# రాయలసీమ తెలుగు శాసనాల సాంస్కృతిక అధ్యయనం



డా॥ యం. ఆదినారాయణ శాస్త్రి

ఆదిత్యా పబ్లికేషన్స్
అనంతపురం.

# రాయలసీమ తెలుగు శాసనాల సాంస్కృతిక అధ్యయనం

(ప్రారంభకాలంనుండి విజయనగరరాజులవరకు)

1993 లో శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయానికి పిహెచ్.డి.
పట్టం కోసం సమర్పించిన సిద్ధాంత వ్యాసం.

గ్రంథకర్త :
**డా॥ మాడ్గుల ఆదినారాయణశాస్త్రి**
యం.ఏ., పిహెచ్.డి., బి.ఎడ్.,
తెలుగు ఉపన్యాసకులు,
ప్రభుత్వ బాలుర జూనియర్ కళాశాల,
అనంతపురం - (ఆం.ప్ర.)

**ఆదిత్యా పబ్లికేషన్స్**
**11/291-2, అరవింద నగర్,**
**అనంతపురం 515 001.**
**(ఆం. ప్ర.)**
**జనవరి 1995**

**వెల : రూ. 95-00**

Raayala Seema Telugu Saasanaala
Samskrutika Adhyayanam
by Dr. Madgula Adinarayana Sastry

ప్రథమ ముద్రణ : జనవరి 1995

ప్రతులు : 1000









ప్రతులకు :
యం. శైలేంద్ర
ఆదిత్య పబ్లికేషన్స్
11/292-2, అరవిందనగర్
అనంతపురం - 515 001
(ఆం. ప్ర.)

ముద్రణ :
పద్మావతి ఆర్ట్ ప్రింటర్స్
1-1-517/బి/1, న్యూ బాకారం
గాంధీనగర్, హైదరాబాదు - 500 380.
ఫోన్లు : 611413, 600547.

# అంకితం

పరోక్షవినయంగా



డా॥ సర్దేశాయి తిరుమలరావు గారికి

# అభిప్రాయము

డా॥ మాడ్గుల ఆదినారాయణశాస్త్రిగారి "పరిశోధనా గ్రంథము'' "రాయసీమ శాసనాల సాంస్కృతిక అధ్యయనం'' నాకు అందగానే నా చిరకాల వాంఛ నెరవేరినట్లు అనిపించింది.

1966 లో డా॥ చిదానందమూర్తిగారి "కన్నడ శాసనగళ సాంస్కృతిక అధ్యయన" అనే పరిశోధనా గ్రంథం ప్రకటించబడిం తర్వాత ఈ విధంగానే తెలుగు శాసనాల మీద సాంస్కృతిక అధ్యయనానికి ఎవరైనా పూనుకుంటే బాగుండేదని భావించేవాడిని. శాస్త్రిగారు ఆదరాభిమానాలతో నాకు పుస్తకాన్ని పంపగానే ఔత్సుక్యంతో గ్రంథాన్ని ఆ మూల చూడంగా చదివినాను. డా॥ చిదానందమూర్తిగారు తమ పరిశోధనను క్రీ.శ. 450 - 1150 వరకు 7 శతాబ్దుల కాలానికి పరిమితం చేనుకున్నట్లే శ్రీ శాస్త్రిగారును తమ పరిధిని రాయలసీమ ప్రాంతానికి (5 జిల్లాలకు) మాత్రమే సీమితం చేనుకున్నారు. మొదటి నుండి ఇప్పటివరకు తెలుగు దేశంలో శాసనాలు వేలకువేలు లభించినాయి. ఆ అన్నిటి మీదా పరిశోధన సాగించడం ఎవరికీ సాధ్యంకాదు. ఈ విధంగానే ''పూర్వాంధ్ర శాసనాల సాంస్కృతిక అధ్యయనం" "తెలంగాణా శాసనాల సాంస్కృతిక అధ్యయనం'' ఎవరైనా చేస్తే ఈ పని సంపూర్ణమౌతుంది. ఎవరైనా పూనుకుంటారని ఆశింతాం. ''కాలోహ్యాయం నిరవధిః విపులాచపృథ్వీ'' కదా!

శాస్త్రిగారి పరిశోధన చక్కగా అయిదు అధ్యాయాలుగా రూపొందించబడింది. వారి మార్గ దర్శకులు డా॥ ఆర్. శేషశాస్త్రిగారు ప్రసిద్ధ పరిశోధకులూ, కన్నడ సాహిత్య వేత్తలూ, డా॥ చిదానందామూర్తిగారి శిష్యులూ కావడం పూవునకు తావి అబ్బినట్లే, ఈ రచనవల్ల శ్రీ ఆదినారాయణశాస్త్రిగారి పరిశోధనా పాటవం లోకానికి విదిత మవుతున్నది.

'ఉద్దేశమూ - వ్యాప్తి' అనే మొదటి అధ్యాయంలో 'రాయలసీమ' నామ విశ్లేషణ చాల చక్కగా చేసినారు.

ఇంతవరకు తెలుగు శాసనాల మీద పలువురు పరిశోధకులు విభిన్న దృక్పథాలతో ఏయే విధంగా పరిశోధన చేసినారో తెలిపి జిజ్ఞాసువులకు మహో పకారం చేసినారు. రాయలసీమలో అంతర్భాగాలైన సీమలు, నాడులు విషయ ములు మొదలైన వాటిని గురించి శాసనాధారాలతో వివరించడం వల్ల చరిత్ర విద్యార్థులకు చాలా ఉపయోగం కలిగింది.

ఈ విధంగానే రాయలసీమ జిల్లాల చారిత్రక నేపథ్యం, శాసన విశేషాలు, సామాజిక జీవనం, లలిత కళలు మొదలైన సాంస్కృతిక విశేషాలను సంగ్ర హముగా అయినా సమగ్రంగా తెల్పడానికి ప్రయత్నించినారు.

వీరు పాఠకుల సౌలభ్యానికి శాసనాల, శిల్పాల చిత్ర పటాలను చేర్చి, పరి శోధనకు పుష్టిని కూర్చినారు. వీరి ఈ గ్రంథము ముందు ముందు ఎవరైనా శాసనాలను గూర్చి పరిశోధించ బూనినప్పుడు వారికి చక్కని మార్గ దర్శకము కాగలదు.

అనేక విషయములను చేర్చి ఈ గ్రంథము త్వరలోనే ముద్రించబడి ఆంధ్రలోకానికి ఆదరపాత్రము కావలెనని ఆకాంక్షించుచున్నాను.

విశ్వసనీయుడు

అలంపూరు
20-12-93

గడియారం రామకృష్ణ శర్మ

# అభినందన

తెలుగు ప్రజల తొలి నివాసం రాయలసీమ అని ప్రముఖ చరిత్ర పరిశోధకులు ప్రొఫెసర్ ఎచ్. డి. సంకాలియా అభిప్రాయం. ప్రాచీన కాలంలో ఈ ప్రాంతాన్ని హిరణ్యక రాష్ట్రమని, రేనాడు, మహారాజవాడి అని కూడ వ్యవహరించేవారు. చాలాకాలం విజయనగరరాజుల పాలనలో ఉండినందున, ఈ ప్రాంతాన్ని 'రాయలసీమ'గా నామకరణం చేసినవారు డాక్టర్. చిలుకూరు నారాయణరావుగారు. ఆ పేరును బాగా ప్రచారం చేసిన వారిలో అగ్రగణ్యులు తొలి తెలుగు రాజకీయ ఖైది, గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు.

మన ప్రాచీన కవులు తమ కావ్యాలలో చారిత్రక అంశాలకు అంతగా చోటివ్వలేదు. వ్రాతప్రతులను, తాళపత్ర గ్రంథాలను ఎత్తివ్రాయుటలో లిపికారులు తగిన శ్రద్ధ వహించకపోవుటవల్ల వాస్తవాంశాలు భావితరాల వారికి నిర్దుష్టంగా లభించలేదు. శాసనాలు ప్రామాణిక ఆధారాలుగ చరిత్ర రచన కెంతగానో ఉపకరిస్తున్నాయి.

''రాయలసీమ తెలుగు శాసనాల సాంస్కృతిక అధ్యయనం'' రచించి శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం నుండి డాక్టరేట్ పట్ట మందుకున్న పరిశోధక మిత్రులు డా॥ మాద్గుల ఆదినారాయణ శాస్త్రిగారు రాయలసీమలోని శాసనాలను పెక్కింటిని స్వయంగా పరిశోధన చేసారు. పలుమార్లు కడపజిల్లాలో పర్యటించారు. శాస్త్రిగారు శ్రమించి కావించిన అధ్యయన ఫలితం ఈ పరిశోధనా గ్రంథం.

శాసనాలలో ప్రధానంగా దాన శాసనాలు, ప్రశస్తి శాసనాలు కానవస్తాయి. యంత్ర, మంత్ర శాసనాలు, ఆత్మబలికి సంబంధించిన శాసనాలు. వీరగల్లులు - వీరశిలలు మొదలగునవి ఉన్నాయి.

రాయలసీమను పాలించిన రాజ వంశాలు, వారి పాలనావిధానం మున్నగు చారిత్రక విషయాలను గురించిన వివరణ ఇచ్చారు.

కాకతీయుల కాలంలో 'నాయంకర వ్యవస్థ'కు పునాదులు వేయగా, విజయనగర రాజులు ఆ వ్యవస్థను పటిష్టమొనర్చారు. వీరు అవసరమైనపుడు రాజుకు సైన్యాన్ని సమకూర్చేవారు. ఈ వ్యవస్థ తరువాత కాలంలో పాళెగాళ్ళ వ్యవస్థకు మూలమనవచ్చు.

అధికారులలో డెబ్బై రెండు విధాల వారుండేవారు. వీరిని బాహత్తర నియోగాలవారనేవారు.

వివిధ రకాల పన్నులుండేవి. పన్ను కట్టే అవసరం లేకుండా, భూము లను మాన్యంగా ఇచ్చేవారు. విశిష్ట సేవలందజేసిన వారికి రాజులు మాన్యా లిచ్చేవారు.

రాయలసీమలో శైవ, వైష్ణవ, వీరశైవ, జైన, బౌద్ధములుండేవి. హరి హరనాథ స్వామి ఆరాధన ఉండేదనుటకు సాక్ష్యంగా శాసనాలున్నాయి.

దేవాలయాలు పూజాస్థలాలుగానే కాక విద్యాలయాలుగానూ ఉండేవి.

వ్యవహారంలో సాక్ష్యాలు, ప్రమాణాలు చూపలేనప్పుడు న్యాయ నిరూపణకు కొన్ని పరీక్షలుండేవి. వీటినే 'దివ్య' లనేవారు. వీటిలో తులాదివ్య, అగ్నిదివ్య, జలదివ్య, విషదివ్య,కోశదివ్య - వీటి ప్రయోగవిధానాలు తెలుపబడినాయి.

వర్తక సంఘాలలో అయ్యావళి వర్తక సంఘం ప్రధాన సంఘంగా చెప్ప బడింది. అయ్యావళి వర్తకసంఘం వారి కేంద్రం, నేటి కర్నాటక రాష్ట్రంలోని బీజాపూర్ జిల్లాలోని 'ఐహోళె.' ఈ కేంద్రం శాఖోపశాఖలుగ విస్తరించి ఉంది. అయిదువందల మంది వర్తకులు త్రిపురాంత మహాదేవునికి బహుమతులు, ధాన్యాలు, ఇతర కానుకలు ఇచ్చేవారు.

ఆనాటి ఆర్థిక వ్యవస్థ, చెలామణిలోని నాణేలు, కొలతలు, తూకాలు, వ్యక్తులు మున్నగువాటిని గురించి విపులంగా తెలిపినారు.

ప్రాచీన శాసనాలు ఎక్కువగా సంస్కృత, ప్రాకృత భాషలలోనే వెలు వడినాయి. కాలక్రమంలో తెలుగులోను, అక్కడక్కడ కన్నడ, తమిళముల లోను శాసనాలు వేయబడినాయి.

వీర శిలలు(వీరగల్లులు) నాటి సామాజిక స్థితికి దర్పణాలుగా ఉన్నాయి. దేశరక్షణకు, దేవాలయంవంటి సంస్థల రక్షణకు, స్త్రీ మాన రక్షణకు, మరో ప్రజా హిత కార్యాలకు కొందరు ఆత్మబలిదానం చేసినందుకు చిహ్నాలుగ వీర శిలలను స్థాపించుట నాటి ఆచారం.

డా॥ ఆదినారాయణశాస్త్రిగారు, తమ సిద్ధాంత వ్యాసంలోని ఉపసంహారంలో శాసనాలు ఇతిహాస రచనకు తోడ్పడిన లిఖిత సాహిత్య రూపాలని, అవి ఆయా దేశాల సాంస్కృతిక చరిత్రలను తెలుసుకోవడానికి అత్యంత ఉపయుక్తములైనవని, శాసనములలోని శైలి, ఛందోలంకారాలు మున్నగువాటిని పేర్కొన్నారు.

"భాషా విషయానికొస్తే, ఇక్కడి భాష అటు తెలంగాణము, ఇటు ఉత్తరాంధ్ర ఉచ్చారణల మధ్యే మార్గంలో అనిపిస్తూంది. కన్నడపు మెత్తదనం, తమిళుల కరుకుదనం, దేవ భాషలోని దివ్యత్వం వెరసి తెనుగు భాష తియ్యదనం రాయలసీమ తెలుగులో రసవంతంగా చిందులేస్తుంది. స్వచ్ఛమైన తుంగభద్ర, నీలి వర్ణపు కృష్ణ, అచ్చమైన పెన్న - ఈ త్రివేణీ సంగమ పరిభాషే రాయలసీమ తెనుగు భాష'' అన్న పరిశోధకుల మాటలలో పొల్లులేదు.

డా॥ ఆదినారాయణశాస్త్రిగారి పరిశోధనా కృషి అత్యంత అభినందనీయమైనది. ఒకనాటి, నేటి రాయలసీమ చరిత్రను చిత్రించారు. ఈ గ్రంథం ప్రశంసార్హమైనది.

—జానమద్ది హనుమచ్ఛాస్త్రి

30-9-94

కాకతీయుల కాలంలో 'నాయంకర వ్యవస్థ'కు పునాదులు వేయగా, విజయనగర రాజులు ఆ వ్యవస్థను పటిష్టమొనర్చారు. వీరు అవసరమైనపుడు రాజుకు సైన్యాన్ని సమకూర్చేవారు. ఈ వ్యవస్థ తరువాత కాలంలో పాళెగాళ్ళ వ్యవస్థకు మూలమనవచ్చు.

అధికారులలో డెబ్బై రెండు విధాల వారుండేవారు. వీరిని బాహత్తర నియోగాలవారనేవారు.

వివిధ రకాల పన్నులుండేవి. పన్ను కట్టే అవసరం లేకుండా, భూము లను మాన్యంగా ఇచ్చేవారు. విశిష్ట సేవలందజేసిన వారికి రాజులు మాన్యా లిచ్చేవారు.

రాయలసీమలో శైవ, వైష్ణవ, వీరశైవ, జైన, బౌద్ధములుండేవి. హరి హరనాథ స్వామి ఆరాధన ఉండేదనుటకు సాక్ష్యంగా శాసనాలున్నాయి.

దేవాలయాలు పూజాస్థలాలుగానే కాక విద్యాలయాలుగానూ ఉండేవి.

వ్యవహారంలో సాక్ష్యాలు, ప్రమాణాలు చూపలేనప్పుడు న్యాయ నిరూపణకు కొన్ని పరీక్షలుండేవి. వీటినే 'దివ్య' లనేవారు. వీటిలో తులాదివ్య, అగ్నిదివ్య, జలదివ్య, విషదివ్య, కోశదివ్య - వీటి ప్రయోగవిధానాలు తెలుపబడినాయి.

వర్తక సంఘాలలో అయ్యావళి వర్తక సంఘం ప్రధాన సంఘంగా చెప్ప బడింది. అయ్యావళి వర్తకసంఘం వారి కేంద్రం, నేటి కర్నాటక రాష్ట్రంలోని బీజాపూర్ జిల్లాలోని 'ఐహోళె.' ఈ కేంద్రం శాఖోపశాఖలుగ విస్తరించి ఉంది. అయిదువందల మంది వర్తకులు త్రిపురాంత మహాదేవునికి బహుమతులు, ధాన్యాలు, ఇతర కానుకలు ఇచ్చేవారు.

ఆనాటి ఆర్థిక వ్యవస్థ, చెలామణిలోని నాణేలు, కొలతలు, తూకాలు, వ్యక్తులు మున్నగువాటిని గురించి విపులంగా తెలిపినారు.

ప్రాచీన శాసనాలు ఎక్కువగా సంస్కృత, ప్రాకృత భాషలలోనే వెలు వడినాయి. కాలక్రమంలో తెలుగులోను, అక్కడక్కడ కన్నడ, తమిళములు లోను శాసనాలు వేయబడినాయి.

వీర శిలలు(వీరగల్లులు) నాటి సామాజిక స్థితికి దర్పణాలుగా ఉన్నాయి. దేశరక్షణకు, దేవాలయంవంటి సంస్థల రక్షణకు, స్త్రీ మాన రక్షణకు, మరో ప్రజా హిత కార్యాలకు కొందరు ఆత్మబలిదానం చేసినందుకు చిహ్నాలుగ వీర శిలలను స్థాపించుట నాటి ఆచారం.

డా॥ ఆదినారాయణశాస్త్రిగారు, తమ సిద్ధాంత వ్యాసంలోని ఉపసంహారంలో శాసనాలు ఇతిహాస రచనకు తోడ్పడిన లిఖిత సాహిత్య రూపాలని, అవి ఆయా దేశాల సాంస్కృతిక చరిత్రలను తెలుసుకోవడానికి అత్యంత ఉపయుక్తములైనవని, శాసనములలోని శైలి, ఛందోలంకారాలు మున్నగువాటిని పేర్కొన్నారు.

"భాషా విషయానికొస్తే, ఇక్కడి భాష అటు తెలంగాణము, ఇటు ఉత్తరాంధ్ర ఉచ్చారణల మధ్యే మార్గంలో అనిపిస్తూంది. కన్నడపు మెత్తదనం, తమిళల కరుకుదనం, దేవ భాషలోని దివ్యత్వం వెరసి తెనుగు భాష తియ్యదనం రాయలసీమ తెలుగులో రసవంతంగా చిందులేస్తుంది. స్వచ్ఛమైన తుంగభద్ర, నీలి వర్ణపు కృష్ణ, అచ్ఛమైన పెన్న - ఈ త్రివేణీ సంగమ పరిభాషే రాయలసీమ తెనుగు భాష'' అన్న పరిశోధకుల మాటలలో పొల్లులేదు.

డా॥ ఆదినారాయణశాస్త్రిగారి పరిశోధనా కృషి అత్యంత అభినందనీయమైనది. ఒకనాటి, నేటి రాయలసీమ చరిత్రను చిత్రించారు. ఈ గ్రంథం ప్రశంసార్హమైనది.

—జానమద్ది హనుమచ్ఛాస్త్రి

30-9-94

# ఇదొక మాట

బ్రహ్మశ్రీ ఎం. ఆదినారాయణశాస్త్రి గారు ప్రభుత్వ బాలుర జూనియర్ కళాశాల, అనంతపురం నందు ఆచార్యులుగనుండి పి హెచ్.డి. పట్టమునకై పరిశోధించి ప్రకటించిన 'రాయల సీమ తెలుగు శాసనాల సాంస్కృతిక అధ్యయన'మను గ్రంథము పరిశోధనా రంగమున నింతవరకు వెలువడిన అపురూప గ్రంథములలో నొకటి.

ఏదేనినొక సాహిత్య గ్రంథమునుగాని, విషయమునుగాని నెన్నుకొని దానిపై పరిశోధనచేసి డాక్టరేటు పట్టమును పొందుట సులభమైన పని. అట్టి పట్టములు పొందిన వారనేకులున్నారు. కాని ఒక ప్రాంతమందున్న శాసనములను పరిశీలించుట, అనేక శాసన, సాహిత్య, పరిశోధక గ్రంథములను సేకరించి విషయమును గ్రహించుట, ఆ ప్రాంత మండలి మండలములందున్న ప్రజల ఆచార వ్యవహారములను వారి సాంస్కృతిక జీవన విధానమును ప్రతిబింబింప జేయు శాసనములను, వీరగల్లులను సేకరించుట, వాటి నధ్యయన మొనర్చి సమగ్ర గ్రంథమును వ్రాసి పి హెచ్.డి. పట్టమును పొందుట సులభసాధ్యమైన పనిగాదు. శ్రీ శాస్త్రిగారు రాయలసీమ తెలుగు శాసనాల సాంస్కృతిక అధ్యయనమను గ్రంథమును అతి వ్యయప్రయాసల కోర్చి, అనేక ప్రాంతములందు సంచరించి, రాయలసీమ ప్రజలకు, తద్వారా తెలుగు జాతికి, ఆంధ్ర భాషా యోషకు అమూల్యాలంకారముగ రూపొందించినారు.

రాయలసీమ రతనాలసీమ. గోలకొండ సుల్తాను అబ్దుల్లా కుతుబ్షా కాలమున కర్నాటక గవర్నరుగా నున్న మీర్జా మహమ్మద్ సయీద్ అనేక వజ్రపు గనులను త్రవ్వించి అపురూపమైన, అతి విలువైన వజ్రములను వెలికి తీయించి యుండెను. అట్టి రతనాల సీమలోని శిలా శాసనములను, వీరగల్లులను పరిశోధించి అనన్య సామాన్యమైన గ్రంథమును శ్రీ శాస్త్రిగారు రచించినారు.

ఈ గ్రంథమున అధ్యయనోద్దేశ్యము - వ్యాప్తి, భూమిక - అందు బళ్ళారి, అనంతపురము, చిత్తూరు, కర్నూలు, కడప జిల్లాల భౌగోళిక చారిత్రక విశేషములను, రాయలసీమ చరిత్ర నేపథ్యమును వివరించినారు.

శాసనములు, వాటి విధములను, వీరగల్లులను, వ్యక్తుల పేరులను, ఆత్మ బలిని, కాలమును, దాన వివరములను, దాన పరిగ్రహీతను, దానమిచ్చుటలో గల ఉద్దేశ్యమును, దానమిచ్చిన భూమి సరిహద్దులను, దానమును పాటించిన వారికి కలుగు పుణ్యఫలమును, పాటింపని వారికి కలుగు పాపఫలమును శాసన కవిని, శాసనాక్షరములను చెక్కిన అక్షపటలికుని సంక్షిప్తముగా శ్రీ శాస్త్రిగారీ గ్రంథమున పరిచయ మొనర్చినారు.

సామాజిక జీవనమునకు సంబంధించిన అధ్యాయమున, రాయలసీమ నేలిన రాజవంశముల సంక్షిప్త చరిత్రలు, ముఖ్యముగా కాకతి, రెడ్డి, కాయస్థ, విజయనగరాధీశుల పాలనా కాలము లందలి పరిపాలనా విశేషములు, రాజ వంశీయులు, దానములు, ప్రజోపయోగ నిర్మాణములు, శైవ, వైష్ణవ, బౌద్ధ, మతముల వ్యాప్తి, ఆయా మతములకు చెందిన దేవాలయములు, ప్రజల ఆచార వ్యవహారములు, సంప్రదాయములు, పండుగలు, పర్వములు, ఊరేగింపులు, ఆర్థిక వ్యవస్థ, నాణెములు, కొలతలు, తూనికలు, అష్టాదశ, ద్వాదశ వృత్తుల వారి జీవన విధానము, దేవరసానులు, బసివిరాండ్రు, మానులు, బాహత్తర నియోగులు, వారొనర్చు కార్యకలాపములు సంక్షిప్తముగ నీ గ్రంథమున పొందుపరచ బడినవి.

చివరి అధ్యాయమున రాయలసీమ శాసనములలోని భాష, లలిత కళలు వివరింపబడినవి.

సుప్రసిద్ధ శాసన పరిశోధకులు, బహుభాషా కోవిదులు, వీరగల్లులను పరిశోధించి చక్కని గ్రంథములను వ్రాసిన డా॥ శేషశాస్త్రిగారి నేతృత్వమున డా॥ ఎం. ఆదినారాయణశాస్త్రిగారీ పరిశోధన గ్రంథమును వ్రాసి డాక్టరేటు పట్టమును పొంది, ప్రచురించి, ఆంధ్ర మహాజనుల కందించి మహోపకార మొనర్చినారు. వారి కాంధ్రజాతి ఋణపడి యుండవలెనని భావించుచు, వారింకను తమ భావి పరిశోధనలో అపూర్వ విషయములను వెల్లడించు గ్రంథములను వెలయింప గలరని ఆశించుచున్నాను.

సరస్వతీ నిలయం — బి. ఎన్. శాస్త్రి
3-4-245/1, లింగంపల్లి,
హైదరాబాద్ 500 027.

# కృతజ్ఞతా సుమాంజలి

నిరంతర జిజ్ఞాసువైన మనిషి, అనంత విజ్ఞాన క్షీరసాగరాన్ని తన అంతరంగమనే కవ్వంతో మథించినప్పుడు మొదట హాలాహల సదృశ భావాలు ఉద్భవించినా, చివరకు అమృతపు సోనలు, దివ్యపదార్థాలవంటి ఫలితాంశాలు దర్శనమిస్తాయనటం విశ్వజనీన సత్యం.

అన్వేషణాతృష్ణ కల్గిన మానవుడికి 'పరిశోధన' ఒక క్రీడాసదృశమే! శ్రద్ధ, నిష్ఠ, అంకితభావం అన్నవి ఆ క్రీడలో విజేత కావటానికి దోహదం చేసే ఉత్తమ లక్షణాలు.

నిత్య విద్యార్థి అయిన పరిశోధకుడికి నిరంతర కార్యశూరులైన, దీక్షా దక్షతలున్న, స్ఫూర్తిని ప్రేరేపించే పర్యవేక్షకులు లభించడం నిజంగా అదృష్టమే! ఈ అదృష్టం నా ఇంటి తలుపు తట్టకముందే నేనే ఆ గృహ ప్రాంగణాన్ని చేరి ఆహ్వానించుకున్నాను.

డా॥ ఆర్. శేషశాస్త్రిగారిలోని నిర్మొహమాటం, ఖండితవాదం, నిజాయితీ అనే సహజగుణాలు నన్ను ఈ పరిశోధనకు పురికొల్పాయి. 'పరిశోధనాంశం' వారే చెప్పి, తుది నిర్ణయాన్ని నాకు వదిలేసినా, అస్థిమితానికి లోనుకాకుండా, ఏకదీక్షతో ముందుకు సాగినాను. ఈ పరిశోధనానౌకను ప్రవాహవేగంతోపాటు నడిపించి, ఎన్ని ఒడుదుడుకులు యెదురైనా, వెన్నుతట్టి, మొక్కవోని దీక్షతో ముందుకు సాగించి, ఒక దశలో చుక్కానిని కూడా నా చేతికే ఇచ్చి, ఆయన సాక్షీభూతుడుగా మాత్రం నిల్చి, చేరవలసిన ఒడ్డుకే చేర్చి నన్ను కృతకృత్యుణ్ణి చేశారు.

సహపర్యవేక్షకులు డా॥ ఏ. వీరప్రసాదరావుగారి విశాల హృదయం, సహకారం, ప్రోత్సాహం, ఉన్నత భావాలు, వ్యక్తిత్వం - నా పరిశోధనా వ్యాసాన్ని అర్థవంతం చేశాయి. ప్రప్రథమంగా ఈ ఇద్దరికీ నా కృతజ్ఞతలు.

'మార్గదర్శీ మహర్షి' అన్నది ఆర్యోక్తి. డా॥ ఎం. చిదానందమూర్తి, ప్రాధ్యాపకులు, బెంగుళూరుగారి అమూల్యగ్రంథం 'కన్నడ శాసనగళ సాంస్కృ

తిక అధ్యయన' అన్నది. శాసన క్షేత్రంలో అద్వితీయ పరిశోధనా గ్రంథమైన ఈ పుస్తకాన్ని నేను అనేక విధాల అనుసరించి, విశేషంగా ఆయన ప్రతిపాదించిన అధ్యయన విధానాలను, సూత్రాలను యథాతథంగా అనుసరించినాను. శాసనాలను గురించిన ఆయన అభిప్రాయాలను అవసరమైనచోట్ల అనువాదం చేసి వినియోగించుకొన్నాను. అలాంటి వాటిని అథస్సూచికల్లో చేర్చినాను. ఈ నా అధ్యయనంలో ఆ గ్రంథం నాకు ప్రధాన మార్గదర్శిగా, దారిదీపంగా తోడ్పడింది. వారికి నా కృతజ్ఞతాసుమాంజలి.

గమ్యాన్ని చూపించటంలో దోహదం చేసిన మిత్రుడు డా. అవధానం నాగరాజరావు గారికి. భారతి మాసపత్రికలను ఇచ్చిన మాన్యులు డా॥ పి.ఎల్. శ్రీనివాసరెడ్డి గారికి, ఆంధ్ర భారతి అధ్యాపకవరేణ్యులకు, అధ్యాపకేతర సిబ్బందికి, విశ్వవిద్యాలయ గ్రంథాలయాధికారిగారికి కృతజ్ఞతలు.

తమ అమూల్య అభిప్రాయాల్ని, ఆశీస్సులను అందజేసిన మాన్యులు శ్రీ గడియారం రామకృష్ణశర్మ, అలంపూర్ గారికి; శ్రీ పి. వి. పరబ్రహ్మ శాస్త్రి; హైదరాబాదు గారికి; శ్రీ బి. ఎన్. శాస్త్రి, హైదరాబాదు గారికి; శ్రీ జానమద్ది హనుమచ్ఛాస్త్రి, కడప గారికి; డా॥ దేవళ్ళ చిన్ని కృష్ణయ్య, మద్రాసు గారికి; డా॥ ఎన్. ఎస్. రామచంద్రమూర్తి, తిరుపతి గారికి; డా॥ ఎన్. గోపి, హైదరాబాదు గారికి నా హృదయపూర్వక కృతజ్ఞతలు.

ఆయా సందర్భాల్లో ఆలోచనాపూర్వకములైన సూచనలిచ్చి, స్ఫూర్తి కల్గించిన విద్వాంసులు శ్రీ సర్దేశాయి తిరుమలరావు గారికి,

ఆత్మీయ మిత్రులు శ్రీ కె. ఆర్. గణేశ్, శ్రీ దేవర కొండారెడ్డి, డా॥ జోస్యుల సదానందం గారికి,

స్థానిక జిల్లా, కేంద్ర గ్రంథాలయం యాజమాన్యం వారికి, పురావస్తు పరిశోధన శాఖ, అనంతపురం, యాజమాన్యం వారికి,

పరిశీలనాదృక్పథంతో చూచిన శ్రీ బండ్లపల్లి ఓబులరెడ్డి గారికి,

మా కళాశాలాధ్యక్షులు మాన్యులు శ్రీ పి. రామకృష్ణారెడ్డి గారికి, శ్రీ వి. హుస్సేన్‌రెడ్డి గారికి, శ్రీ పురుషోత్తంరెడ్డి గారికి, గ్రంథాలయాధికారి శ్రీ కె. రామచంద్రారెడ్డి గారికి, మాన్యులు శ్రీ మాడ్గుల వెంకట శివశాస్త్రిగారికి,

పుస్తకాన్ని ప్రచురించటానికి దయతో అనుమతించిన శ్రీకృష్ణ దేవరాయ విశ్వవిద్యాలయ యాజమాన్యం వారికీ,

ఈ పుస్తకాన్ని ప్రచురించటానికి ప్రభుత్వపరంగా (మేనేజ్‌మెంట్) ఆనందంతో ప్రోత్సహించి, అనుమతించిన శ్రీ వి. నర్సిరెడ్డి, ఇంటర్మీడియట్ విద్యా సంచాలకులు, (హైద్రాబాదు, ఆంధ్రప్రదేశ్) వారికి నా హృదయపూర్వక నమస్సుమాంజలులు.

ముఖపత్రం శీర్షికను అందంగా లిఖించిన శ్రీ ఓబులేసు, చి॥రా॥ శ్రీ రవి కాంత్ కారికీ,

ఈ పుస్తకాన్ని సర్వాంగ సుందరంగా ముద్రింపజేసిన పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్ అధినేతలైన శ్రీ పి. శ్రీనివాసగౌడ్ గారు చాలా శ్రద్ధ వహించి, సంపూర్ణమైన బాధ్యతతో నా పనిని సులభతరం చేశారు. వారు కేవలం ముద్రణ కర్తలేకాక, ఆత్మీయులై, స్నేహాన్ని ఇనుమడింపచేసి ఆప్తమిత్రులయ్యారు. వారి ఈ సహాయానికి నేను కృతజ్ఞతలు చెప్పడం కేవలం లాంఛనప్రాయం మాత్రం కాదు. వారి సిబ్బందికి కూడా నా ధన్యవాదాలు.

ప్రూఫులు యెంతో ఓపికతో సరిచూచిన శ్రీ చీమకుర్తి శేషగిరిరావుగారికీ, శ్రీ కె.పి. బాబుగారికీ, ఈ పరిశోధనాయజ్ఞాన్ని నిర్వహించటంలో సహకరించిన సహృదయులను అందర్నీ పేరుపేరునా స్మరింపలేకపోవచ్చు. ఎందరో మహాను భావులు - అందరికీ వందనాలు.

బహుముఖ ప్రజ్ఞాశాలి, ప్రసిద్ధ విమర్శకులు, సహృదయులు, స్థానిక తైల సాంకేతిక పరిశోధనా సంస్థ సంచాలకులుగా చిరకీర్తిపొందిన సర్దేశాయి తిరుమలరావుగారికి ఇది నా పరోక్ష వినయం.

మాడ్గుల ఆదినారాయణశాస్త్రి

# సంక్షిప్తపదసూచిక

| | | |
|---|---|---|
| 1. | ఆం.చ. | - ఆంధ్రుల చరిత్రము |
| 2. | ఆం.చ.సం. | - ఆంధ్రుల చరిత్ర - సంస్కృతి |
| 3. | ఆం.ద్వి.సా.చ. | - ఆంధ్ర ద్విపద సాహిత్య చరిత్ర |
| 4. | ఆం.ప్ర.దే.శా. సమీక్ష | - ఆంధ్రప్రదేశ్ దేవాలయ శాసన సమీక్ష |
| 5. | ఆం.భా వికా | - ఆంధ్ర భాషా వికాసము |
| 6. | ఆం మ.భారతం | - ఆంధ్ర మహా భారతం |
| 7. | ఆం.వా.అ. | - ఆంధ్ర వాఙ్మయారంభదశ |
| 8. | ఆం.సం చ. | - ఆంధ్రుల సంస్కృతి - చరిత్ర I & II |
| 9. | ఆం.సాం.చ. | - ఆంధ్రుల సాంఘిక చరిత్ర |
| 10. | ఆం.సా.ఆర్థి.చ. | - ఆంధ్రుల సాంఘిక ఆర్థిక చరిత్ర |
| 11. | ఆముక్త | - ఆముక్త మాల్యద |
| 12. | ఇం.ఎపి.గ్లా | - ఇండియన్ ఎపిగ్రాఫికల్ గ్లాసరీ |
| 13. | ఇన్స్.క. | - ఇన్స్క్రిప్షన్స్ ఆఫ్ కడప డిస్ట్రిక్ట్ I, II & III వాల్యూములు |
| 14. | ఇన్స్.ఆం. | - ఇన్స్క్రిప్షన్స్ ఆఫ్ ఆంధ్రప్రదేశ్ |
| 15. | ఎపి ఆం. | - ఎపిగ్రాఫియా ఆంధ్రికా |
| 16. | ఎపి.ఇం. | - ఎపిగ్రాఫియా ఇండికా |
| 17. | క.శా.సాం.అ | - కన్నడ శాసనగళ సాంస్కృతిక అధ్యయన |
| 18. | క.శి శా.వగయిరా | - కడప శిలాశాసనములు వగయిరా |
| 19. | కర్నా.వీర | - కర్నాటకద వీరగల్లుగళు |
| 20. | కా.శా. | - కాకతీయ శాసనాలు |
| 21. | కా.శా.సా. | - కాకతీయ శాసన సాహిత్యము |
| 22 | కుమా.సం. | - కుమార సంభవము |
| 23. | గురు.ప్ర | - గురుబాల ప్రబోధిక |
| 24. | జా.గే.సాం.చరి | - జానపద గేయాలు సాంఘిక చరిత్ర |
| 25. | తి. తి. దే. శాస. | - తిరుమల తిరుపతి దేవస్థాన శాసనాలు. |
| 26. | త్రి.పు.దే.శా. | - త్రిపురాంతక దేవాలయ శాసనములు. |
| 27. | తె.ఛం.వి. | - తెలుగు ఛందో వికాసము. |
| 28. | తె.చ.సం. | - తెలుగు చరిత్ర సంస్కృతి |
| 29. | తె.చారి.కావ్యాలు | - తెలుగులో చారిత్రక కావ్యాలు |
| 30. | తె.జా.గే.సాహి | - తెలుగు జానపద గేయ సాహిత్యము |

31. తె.దే ఛం. - తెలుగులో దేశిచ్ఛందస్సు
32. తె.వా సం.చరి. - తెలుగు వాఙ్మయము-సంగ్రహ చరిత్ర
33. తె.వి.సర్వస్వము (సం॥) - తెలుగు విజ్ఞాన సర్వస్వము (సంపుటము)
34. నన్నె.కవి. - నన్నెచోడుని కవిత్వము
35. ప్రా.క.గమకి-మత్తు-గమకవలె - ప్రాచీన కర్నాటక దల్లిగమకిమత్తు-గమక వలె
36. ప్రాఙ్న.యు. - ప్రాఙ్నన్నయ యుగము
37. ప్రా.చా.భూ. - ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము
38. ప్రా.కా.తె.నాడు - ప్రాచీన తెలుగు కావ్యాల్లో తెలుగునాడు
89. ప్రా.శా. - ప్రాచీనాంధ్ర శాసనములు
40. బ్రౌ.ని. - బ్రౌన్ నిఘంటువు
41. మధ్య తె.ప.పరి. - మధ్యయుగపు తెలుగు పరిపాలనా పరిభాష
42. మను.చ. - మను చరిత్రము
43. మల్లి.పం.చరిత్ర - మల్లికార్జున పండితారాధ్య చరిత్ర
44. రాయ.వా. - రాయవాచకము
45. వి కా.క.సా జ. చరిత్ర - విజయనగర కాలద కన్నడ సాహిత్య జనజీవన చరిత్ర
46. శ.దీపిక - శబ్దార్థ దీపిక
47. శబ్ద.రత్నా - శబ్దరత్నాకరము
48. శా.శ.కో - శాసన శబ్దకోశము
49. శుక.స - శుకసప్తతి
50. సమ. సాహి - సమగ్రాంధ్ర సాహిత్యము
51. సౌ. ఇం. ఇన్స్. - సౌత్ ఇండియన్ ఇన్స్క్రిప్షన్స్
52. హం. విం. - హంసవింశతి

1. E. Vij. - Early Vijayanagara (Studies & its culture)
2. His. S. I. - History of South India
3. I. E. - Indian Epigraphy
4. J.A.H.R.S. - Journal of Andhra Historical Research Society
5. S.O. Vij. His. - Sources of Vijayanagar History

# విషయసూచిక

# 1. అధ్యయన ఉద్దేశ్యము – వ్యాప్తి

సమస్త ప్రాణికోటి చరిత్ర భాష ద్వారా వివరింపబడిందని పెద్దల విశ్వాసం. మానవుల భావాలను పరస్పరం ప్రకటించుకోవడానికి సాధనం భాషే అని అందరికీ తెలిసిన విషయమే! మొదట మౌఖికంగా ఉండిన ఈ భాష క్రమేణా లిపిగా రూపొంది, పరికరాలు యేర్పడి వృద్ధిచెందుతూ వచ్చింది.

భాషాక్రమ పరిణామ దశలో మౌఖికము, లేఖనమై అనేక విధాలైన పరికరాలపై అదిశాశ్వతమైన ఊపిరిపోసుకోవడానికి ప్రయత్నించింది. ఇట్లాంటి ఊపిరులకు ప్రతిరూపాలే శాసనాలు. దేశ సాంస్కృతిక చరిత్రలను తెలుసుకొనేందుకు శాసనాలు మూల ఆకరాలై పరిశోధనకు ఆయువు పట్టులుగా విరాజిల్లుతున్నాయి.

అచ్చమైన ఒక దేశపు చరిత్ర ఆ ప్రజల చరిత్రే! వారు బ్రతికిన రీతి అనుసరించిన ధర్మం, అలవరచుకొన్న కళలు, వారి నిత్యజీవిత సమస్యలు, జీవన మూల్యాలు మొదలైనవాటి వివరణగా దీనిని చెప్పవచ్చు. ప్రజా జీవితాన్ని గూర్చిన ఇట్లాంటి 'అధ్యయనాన్ని' సామాజిక అధ్యయనమనో, సాంస్కృతిక అధ్యయనమనో చెప్పవచ్చు. వీటిలో సాంస్కృతిక అధ్యయనమనే మాటే సరైన దని చెప్పాలి. ప్రతి దేశ చరిత్రను, ఆ దేశాన్ని పాలించిన రాజవంశాలు, వారి పరిపాలనను ప్రధానాంశాలుగా స్వీకరించి రాయడం ఒక సంప్రదాయం. రాజులకు, రాజ్యాలకు మధ్య జరిగిన యుద్ధాలు, ఒడంబడికలు; ప్రజలు, వారి జీవన విధానం, భాష, సంస్కృతి ఇవన్నీ కేవలం చరిత్ర ద్వారానే తెలుస్తాయి. ఈ చరిత్రకు మూలరూపాలు ఆనాటి గ్రంథాలే! ఆ గ్రంథాలకు ఆకరాలు నాటి శాసనాలే! శాసనాల్లో చెప్పబడిన విషయాలు, కాలానుగుణ్యమైన సంకేతాలు, భాష, సంస్కృతి, రకరకాలైన పేర్లు, పదజాలము-ఇవన్నీ చారిత్రికాంశాలనేకాక సంస్కృతిని కూడ ప్రతిబింబింపచేయడానికి దోహదకారులైనాయి.

ఈ సిద్ధాంత వ్యాస శీర్షికలో వచ్చిన 'సాంస్కృతిక' అనే విశేషణానికి కొంత వివరణ అవసరం. మన సంస్కృతి, ప్రాచీనమైనదైనా, దీని వాడుక మాత్రం ఆధునికమైనదే! బహుశః ఇది ఆంగ్లంలోని 'culture' అనే అర్థంతో సుమారు ఒక దశాబ్ది నుంచీ ధ్వనిస్తున్నది. ఈ పదం ఆంగ్లంలో యెంతమట్టుకు వాడుకలోనికి వచ్చిందంటే దాన్ని తప్పు తప్పుగా భిన్నార్థాల్లో విశ్లేషించడం వరకు జరిగిందని చెప్పడం మాత్రం సాహసం కాదు. తెలుగులోనూ ఇంతే! మాటల్లోనూ, గ్రంథాల్లోనూ ఈ పదాన్ని, దాని వ్యాప్తిని యథేచ్ఛగా ఉపయోగిస్తున్నారు. ఈ పద నిర్వచనం ఆయా వ్యాఖ్యానకారుల సామాజిక, ధార్మిక దృక్పథాలను అనుసరించి నిర్వచింపబడి ఉంటుందనే చెప్పవచ్చు.

"మనస్సును సంస్కరింపగల గొప్ప విశేషమే సంస్కృతి. జీవితమును గూర్చిన దృక్పథమే సంస్కృతి. ఇది యేవ్యక్తియందైనను తన జీవితమునందు నితరులతోడి వర్తనమునను వ్యక్తమగు దృక్పథమనియే చెప్పవలసియున్నది. ఇది విద్యాభ్యాస విజ్ఞాన సౌజన్యాది సకల సంస్కారముల ఫలమని చెప్పవచ్చును.''[1]

"ఒక పరిమిత కాలంలో కానీ, లేక భౌగోళిక సరిహద్దుచే పరిమితమయిన ఒక ప్రాంతంలో కానీ, ఒకే భాషను మాట్లాడే ప్రజలచే కానీ, ఒకే మతాన్ని అనుసరించే వారిచే కానీ చరిత్రగతిలో ఆలోచనాపూర్వకమైన కృషిచేత, నిత్య జీవన విధానంలో ఆధ్యాత్మిక విషయాలలో సాధించిన అభివృద్ధికరమైన మార్పుల నన్నిటినీ 'సంస్కృతి' అని పిలవడం సమంజసం.''[2]

''మనల్ని మనమే ఉత్తములుగా దిద్ది తీర్చుకొనడమే సంస్కృతి.''[3]

ఇంతైనా 'సంస్కృతి' అనేది స్థిరమైన ఒక నిర్వచనానికి లోబడి ఉండడం లేదు.

విద్వాంసులందరి పిండితార్థమేమంటే - సంస్కృతి అనేది ఆయా కాలాల్లోని ప్రజలు కాలక్రమేణా రూపురేఖలు దిద్దుతూ వస్తున్న జీవితమూల్యాల పరంపరే! ఈ సంస్కృతిని, అంటే- జన జీవన మూల్యాలకు ప్రాతినిధ్యం వహించే మానవుల చర్యలను శాసనాల ద్వారా అధ్యయనం చేయవలసిన అవసరం యెంతైనా ఉంది

చరిత్రకారులు ఆంధ్రదేశ చరిత్రను పునారచించడానికి ఈ దేశ చరిత్రలో వెలువడిన అనేకానేక శాసనాలను పరిశీలించి ఉపయోగించుకొన్నారు. అయితే, విద్వాంసుల దృష్టి రాజకీయ చరిత్రవైపే ఎక్కువగా ప్రసరించింది. ఆయా రాజవంశాల చరిత్ర రాసేటప్పుడు ప్రాసంగికంగా సమకాలీన సాంస్కృతిక అంశాలనూ పేర్కొన్నారు. కానీ, ఈ అధ్యయనం సమగ్రమని చెప్పేటందుకు యేమాత్రమూ సాధ్యంకాదు.

శాస్త్రిలు, గ్రంథాలు రాసిన మన పూర్వులైన పెద్దలు, ప్రాచీన భారత దేశ చరిత్ర రాయకపోయినా, మనకంటూ ఒక చరిత్ర వున్నదన్నది మాత్రం వారందరూ తెలుసుకొన్న ఒక యథార్థం. మన ప్రాచీన చరిత్రను తెల్పే అనేక దృష్టాంతాలు లభ్యమైనాయి. వీటిలో ప్రధానంగా ప్రాచీన వాస్తు విశేషాలు, శిల్పాలు, శాసనాలు, నాణేలు, వాఙ్మయం మొదలైనవాటిద్వారా చరిత్ర పరిశోధనకు పునాది వేయబడింది. పాశ్చాత్య సంపర్కంవల్ల వీటిల్లో మనకు కొంత అభినివేశం కూడా యేర్పడింది. ఈ సందర్భంలో మనం కొంతమంది చరిత్ర పరిశోధకులను స్మరింపవలసిన ఔచిత్యం ఎంతైనా ఉంది. వారిలో కావలి వెంకట బుఱ్ఱయ్య, బుక్కపట్టణం రాఘవాచార్యులు, కొమఱ్ఱాజు లక్ష్మణరావు, మల్లంపల్లి సోమశేఖరశర్మ, డా॥ నేలటూరి వెంకట రమణయ్య మొదలైనవారిని చరిత్ర పరిశోధకులుగా మనం తప్పక జ్ఞాపకం చేసుకోవాలి.

"హైద్రాబాద్‌లో లక్ష్మణరాయ పరిశోధక మండలివారు కూడ తెలంగాణాన ఉండే శాసనాలను వెదకి కన్గొని వాటిని 'తెలంగాణా శాసనములు' అను ఒక ప్రత్యేక గ్రంథంగా రెండు సంపుటాలుగా ప్రకటించారు. మొదటి సంపుటానికి డా॥ మారేమండ రామారావుగారును, రెండవ సంపుటానికి శ్రీ గడియారం రామకృష్ణశర్మగారును సంపాదకత్వాన్ని వహించారు. ఈ సంపుటాల్లో ప్రాచీనాంధ్ర దేశ చరిత్రకు సంబంధించిన అపూర్వములైన శాసనాలు చాలా వున్నాయి."4

''కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారు కేవలం చరిత్ర రచయిత మాత్రమేకాదు, శాసన పరిశోధకుడు కూడ. ఆంధ్రదేశ చరిత్రకు సంబంధించిన శిలా తామ్ర శాసనములను వెలికితీయించి, పరిష్కరించి ప్రకటించిరి. వీరి కృషివల్లనే ఆంధ్ర దేశపు శాసనముల ప్రాముఖ్యం ప్రజలకు తెలియవచ్చినది.''5

శాసన సాహిత్యాన్ని గూర్చి తెలుగులో జరిగిన కృషిని పరిశీలిస్తే, ఈ క్షేత్రంలో ఇంకా జరగవలసినది ఎంతో వుందని అనిపిస్తుంది. ఇదివరకు తెలుగులో జరిగిన శాసనాధ్యయనమే రెండు విభాగాల్లో మనం పరిశీలించవచ్చు. మొదటిది శాసనాల పర్యవేక్షణ - వాటి ప్రకటన, రెండవది శాసన సాహిత్య పరిశోధనలు.

భారత ప్రభుత్వ శాసన పరిశోధక శాఖవారు ఆంధ్ర దేశంలోని శాసనాలను దక్షిణ భారత శాసన సంపుటాల (Sii Volumes) ద్వారా ప్రకటించారు. మహత్వపూర్ణమైన కొన్ని శిలాశాసనాలను ఎపిగ్రాఫియాఇండికా ద్వారా ఆ శాసనాల యొక్క సుదీర్ఘ వివరాలను ప్రకటించారు. ఈ దశలో విశేష కృషి చేసిన హెచ్. కృష్ణశాస్త్రి, జయంతి రామయ్య పంతులు, డా॥ ఎస్. రామచంద్రమూర్తిగారల సేవలు ప్రశంసనీయములు. ఇదే విధంగా హైదరాబాదు ఆర్కియలాజికల్ సీరీస్‌వారు ప్రకటించిన 'ఇన్‌స్క్రిప్షన్స్ ఆఫ్ తెలంగాణా' కూడ స్తుతిపాత్రమైనది.

స్వాతంత్ర్యానంతరం ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వమేర్పడిన తర్వాత ప్రభుత్వ పురాతత్వ శాఖవారు ఆంధ్రదేశంలోని శాసనాలు సేకరించి, వాటిని జిల్లాల వారీగా ప్రకటిస్తున్నారు. ఈ దిశలో డా॥ నేలటూరి వెంకటరమణయ్య, డా॥ పి. వి. పరబ్రహ్మశాస్త్రి, కృష్ణశాస్త్రిగారల కృషి గణనీయమైందని చెప్పవచ్చు. రాయలసీమకు సంబంధించి, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంవారు కేవలం కడపజిల్లా శాసనాలను మూడుసంపుటాలుగా ప్రకటించారు. కానీ, అనంతపురం, కర్నూల్, చిత్తూరు జిల్లాల శాసన సంపుటాలను ప్రకటించవలసి ఉంది. కడప జిల్లా మూడు శాసనాల సంపుటాల ద్వారా, సౌత్ ఇండియన్ ఇన్‌స్క్రిప్షన్స్ సంపుటాల్లో వెలుగుకురాని అనేక శాసనాలు మొదటిసారిగా ప్రకటింపబడ్డాయి. శాసనాల మరి స్థలీయ ఐతిహ్యాలను గూర్చి మెకంజీగారు సేకరించిన విషయాలు చాలా అపూర్వములైనవి. వీటిలో కొంత భాగాన్ని శ్రీ నేలటూరి వెంకటరమణయ్యగారు 'కడపజిల్లా శిలాశాసనములు - వగయిరా' అనే పుస్తకంలో ప్రకటించారు.

కొందరు వ్యక్తులు ఉద్యోగరీత్యా లేదా శాసనాలపట్ల ఉండే ఆసక్తివల్ల ఆంధ్ర శాసనాలను పరిశోధనా పత్రికల్లో ప్రకటించారు. వీరిలో కొందరి పేర్లను

మాత్రం తప్పక ప్రస్తావించాలి. శ్రీయుతులు మల్లంపల్లి సోమశేఖరశర్మ, నేలటూరి వెంకటరమణయ్య, వేటూరి ప్రభాకరశాస్త్రి, కె. హెచ్. వి శర్మ, పి. వి. పరబ్రహ్మశాస్త్రి, గడియారం రామకృష్ణశర్మ, పద్మనాభశాస్త్రి, డా॥ ఎస్. ఎస్. రామచంద్రమూర్తి, కుందూరి ఈశ్వరదత్తు, బి. ఎన్. శాస్త్రి, ఘంటా జవహర్‌లాల్ మొదలైనవారల ప్రయత్నాలు అనుసరణీయాలు. దేశోద్ధారక కాశీనాధుని నాగేశ్వరరావుగారు భారతి మాసపత్రిక వ్యవస్థాపక సంపాదకులు. ఈ పత్రికలో ప్రకటింపబడినన్ని తెలుగు శాసనాలు మరి ఏ భాషా పత్రికలోనూ ప్రకటింపబడలేదు.

ఇప్పటివరకు శాసనాలను అధ్యయనం చేసినవారు ప్రాఙ్నన్నయ యుగానికి ప్రాశస్త్య మిచ్చినంతగా తరువాతి యుగాల శాసనాలవైపు అంతగా దృష్టి చూపలేదు. శాసనాలపై సమకాలీన సాహిత్యం యేమాత్రం ప్రభావం చూపిందన్న అంశంపై వీరు విశ్లేషణ చేయలేదు.

శాసనాలను గురించిన గ్రంథాలను పరిశీలిస్తే ఈ అధ్యయనాన్ని మూడు విభాగాలుగా చేయవచ్చు. (1) లిపి, శాసనము, శాసన శాస్త్రాన్ని తెల్పే రచనలు, (2) ప్రకటితమైన శాసనాలను సాహిత్యరీత్యా అధ్యయనం చేసి తత్ఫలితంగా వచ్చిన శాసనపద్యమంజరి మొదలైనవి, (3) కేవలం శిలాశాసనాలను ఆధారంగా చేసుకొని వెలువడిన అధ్యయనం. మొదటి విభాగంలో డా॥ తిరుమల రామచంద్ర గారి 'మన లిపి పుట్టుపూర్వోత్తరాలు' అనే పుస్తకం ఎన్నతగింది. చాలా నీరసమైన విషయాలైన లిపి పుట్టుపూర్వోత్తరాలకు సంబంధించిన అనేక విషయాలను ఇందులో తిరుమల రామచంద్రగారు చాలా హృద్యంగా చెప్పారు.

తెలుగు శాసనాల అధ్యయనంలో శ్రీ కుందూరి ఈశ్వరదత్తుగారు ఒక ధృవతార. వీరిచే రచింపబడిన 'తెలుగు శాసన పదకోశము', 'ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము' అనే ఈ రెండు కృతులు శాసనాలను అధ్యయనం చేసే వారికి ప్రతి దశలోను ఉపకరించే కల్పతరువులు తెలుగు శాసన పదకోశంలో ఆంధ్ర శిలాశాసనాల్లోని పారిభాషిక పదజాలానికి అధికారికమైన వ్యాఖ్యనిస్తూ శ్రీ దత్తుగారు అర్థాన్ని కూడా నిర్వచించారు. ఇట్లాంటి రచన ఆంగ్లంలో డి. సి. సర్కార్‌గారు 'ఇండియన్ ఎపిగ్రాఫికల్ గ్లాసరీ' అన్న పేరుతో రూపొందించారు.

కాని, ఈ రెండింటికీ అనేక భేదాలున్నాయి. శ్రీ దత్తుగారు తన యీ పుస్తకానికి రాసిన పీఠిక ఆంధ్ర శిలాశాసనాల్ని అధ్యయనం చేసేవారికి కరదీపిక. వీరి ప్రాచీనాంధ్రచారిత్రకభూగోళం మరొక నూతన యత్నం, ఆంధ్రదేశంలో పేర్కొన్న నాడుల్ని, సీమల్ని, రాజ్యాల్ని గుర్తించి, వాటి యెల్లల్ని చారిత్రకంగా తెలుపుతుందీ పుస్తకం.

. . . . . . . . . .

నేలటూరి వెంకటరమణయ్య, నిడదవోలు వెంకటరావు, దివాకర్ల వెంకటావధాని మొదలైనవారు శాసనాలను సాహిత్య నేపథ్యంలో విశ్లేషించి తమ సీమిత పరిధిలో శాసన సాహిత్యాన్ని గూర్చి వివరించారు. ఈ దృక్పథంలో వెలువడిందే శాసన పద్యమంజరి. దీన్ని జయంతి రామయ్య పంతులుగారు సంకలనం చేశారు.

డా॥ పి. వి. పరబ్రహ్మశాస్త్రిగారు 'కాకతీయ శాసనాలు' అనే రచన ద్వారా శాసనాలను కేవలం సాహిత్య దృక్పథంతోనే చూడకుండా సమగ్ర పరిశీలనా దృక్పథంతో విశ్లేషించి అధ్యయనం చేశారు. ఇలాంటి అధ్యయనాలు కేవలం కాకతీయ యుగానికి పరిమితం కాకుండా, అన్ని యుగాలకూ జరిగితే ఆంధ్ర శాసన సాహిత్యానికి మరింత స్పష్టమైన రూపం యేర్పడుతుంది.

'ఆంధ్రుల సాంఘిక చరిత్ర'ను శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారు చాలా కాలం కిందటే రచించారు. ఆ కాలానికి ఇదొక వినూత్న ప్రయత్నమే! ఇట్లాంటి ప్రయత్నాలు తెలుగులోకాని, ఆంగ్లంలో కాని అప్పటివరకు వెలువడలేదు. ప్రారంభ కాలం నుండి 1907 వరకు వెలువడిన తెలుగు సాహిత్యకృతులను మూలసామగ్రిగా స్వీకరించి, అంతవరకు ప్రకటింపబడిన చారిత్రక పరిశోధనల నేపథ్యంలో చాల సమర్థంగా రచించారు. అంతేకాక, ఈ గ్రంథానికి పాండిత్య స్ఫోరకమైన, ఆలోచనా ప్రదమైన పీఠికరాస్తూ, సాంఘిక చరిత్ర మహత్వాన్ని వివరించారు. కావ్యాలనే ఆధారంగా చేసుకొని సాంఘిక చరిత్రను గురించిన యింతటి విస్తృత రచన, మనకు తెలిసినంతవరకు అటు ఆంగ్లంలో కాని, ఇటు దాక్షిణాత్య సాహిత్యాలలో కానీ రాలేదంటే యేమాత్రం అతిశయోక్తిలేదు."6

ఇదే సందర్భంలో జానపద సాహిత్యాన్ని మూలసామగ్రిగా స్వీకరించి రచింపబడిన కొన్ని సాంఘిక చరిత్రల్ని కూడా మనం స్మరించవచ్చు. ఈ

కోణంలో డా॥ బి. రామరాజు, నాయని కృష్ణకుమారిగారలు కలసి రాసిన జానపద సాహిత్యం - సాంఘిక చరిత్ర అనే పుస్తకం, డా॥ పి. నరసింహా రెడ్డి గారి తెలుగు సామెతలు - సాంఘిక జీవితం, డా॥ జి. ఎస్. మోహన్‌గారి సామెతల్లో తెలుగు సాంఘిక చరిత్ర మొదలైనవి గమనింపదగ్గవి. ఇవన్నీ పరిశోధనల్లో సామాజిక అంశాలకు యెక్కువ ప్రాధాన్యాన్నిచ్చాయి. కానీ, ధార్మిక అంశాలవైపు దృష్టి ప్రసరింపలేదు.

శ్రీ యం. కందప్ప చెట్టిగారు క్రీ.శ. 12వ శతాబ్ది నుండి 19వ శతాబ్ది వరకు కల తెలుగు భాషను విశ్లేషించి చారిత్రక వ్యాకరణాన్ని పిహెచ్.డి. పట్టం కొరకు సిద్ధం చేశారు.

శ్రీ కె.కె. రంగనాథాచార్యులు 1401 నుండి 1900 వరకు ఉపలబ్ధమైన తెలుగు శాసనాల ఆధారంగా ఆ శాసనాల భాషను గురించిన చారిత్రక వ్యాకరణాన్ని తమ సిద్ధాంత వ్యాసంగా రచించారు.

డా॥ కోరాడ మహాదేవశాస్త్రిగారు ప్రాచీన తెలుగు శాసనాల ఆధారంగా ఆంధ్రభాషా చారిత్రక వ్యాకరణం అనే పరిశోధనా సిద్ధాంతాన్ని రచించారు.

పైన పేర్కొన్న ఈ పరిశోధనా గ్రంథాలన్నీ శాసనాలభాషను గురించి జరిగిన అధ్యయనాలే అయ్యాయి. డా॥ శ్రీ రామచంద్రమూర్తిగారు శాసనాల్లోని స్థలనామాలను గురించిన పిహెచ్.డి. సిద్ధాంతాన్ని ఆంధ్ర విశ్వవిద్యాలయానికి సమర్పించారు. బోయి విజయభారతిగారు దక్షిణాంధ్ర - వాఙ్మయం - సాంఘిక జీవితం అనే అంశంపై సిద్ధాంత వ్యాసం సమర్పించారు. డా॥ ఎన్. కృష్ణారెడ్డి గారు తమ ఆంధ్రదేశ సాంఘిక చరిత్ర అన్న సిద్ధాంత వ్యాసంలో రాయలసీమ శాసనాలు, సాంఘిక చరిత్రను గూర్చి కొంతవరకు పరిచయం చేశారు.

శ్రీ గంగిశెట్టి లక్ష్మీనారాయణగారు తమ పిహెచ్.డి. పట్టంకొరకు 'ఆంధ్రశాసనాల సాంస్కృతిక అధ్యయనం' చేశారు. అదేవిధంగా శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయంలో ఎ. ఉమామహేశ్వరశాస్త్రి గారు కడప జిల్లా శాసనాల సాంస్కృతిక అధ్యయనాన్ని చేశారు. ఇటీవలే ప్రకటింపబడిన [illegible] గారి కాకతీయ శాసనాలు (ఆంధ్రభాషా పరిశీలన)

అనే గ్రంథంలో శాసన సాహిత్యాన్ని గూర్చి విపులమైన చర్చ జరిగింది. శ్రీ రామచంద్రమూర్తి గారు ఆంధ్రదేశంలోని కొన్ని దేవాలయాలను, వాటిలో లభించే శాసనాల ద్వారా అధ్యయనం చేసి, 'దేవాలయ శాసన సమీక్ష' అనే ఉత్తమ గ్రంథాన్ని రచించారు. శ్రీ బూదరాజు రాధాకృష్ణగారి 'ప్రాచీనాంధ్ర శాసనాలు' అనే కృతి శిలాశాసనాల్లో గల వ్యాకరణాంశాల్ని చారిత్రకంగా అధ్యయనం చేసిన ఫలితమే! ఇది ఇప్పటి వఱకు ఆంధ్ర శాసనాల విషయంలో జరిగిన కృషి యొక్క స్థూల పరిచయం.

తెలుగు శాసనాల ఆధారంగా ఇతిహాస విభాగం నుండి ఆంగ్ల భాషలో అనేక పరిశోధనా కృతులు వెలువడిన విషయాన్ని ఇదివరకే స్పష్టంచేసి, వీటిలో తెలుగున వెలువడిన రచనలను మాత్రం ఇక్కడ పరిశీలనకు గ్రహించడం జరిగింది.

ఆంధ్రదేశపు జీవనవిధానం యెక్కడా యే కావ్యంలోనూ కళ్ళకు కట్టినట్లు చిత్రించబడలేదు. తళుక్కుమని కొన్ని కావ్యాల్లో అది మెరుస్తున్నా, అధిక ప్రమాణంలో విస్తారంగా స్వచ్ఛమైన రూపంలో కనిపించేది శాసనాల్లోనే. పాశ్చాత్యులకుండే చారిత్రక దృష్టి భారతీయులకు లేదన్నది అందరికీ తెలిసిన విషయమైనా, పాశ్చాత్యులు కొన్ని కొన్ని దేశాల్లో పర్యటించి వారి అనుభవాలను చరిత్రరూపంలో రాశారు. మన వారు వివిధ దేశాలకు వెళ్ళి వారి వారి జీవన విధానాల్ని గూర్చి రాయకపోవడం లేదా అతి తక్కువగా రాయడం అటుంచితే, మన దేశపు యథార్థ జీవిత చిత్రాన్ని కూడా ఎక్కడా పేర్కొనలేదు అనడంలో ఏమాత్రం సాహసం లేదు.

ఈ నేపథ్యంలో చూచినపుడు, ఆంధ్ర శాసనాలను గురించి, ఇది వరకు జరిగిన పరిశోధన అంత ఆశాజనకంగా కనబడటం లేదు, ఇంకా యెన్నో శాసనాలు వెలుగులోకి రావలసి ఉన్నాయి. వెలుగుకు వచ్చిన శిలాశాసనాల్ని అనేక దృక్కోణాలలో అధ్యయనం చేయవలసి ఉంది. ఇంతకు ముందే స్పష్టం చేసినట్లు, చరిత్రకారులు రాజకీయ చరిత్ర పునర్నిర్మాణానికి శాసనాలను చాలా చక్కగా ఉపయోగించుకొన్నారు. కాని, ఆ శిలాశాసనాల ద్వారా తెలియవచ్చే సాంస్కృతిక చరిత్రను సంపూర్ణంగా పునఃరచించలేకపోయారు. ఈ న్యూనతను

గుర్తించి, దీన్ని పరిహరించే చిన్న ప్రయత్నంగా ఈ అధ్యయనం చేయబడింది. మొత్తం ఆంధ్రప్రదేశములోని శాసనాలన్నింటినీ నేపథ్యంలో వుంచుకొని, వాటిలో రాయలసీమ తెలుగు శాసనాలను విశ్లేషించి, విభజించి, తద్వారా తెలియవచ్చే సాంస్కృతిక అంశాలను, తత్కాలీన సాహిత్యకృతులనుండి తెలియవచ్చే అంశాలతో తులనాత్మకంగా వివేచిస్తూ, బలపరుస్తూ ఇందులో నిరూపింపబడింది. అదే విధంగా రాయలసీమ వైశిష్ట్యాన్ని గురించిన శ్రద్ధాపూర్వక ప్రయత్నం కూడా ఆవిష్కరింపబడింది. ఈ అధ్యయనం రాయలసీమ చరిత్రను తెలుసుకొనే వారికి యే కొద్దిగానైనా సహాయపడగల్గినా ఈ ప్రయత్నం సార్థకమవుతుందని ఆశిస్తున్నాము

## అధ్యయన వ్యాప్తి :

సువిశాలమైన ఆంధ్రదేశము ప్రాదేశికమైన కొన్ని వైశిష్ట్యాలను కల్గి వున్నది ఈ దృష్టితో రాయలసీమ వైశిష్ట్యము, కర్నాటక, తమిళనాడుల విలక్షణాలతో పరస్పర సంబంధం కల్గిన 'మిశ్రమ సమన్వయ సంస్కృతి'గా రూపుదిద్దుకొన్నది. కాబట్టి, ఈ ప్రదేశాన్ని ఒక అధ్యయన వేదికగా పరిగణించవచ్చు.

ఈ అధ్యయనాన్ని కాలదృష్టితో కూడ పరిమితం చేసుకోవలసిన అవసరం యెంతైనా ఉంది. ఎందుకంటే, ప్రాచీనకాలం నుండి, అర్వాచీన కాలంవరకు వేలాది శాసనాలు వెలువడినాయి. వీటి నన్నింటిని దృష్టిలో ఉంచుకొని అధ్యయనం చేయడం ఒక వ్యక్తికి నిర్దిష్టమైన వ్యవధిలో సాధ్యం కాదు. అందువల్ల ఈ అధ్యయనం ప్రాచీనకాలం నుండి విజయనగర సామ్రాజ్య కాలంవరకు పరిమితం చేయబడింది దీనికి కారణం ఒక దృష్టితో చూస్తే ఈ మధ్యకాలం ఆయా రాజరిక వ్యవస్థలో ప్రత్యేకించిన సంస్కృతిని కలిగి ఉండడమే! ఉత్తరం నుండి ముస్లింల దాడి పెరిగినకొద్దీ, ఈ రాజవంశాలన్నీ నశించిపోయాయి. ఆ సందర్భంలో ముస్లింలను యెదుర్కొనేందుకు దక్షిణ భారతంలో ఒక సమర్థవంతమైన సామ్రాజ్యం అవసరమై ఉండింది. ఈ సారథ్యాన్ని విజయనగర సామ్రాజ్యం వహించడంతో, దక్షిణ భారత చరిత్ర మరొక దిక్కులో మలుపు తిరిగింది. అదే ఈ ప్రధాన అధ్యయనానికి యోగ్యమైన ఘటనమౌతుంది.

శాసనాలను అధ్యయనం చేసేటప్పుడు ఒక నియమం ఆద్యంతం అనుసరించబడింది. రాజకీయ చరిత్రకు సంబంధించిన విషయాల్ని కుదించి, మిగిలిన సాంస్కృతిక, సామాజిక అంశాల్ని సేకరించడం జరిగింది. ఉదాహరణకు రాజులు, వారి భార్యలు, బిడ్డలు, దిగ్విజయాలు, యుద్ధాలు— వీటి ప్రస్తావనలు వచ్చినా, ఇవి ఆ కాలంలోని సామాజిక విశేషాల అంగాలుగా మాత్రమే కన్పిస్తాయి. రాజ్యపరిపాలనా విధానాన్ని గూర్చిన అధ్యాయంలోనూ అంతే! అది ప్రజల జీవన విధానంలోని ఒక భాగంగా మాత్రమే భావింపబడింది. రాజకీయం కూడా సంస్కృతి నుండి ఉద్భవించిందే కదా!

మన ప్రాంతపు ప్రజా జీవనాన్ని తెలుసుకోవాలంటే శాసనాల కంటె ఉత్తమమైన సాధనాలు లేవు. సామాజిక అధ్యయనంలో శాసనాల ద్వారా కలిగే సహాయం, శాసనాల్లో ఉండే విషయ విపులత, వైవిధ్యం మొదలైన వాటి సమీక్షలు రాబోవు అధ్యాయాల్లో దర్శనమిస్తాయి. క్రీ. శ. 16 వ శతాబ్ది వరకు ప్రకటింపబడిన శాసనాలు ఈ అధ్యయన పరిధిలో చోటు చేసుకొన్నాయి.

పూర్వం నుండి మనం ప్రతి విషయాన్నీ అలంకారికంగా, భాషాబద్ధంగా చెప్పడం ఒక సంప్రదాయంగా చేసుకొన్నాము. అది భాషకు సంబంధించినదైనా, వ్యాకరణ సంబంధి అయినా, శాస్త్రానికి సంబంధించింది అయినా ఇదే పద్ధతిలో మాట్లాడటమో, రాయటమో జరుగుతూంది. ఇది నాగరక మానవులకుండే ప్రత్యేక ప్రకృతి. ఈ లక్షణం శాసనాల్లోనూ కనిపిస్తుంది. అట్లానే కేవల కావ్యాలుగా వుండే శాసనాల సంఖ్య కూడా చాలా తక్కువే! ఉదాహరణకు చివరి చోళరాజు మూడవ కులోత్తుంగుని 'త్రిభువనం' సంస్కృత శాసనం పూర్తిగా కావ్యమే! దానిలో చరిత్రాంశమేమీ కన్పించదు.

ఆంధ్రదేశంలోని చాలా శాసనాలు పద్యరూపంలో ఉన్నాయి. వీటి ద్వారా యెంతో మంది కవుల ప్రతిభ కూడా సహిర్గతమైంది. వీరిలో అనేకులు సహజ కవులుగా, శాసన కవులుగా ప్రకటింపబడి ఉన్నారు. కొన్ని శాసనాలను శుద్ధ కావ్యాలుగా కూడా రచించారు. కంచిలోని సూర్యదేవాలయ స్తంభాలపై మయూర మహాకవి విరచిత సూర్యశతకాన్ని మలిచారు. వీటిలో ఒక స్తంభం మాత్రం చెక్కుచెదరకుండా ఇప్పటికి నిలిచి ఉంది. విద్యాకేంద్రాల్లో కూడ అనేక

గ్రంథాలను, గ్రంథ భాగాలను, విద్యార్థులకు ఉపయుక్తమైన విషయాలను ఈ విధంగా శిలలపై చెక్కి, గోడల ప్రక్కల దర్శనీయంగా నిలబెట్టి ఉంచడం ఆనాటి సంప్రదాయం.

శాసనాలు సాహిత్యానికి ఊటవెల్లువలు. సాహిత్యం మొట్టమొదట కన్పించేది శాసనాల్లోనే! నన్నయకు పూర్వపు తెలుగు కావ్యం మనకింకా లభింపలేదు కానీ, కొన్ని శాసన పద్యాలు మాత్రం అక్కడక్కడ కావ్య శైలిలో లభిస్తున్నాయి.

ఈ అధ్యయనం ప్రాచీన తెలుగు దేశాన్ని, ప్రజా జీవితాన్ని, కావ్యాల్ని, వాటి ప్రభావాల్ని, కావ్యక్రమ పరిణామాన్ని, కొంతవరకు కావ్యాల్లోని భాషా పరిణామాల్ని, వర్ణనల్ని అర్థం చేసుకొనేందుకు తోడ్పడుతుంది.

శాసనాలు సామాన్యంగా రాజులు వేయించినవే! ఊహా ప్రపంచానికి, కథాత్మతకు సంస్కృత కావ్యాలు సన్నిహితమైనవి. పల్లెల, పట్టణాల, నగరాల్లోని ఆనాటి ప్రజా జీవనము శాసనాల్లో వ్యక్తమైనంతగా ఆనాటి కావ్యాల్లో వ్యక్తం కాలేదనేందుకు యేమాత్రం సందేహం లేదు. శాసనాల ద్వారా కేవలం ఆనాటి యుద్ధాలు, రాజుల పరిపాలనాది విశేషాలు, దానాది విషయాలు మాత్రమే తెలుస్తాయని కొంతమంది విమర్శకులు భావించినా, వీటివల్ల ఆనాటి గ్రామీణుల, నాగరికుల, రాజుల, పండితుల జీవన విధానమూ, సామాజిక స్థితిగతులు, ఆర్థిక సంబంధమైన విశేషాంశాలూ, భిన్నభిన్న సంస్కృతులూ వీటిని గూర్చిన అంశాలను తెలుసుకోవచ్చుననే సత్యాన్ని గుర్తించినవాళ్ళూ ఉన్నారు.

శాసనాల్లో కన్పించే విషయ నిరూపణకంటె, యే ఉద్దేశ్యం లేకుండా ప్రాసంగికంగా అవి మనకిచ్చే వివరణలు చాలా విలువైనవని చెప్పవచ్చు. ఉదాహరణకు, ఏదో దానవిషయాన్ని చెప్పేందుకు మొదలుపెట్టబడిన శాసనం ఆ కాలపు భిన్న భిన్న వ్యవహారాలు, వాటికి సంబంధించిన అధికారాలు, వ్యాపారం, గ్రామాలు, అగ్రహారాలు, పరిపాలన, ధార్మిక మనోభావాలు మొదలైన విషయాలను కూడా తెలుపగలుగుతున్నది. శాసనాలను రాజకీయ దృష్టితోను, వాటి అధ్యయనాన్ని ఇంకా అంకితం భావంతోను పరిశీలింపవలసిన అవసరం యెంతైనా ఉంది.

కొన్ని శాసనాల్లో ఊళ్ళ పేర్లూ, వ్యక్తుల పేర్లూ తెలిపి- చివర ప్రాకృత, సంస్కృత ప్రత్యయాలను చేర్చడంతో మొత్తం శాసనం సుదీర్ఘంగా కొనసాగించడం ఒక పద్ధతిగా యేర్పడింది. భాషా దృష్టితో మనకు దొరికే శాసనాలను నాల్గు భాగాలుగా వింగడింపవచ్చు. పూర్వకాలంలోని శాసనాలన్నీ చాలావరకు ప్రాకృతంలో ఉన్నాయి. (అశోకుని శాసనాలు, బౌద్ధ శాసనాలు మొదలైనవి.) ఇది మొదటి దశ. 9వ శతాబ్దివరకు లభించే శాసనాల్లో సంస్కృతమే ఎక్కువ. అప్పటినుండి 12 13 శతాబ్దుల వరకు తెలుగు సంస్కృత శాసనాల మిశ్రమాలు లభిస్తున్నాయి. అయితే, ఈ కాలంలో తెలుగు శాసనాల ప్రాబల్యం కొంచెం యెక్కువే! ఇది మూడవ దశ. ఇక్కడి నుండి తెలుగు శాసనాలే అధికంగా లభిస్తున్నాయి. ఇది నాల్గవ దశ.

ప్రథమ దశలో శాసనాల సంఖ్య తక్కువే! మూడు, నాల్గు దశల్లో శాసనాల సంఖ్య అధికం, అంటే నన్నయకు పూర్వం. సంస్కృత ప్రాధాన్యతా కాలంలో తెలుగులోని ఒక అనుక్రమాన్ని నిల్పిన యశస్సు సామాన్య విద్యావంతులదీ, శాసనాలదీను.

ప్రస్తుతం రాయలసీమ తెలుగు శాసనాలను కూడ అక్కడక్కడ తులనాత్మకంగా పరిశీలన చేసే ప్రయత్నం జరిగింది. ఇలాంటి ఈప్రయత్నం యెన్నో తెలుగు శాసనాలను అర్థంచేసుకోవడానికి కూడా సహకరించింది.

## సూచికలు


1. హనుమజ్జానకీరామశర్మ, పోలూరి: భారతీయ సంస్కృతీ ప్రకాశము - పు. 5-6 తి.తి.దే. 1979.
2. విశ్వనాథరెడ్డి, కేతు: (సం) తెలుగు చరిత్ర-సంస్కృతి - పు. 2-3.
3. చిదానందమూర్తి, ఎం., : కన్నడ శాసనగళ సాంస్కృతిక అధ్యయన- పు. 4-5.
4. వెంకటరమణయ్య, నేలటూరి : పల్లవులు - చాళుక్యులు - పు. 17.
5. వేంకటరమణయ్య, నేలటూరి : -అదే- పు. 9.
6. ఈశ్వరదత్తు, కుందూరి: ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము - పు. 282.

# భూమిక

'రాయలసీమ' అనే పారిభాషిక పదంతో పిలువబడుతున్న ఈ ప్రాంతానికి ఈ పేరు యెప్పుడు, యెట్లా వచ్చిందో, యింకా దీని చరిత్ర యేమిటో కొంత తెలుసుకోవడం అవసరం.

రాయలసీమ అనే ఈ పదప్రయోగం, సుమారు రెండు మూడు శతాబ్దాల కిందటి సాహిత్య కృతుల్లో లభించింది. సిద్దవట సీమ పాలకుడు మట్ల వెంకట రామభూపాలుని ఆశ్రయంలో ఉండిన నడిమింటి వెంకటపతి అనే కవి, తన అభిషిక్త రాఘవంలో, తన పూర్వీకుడైన మట్ల అనంతరాజు పౌరుషాన్ని వర్ణిస్తూ ఈ విధంగా తెలిపాడు:

ఉ: ''గాయకులశ్వరాయ బలఖానులు మట్ల యనంతరాజశౌ
ర్యేయక ధారద్రెవ్విరని చెప్పెడి వింతియగాక వేలుపున్
రాయలసీమలోన జతురంగబలంబుల తోడ వైరముల్
పాయక యున్నవారు సరిపాళెము వైచిన యట్లజస్రమున్."

ఈ పద్యంలో పేర్కొనబడిన 'రాయలసీమ' అన్న పదాన్ని ఆధారంగా చేసుకొని శ్రీ కుందూరి ఈశ్వరదత్తుగారు యిలా రాస్తున్నారు—

''—నేటి దత్తమండలములనబడు దక్షిణాంధ్ర ప్రదేశంలోని కర్నూలు, కడప, అనంతపురం ప్రాంతములకు రాయలసీమ అను పేరు వాడుకలో నున్నది. కన్నడ రాయంద్రడు పాలించిన దేశము గావున దీనికి రాయలసీమ యని పేరు వచ్చియుండెను.''1

పై పద్యంలో రాయలసీమ భౌగోళిక పరిధిని తెల్పే యే అంశమూ లేకపోయినా కుందూరి ఈశ్వరదత్తుగారు యే ఆధారాన్నిబట్టి ఈ వ్యాఖ్యానం చేశారో స్పష్టమవడం లేదు.

పద్యంలోని సందర్భాన్నిబట్టి రాయలసీమ అన్న పదాన్ని ఈ విధంగా అన్వయించవచ్చు:

"అశ్వపతులైన ముస్లింలు పట్ల అనంతరాజ వీర ఖడ్గముచే చంపబడినారని చెప్పడం మాత్రమేకాక వారు స్వర్గలోకంలో కూడ చతురంగబలాలతో వారి వారి శత్రుత్వాలను అక్కడ కూడా శాశ్వతంగా హోరాహోరీగా (సరిసమానులుగా) తమ బలప్రదర్శనద్వారా వ్యక్తం చేస్తూనే ఉన్నారని గాయకులు పాడుతున్నారు."

ఈ పద్యంలోని రాయలసీమ పదాన్ని పూర్వపు పదమైన 'వేలుపున్' అన్న పదంతో కలిపి అన్వయించుకోవాల్సి వస్తుంది. ఎందుకంటే, ఈ రెండు పదాలు పరస్పరం కూడుకొన్నాయి కాబట్టి. ఈ రెండింటిలో ఏ పదానికి ఆ పదాన్ని విడదీస్తే పూర్తి అర్థం స్ఫురించదు. పద్యంలోని సంపూర్ణార్థం కూడ దెబ్బతింటుంది. అన్వయక్రమం కూడ చెడిపోతుంది. నాటి ముస్లిం, హిందూ రాజుల పరస్పర పరాక్రమాలను కవులు ఈ విధంగా అలంకారికంగా వర్ణించడం కూడా ఒక సాంప్రదాయంగా పెట్టుకొన్నారని ఈ పద్యంలో ప్రయోగించిన పారిభాషిక పదాల్నిబట్టి తెలుసుకోవచ్చు.

ఇట్లాంటి ఛాయగల పద్యమే కడపజిల్లా జమ్మలమడుగు తాలూకా తాళ్ళ పొద్దుటూరు గ్రామం ఆంజనేయస్వామి దేవాలయంలోని ఒక స్తంభంపై క్రీ. శ. 1323 సం॥ నకు చెందిన శాసనంగా ప్రకటింపబడి ఉంది.[2]

ఉదా॥ ఇలజగతాపి ఖడ్గమున నీల్గిన వీరుని రంభపుచ్చుకోం
దలచిన దూర్పుదిక్కున ఘృతాచి గిసుక్కనందుమ్మె నంతలో
పలంజనుదెంచ్చె వారి కులభామినియగ్ని పథంబునందు ని
ష్ఫలతకు రంభ యున్వోలఖువారిన నవ్విరిదోడికామినులు.

యుద్ధంలో చనిపోయిన వీరునికి వీరస్వర్గం ప్రాప్తిస్తుంది అనే భావం (కల్పన), దక్షిణ భారతంలోని శాసనాల్లో ముఖ్యంగా 9, 10 శతాబ్దాల తరువాతి శాసనాల్లో మిక్కిలి స్పష్టంగా కన్పిస్తుంది. ఈ భావం సాధారణ (కావ్య) సాహిత్యంలోనేకాక శాసన సాహిత్యంలో కూడ తగిన స్థానం పొంది ఉంది.

మొత్తం మీద అభిషిక్త రాఘవంలోని పై పద్యంలో ఉటంకింపబడిన 'రాయలసీమ' పదం ఆంధ్రదేశంలోని ఒక భాగమైన రాయలసీమ ప్రాంతం మాత్రం కాదని నా అభిప్రాయం.

ఇక సాహిత్యాధారాల నుండి చారిత్రక, భౌగోళిక, రాజకీయ ఆధారాల వైపు పరిశీలిస్తే-

రాయలసీమ అనే పదం ఇంతకు మునుపు దత్తమండలాలుగా పిలవబడుతూ ఉండిన బళ్ళారి, అనంతపురం, కడప, కర్నూలు, చిత్తూరు జిల్లాలను ఉమ్మడిగా సూచించేందుకు వాడుకలో ఉంది. 1953 వ సంవత్సరంలో భాషా ప్రయుక్త రాష్ట్రాలు యేర్పడిన తర్వాత బళ్లారి జిల్లా కర్నాటకంలో విలీనమైపోయింది. అంటే, ఈ శతాబ్దపు ప్రారంభకాలంలో ఉండిన రాయలసీమ భూపటం మారింది. ప్రస్తుతం అనంతపురం, కడప, కర్నూల్, చిత్తూరు జిల్లా ప్రాంతాలు కలిపి 'రాయలసీమ'గా పిలువబడుతూంది. ఇటీవలికాలంలో కర్నూల్ జిల్లాలోని కొంత భాగం కోస్తా జిల్లా అయిన ప్రకాశంకు చేరింది. ప్రస్తుతం రాయలసీమ భూపటం మళ్ళీ మారింది.

భౌగోళికంగా, రాజకీయంగా రాయలసీమకు కొంత చరిత్ర ఉంది. ఈ చరిత్ర 'దత్తమండలాలు' అన్న పేరుతో ముడిపడి ఉంది.

"క్రీ. శ. 1780 నుండి యూరపు ఖండమున ఫ్రెంచివారికిని, బ్రిటిష్ వారికిని యుద్ధము లనేకము జరుగుచుండెను. బ్రిటిష్‌వారికి చిక్కులు కలిగించు ఉద్దేశముతో ఫ్రెంచి నౌకాదళములు, కాల్బలములు దక్షిణ హిందూదేశమునకు రాసాగెను. ఇట్టి సందర్భములలో ఊరకుండుట రాజనీతి కాదని బ్రిటిష్‌వారు తమకు గల చాతుర్యమునంతను ఉపయోగించి నిజామును, మహారాష్ట్రులను తమ పక్షములోనికి తెచ్చుకొని, టీపుతో రెండు యుద్ధములు కావించిరి. వీనిలో మొదటి యుద్ధమందు (క్రీ. శ. 1790 - 92) టీపు అపజయముగాంచి, తన రాజ్యములో కొంత భాగము కోల్పోయెను. ఆ భాగములో చేరియుండిన ఇప్పటి బళ్లారి, అనంతపురములు నిజామువంతుకు వచ్చెను. అటు తరువాత క్రీ.శ. 1799 లో జరిగిన రెండవ యుద్ధమందు టీపు ఓడిపోవుటయేకాక ప్రాణములను కూడ కోల్పోయెను. అప్పుడు జరిగిన రాజ్యము పంపకములో రాయలసీమ

తక్కిన ప్రాంతములన్నియు (కడప, కర్నూలు మొదలైనవి) నిజాముకు లభించినవి. క్రీ. శ. 1800 ప్రారంభమున ఈ విధముగ రాయలసీమ అంతయు నిజాము పాలనలోనికి వచ్చెను. కాని, ఇవి అతని పాలనములో చాలా కాలము నిలబడలేదు. అంతకు రెండు సంవత్సరములకు పూర్వము అతడు బ్రిటిష్‌వారి సైన్యసహకార విధానమునకు సమ్మతించి తన రక్షకై వారు యేర్పరచిన సైన్యమున కగు ఖర్చులను భరింపవలసిన వాడయ్యెను. కాని, ఆ ఖర్చులను ఏటేట సక్రమముగ సకాలమునకు చెల్లించుట సాధ్యము కాని కారణమున క్రీ.శ. 1800 సంవత్సరములో బ్రిటిష్‌వారికిని అతనికిని సంధి ఒకటి జరిగినది, దానిని అనుసరించి సైనిక వ్యయమునకు బదులుగా అతడు రాయలసీమనంతను బ్రిటిష్‌వారి వశము గావించెను. అది మొదలు రాయలసీమకు బ్రిటిష్‌వారు పరిపాలకులయిరి. నిజాముచే దత్తములయినవి కావున వానికి ఇటీవలి వరకు 'దత్తమండలము'లను పేరు ప్రచారములో ఉండెను."[3]

"అనంతపురం, చిత్తూరు, కడప, కర్నూలు జిల్లాలను 'దత్తమండలాలు' అని పిలపటం బానిసత్వానికి చిహ్నమని భావించి ఆ జిల్లాలకు 'రాయలసీమ' అని పేరు పెట్టి ప్రచారంలోకి తీసుకొచ్చిన వ్యక్తి గాడిచర్ల హరిసర్వోత్తమరావు అని శ్రీ భూమన్ అభిప్రాయం. దత్తమండలాలకు 'రాయలసీమ' అనే పేరును ప్రచారం చేసిన వారిలో గాడిచర్ల వారొకరు అనే విషయంలో ఎలాంటి విరుద్ధత లేదు. కాని, 'రాయలసీమ' పేరు పెట్టిన వారు మాత్రం గాడిచర్లవారు కాదు. ఆ పేరు పెట్టింది మహా మహోపాధ్యాయ, కళాప్రపూర్ణ డా. చిలుకూరి నారాయణరావుగారు."

....రాజకీయపు ఒడుదుడుకులవల్ల రాయలసీమ పేరు ఎప్పుడో మరుగున పడిపోయిందని, క్రీ. శ. 1792-1799 మధ్య కాలంలో హైద్రాబాదు నిజాం ప్రభువుకూ, బ్రిటిషువారికీ కుదిరిన ఒప్పందంలో ఈ ప్రాంతం దత్తమండల మైందనీ, ఆ తర్వాతి కాలంలో క్రమంగా దేశంతో జాతీయాభిమానం, గౌరవం హెచ్చినకొద్దీ దత్తమండలం అనే పేరు ప్రజలకు వెగటుగా తోచింది. అగౌరవం అనిపించింది. అందువల్ల వారు కొత్త పేరు పెట్టాలనుకున్నారు. అట్లాంటి సమయంలో డా. చిలుకూరి నారాయణరావు గారు నంద్యాలలో 1928 నవంబరు 17, 18 తేదీల్లో జరిగిన ఆంధ్ర మహాసభల్లో 'రాయలసీమ' అనే పేరు పెట్టినట్లు తెలుస్తోంది. 'దత్త అనే పేరుతో 128 పంక్తుల్లో మంజరీ ద్విపదలో ఈ సీమ

ఇందులో - 'దత్త నందురు నన్ను దత్త నెట్లగుదు,
రిత్త మాటల చేత చిత్తము కలగె'.

ఈ వివరాలు ఇస్తూ, తమ వాదాన్ని 'శ్రీ చిలుకూరి నారాయణరావుగారు బల పరచారు' అని శ్రీ అవధానం నాగరాజరావు వివరించారు.[4] అయితే, 'అభిషిక్త రాఘవం'లో ఉన్న పద్యానికీ, ఇటీవల జరిగిన ఈ వృత్తాంతానికి పొంతన లేదు.

క్రీ. శ. 1800-1850 మధ్య జనసంఖ్య రెండింతలయ్యేనని నిపుణులు అంచనా వేసి యున్నారు. సరియైన జనాభా లెక్కలను తయారు చేయుటకు క్రీ. శ. 1871 లో ప్రథమ ప్రయత్నము జరిగెను. తెలంగాణా మినహాగా బళ్ళారి, గంజాములతో కూడిన అప్పటి తెలుగు జిల్లాలలోని జన సంఖ్య 1,20,80,251. (అనంతపురం, చిత్తూరు జిల్లాలు అప్పటి కేర్పడలేదు.)[5]

డా॥ నేలటూరివారు తమకు ఉత్తరంలో రాసిన అంశాన్ని దివాన్ బహద్దూర్ టి. భుజంగరావుగారు ఇలా తెలిపారు:

"దత్తమండలాలకు ప్రస్తుతం వర్తించే రాయసీమ లేక రాయలసీమ అన్న పదం ఇటీవలి కాలంనుండి పిలువబడే నూతన పదం మాత్రం కాదు. కొన్ని శాసనాలు, సాహిత్యము పరిశీలించిన తర్వాత - వీటి అన్నింటి ఆధారాలుగా దత్తమండలాల్ని (జిల్లాలను) 16, 17 శతాబ్దుల్లో రాయలసీమగా చెప్పబడినది."[6]

రాయలసీమ అని భావింపబడే ఈ దత్తమండలాల్లో ఉపలబ్ధమయ్యే శాసవాలను చూచినపుడు ఈ సీమను వేర్వేరు సీమలుగా, నాడులుగా విభాగింప బడటం గమనింపవచ్చు. దీన్ని గూర్చి యింకా వివరంగా శాసనాల్లో 'నాడులు' అన్న విభాగంలో (పూర్తిగా) వివరింపబడింది. ఇంకా లోతుగా పరిశీలిస్తే అసలు శాసనాల్లో 'రాయలసీమ' అన్న ప్రయోగము లేదనే చెప్పవచ్చు.

ఇక ఇప్పుడు 'రాయలసీమ'ను గూర్చిన చర్చ చేయవలసి వస్తే, ఈ రాయలసీమ పదం కేవలం విజయనగర రాజులకు చెందిన ఒక దేశం లేక ప్రాంతం అని సాధారణార్థంలో అర్థం చేసుకోరాదు. ఎందుకంటే, రాయలసీమ అనే ఈ పదం పరిమితమైన అర్థంలో మాత్రమే ఉపయోగింపబడుతూ విజయ నగర రాజుల్లోని చివరి రాజుల పాలననుబట్టి వచ్చి ఉంటుంది.

రాయలసీమ అనే ఈ పదంతో ఈ ప్రాంతాన్ని యీ విధంగా పిలువబడే సామంజస్యం, ఈ ప్రాంతపు పరిధిలోని బళ్ళారి, అనంతపురం, చిత్తూరు, కర్నూలు, కడప అనే ఈ ఐదు జిల్లాలను గూర్చిన వివరణలు యివ్వడం ఈ సందర్భంలో అత్యంత అవసరం.

**బళ్లారి జిల్లా :**

మొట్టమొదట చెప్పవలసింది బళ్ళారి జిల్లాను గురించి. ఆరవీడు వంశ క్రమంప్రసిద్ధుడైన శ్రీ కృష్ణరాయలకు అల్లుడైన అళియ రామరాజు నుండి ప్రారంభమవుతుంది. అళియ రామరాజు కృష్ణరాయల మేనల్లుడైన సదా శివరాయలయొక్క నామమాత్రపు పరిపాలనకు ప్రతినిధి అయినాడు. అయితే, చట్ట సంబంధమైన, రాజ్యాంగ సంబంధమైన విషయాల్లో ఆరవీటి వంశపరంపర రామరాయల తమ్ముడైన తిరుమలరాయలతో ప్రారంభమౌతుంది.

'సదాశివరాయలు కృష్ణరాయల సవతి తమ్ముడు. అచ్యుతరాయల సోదర పుత్రుడు. కృష్ణరాయల అనంతరం ఉత్తరాధికారిని గూర్చిన తర్జన భర్జనలో రామరాజును కాదని అచ్యుతరాయలను సింహాసన మెక్కించటం జరిగింది. అతని తర్వాత కూడ విధిలేక ఆ వంశీయుడే అయినట్టి సదాశివరాయలను నామమాత్రపు రాజును చేయవలసి వచ్చింది కాని, రామరాజే అధికారం చేసినాడు'[6](a)

ఫాదర్ హెరస్ (father Heras) ప్రకారం, తిరుమలరాయల కాలంలోనే సదాశివరాయలు మృత్యువువాత పడ్డాడు. అయితే, ప్రత్యక్ష పరిపాలనకు సంబంధించినంత వరకు అళియ రామరాయలనే ఆరవీడు వంశ ప్రథమ పాలకుడుగా స్వీకరింప వచ్చు. యథార్థమైన కొన్ని సాక్ష్యాధారాలను బట్టి చూస్తే, అళియ రామరాజు, రాజుగారి ఆహ్వానంపై పట్టాభిషేక మహోత్సవాలకు వెళ్ళినట్లు చాలా శాసనాల ద్వారా తెలుస్తున్నది.[7] ఇప్పటి ఈ రామరాజు బళ్ళారి జిల్లాలోని విజయనగరాన్ని రక్షసి తంగడి యుద్ధంలో (సామాన్యంగా అందరిచే పిలువబడే తళ్ళికోట యుద్ధం) అతడు వోడిపోయేవరకు పాలించాడు. ఇతని చిన్న తమ్ముడు తిరుమల రాయలు విజయనగరానికి పునః ప్రాభవాన్ని కల్గించటానికై కొంతకాలం ఈ రాజ్యాన్ని పాలించాడు. తర్వాత క్రమంగా

తిరుమలరాయలు తన రాజధాని నగరాన్ని ప్రస్తుత అనంతపురం జిల్లాలోని పెనుకొండకు మార్చినాడు. అయితే, ఫాదర్ హెరాస్ చెప్పినట్లు (పు. 243-వాల్యూం I) చాల మంది ఉత్తరప్రాంత సామంత రాజులు (పాలెగాళ్ళు), రాజ ప్రతినిధులు మహమ్మదీయుల వలన కలిగే భయంవల్లనో, లేక వారి వారి దురాశలవల్లనో తమతమ నగరాలకు, కోటలకు తమను తాము స్వతంత్రులుగా ప్రకటించుకున్నారు. చిట్టచివరకు ఈ అరవీటి రాజులు కూడా తమను తామే కర్నాటక రాజులుగా- అంటే, బళ్ళారి జిల్లాలోని పాత విజయనగర రాజులుగా ప్రకటించుకున్నారు. వారి క్రొత్త రాజధానిని 'విజయనగరపు పెనుకొండ'గా పిలుచుకొన్నారు (చూడు : హెరాస్ - వాల్యూం. I, పుట. 238). యథార్థానికి కొంత మంది చరిత్రకారులు అరవీటి వంశాన్ని కర్నాటక వంశంగా కూడ చెప్పడం జరుగుతుంది. అందువల్ల బళ్ళారి జిల్లా వీరికి రాజధాని కేంద్రంగాను, రాయలసీమలో ఒక భాగంగా కూడ పిలువబడుతూ వచ్చింది.

## అనంతపురం జిల్లా :

ఇక అనంతపురం జిల్లా విషయాని కొస్తే, నూతన రాజధాని పెనుకొండ పట్టణం ఈ జిల్లాలోనిదే. ఈ పెనుకొండకు ఉత్తర ప్రాంతాన్ని మహమ్మదీయులు క్రీ.శ. 1580 లో ఆక్రమించుకొన్నారు. ఈ కారణంవల్లను, స్థానిక అధికారుల తిరుగుబాట్లవల్లను ఈ రాజులు, ఈ రాజధానిని వదలి చిత్తూరు జిల్లాలోని చంద్రగిరిని రాజధానిగా యేర్పాటు చేసుకోవడం జరిగింది.[8] ఈ విధంగా అనంతపురం తనకుతానై రాయలవారి సీమలోని ఒక భాగంగా పిలువబడటానికి సరియైన ఆధారమైంది.

## చిత్తూరు జిల్లా :

చిత్తూరు జిల్లాలోని చంద్రగిరి అరవీడు ప్రభువులకు చివరి రాజధాని అయినందువల్ల, ఈ జిల్లా వీరి చివరి రోజుల్లో యీ విధంగా సీమగా యేర్పడింది.

## కర్నూలు జిల్లా :

ఇక కర్నూలు జిల్లా విషయానికొస్తే, అరవీడు వంశానికి చెందిన యే అంశమైనా ప్రత్యేకంగా ఈ జిల్లాలో ఉందా అంటే ఔననే జవాబు చెప్పవలసి

వస్తుంది. అళియ రామరాజు తాత అరవీటి రామరాజు. ఇతడు అరవీటి బుక్క అనునాతని కుమారుడు. కర్నూలు జిల్లా మాన్యుయల్ (పుట. 27) ప్రకారం, అరవీటి రాజు కృష్ణదేవరాయల తండ్రివద్ద సైనికాధికారిగా ఉంటూ, రాజుగారి తరఫున ఈ అరవీటి రామరాజు, యూసుఫ్ ఆదిల్‌సవాయి (గోల్కొండ సుల్తాన్, పర్షియాలోని సవాయిలో పుట్టినవాడు)ని, కర్నూలు నుండి వెళ్ళగొట్టినందువల్ల అతడు (అరవీటి రామరాజు) క్రమంగా కర్నూలును విజయనగర ప్రభువునుండి జాగీరుగా పొందాడు. ఈ సవాయి పరాజయము వెంకయ్యగారి తెలుగు పద్య కావ్యం రామరాజీయంలో చెప్పబడింది. ఆ కావ్యంలో కవి (పద్య సంఖ్య : 208, పుట : 104, ఎస్. కె. అయ్యంగార్‌గారి విజయనగర చరిత్ర) అరవీటి రామరాజు కందనవోలు (కర్నూలు) ప్రభువనియు, అరవీటి బుక్క నంద్యాల (కర్నూలు జిల్లా) పరిపాలకుని కుమార్తె అబ్బలదేవిని వివాహం చేసుకొన్నట్లు, అతని వంశస్థులు ఆమె ద్వారా నంద్యాలలో సామంతులుగా పరిపాలించినట్లు వివరించాడు. డా॥కృష్ణస్వామి అయ్యంగార్‌గారు తన 'Sources of Vijayanagar History' (పుట : 16) లో, శ్రీకృష్ణదేవరాయల కాలంలో అళియ రామరాజు, అతని సోదరులు ఆదోని, గుత్తి, పెనుకొండ, గండికోట, కర్నూలు జిల్లాలకు ప్రత్యేక పాలనా ప్రతినిధులుగా ఉండేవారని చెప్పాడు. అరవీటి పాలకులు విజయనగర రాజులయ్యేందుకు ముందే కర్నూలు జిల్లా వీరి పాలనకింద వుండేదని తెలియవస్తూంది. బీజాపూర్ సుల్తాన్ కర్నూలును బీజాపూర్‌లో కలుపుకున్న తర్వాతకూడా అరవీడు పాలకులు నవాబుకింద పాలెగాండ్రుగా (సామంతులుగా) కొనసాగారు.[9] ఈ విధంగా కర్నూలు జిల్లా పూర్తిగా రాయల వారి సీమ కాకున్నా, ప్రత్యేకార్థంలో ఒక విధంగా వారిసీమగానే చెప్పవచ్చు. త్రిపురాంతక శాసనాలు మొదలైనవి ప్రస్తుత ప్రకాశం జిల్లా పరిధిలో (పూర్వపు కర్నూలు జిల్లాలోని కొంత ప్రాంతం) వున్నాయి. ఆయా అధ్యాయాల్లో ఈ జిల్లా శాసనాలను ఉటంకించినప్పుడు కర్నూలు జిల్లా శాసనాలుగనే పేర్కొనబడినాయి.

## కడప జిల్లా :

చివరగా కడప జిల్లాను గూర్చి చెప్పవలసివస్తే - డా॥ కృష్ణస్వామి అయ్యంగార్‌గారు యిదివరకు యిచ్చిన వివరణ ప్రకారం గండికోట ప్రాంతం

అరవీటి రాజులు విజయనగర పాలకులుగ అయ్యేందుకు ముందు, వారి అధికార పరిధిలో ఉండే కొన్ని ప్రాంతాల్లోని ఒక విభాగం అని చెప్పబడింది. కడప జిల్లా గెజిటీర్ (పుట : 192) ప్రకారం, గండికోట ప్రాంతం- "ఈ జిల్లా అధికార పరిధిలో ప్రస్తుతపు పులివెందల, ప్రొద్దుటూరు,కమలాపురం, కడప తాలూకాలు, ఇంకా కర్నూలు జిల్లాలోని కొంత భాగంకూడా ఉండి ఉండవచ్చు." ఇంకా కడప జిల్లా గెజిటీర్ (పుట : 35 మరియు 38) లో కనబరచినట్లు, కడప జిల్లా అంతా విజయనగర రాజ్యభాగమై ఉండేదనీ, దీనికి శంకుస్థాపన జరిగిన అతికొద్ది కాలంలోనే యిది ఉదయగిరి రాజ్యంలో విలీనం చేయబడిందనీ (without following the vicissitudes of the fort of Udayagiri) తెలుస్తుంది. దాదాపు కడప జిల్లా అంతా క్రీ.శ. 17 వ శతాబ్ది వరకు ఈ రాజ్యంయొక్క అధికార పరిధిలోనే ఉంది. కడప జిల్లా రాయలవారి సీమలోని ఒక భాగమే అని చూపేందుకు ఈ మాత్రం ఆధారాలు చాలు.[10]

## రాయలసీమ చారిత్రక నేపథ్యం

సువిశాలమైన భారత ఉపఖండంలో ఆంధ్రదేశానికి సమున్నతమైన చరిత్ర ఉంది. దీన్ని అనేక రాజవంశాలు పాలించాయి. ఒక్కొక్క వంశానికీ ఒక్కొక్క చరిత్ర ఉంది. ఇదే ఒక ప్రత్యేక ప్రకరణంగా పరిశీలింపబడింది.

పరిపాలనా సౌలభ్యంకోసం దేశాన్ని నాడులుగాను, స్థలాలుగాను, గ్రామాలుగాను యేర్పరచారు. అలాగే పిలిచారు.

ప్రాచీన రాజకీయ విభాగంలో 'నాడు' అనే పదం బహుళ వ్యాప్తంగా ప్రసిద్ధమైంది. నేటికీ బ్రాహ్మణుల్లో వెలనాటివారు, వేగినాటివారు, కాసలనాటి వారు, ములికినాటివారు, తెలగాణులు, కమ్మనాటివారు, పాకనాటివారు అనే శాఖా భేదాలతో పిలువబడుతున్నారు. 'నాడు' అనేది 'మండలము' అనేదానిలో అంతర్భాగము.

అతి పెద్ద భూభాగానికి పరిపాలకుడు చక్రవర్తి. రాజులు, సామంతులు, పాలెగాళ్ళు మొదలైనవారు ఇతనికిలోబడి నడిచే చిన్నపాలకులు. వీరి పరిపాలనా సౌలభ్యంకోసం రాజ్యాన్ని కొన్ని భూములుగా,వాటిని కొన్ని సీమలుగా, వాటిన్ని

నాడులుగ, నాడుల్ని స్థలాలుగ విభజించారు. ఈ స్థలాల్లో ఒక్కొక్క దానిలో నిర్ణీత సంఖ్యగల గ్రామాలుంటాయి. గ్రామం అనేది అతి చిన్న పరిపాలనా విభాగం. స్వయం పాలనా, పోషకము కల్గి, సామ్రాజ్యానికి మచ్చుతునకగా నిల్చిందే గ్రామం.

**'రట్ఠములు'** ;- బౌద్ధ వాఙ్మయంలో మధ్య దేశం, దక్షిణా పథంలోని దేశాలలో అంధకరట్ఠము, కళింగరట్ఠము. చోళరట్ఠము, దమిళరట్ఠము, మహారట్ఠము, సురట్ఠములుగా చెప్పబడినాయి. ఇవే ఆంధ్రరాష్ట్రము, కళింగరాష్ట్రం, చోళరాష్ట్రము, ద్రవిడరాష్ట్రము, మహారాష్ట్రము, సౌరాష్ట్రలుగా ఇప్పుడు పిలువబడుతున్నాయి. 11

**హారము** :- అత్యంత ప్రాచీన విభాగాల్లో ఈ 'హారం' అన్నది కూడా ఒకటి. కర్నూలు మండలము, ఆదోని తాలూకాలో శాతవాహన వంశరాజైన శ్రీపులమావి ప్రాకృత శాసనంలో శాతవాహనిహార జనపదంలోని వేపురక గ్రామము ఉదాహరింపబడింది. 12

**రాష్ట్రము** :- పల్లవుల కాలంనాటి సంస్కృత శాసనాల్లో రాష్ట్రం అన్న పదం అధికంగా వాడబడింది. కమ్మరాష్ట్రాన్ని కమ్మనాడనీ, ముందరాష్ట్రాన్ని ముందనాడనీ తర్వాతి కాలపు శాసనాల్లో పేర్కొనడం జరిగింది. ఈ విధంగా పాకరాష్ట్రము పాకనాడుగా చెప్పబడింది. 13

**పథము** :- పల్లవరాజు శివస్కంద వర్మచే వేయబడ్డ మైదవోలు పాకృత శాసనంతో ఆంధ్ర దేశానికి ఆంధ్ర పథమనే పేరు చెప్పబడింది. బాణ రాజుల్లో చాలా పూర్వుడైన జయనందివర్మ పాలించిన రాజ్యం 'అంధాత్ పథః పశ్చిమతోక్షితిః' అని రెండవ విక్రమాదిత్యుని ఉదయేంద్రియము తామ్ర శాసనంలో చెప్పబడింది. 14

బాణరాజులు యేలిన రాజ్యానికి వడుగావళి అనీ, పేరుంబాణప్పాడి అనీ పేర్లు. చిత్తూరు మండలంలోని దక్షిణభాగం, అనంతపురం మండలంలోని కొంత భాగం, మైసూరు రాజ్యంలోని కోలారు మండల ప్రాంతం, దక్షిణాన పాలారు నదిగల భూభాగం బాణరాజ్యం.

సంస్కృతాంధ్ర సారస్వతాల్లోను, ఆయాకాలాల్లోను దేశ విభాగాన్ని సూచించే ప్రసిద్ధమైనది 'విషయం' అనే పదం. ఆంధ్రవిషయం, వేంగి విషయం, పాక విషయం మొదలైన అనేక విషయములు మనకు తెలియవస్తున్నాయి. ప్రాచీన కాలంలోని భూభాగాలు లేదా రాజ్యాలు విస్తీర్ణాన్నిబట్టి కాక, ఆయా పరిపాలనా ప్రాంతాన్నిబట్టి దాన్ని విషయంగా పిలిచేవారు. రాష్ట్రము, మండలము, విషయము, రాజ్యము- ఇవన్నీ పరస్పరం పర్యాయపదాలే. 15

"వంగనూరు విషయం :- తాడిపత్రి తాలూకాలోని కొట్టూరు(?) గ్రామములో పశ్చిమ చాళుక్య మహారాజైన విజయాదిత్యుని యొక్క ప్రాచీనాంధ్ర శాసనములో బాణరాజు వంగనూరు విషయమును పాలించు కాలమున పెనుకపట్టు గ్రామము భారద్వాజ గోత్రుడైన కుమారశర్మకు దానము చేసెనని వ్రాయబడి యున్నది. వంగనూరు గ్రామము తాడిపత్రి తాలూకాలోనిది. పెనుకపట్టు గుత్తి తాలూకాలోని పెనుకులపాడు కావచ్చును. వంగనూరు విషయము తాడిపత్రి తాలూకాలోని ప్రాచీన విషయములలో నొక్కటియని తలంచవచ్చును.

(1) **Annual Report on Indian Epigraphy.1847-48, No: 14.**

(2) **E. I. Vol xxx, part II** విజయాదిత్యుని కొట్టూరు శాసనము క్రీ. శ. 699. 15a

కాకతీయులు, రెడ్లు, విజయనగరరాజుల పరిపాలనా కాలాల్లో 'రాజ్యము' అనే పదము వారు పాలించే సామ్రాజ్యాలకు అంతర్గత విభాగాలుగా వ్యవహార సిద్ధము లయ్యాయి. ఈ రాజ్యాలకు ముఖ్యనగరాలుగా దుర్గాలు యేర్పడ్డాయి. వీటిలో జలదుర్గ, వనదుర్గ, స్థలదుర్గాలు వున్నాయి. ఉదాహరణకు పెనుగొండ రాజ్యం- పెనుకొండ దుర్గం, చంద్రగిరిరాజ్యం-చంద్రగిరిదుర్గం ఇలాంటివే."16

ఈ రాజ్యాలే పరిపాలనాసౌకర్యార్థం సీమలుగాకూడా విభాగింపబడ్డాయి. కొన్నిటిల్లో నాడులుకూడా ఉన్నాయి.

ఉదాహరణకు గుత్తిరాజ్యంలోని గుత్తిసీమ, పెన్నబడిసీమ, పెనుకొండ రాజ్యంలోని రొదనాడు, రోదసీమ, రాయదుర్గరాజ్యంలోని అగలిసీమ, ఉదయగిరి రాజ్యంలోని పాకనాడు మొదలగునవి.17

అనంతపురం జిల్లా పెనుకొండ దుర్గం ఆంధ్ర సంస్కృతాల్లోను, కర్ణాటక, ఆంధ్ర, తమిళ శాసనాల్లోను ఘనగిరిగా, ఘనాద్రిగా ప్రశంసింపబడింది.

"విరూపాక్షరాయల శ్రీశైల తామ్ర శాసనమునందు రెండవ దేవరాయలు తన జ్యేష్ఠ సోదరునివల్ల ఘనాద్రిరాజ్యమును బడసెనని చెప్పబడినది. ఏకామ్ర నాథుని సత్యాపరిణయ సంస్కృత కావ్యములో జగదేకరాయలు మహమ్మదీయ సేనానుల నోడించి ఘనగిరిని సంరక్షించెనని చెప్పబడినది. రఘునాథాభ్యుదయ తెలుగు కావ్యములో రఘునాథరాయలు రాయదేవరాయలను ఘనగిరి సింహాసన మందు నిలిపెనని చెప్పబడినది. ఘనాద్రియన్నను ఘనగిరియన్నను పెను గొండకు సంస్కృత రూపములు.

విజయనగర రాజుల రెండవ రాజధానిగా పేరుబడ్డ నేటి అనంతపురం జిల్లాలోని పెనుకొండ పెనుకొండ,శాసనాల్లోసముచితమైనస్థానం పొందిఉంది."18

ఇదే జిల్లాలోని తాలూకా ముఖ్య పట్టణంగా వున్న గుత్తి పట్టణం ప్రాచీన కాలంలో ఒక బలిష్ఠమైన దుర్గం, గుత్తికి దగ్గర్లోనే (తాడిపత్రి) లో పెన్న ఉత్తర వాహినిగా ప్రవహిస్తుంది. ఈ పెన్నకు రెండువైపులా వుండే ప్రదేశమే పెన్న బడి, పెన్నమాగాణి, హెన్నయమాగాణి అనే పేర్లతో పిలువబడింది.

'సీమ' రాజ్యంలో ఒక అంతర్భాగమే! ఈ రాజ్యవిభాగం కాకతీయులు, రెడ్లు, విజయనగరరాజుల పరిపాలనా కాలాల్లో వ్యవహారంలో వుండినది. ఈ సీమలు కృష్ణానదికి దక్షిణ ప్రాంతంలోని ఆంధ్రదేశంలోని శాసనాల్లో ఎక్కు వగా పేర్కొనబడ్డాయి.

ఈ ప్రాంతంలోని ప్రాచీన కన్నడ ఆంధ్రశాసనాల్లో–19

—పెరుం బాణప్పాడి - ఇది బాణరాజులు పాలించిన ప్రాంతానికి పేరు. గుత్తిరాజ్యంలోని పెన్నంబడి లేక పెన్నబడి సీమ అని ఉన్నాయి.

హారమునకు పూర్వరూపం 'పారము' అనీ; పారమే పాడి, వాడి, పడి, బడి అనే అనేక రూపాలు దాల్చిందనీ; ఈ పదానికి మార్గము, పథము, స్థలము లేక సీమ అని అర్థమని శాసన పరిశోధకులు చెప్పినారు. పెన్నబడిలోని 'బడి' శబ్దానికి మార్గము, స్థలము అని అర్థము.19(a) పెన్నబడి తెంకణ రాజ్యంలోని అంతర్భాగం.

మాగాణి లేక మాగణి అనే పదం విజయనగర రాజుల కాలంనాటి తెలుగు, కన్నడ శాసనాల్లో పేర్కొనబడింది.

"కన్నడ భాషలో మాగాణి అనే పదమునకు **A part of Taluk or District** అనగా తాలూకా లేక జిల్లాలోని అంతర్భాగమని పేరు."

"గుత్తిసీమలోని పులియేరు మాగాణి గుత్తి రాజ్యములోని చీర మాగాణి గుత్తి రాజ్యములోని హెంనెయ మాగాణి జగతాపి గుత్తిసీమలోని పెన్నబడి మాగాణి జగతాపి గుత్తిసీమలోని పెన్నబడి "[20] అనంతపురం మండలంలోని ధర్మవరం తాలూకాలోని కొన్ని గ్రామాల్లో విజయనగర రాజుల కాలంనాటి తెలుగు శాసనాల్లో ఈ మాగాణి పదం పేర్కొనబడింది.

ఉదా:- గుత్తి రాజ్యంలోని చీర మాగాణి యందలి చిగులురేవు
గుత్తి రాజ్యములోని చీర మాగాణి యందలి విజయభూపతి పుర
మనే నగల గ్రామము.
గుత్తి రాజ్యములోని చీర మాగాణి.

రాయలసీమ కన్నడ శాసనాల్లో 'వళితము' అనే పదం పేర్కొనబడింది.

ఉదా:- చంద్రగిరి రాజ్యంలోని గుత్తి వళితము.
హస్తినాపతి యందలి ఆదవాని వళితము.

విజయనగర సామ్రాజ్య కాలమందు ఇది కూడా ఒక రాజ్యవిభాగమే![21]

1. హస్తినావళిలోని మూదనాటి యందలి రాయదుర్గ వెంఠలోని ఉదవ కొండసీమ.

2. రాయదుర్గ వెంఠలోని అగలిసీమ.

3. రాయదుర్గ రాజ్యములోని వేపరాల వెంఠ.

ఈ వెంఠ రాజ్యములో నంతర్భాగము, వెంఠలోని యంతర్భాగసీమ.[22] కాకతీయ, విజయనగర రాజుల కాలంలో ఈ సీమా విభాగం ఉంది. రాయదుర్గ రాజ్యంలోని అగలిసీమలోని రత్నగిరిస్థలము పెనుగొండరాజ్యంలోని రొద్దనాటి తుంబికెళ్ళస్థలము రాయదుర్గస్థలంలోని అగలిస్థలము.

స్థలమనగా కొన్ని గ్రామాలు గల నేటి ఫిర్కాతో పోల్చవచ్చును.[23]

"వాడి అనేది కూడా ఒక రాజ్య విభాగమై యుండవచ్చు. 'గోవిందవాడి' కర్ణాటికా శాసన సంపుటాల్లో పేర్కొనబడింది. సరియైన సీమా నిర్ణయము చేయుటకు దగిన విషయములు చేకూరలేదు. గోవిందవాడికి సీమలు నిర్ణయించు

శాసన మొకటి మాత్ర ముదాహరింపబడినది ఇది దక్షిణాంధ్ర మైసూరు రాష్ట్రములలో నంతర్భాగము."

"నళవాడి (నలవాడి) కర్నూలు జిల్లాలోని ఒక ప్రాంతంగాను, నలవాటి (నళవాడి) విషయములోని రత్నగిరి గ్రామం ప్రస్తుతం అనంతపురం జిల్లాలో ఉన్న గ్రామంగాను చెప్పబడింది. నళవంశపురాజులు ఈ ప్రాంతాన్ని పరిపాలించి యుండుటవల్ల దీనికి నలవాడి యను పేరు కల్గివుంటుందని శాసన పరిశోధకుల అభిప్రాయము. నళవాడి కర్నూలు, అనంతపురం మండలాల్లోని కొంతభాగమై వుండవచ్చును."

"నోలంబవాడి మొదట చిన్నమండలంగా రాష్ట్రకూటుల పరిపాలనలో వున్నా, మైసూరు రాష్ట్రంలోని తుంకూరు, చిత్రదుర్గ ప్రాంతాలు అనంతపురం మండలంలోని దక్షిణప్రాంతం వరకు వ్యాపించి ఉండినది. మడకశిర తాలూకా లోని హెంజెరు లేక హేమావతి నోలంబులకు రాజధానికి వుండింది. అనగా, అనంతపురం మండలం దక్షిణ ప్రాంతంలోని కొంతభాగం తొమ్మిది, పదవ శతాబ్దాల్లో నొలంబుల అధీనంలో వుండినదని చెప్పవచ్చు.[24]

"ఇంతవరకు స్థూలంగా చెప్పినట్టు విషయము అనేది రాజ్యము, దేశము అనే పదాలకు పర్యాయ వాచకము. గుత్తి తాలూకా ప్రాంతంగా పెన్నానదికి ఉత్తరంగా 'తురమర విషయము' ఉండినది. ఈ విషయం (దేశం) ప్రాచీన బాణరాజుల శాసనాల్లో పేర్కొనబడింది. ఆ తాలూకాలోని బేతపల్లి గ్రామంలోని ఒక శాసనంలో బాణరాజు ఒకడు తురమర విషయమును పాలించుచుండెనని తెలుపబడింది."[25]

'నాడు' అన్న పదానికి ఇదివరకే స్థూలంగా నిర్వచనం ఇవ్వబడింది. ఇది ఒక దేశ వాచకము. 'నాడు' అనేది మండలంలో ఒక అంతర్భాగం. బ్రాహ్మణ, బ్రాహ్మణేతరశాఖా సాంఘిక వ్యవస్థలో 'నాడు' అనేది ఒక 'తెగ'గా కూడా ముడివడి ఉంది.

"ఆంధ్రదేశంలోని రాయలసీమ ప్రాంతంలో అనేక 'నాడులు' శాసనాల్లోను, చరిత్రలోను, కావ్యాల్లోను చోటుచేసుకున్నాయి.

**రేనాడు :-** కర్నూలు, కడప, అనంతపురం, చిత్తూరు మండలాల్లో 'రేనాడును'ను సూచించిన శాసనాలు అనేకం ఉన్నాయి.[26]

రేనాడు ఏడువేలసీమగా శాసనాల్లో ఇది పేర్కొనబడింది:

1. "శ్రీమత్ చోడమహారాజు రేనాణ్డు ఏఱువేలనేల"
2. "కరికాలాన్వయ మహారాజు వ్రేనాణ్డేఱువేల"
3. "కరికాలాన్వయం శ్రీమత్ చోడమహారాజు లేనాణ్డు ఏఱువేఱనేఱంగా"
4. "ధనంజయున్డు రేనాణ్డు ఏళన్"....... ........

గండికోట దుర్గానికి ఉత్తరంగా నుండే గ్రామములు రేనాడు అని........ ..............శిరాశాసనములోనున్న అదే ప్రకారం వ్రాస్తూవచ్చినారు."[27]

కర్నూలు, కడప, చిత్తూరు, అనంతపురం మండలాలు రేనాటి తెలుగు చోళుల వైదుంబ బాణరాజుల యేలుబడిలో వుండినాయని రాయలసీమ తెలుగు శాసనాలద్వారా తెలుస్తుంది.

కర్నూలు మండలంలోని దక్షిణప్రాంతమైన కోయిలకుంట్ల, సిరివేలు తాలూకాలు, కడపజిల్లా జమ్మలమడుగు, ప్రొద్దుటూరు పులివెందుల, కమలాపురం తాలూకాలు, అనంతపురం జిల్లా దక్షిణ ప్రాంతమైన హిందూపురం ప్రాంతం, చిత్తూరు జిల్లా ఉత్తరం వైపు, కడప జిల్లా కొంతభాగం, మదనపల్లి తాలూకాలోని కొంత ప్రాంతం ఈ రేనాటిసీమగా గణించవచ్చు.

**తెంకణము :** అనంతపురం మండలం, అనంతపురం తాలూకా తాడిపత్రి గ్రామంలోని రామేశ్వరాలయమునందు శా.శ. 1120 నాటి శ్రీ మహామండలేశ్వర ప్రతాపకుమార ఉదయాదిత్య మహారాజు వ్రాయించిన కన్నడ శాసనములో తెంకణ దేశము పేర్కొనబడినది. ఈ శాసనము ప్రాచీన చారిత్రక భూగోళ విషయముల కమూల్యమైనది.

నవరత్న భరిత జలచర
నివహ పరిక్షుభిత బహుళ కల్లోల రవ
ప్రవిఘూర్ణమాన లవణా
ర్ణవ పరివృత మేనిపుదంతు జంబూద్వీపం॥

అముత శత సహస్ర యోజన గదిత సువిస్తారమాగి సమవృత్తాకార ది
నిర్పుడదఱ మధ్యప్రదేశ దోళ్మందరాద్రి సొగయిని తోర్కు-
మేరు మహామహీధర దతెంకణ భారత వర్ణ దోళగునో
హరి యిదెంచిన నోళ్ప్రకుంతల దేశద పూర్వ భాగదోళు
సారిమరప్పు దంధ్ర ధరణీతల వందద తెండె తెంకణా
ధారణి యల్లి పెన్నపరినాడు నిరంతర ఒప్పితోఅగుం॥

జంబూ ద్వీపములో భరత వర్షమునందు కుంతల దేశమునకు పూర్వ దిక్కున ఆంధ్రదేశమందు తెంకణ రాష్ట్రములో పెన్నపరినాడొప్పియుండెనని పై కన్నడ పద్యముల భావము.''28

''కవిరాజ శిఖామణి నన్నెచోడుడు కుమారసంభవ కృతిలో తాను టెంకణా (డెంకణా) దిత్యుడనని చెప్పుకొన్నాడు. ఈ టెంకణము (తెంకణము)ను గూర్చిన ప్రసక్తి తెలుగు కావ్యాల్లో ఇదే మొదటి ఉదాహరణ కావచ్చు.''

''శాసనములలో టెంకణాదిత్య బిరుదాంచితులలో రేనాడేలిన వెంకయచోడ మహారాజు ప్రథముడు గానోపును. ఈ శాసనము పదియవ శతాబ్దము నాటిది. రెండవవాడు కొణిదెనచోడులలో ప్రసిద్ధుడైన త్రిభువనమల్లదేవ చోడమహారాజు. ఇతనికి టెంకణాదిత్య బిరుదమున్నట్లు గుంటూరు జిల్లా నరసరావుపేట తాలూకా కొణిదెన గ్రామమునందలి శంకరస్వామి దేవాలయములో నిట్లు లిఖింపబడినది:

''ఆదిత్య వంశతిలకుండు టెంకణాదిత్యుండు ఊర్జితుండు అ త్రిభువన మల్లధాత్రీనాథుడు....''ఆ దేవాలయములోని కాకతీయ గణపతి చక్రవర్తి సామంతుడుగ కమ్మనాడేలిన రెండవ జోపిలిసిద్ధికి తెంకణాదిత్య బిరుదమున్నట్లు వ్రాయబడినది. టెంకణము - కన్నాటికి దక్షిణమునను, పాకనాటికి పడమటను, ములికినాటి కుత్తరమునను వున్న ఇప్పటి అనంతపురము మండలములోని తాడిపత్రి తాలూకా ప్రాంతమై యుండును.''29

**రాయదుర్గం సీమ :** ప్రస్తుత అనంతపురం జిల్లా రాయదుర్గం ప్రాంతం రాయదుర్గ సీమగా, కణేకల్లు కణియకల్లుగా చెప్పబడింది. విజయనగర సామ్రాజ్యాధీశులైన తుళువ, అర్వేటి వంశ రాజుల కన్నడ, ఆంధ్ర శాసనాల్లో రాయదుర్గ సీమగా పేర్కొనబడింది.

**అసిరెనాడు :** ప్రస్తుత మడకశిర తాలూకాలోని హేమావతి (హెంజేరు) ప్రాంతంగా చెప్పబడింది. "హేమావతి గ్రామమునందలి యొక శాసనములో చాళుక్య చక్రవర్తియగు మూడవ తైలపదేవుని మహాసామంతుడైన త్రిభువనమల్ల దేవ చోళ మహారాజు హెంజేరు(హేమావతి) రాజధానిగా అసిరెనాడేలుచుండె"నని చెప్పబడెను.

కల్యాణ దుర్గము తాలూకా మలయనూరు శాసనములో హేమావతి శాసనమునందు పేర్కొనబడిన పై మల్లిదేవచోడ మహారాజు హేమావతి నుండి రాజ్యపాలనము చేయుచుండగా అసిరెనాటిలోని మలయనూరులో నైదు దేవాలయముల నిర్మించెనని వ్రాయబడెను."

పై విషయములనుబట్టి అసిరెనాడు ఆంధ్రప్రదేశములోని కల్యాణ దుర్గ మడకశిర ప్రాంతములనియు, దానికి హేమవతి రాజధానియనియు తెలియుచున్నది. ఈ అసిరెనాడె మైసూరు రాష్ట్రములోని మరికొన్ని శాసనములందు తెలుపబడినది 30

పరువి విషయము ప్రాచీనాంధ్ర విషయములలో ఒకటి. ఇది ప్రస్తుతం హిందూపురం తాలూకాలోని పరిగి గ్రామమే. పశ్చిమ గాంగ రాజైన మహారాజ మాధవ వర్మ తామ్రశాసనములో (క్రీ.శ.425) పరువి విషయంలోని వేల్పుత్తూరు గ్రామమును ధరశర్మ అనే బ్రాహ్మణునికి బ్రహ్మదేయంగా ఇచ్చినట్లు చెప్పబడింది. గుత్తి తాలూకాలోని వేల్పుమడుగే ఈ వేల్పుత్తూరు.

"ఈ పరువి విషయమే ప్రాచీన కన్నడ శాసనములలో హరుమోదని చెప్పబడినది. పరిగి గ్రామములోని హొయసల రాజగు బళ్ళాలదేవుని కన్నడ శాసనములో (శ.సం. 1100) గురిగంజకోల బయలులోని భీమేశ్వరస్వామి దేవాలయమునకు నొక ఘంట దాన మొసంగబడినట్లు తెలుపబడినది. పరువి విషయము, పరిగి గ్రామ పరిసర ప్రాంతమును, గుత్తి తాలూకాలోని కొంత భాగమును అయి యుండెను.

రొద్దనాడు అనంతపురం జిల్లా పెనుకొండ తాలూకా పెన్నా తీరమందున్నది. రొదం ప్రధాన గ్రామంగా (నేటి రొద్దం) ఉండినది.31

"వేనాడు : చిత్తూరు మండలములో వాయల్పాడు తాలూకాలోని కలకడ గ్రామమునగల వైదుంబుల కాలమునాటి తెలుగు శాసనములో చెప్పబడినది.

"స్వస్తి అనేక సమర సమర సంఘట్టనోపలబ్ధ విజయలక్ష్మీ సమాలింగిత విశాల వక్షస్థల భువన త్రినేత్ర ఇరుగెయ మహారాజు దన పట్టంబు గట్టిన సంతోషంబున వేనాటి కాపులకు దయచేసిన స్థితి."

ఈ శాసనములో పేర్కొనబడిన కొన్ని గ్రామములు వేంబల్లి, అకుంట, మేళికుర్తి, పిచ్చలి మొదలైనవి వాయల్పాడు, మదనపల్లి తాలూకాలలో గలవు. ఈ యాధారము ననుసరించి వేనాడనునది యా తాలూకాల ప్రాంతమని శాసన పరిశోధకుల యభిప్రాయము. వేనాడనునది వేయినాడు గావచ్చుననియు వారి యూహ.[31]

చంద్రగిరి రాజ్యము : ఇప్పటి చిత్తూరు మండలంలోని చంద్రగిరి తాలూకా ప్రాంతమంతా పూర్వం చంద్రగిరి రాజ్యంగా ఉండేది. పూర్వ తొండ మండలంలోని తిరువేంగడ కొట్టంలోని వైకుంతవలనాటిలోని అంతర్భాగమిది. తర్వాత జయగొండ చోళమండలంలో కలిసిపోయింది. విజయనగర సామ్రాజ్య కాలంలో ఈ భాగం ప్రసిద్ధి పొంది ఒక రాజ్యానికే కేంద్రస్థానమైంది.[32]

కలకడ పురము : "నేటి చిత్తూరు మండలంలోని వాయల్పాడు తాలూకాలోని గ్రామం కలకడ. తొమ్మిది- పది శతాబ్దాల్లో ఈ ప్రాంతం వైదుంబుల పరిపాలనలో ఉండినది. వైదుంబ రాజులకు కలకడాధీశ్వరులనే బిరుదు కూడ ఉంది. కడపకు దక్షిణంగా, చిత్తూరు మండలానికి ఉత్తరంగా ఉండిన ఈ ప్రాంతం పరిమితమైన ఒక భూభాగంగానే వుండిందని చెప్పవచ్చు. 'సోమదేవ మహారాజు మాచుపల్లి శాసనము E. 1. Vol. XXXVIII : No. 21 (శ.స. 1178)' కలకడ రేనాటికి దక్షిణ ప్రాంతము నేలిన మాండలికులకు ముఖ్యపట్టణము. ఈ మాండలికులకు సిద్ధవట దేవర దివ్యశ్రీ పాదపద్మారాధకులని బిరుదు కలదు."[33]

కడప మండలంలోని కొన్ని సీమల్లో గండికోట దుర్గం సీమ ప్రఖ్యాతి వహించినది.

"పినాకిని గండికి కుడివైపున సముద్రమట్టమునకు 1670 అడుగుల యెత్తున నున్నది. దీనిప్రక్క పినాకిని రెండుమూడు మైళ్ళ పొడవున గండికోని అందు లోతైన ప్రవాహముగ రెండు వందల యడుగుల యెత్తున నీరెగురగొట్టుచు నురుగులు గ్రమ్ముచు దుర్గమునకు పెట్టని కందకమై యెవ్వటచేసి యీ దుర్గ మభేద్యమై యలరారుచున్నది."

నంది మల్లయ, ఘంట సింగయ కవులు సాళువ నరసింహ సేనానియగు తుళువ నరసింహరాయలకు కృతినిచ్చిన వరాహపురాణ కావ్యమునందు కృతిపతి తండ్రియైన ఈశ్వర నాయకుని వర్ణించునెడ నాతడు జయించిన దుర్గములలో గండికోట యొకటియని వర్ణించిరి.

సీ॥ ఉదయాద్రి భేదించె హుత్తరి నిర్జించె
గండికోట పురంపు గదలద్రవ్వె
.... .... .... .... .... .... ....

శ్రీకృష్ణదేవరాయలు సకలదళ సమేతుడై గుత్తి గండికోట మార్గముగా ఉదయగిరికి వచ్చి యాదుర్గమును స్వాధీన పరచుకొనినట్లు రాయవాచకము నందు గలదు. అళియ రామరాయలు గండికోట దుర్గము నవలీలగా గెల్చినట్లు రామరాజీయమునందు గలదు. ఈ గండికోట దుర్గము, లేక సీమ విజయనగర సామ్రాజ్య కాలములో ప్రసిద్ధికెక్కిన నేటి కడప మండలములోని బద్వేలు, జమ్మలమడుగు, ప్రొద్దుటూరు, కమలాపురము తాలూకా ప్రాంతముల నావరించి యుండెనని యీ సీమలోని గ్రామముల యునికినిబట్టి తెలియుచున్నది.[34]

పొత్తపి అనే గ్రామం కడప మండలంలోని రాజంపేట తాలూకాలో చెయ్యేరు నదీతీరంలో వుంది. ఆ గ్రామప్రాధాన్యతనుబట్టియే ఆ ప్రాంతానికికూడ పొత్తపినాడు అనే పేరు వచ్చింది.

కొణిదెన చోడులలో పూర్వుడు దశవర్మ అనేవాడు పాకనాటిని జయించి పొత్తపిని తన రాజధానిగా చేసుకొని పరిపాలన చేసినట్లు నరసరావుపేట తాలూకా [illegible] శాసనంలో వుంది.

విజయనగర సామ్రాజ్య కాలంలో పొత్తపినాడు ఉదయగిరి రాజ్యంలో సిద్ధవట సీమలోని ఒక అంతర్భాగమని ఆనాటి శాసనాల్లో పేర్కొనబడింది. పొత్తపినాటికి తూర్పున పాకనాడు, ఉత్తరాన ముల్కినాడు, దక్షిణాన వెంగొనాడు, పడమట రేనాడును వున్నట్లు తెలుస్తూంది.

"వెలనాడు వేగినాడును
బులుగ నాడ్పాకనాడు పొత్తపినాడున్
గల ములికినాడు రేనా
డలయక కనుగొంటి నచటి యబలలగంటిన్".35

ములికినాడు : రాష్ట్రకూట రాజైన మూడవ కన్నర దేవునిగూర్చి కడప మండలములోని పుష్పగిరిలోని యొక కన్నడ శాసనములో నతడు హొన్నవాడిలోని ముళుకినాడు ఏలుచున్నట్లు వ్రాయబడినది.36

అదే మండలములోని కమలాపురము తాలూకాలోని మహామండలేశ్వర త్రైలోక్య మల్లదేవుని కన్నడ శాసనములో నతడు ముళుకి మూనూఱు ఏలుచున్నట్లు చెప్పబడినది.37

అదే మండలములోని కడప తాలూకా చింతలపుట్టూరులోని సిద్ధనదేవ మహారాజు యొక్క కన్నడ శాసనములో ముళుకినాటిలోని కోడూరు గ్రామము పేర్కొనబడినది.38

'విజయనగర రాజ ప్రతినిధియైన రెండవ సంగముని బిట్రగుంట శాసనములో ములికి దేశము యొక్క ఎల్లలు వివరించబడినవి. ములికిదేశములో పుష్పాచలమను దేవళమున్నదనియు, దానికుత్తర దిశనున్న పెన్నానది కుత్తర తటమున సింకేసరియను గ్రామమున్నదనియు లిఖింపబడెను.39

ప్రబంధ రత్నావళిలో వల్లభరాయని పీధినాటకములోని యొక చాటు పద్యములో ములికినాటి మోపూర భైరవుని వర్ణనము కలదు.

గీ॥ సిగ్గుమాలిన మొలవానిజిలుతవాని
నెల్లకాలంబు ములికినాడేలువాని
నర్థి మోపూర నవతారమైన వాని
భైరవుని గొల్వవచ్చిరి భక్తవరులు.

ములికినాడు కడప మండలములో నంతర్భాగము.40

క్రీడాభిరామంలో వినుకొండ వల్లభరాయడు 'మూడు గ్రామాలలో గ్రాస ములతోడ పూన్కి_మై మోపూరు పాలించె ముల్కి_నాటి' అని ఉన్నది. మోపూరు ముల్కి_నాటికి రాజధాని.40(a)

ములికినాడు కడప మండలములోని పులివెందుల తాలూకాలోని కొన్ని గ్రామాలు, కడప తాలూకాలోని కొన్ని గ్రామాలు గల ప్రాంతంగా చెప్ప బడుతూంది.

"గండికోట దుర్గానకు తూర్పు దక్షిణంగా నుండే గ్రామములు ములికి నాడు" అని..........శిలాశాసనములలోనున్న వ్రాస్తూ వచ్చినారు.

ఏఱువనాడు ఆంధ్రదేశంలో మిక్కిలి ప్రాచీనమైన నాడులలో ఒకటి.

ఏఱువనాడును పేర్కొనిన ప్రథమాంధ్రకవి, దశకుమార చరిత్రమును దెనిగించిన మూలఘటిక కేతన, చోడ తిక్క నృపతి ప్రతాప వర్ణన సందర్భ మున ఆ నృపుడు ఏఱువమన్నీల నోడించినట్లు వర్ణించియున్నాడు.

.... .... .... .... ....

.... .... .... .... ....

పాండ్యునిచేత గప్పంబుగొనియె
నేఱువమన్నీల నెఱిపుట్టగా నేల
వైరివీరుల వామలూరనోర్చె
త్రిభువనీరాయ పెండారు డుభయకటక
వీరుడభిసవ భోజు డాకార మదను
డవని భారధౌరేయ మహత్త్వ విజిత
ధిక్క_రీంద్రుండు చోడల తిక్క_నృపతి (దశకుమార చరిత్ర-పీఠిక)

ఏఱువనాడు నెల్లూరు జిల్లాలోని కొంత భాగమును, కర్నూలు, కడప జిల్లాలోని మరికొంత భాగముగా చరిత్రకారులు నిర్ణయించినారు.

సకలినాడు బద్వేలు తాలూకాలోని కొన్నిగ్రామాల్లోని శాసనాల్లో సాకలి సీమ గండికోటసీమలోని అంతర్భాగంగా, సకలి పెద్ద కోడూరుగా వ్రాయబడి ఉంది. ఈ సకలిసీమ బద్వేలు తాలూకాలో కొంత భాగమై ఉండిఉండును.

కర్నూలు మండలములోని కర్నూలుకు పూర్వపు నామము కందెనవోలు. ఆరవీటి వంశపు మూలపురుషుల్లో ఒకడైన సోమదేవరాజు గెల్చిన సప్తదుర్గాల్లో ఈ కందెనవోలు దుర్గంకూడ ఒకటి.

కుమారగిరి - కర్నూలు మండలం మార్కాపురం తాలూకాలోని త్రిపురాంతకంలోని త్రిపురాంతకదేవత ఉన్న స్థలానికే కుమారగిరి అని పేరు.

(1) శ్రీ పర్వత శిరోమణి శ్రీమతి కుమారగిరి త్రిపురాంతకదేవర

(2) శ్రీ పర్వత పూర్వద్వార శ్రీ త్రిపురాంతకదేవర

(3) శ్రీ త్రిపురాంతక దేవర కుమారగిరి శివులకు

(4) శ్రీ పర్వత పూర్వదిగ్భాగ...........

(5) శ్రీ పర్వత పూర్వద్వార త్రిపురాంతక దేవరకు...........

ఈ శాసనాధారాలవల్ల త్రిపురాంతకం శ్రీశైలానికి పూర్వద్వారమని, త్రిపురాంతకేశ్వరుడు కుమారగిరి నిలయుడనీ స్పష్టంగా తెలుస్తూంది.45

ఆరెవీడు కర్నూలు జిల్లా మార్కాపురంలోని ఒక గ్రామం. కడప మండలం రాయచోటి తాలూకాలో ఒక ఆరెవీడు, నెల్లూరు మండలంలోని ఆత్మకూరు తాలూకాలో ఒక ఆరెవీడు అనే పేర్లుగల గ్రామాలున్నాయి. అయితే, ఆర్వీటి వంశానికి చెందిన విజయనగర రాజులు కర్నూలు జిల్లాలోని ఆరెవీడును కేంద్ర స్థానంగా చేసుకొన్నట్లు చరిత్ర చెబుతూంది. అ మండలంలోని సిరివేలు తాలూకాలోని దిగువ అహోబిలంలో వున్న శ్రీ నరసింహస్వామికి ఆరవీటి వర్తకులు కొందరు ఏడు బంగారు కలశములు దానము చేసినట్లు అహోబిలంలోని శాసనంవల్ల తెలుస్తూంది.46 ఆరవీటినేలిన మొదటి రాజు అళియ రామరాయల పూర్వుడైన సోమదేవరాజు.

ఆదవాని కర్నూలు మండలంలోని ఆదోని తాలూకాకు ముఖ్యపట్టణం. కల్యాణి చాళుక్య ప్రభువుల కాలంనుండి ప్రసిద్ధికెక్కిన సీమల్లో ఇది ఒకటి. దీనికి దగ్గరోనే ఒక గిరిదుర్గం ఉంది.47

"కర్నాడు (కన్నాడు) శ్రీశైలములలోని శాసనములలో కర్నాటిలోని కొన్ని గ్రామములు పేర్కొనబడినవి.

| | | | |
|---|---|---|---|
| బీర్రవోలు | బీరవోలు | .... | నందికొట్కూరు తాలూకా |
| శివపురము | శివపురము | .... | ,, |
| కుఱుకుంట | కురుకుంచ | .... | ,, |
| ఇందేశ్వరము | ఇందిరేశ్వరము | .... | ,, |
| నందికుంట | నందికుంట | .... | ,, |

—కన్నాడు నేటి కర్నూలు మండలంలోని నందికొట్కూరు తాలూకా, నంద్యాల తాలూకాల్లోని కొంత భాగమునైన ప్రాంతము.

1. S.I I. Vol. X No : 503 (శా.శ. 1234) కాకతి ప్రతాపరుద్రుడు
   ,, No : 504 (శా.శ 1235)
2. E.I. Vol XV, Page 815 (శా.శ. 1388)"[47a]

రాయలసీమలో రాజ్యాలు, విషయాలు, సీమలు, నాడులు, దుర్గాలు, మండలాలు, స్థలాలు, గ్రామాలు అనేకం ఉండినట్లు శాసనాలద్వారా, చరిత్రవల్ల తెలుస్తూంది. పూర్వపు మండలాల్లోని చాలా ప్రాంతాలు ప్రస్తుతపు జిల్లాల్లో కలిసి పోయాయి. చిన్న చిన్న ప్రాంతాలు కూడా రాజ్యాలు (విషయాలు) గా వుండి నట్లు అనేక శాసనాలు తెల్పుతున్నాయి. ప్రాచీన, మధ్యకాలాల్లోని పాలకులు తమ సౌలభ్యంకోసం తాము గెల్చిన, పాలించిన రాజ్యాల్ని చిన్నచిన్న సీమలుగా, నాడులుగా యేర్పరచి, ఆయాచోట్ల తమ ప్రతినిధుల్ని నిల్పినట్లు, వారు ఆయా రాజుల పేరిట దానాది కార్యాలను, ఆర్థిక, పరిపాలనాది కార్యాలను నిర్వ హించినట్లు, పన్నులు, సుంకాలు వసూలుచేస్తూ ఉండినట్లు నాటి శాసనాలు పేర్కొంటున్నాయి. ఆయా నాడుల్లోని, సీమల్లోని ఊళ్ళు, వాటి ఉనికి, ఇతర విషయాలు,విశేషాలు శాసనాల్లో స్పష్టంగా ఉన్నాయి.ఆనాటి సీమలు, నాడులు, ఇతర ప్రాంతాలు - వాటి స్థితిగతులకు శాసనాలు అద్దం పడుతున్నాయి.

కొండలు, నదులు, అడవులు, వృక్షజాలం- వీటికి ఆయా సీమలతోగల సహజ సంబంధాలు, హద్దులు మొదలైన వివరాలను తెలియజేస్తున్నాయి. రాయలసీమ శాసనాల్లో ఏయే నాడుల్ని /సీమల్ని ఏయే శాసనం పేర్కొం టూందో వివరంగా సోదాహరణంగా తెలుసుకోవడం సముచితం.

కడప జిల్లా మాలెపాడు గ్రామంలోని క్రీ.శ. 8 వ శతాబ్దం మరియు 10 వ శతాబ్దికి చెందిన ఇదే జిల్లా వందడి, ముత్తుకూరు, ప్రొద్దుటూరు శాసనాల్లోనూ రేనాడు ఏఱువేలును గూర్చిన ప్రసక్తి ఉన్నది.[48]

ఇదే జిల్లా రాయవరం గ్రామానికి చెందిన క్రీ.శ. 9 వ శతాబ్దికి చెందిన ఒక శాసనంలో కొట్టము (కోట)ను గూర్చిన విషయం ప్రస్తావించబడింది.[49]

ఇదే జిల్లా సుంకేశుల గ్రామంలోని క్రీ.శ. 8 వ శతాబ్దికి చెందిన ఒక శాసనంలో తురుమర విషయం ప్రస్తావించబడింది.[50] అనంతపురం జిల్లా కొండుపల్లి గ్రామానికి చెందిన పశ్చిమ చాళుక్యుల శాసనంలో విజయాదిత్యుడు తన 23 వ పరిపాలనా సంవత్సరంగా పరిపాలించే కాలంలో ఇన్ద్రబాణరాజులు తురుమర విషయమును ఏలుచున్నట్లు చెప్పబడింది.[51]

కడప జిల్లా అబ్బవరం గ్రామంలోని క్రీ.శ. 1234 వ సం॥నాటి శాసనంలో మహా మండలేశ్వర కలకడ పురాధీశ్వరుడుగా రాయదేవర మహారాజులను పేర్కొన్నారు.[52]

అనంతపురం జిల్లా తాడిపత్రి గ్రామంలోని క్రీ.శ. 1509 వ సం॥ చెందిన ఒక శాసనంలో గుత్తిరాజ్యం పెన్నంబడి స్థలంలోని నెలదలపాడు గ్రామం పేర్కొనబడింది.[53] కూడ్లురు గ్రామంలోని క్రీ.శ. 1556 నాటి ఒక శాసనంలో[54] రాయదుర్గంసీమ తెలుపబడింది. ఇదేజిల్లా పెనుకొండ పట్టణంలోని క్రీ.శ. 1577 శాసనంలో[55] పెనుకొండ చైవనిర్మితమైన పట్టణంగాను, ఇదే పట్టణంలో మరొక శాసనంలో[56] దీన్ని ఘనగిరిగాను వర్ణించడం గమనార్హం.

గండికోటదుర్గం కైఫీయతులో, గండికోటదుర్గానికి తూర్పు దక్షిణంగావుండే గ్రామాలు ములికినాడు అని, దుర్గానికి ఉత్తరంగా ఉండే గ్రామాలు రేనాడు అని, దుర్గానికి పశ్చిమంగా పెన్నదరిని ఉండే గ్రామాలు పెన్నదాడి అని, చిత్రావతీ నదీ తీరాన ఉండే గ్రామాలకు చిరబడి అని పూర్వోత్తరంగా నామము కలిగి శిలాశాసనాల్లో అదే ప్రకారంగా వ్రాస్తూ వచ్చినారని పేర్కొనబడింది.[57]

అనంతపురం, కడప, కర్నూలు, చిత్తూరు జిల్లాలు ప్రస్తుత రాజకీయ పటంలో రాయలసీమగా పిలువబడుతున్నా, క్రీ.శ. 1882 సంవత్సరానికి ముందు

ఈ వరుసక్రమంలో కాకుండా బళ్ళారి, అనంతపురం, కడప, కర్నూలు జిల్లాలను రాయలసీమ జిల్లాలుగా పిలుస్తూ ఉండినారు. ప్రస్తుత చిత్తూరు జిల్లాలోని తూర్పు దక్షిణ ప్రాంతంలోని చాలా భాగం అప్పటి ఆర్కాటు జిల్లాలో చేరి ఉండినది. బళ్ళారి ప్రత్యేకంగా కర్నాటక (అప్పటి మైసూరు) రాష్ట్రంలో విలీనమైన తర్వాత చిత్తూరు ప్రాంతంలోని పైభాగం రాయలసీమలో చేర్చబడింది. ఈ విషయాన్ని గూర్చిన సమగ్ర పరిశీలనము 'రాయలసీమ' అన్న శీర్షికలో ప్రత్యేకంగా వివరింపబడింది.

## శాసనాలంటే ఏమిటి?

శాసనం అనే పదాన్ని నేటి పరిశోధకులు, ఏదైనా శాశ్వతమైన వస్తువుపై చెక్కబడిన రాత అన్న అర్థంలో వాడుతూ ఉన్నారు. ఈ రాత అక్షరాలు కావచ్చు; సంప్రదాయంగా ఒప్పుకొన్న చిహ్నాలు కావచ్చు. రాళ్ళపై, లోహాలపై, బండలపై, దారువులపై, నాణేలపై, రకరకాల ఫలకాలపై, కుండలపై, ఇటుకలపై, ఆలిచిప్పలపై, పెంకులపై, దంతపు సామానులపై, ఇతర వస్తువులపై శాసన రూపమైన రాతలు కన్పిస్తున్నాయి. ఇలాంటి రాతలు రాసిన వారి ఉద్దేశ్యం ఒక సందేశాన్ని ముందు తరాలవారికి అందించాలని వుండవచ్చు లేదా ఒక సంఘటనను దాఖలు చేసే ఉద్దేశ్యం కూడ ఉండవచ్చు. ఇలాంటి రాతలను చదివి విశ్లేషణ చేసే శాస్త్రాన్ని 'శాసనశాస్త్రం' అంటారు.

శాసనము అన్న సంస్కృత పదానికి ఆజ్ఞ (రాజాజ్ఞ) అన్నది మూలార్థం. 'శాస్' అనే ధాతువు నుండి నిష్పన్నమైన ఈ మాటకు ఆజ్ఞాపించు, శిక్షించు, నియంత్రించు అనే అర్థాలున్నాయి. శాస్యతే అనేన శాసనం. క్రమక్రమంగా రాజాజ్ఞ అనే అర్థంలో వాడబడిన ఈ శాసన పదం అనేకానేక అర్థాల్లో సందర్భానుసారంగా వ్యాప్తిలోనికి వచ్చింది.

**శాసనాల వర్గీకరణ :** రాజు కానీ, అతని పరంగా ఇతరులు కానీ చెక్కించిన శాసనాలు చాలా ముఖ్యమైనవి. ఇట్లాంటి శాసనాలను స్వచ్ఛమైన రాజాజ్ఞలు, ప్రశస్తి శాసనాలు, దాన శాసనాలు, సంకీర్ణ శాసనాలు అని వర్గీకరించవచ్చు. వీటిలో దాన శాసనాల సంఖ్యే యెక్కువ.

ప్రత్యేక వ్యక్తి లేక సంస్థ తరఫున వేయబడ్డ చాలా శాసనాలు దానాల్ని గూర్చిన వివరణలే. దేవాలయానికి యిచ్చిన దాన వివరాలు, విగ్రహ ప్రతిష్ఠాదులు మొదలైనవి చేసినట్లు తెల్పుతాయి. విషయదృష్టి ననుసరించి శాసనాలను దాన శాసనాలు, ప్రశస్తి శాసనాలు అని రెండు ప్రముఖ వర్గాలుగా చేయవచ్చు. ఇవి విభిన్న వర్గాలైనా రాజుల దాన శాసనాల్లో ప్రశస్తికి సంబంధించిన అంశం యిటీవలే చేరిందనేది గమనించవలసిన అంశము.[58]

**దాన శాసనాలు :** వ్యక్తి కానీ, రాజు కానీ వారి వారి స్తోమతలను అనుసరించి దానాలివ్వడం పరిపాటి. దానాన్ని ఇవ్వడంలో గల ముఖ్యోద్దేశం ఇచ్చిన వానికి పుణ్యం, పుచ్చుకొన్నవానికి పురుషార్థం కలుగుతుందనే స్థూలభావన అందరిలోను ఉంది. దానమిచ్చేవాడు తమ తాత, తల్లి, తండ్రి మొదలైన పూర్వజుల పుణ్యానికిగాను, కీర్తిశేషులైన తమ ఆత్మీయుల స్మారకార్థానికి కూడ దానాల్ని చేయడం జరిగేవి. ఇట్లాంటివి అనేక వస్తు రూపాల్లో, నిర్మాణరూపాల్లో కూడ ఉండేవి. రాజులైనవారు గ్రామాలు, అగ్రహారాలు, భూములు మొదలైన వాటిని దానం చేసిన దాఖలాలున్నాయి. పాలకులు మరీ పరిమిత స్థాయిలోని వారైతే వారి పాలన కింద ఉండే పై చెప్పిన అంశాల్ని దానం చేసేవారు ఇతరులు వారివారి స్తోమతలకు తగిన రీతుల్లో ధన కనక వస్తు వాహనాదులు, గోవులు (కపిల గోవులు), గొర్రెలు, మేకలు, దీపాలు మొదలైనవాటిని దానం చేసిన సందర్భాలు అనేకం ఉన్నాయి. కొందరు పాలకులు దేవాలయాలనేకాక, దేవాలయ ప్రాకారాలు, ప్రాచీన ఆలయాల జీర్ణోద్ధరణలు, వాపీ, కూప, తటాకాది ప్రతిష్ఠలు, వాటి జీర్ణోద్ధరణలు, కోనేళ్లు, వాటికి సోపానాదులను నిర్మించడం జరిగింది. ఇవి ఇప్పటికీ జరుగుతున్నాయి.

ఇట్లా ఇన్ని విధాలుగా చెప్పబడే 'దానం' అన్న పదానికి - ''దీయతే దానం. దాఞ్ దానే. ఇచ్చుట. దీనిచేత నరకమును తరింతురు. స్పృశ్యతే నేన స్పర్శనం. స్పృశ స్పర్శే. దానమందు వస్తువు స్పృశింపబడును గనుక ఉపచారమున దానమును స్పర్శనము దీనిచేత పుణ్యము ప్రతిపాదింపబడును''[59] అని అర్థము.

తానుగా ఇచ్చుట, ఇతరులచేత ఇప్పించుట ఈరెండింటినే దాన ద్వయంగా పేర్కొన్నారు.[60]

సంప్రాప్తము, ఉత్సర్గము, సంప్రాప్తనోత్సర్గము, స్వయంగ్రాహము, ప్రతిమోక్షము - వీటిని దానపంచకంగా పేర్కొన్నారు.[61]

గోదానము, భూదానము, తిలదానము, హిరణ్యదానము, ఆజ్యదానము, వస్త్రదానము, ధాన్యదానము, గుడదానము, రౌప్యదానము, లవణదానము- వీటిని దశదానాలుగను; గో, భూ, తిల, హిరణ్య, రత్న, విద్యా, కన్యా, దాసీ, శయ్యా, గృహ, అగ్రహార, రథ, గజ, అశ్వ, ఛాగ (మేక), మహిషి దానములను షోడశ దానాలుగను చెప్పారు.

ఈ దానాలే కాకుండా ఇంకా అనేక విధాలైన దానాలు శాసనాల్లోను, కావ్యాల్లోను కన్పిస్తున్నాయి. ఇవి ఆయా వ్యక్తుల స్తోమత, సంస్కారం మరియు సందర్భాన్నిబట్టి చేయబడి ఉన్నాయి. దానం ఇవ్వడం, తీసుకోవడం అన్నది గొప్ప కాకున్నా, ఇచ్చిన దానాన్ని కాపాడడం, తీసుకున్న వ్యక్తి తరంవరకే కాక, తరతరాలుగా వాటిని శాశ్వతంగా అనుభవించడం; అనుభవింప చేయడం చాలా గొప్పవిషయం. ఇతరులు ఇచ్చిన దానాన్ని కాపాడడం తాను దానం ఇవ్వడం కంటె మిన్న అనే అభిప్రాయం 'దానాచ్ఛ్రేయోనుపాలనం'[62] అన్న సూక్తి శాపాశయ విభాగంలో ఉన్నది. ఇచ్చిన దానాన్ని అపహరిస్తే వచ్చే పాప ఫలితాలు కూడా ఈ విభాగంలో చోటు చేసుకున్నాయి.

తామ్ర శాసనాల్లో కొన్ని కూట శాసనాలు (Forgeries) కూడా ప్రవేశించాయి. ఎవరూ తమకు ఇవ్వకున్నా, తమ పూర్వీకులైన పెద్దలకు ఏదో కాలంలో యిట్లాంటి భూమిని, ఆ కాలపు రాజు దానం చేశాడని తామే సృష్టించి రహస్యంగా తామ్ర ఫలకాల్ని (రేకులను) రాయించి, మోసంతో భూమిని పొందారనడానికి దాఖలాలుకూడా ఉన్నాయి. గంగరాజుల కాలంలోని చాలా తామ్ర ఫలకాలు ఇలాంటివి ఉన్నాయి.

"ఒక వంశపు రాజు పరిపాలన తర్వాత మరొక వంశపువాడు పాలకుడైతే, మొదటి పాలకుడు ఇచ్చిన దానాన్ని పాలించడం, రక్షించడం అనంతర రాజు కర్తవ్యంగా భావిస్తూ ఉండేవారు. తామ్ర ఫలకాల చివరల్లో చెప్పబడిన పూర్వరాజుల దానాన్ని ధర్మబుద్ధితో రాజు రక్షించాలి. లేకుంటే అతనికి 'సంసార దోషం' కల్గుతుందనే హెచ్చరిక కూడా చేయబడింది.

"స్థిత్యానయా పూర్వ నృపాను జుష్టయా
యత్రాముత్ర పత్రేషు నిబద్ధ మాదౌ
ధర్మా ప్రమత్తేన నృపేణ రక్ష్యం
సంసారదోషం ప్రవిచార్య బుద్ధ్యా."

అలాగే ధారాపూర్వకంగా ఇవ్వబడిన ముగ్గుర్నుండి అనుభవింపబడే సజ్జనులచే పాలింపబడే దానాన్ని బలాత్కారంగా గ్రహింపరాదు అనే విషయం తామ్ర ఫలకంలో ఒకచోట చెప్పబడింది

"అద్భిర్దత్తం త్రిభిర్భుక్తం సద్భిశ్చ పరిపాలితం
ఏతాని ననివర్తంతే పూర్వరాజ కృతానిచ."63

తామ్ర శాసనాలన్నీ సామాన్యంగా దానాన్ని గూర్చి వివరిస్తున్నవే! ఏవో కొన్ని తప్పితే మిగిలినవన్నీ సంస్కృత భాషలో ఉన్నవే! తామ్ర ఫలకాలపై దాన విషయాన్ని చెక్కి, ఫలకాలన్నింటిని ఒక ఉంగరానికి కూర్చి, ఆ ఉంగరంపై రాజముద్రను వేసి, దాన్ని బహుశః ఒక కార్యాలయంలో ఉంచి, నకలు ప్రతిని దానాన్ని స్వీకరించినవానికి ఇవ్వడం జరిగేది.

బృహస్పతి స్మృతిలో రాజు దాన శాసనాన్ని ఇచ్చే విధానం ఇట్లా చెప్పబడింది : భూదానం మొదలైన వాటిని ఇచ్చేరాజు శాసనాన్ని వస్త్రంపై కానీ, తామ్రఫలకంపై కానీ రాయించాలి. దానగ్రహీత పేరు, రాజవంశానికి చెందిన పెద్దల పేర్లు యిక్కడ పేర్కొనాలి. ఈ దానం చివరివరకూ నిలవాలి, ఈ దానం యే రాజునూ అపహరించకూడదు. ఈ భూమికి కందాయం లేదు. దానాన్ని కాపాడేవాడు స్వర్గానికి, నాశనం చేసేవాడు నరకానికి పోతాడు మొదలైన అనేక హెచ్చరికలు ఉండాలి. రాజముద్ర, దాన సంవత్సరం, అధికారుల సంతకాలు - ఇవన్నీ రాజ శాసన సహితంగా ఉండాలి.

"దత్వా భూమిం నిబంధంవా కృత్వా లేఖ్యంతు కారయేత్
ఆగామి భద్ర నృపతి పరిజ్ఞానాయ పార్థివః॥

పటేవా తామ్ర పట్టేవా స్వముద్రోపరిచిహ్నితమ్
అభిలేఖ్యాత్మనో వంశ్యా నాత్మానం చ మహీపతిః॥

ప్రతిగ్రహ పరీమాణం దానచ్ఛేదోప వర్ణనం
స్వహస్త కాలసంపన్నం శాసనం కారయేత్ స్థిరం॥

దేవస్థానాలకో, వ్యక్తులకో మాసానికి లేదా సంవత్సరానికి ధన/వస్తు రూపాల్లో ఇంత ఇవ్వాలి అని నిర్దేశింపబడిన నియమమే 'నిబంధం'. ఉదాహరణకు తెలుగు శాసనాల్లో ఫలాన దేవస్థానానికి ఆయా వృత్తులవారు ఇన్ని విస్తరాకులు, ఇంత తైలం ఇవ్వాలని ఒప్పుకొని ఉంటారు. దీన్నే 'నిబంధం' అని చెబుతారు."[64]

కేవలం దానం నుండి దానఫలం పొందవచ్చు. అయితే, శాశ్వత ఫలం పొందాలంటే దానవిషయాన్ని పేర్కొంటూ శాసనం వేయించి తీరాలి. ఇది చాలా ముఖ్యం. చాలా శాసనాల్లో దానకాలం స్పష్టంగా లేదు. కాలంతోపాటు వివరాలు కూడ వస్తాయి. దానమిచ్చిన వాని వంశం, సంప్రదాయం, కుటుంబం, గుణగణాలు మొదలైనవీ - ఇక దానాన్ని స్వీకరించిన వాని విద్య, శౌర్యము, ధర్మము- ఈ విషయాలన్నీ వస్తాయి. భూమిని దానంగా యిస్తే, దాని ప్రమాణం, గుణం, దానిమేరలు, ఆ దానాన్ని కాపాడుకొనేందుకు కావలసిన సాక్ష్యాదులు - ఈ వివరాలన్నీ ఉంటాయి. దాన విషయం వ్యాపార వస్తువులకు సంబంధించినదైతే ఆ కాలంనాటి ఆర్థిక స్థితిగతులు, వ్యాపారం, వ్యాపారులు, సుంకాలు, దానికి సంబంధించిన అధికారులు మొదలైన వివరాలు వస్తాయి. ప్రాచీన ఆంధ్రదేశపు జీవన విధానం, వారి స్థితిగతులు వాటిని తెలుసుకొనేందుకు ఉపయోగపడే శాసనాలంటే ఇవే! కేవలం దానం అనే పేరుతో మొదట శాసనం ప్రారంభించబడి ఉన్నా, శాసనాన్ని సంపూర్ణంగా అవగాహన చేసుకుంటే ఆ కాలంలోని గ్రామాలు, నగరాలు, అగ్రహారాలు, వాటి పరిపాలనా విధానం, యుద్ధం సామాజిక మౌల్యాలు మొదలైనవాటి పరిచయం ప్రారంభమౌతుంది.

దానాన్ని కాపాడినవారికి కల్గే శ్రేయస్సు, దానాన్ని అపహరించినవారికి కల్గే అనేక పాపాలు - వాటిని గూర్చిన అనేక శ్లోకాలు ప్రాచీన ధర్మశాస్త్ర గ్రంథాలు, పురాణాలు, కావ్యాలు మొదలైన వాటినుండి ఉద్ధరింపబడివుండటం గమనింప వచ్చు. అయితే, ఇట్లాంటి ఉద్ధరణలు అతి ప్రాచీన శాసనాల్లో కన్పించవు. కేవలం దాన శాసనాల్లోనే ఇవి పేర్కొనబడినాయి.

దేవతలకు, దేవాలయ అర్చకులకు, సామాజిక సంస్థలకు ఇచ్చిన కానుకలను, కేవల దానాల్నిగూర్చి చెప్పే శాసనాలను ధార్మిక శాసనాలుగానే చెప్పాలి.

ప్రత్యేకించిన వ్యక్తులకు ఇచ్చిన లౌకిక దానాలను దాఖలుచేసే శాసనాలు ఈ వర్గంలో చేరతాయి.

భారతీయ పాలకులు తమ పుణ్యార్జనకై యజ్ఞయాగాదుల స్థానాల్లో దానాల్ని చేయడమే మహా యజ్ఞాలుగా భావించారు. వారి ధార్మిక మనోభావాలు దానాల సరళితో వ్యక్తమవుతున్నాయి. చాలా శాసనాలు, వాటి వివరాలు ఈనాటికీ మనకు లభ్యం కావడానికి. "ఇన్ని శాసనాలు ఉత్పన్నం కావడానికి కారణం హైందవ మనస్తత్వంలోని ధార్మిక భావనేతప్ప చారిత్రక ప్రవృత్తి కాదు. ప్రతి సందర్భంలోనూ, వారి స్వభావాల్లో దానాల్ని సిద్ధపరచడంలోని ఆకాంక్ష స్పష్టంగా కన్పిస్తుంది అన్న ఫ్లీటర్ మహాశయుడి మాటల్ని మనం జ్ఞాపకం చేసుకోవాలి. దాన శాసనాలు మొట్టమొదట వస్త్రాలపై మాత్రం లిఖించ బడినట్లు తెలుస్తూంది. కాలక్రమేణా ఇవి చెరిగి, చిరిగిపోతాయని తోచడంవల్ల తామ్ర ఫలకాలపై రాసే పద్ధతి క్రీ.శ. 2 వ శతాబ్దినుండి ప్రారంభమై వుండ వచ్చని తెలుస్తూంది ఇందువల్లనే ప్రస్తుతం లభ్యమయ్యే తామ్ర శాసనాలు చాలా ప్రాచీనాలు కావనే విషయం స్పష్టమవుతోంది."65

మొత్తం భారతదేశంలోనే భూమిని మొట్టమొదట దానం ఇచ్చినది క్రీ. పూ. 2 వ శతాబ్దిలో దాక్షిణాత్యులైన శాతవాహనులు. తరువాత అది ఉత్త రానికి కూడా వ్యాపించింది. పశ్చిమానా, తూర్పునా కూడ బౌద్ధారామాలకూ, బ్రాహ్మణులకు భూములూ, గ్రామాలూ యిచ్చినట్లు శాసనాలు తెలుపు తున్నాయి "66

సామాన్యంగా దానంచేసే భూమి, గ్రామం, వాటి ఉనికిని గుర్తించే స్థలం, యెక్కడుందో తెలియడానికి సంబంధించిన గ్రామం, విషయం, మండలం ఇత్యాదులను నమోదు చేయాలి. భూ పరిమాణాన్ని సామాన్యంగా హలము, నివర్తన, పాదావర్తన, కుల్యావాప, ద్రోణవాపము మొదలైన కొలతలతో సూచిస్తారు. వీటి ప్రకారం భూ పరిమాణం ఎంత అని నిర్ధారించడం కష్టమే. కొన్నిచోట్ల నిర్దిష్టమైన కొలమానం ద్వారా సూచించడం జరుగుతుంది. తెలుగు శాసనాల్లో అనేక రకాల కొలమానాల ప్రస్తావన ఉంది. వీటిద్వారా భూములను మర్తురు, పుట్లు మొదలైనవాటిగా కొలుస్తూ వుండినట్లు తెలుస్తూంది. కడప జిల్లా, మద్దులేటిగడ్డ గ్రామ శాసనం దీన్ని వివరిస్తుంది.67 ఈ కొలతల్ని గూర్చిన వివరాలు ప్రత్యేక అధ్యాయంలో చెప్పబడ్డాయి.

రాజులనుండి, వారి అధికారులనుండి దానం పొందుతుండినవారు సామాన్యంగా బ్రాహ్మణులే! శాసనాల్లో వీరి పేర్లు, తండ్రి, తాతల, ముత్తాతల పేర్లు, గోత్రాలు, ప్రవరలూ, శాఖలూ పేర్కొనబడ్డాయి. దానగ్రహీత వంశం మూలం, వంశపరంపర, అతని పూర్వుల సేవలద్వారా ప్రతిఫలరూపంగా దానమిచ్చిన ప్రకరణాలు కూడా శాసనాల్లో చాలినన్ని ఉన్నాయి. ఇలాంటి సందర్భాల్లో దానగ్రహీతలు కేవలం బ్రాహ్మణులే కావాల్సిన అగత్యం లేదు. కడపజిల్లా దేవగుడి గ్రామంలోని శాసనం, ఇతర శాసనాలు ఈ విషయాన్ని పేర్కొంటున్నాయి.[68]

పుణ్యార్జనమే దాన మివ్వటంలో ఉద్దేశ్యంగా ఉన్నట్టు తోస్తుంది. కొన్ని శాసనాల్లో దాన సందర్భాల్ని ప్రత్యేకంగా తెల్పకపోయినా, చాలా శాసనాలు సంక్రాంతి, సూర్యగ్రహణం, చంద్రగహణం, పర్వదినాలు, ఏకాదశి, ద్వాదశి, ముహూర్తాలు, తీర్థయాత్ర మొదలైన సందర్భాల్లో యివ్వడం సంప్రదాయంగా పెట్టుకొన్నట్లు తెలుస్తూంది. ధారాపూర్వకంగా యిచ్చే దాన ఉద్దేశ్యం పుణ్య సంపాదనమే! ఈ భావం చాలా శాసనాల్లో స్పష్టంగా వ్యక్తమైంది. మరి కొన్ని సందర్భాల్లో దానగ్రహీత బ్రాహ్మణుడయ్యుంటే, నిత్యవిధి, అనుష్టానము, దేవపూజా నిర్వహణ, దేవాలయ జీర్ణోద్ధరణ, సన్యాసుల ఆహార వ్యవస్థ మొదలైన ఉద్దేశాలకుగాను దానమివ్వడం జరిగినట్లు తెలుస్తూంది. దానమిచ్చిన భూమినుండి లేదా ఇతర వస్తువుల నుండి వచ్చే ఆదాయాలను ఈ కార్యాలకుగాను వినియోగించవలసి ఉంటుంది.[69]

దానంగా ఇవ్వబడిన భూమికిగానీ, గ్రామానికికానీ చెక్కుబందిలు (మేరలు) సుపరిచితమైనవే ఐతే, వాటిని ప్రత్యేకంగా నమోదుచేయడం జరగదు. ప్రత్యేకించిన సందర్భాల్లో మాత్రం చెక్కుబంది నిర్దిష్టంగా తెల్పడం జరుగుతుండేది. కొండ, నది, లోయ, తోట, గ్రామం, చెట్టు, చేను మొదలైనవి నైసర్గిక హద్దులుగా లెక్కించేవారు. కర్నూలుజిల్లా త్రిపురాంతకం గ్రామంలోని వైవిధ్యం కల ఒక శాసనం దీన్ని వివరిస్తూంది.[70]

ఒక్కొక్కసారి దానం పొందిన వ్యక్తి కొన్ని నియమాలు పాటించవలసిన పద్ధతులుకూడా ఉన్నాయి. దానం పొందిన భూమిని అతడు విక్ర

యించడంకానీ, కుదువబెట్టడంకానీ నిషిద్ధం. వేశ్యావృత్తికి, జూదపు గృహానికి, జూదపు ఆటలకు దాన్ని బలి చేయరాదు. దాన గ్రహీత ఈ విషయాల్లో చాలా నైష్ఠికుడుగా వుండాలి అనేది కూడా దాన శాసనాల దాఖలాలవల్ల తెలుస్తూంది. దానాన్ని ఇవ్వడం, తీసుకోవడం అన్నవి అంత కష్టకార్యాలు కానప్పటికీ, ఇచ్చిన దానాన్ని శాశ్వతంగా నిల్పుకోవడం, దాన్ని అన్యాక్రాంతం చేయకుండా కాపాడుకోవడం, వంశపారంపర్యంగా, సక్రమ రీతిలో నియమబద్ధంగా అనుభవించటం వంటి కట్టుదిట్టమైన విధానాలు-శాస్త్రోక్తమైన, పురాణోక్తమైన శాపాశయాలు శాసనాల చివరల్లో అవి చోటు చేసుకున్న రీతుల్నిబట్టి అవగతమవుతూంది.

కవులకు, కళాకారులకు భూ, గ్రామ దానాలు చేసేవారని కడప జిల్లా తుడుములదిన్న గ్రామంలోని శాసనం చెబుతూంది.71 తురిమిళ్ళదిన్న అగ్రహారం ఉత్తర హరివంశ కావ్యకర్త, ప్రఖ్యాత కవి నాచన సోమునికి ధారాదత్తంగా ప్రౌఢ దేవరాయలచే ఇవ్వబడినట్లు, అప్పటినుంచే అది నాచన సోముని అగ్రహారంగా పిలువబడుతూందని తెలుస్తూంది. కృష్ణదేవరాయల కాలంలో అల్లసాని పెద్దన మహాకవికి, కడపజిల్లాలోని కోకటం అనే గ్రామం ఇచ్చినట్లు తన స్వారోచిష మనుసంభవం కావ్యంలో 'కోకట గ్రామాద్యనేకాగ్రహారము లడిగినసీమల యందునిచ్చె' అన్న పెద్దన మహాకవి రచిత చాటు పద్యంవల్ల తెలుస్తూంది.72 శ్రీనాథకవి సార్వభౌముడికి రెడ్డిరాజులు అనేక మడిమాన్యాదులు, ధన కనక వస్తు వాహనాదులనిచ్చినట్లు చరిత్ర చెబుతూంది.

దానాలు చేయడం దాతలు పవిత్రకార్యంగా భావిస్తే, దానాలు గ్రహించడం గ్రహీతలు ప్రశస్తంగా భావించేవారు. అయితే, ఆనాడుకూడా ఈ దానాల్ని అందరూ గ్రహించేవారు కాదనీ, పరమ నైష్ఠికులైన బ్రాహ్మణోత్తములు అసలు దానమే తీసుకొనేవారుకారనీ, దీనికి తార్కాణంగా అల్లసాని పెద్దనగారి మను చరిత్రలో ప్రవరుడు 'సాలగ్రామము మున్నుగాకొనడు' అన్న పద్యంలోని అంశమే తెలుపుతూంది. సాలగ్రామాన్ని దానంగా తీసుకోవడంలో తప్పులేదు, పైదు మిక్కిలి మహాప్రశస్తం కూడ. అయితే, దాన్నికూడా ముట్టకపోవడం అనేది పరమ నైష్ఠికతకు పరాకాష్ఠ.

అన్ని సంప్రదాయాలు మరుగునపడ్డట్లే ఈ దానాల తంతుకూ పవిత్రత, విలువ పడిపోయాయి. దానగ్రహీతల్లో అపాత్రులు ఎక్కువయ్యారు, దాతల్లో త్యాగమూర్తులు కరువయ్యారు. ఇట్లాంటి సాంప్రదాయాలకూ కాలదోషం పట్టింది. వ్యాపార ధోరణి ప్రబలిన నేటి సమాజంలో కుతంత్రాలకే పట్టాభిషేకం జరుగుతూంది.

ఈ దానం అనేది పుణ్యం అనే పవిత్ర సూత్రంతో నిబంధింపబడివుంది. దీనికి కారణ భూతులైన దాత గ్రహీతలు పరస్పరం నిగ్రహనియమాలతో వర్తిస్తూ, వారికి అధికారికమైన రక్షణ, సామాజిక పరమైన అవగాహన యేర్పడినప్పుడు ఆ దానం శాశ్వత కీర్తిని ప్రసాదిస్తుంది. ఇహ పర సార్థకతల్ని సంతరించుకొంటుంది. చరితార్థమై నిలుస్తుంది.

ప్రశస్తి శాసనాలు :- ప్రశస్తి అంటే ప్రశంస లేక పొగడ్త. ప్రశంసింపబడే వ్యక్తి, ప్రశంసించే వ్యక్తి వారి వారి అంతస్తులు సందర్భాల్నిబట్టి కూడా పొగడ్తలకు విలువ ఉంటుంది.

రాజరిక వ్యవస్థలో రాజులను ప్రశంసించడమే ఒక వృత్తిగా, వ్యాపకంగా పెట్టుకొన్నవాళ్లుకూడ ఉన్నట్టు చరిత్ర చెబుతూంది. "భట్టులు" అనబడేవారు శాస్త్ర, పురాణ, ఇతిహాస జ్ఞానాన్ని కలిగి వుండి, తమ వాక్చాతుర్యంతో పాలకుల్ని మెప్పించేవారు. దీనికి ప్రతిఫలంగా అనేక కానుకల్ని గ్రహించేవారు. మడిమాన్యాది దానాల్ని కూడా పొందేవారు.

భక్తుడు భగవంతుని ప్రార్థించే విధానమే ప్రశంస. శ్లోకం, పద్యం, వాక్యం ఏ రూపంలోనైనా అది ఉండవచ్చు. ప్రాచీన మహర్షుల నుండి యిప్పటి సామాన్యుల వరకు వస్తున్న సంప్రదాయమిది. దీనివల్ల పుణ్యం లభిస్తుందనీ, స్వర్గలోకానికీ, మోక్షానికీ దగ్గరవుతామనీ, మనశ్శాంతి లభిస్తుందనీ భారతీయుల విశ్వాసం.

కవులను, కళాకారులను వారివారి ప్రతిభనుబట్టి సభల్లోకానీ, ప్రత్యేకంగా కానీ వారి కావ్యాల్లోనే ప్రథమంగా ప్రశంసించడం అనాదిగా జరుగుతూంది.

ఈ ప్రశస్తులు శాసనాల మొదటనే (ప్రారంభంలోనే) విశేషణ, విశేష్యాలతో (బిరుదాలతో) ఉటంకింపబడటం గమనించదగ్గ అంశం. పురాణ, చారిత్రక పురుషులతో పోల్చదగిన, గుణగణాలను కల్గిన నాటి రాజులను శాసన కవులు ఘనంగా కీర్తించినట్లు దీనివల్ల వ్యక్తమౌతూంది. క్రీ.శ. 8 వ శతాబ్దంనాటి కడప జిల్లా, కన్యేశ్వరం గ్రామంలోని ఒక శాసనంలో 'శ్రీ అరువ త్రిపువణసింగంబు' అని చెక్కబడింది.[73] అరువ అనే వాడు మూడులోకాలకు సింహము వంటివాడు అని అర్థం. 'మహారాజాధిరాజ పరమేశ్వర'[74] వంటి ప్రశస్తులతో అనేక శాసనాలు ప్రారంభింపబడి వున్నాయి. 'స్వస్త్యనేక సమరసఙ్ఘట్టణోపలబ్ధ జయలక్షుమీ సమాలిఙ్గిత వక్షస్థల గణ్డత్రిణేత్ర శ్రీ వైదుమ్బ మహారాజు' శాసనాలు వైదుమ్బులకాలంనాటివి.[75]

'స్వస్తి సమస్తప్రశస్తి సహితం శ్రీ మనుమహా మండలేస్వర త్రైలోక్య మల్ల భుజబళ వీరనారాయణ అవుదుంబరాభరణ..........................
...................సమస్త ప్రశస్తులైన శ్రీమంతుడు మహామండలేశ్వరుడు.'

ఈ ప్రశస్తి కడప జిల్లా జ్యోతి గ్రామంలోని ఒక శాసన ప్రారంభమే![76] కడప జిల్లా పొందలూరు గ్రామ శాసనం,[77] ఇదే జిల్లాలోని సోమిరెడ్డి గ్రామ శాసనం,[78] వుటుకూరు గ్రామ శాసనం,[79] నంద్యాలంపేట గ్రామశాసనం,[80] కర్నూలుజిల్లా త్రిపురాంతకంలోని శాసనాలు అనేకాలు,[81] కడపజిల్లా దూపాడు గ్రామ[82] మొదలైన శాసనాలు అప్పటి రాజుల విశేష గుణగణాలను పురాణ ప్రసిద్ధులైన పురుషులలోనేకాక, జప హోమ తత్పరులుగను, స్వామిద్రోహుల గండలుగను, శరణాగత వజ్ర పంజరులగను, తురగరేవంతులుగను, సమధిగత పంచమహాశబ్దులుగను, బాహత్తర నియోగాధిపతి, అనేక దేశాధిపతి, చాతుర్వర్ణ సముద్ధరణులుగను, చతుష్షష్టి విద్యాప్రవీణులుగను అభివర్ణింపబడ్డారు.

మహావ్యక్తుల, మహారాజుల గుణవిశేషాల్ని కీర్తించడంలో ప్రాచీనులు, పౌరాణిక, చారిత్రక దృక్పథాలతో ప్రకృతి శక్తుల్ని అంతర్వాహినులుగా తమదైన కవితా హృదయాల్ని శాసనాల్లో ఆవిష్కరించారు. ఈ శాసనాలను ఇహలోకాన్ని, చతుర్దశభువనాల్ని అధిగమించి ఉత్ప్రేక్ష, అతిశయోక్త్యాదులతో అలంకరింప చేశారు.

'మహారాజాధిరాజ రాజపరమేశ్వర' అన్న ప్రశస్తి రాజులందరికీ సామాన్య విశేషణ వాచకంగా ప్రయోగింపబడింది. రాజులు అనేక సమరాల్లో జయలక్ష్మిని గ్రహించినవారుగా కొన్ని శాసనాల్లో వర్ణింపబడ్డారు. ప్రచండ ప్రద్యోత దినకర కులనన్దనులుగా, తమకి దగ్గర్లోఉన్న గొప్ప నదులు, గిరులు వాటికుండే విశేష ప్రాధాన్యతల్ని మూలంగా చేసి వర్ణింపబడ్డ రాజులు కొందరు, అమరేంద్రుడితో సమానులైనవైభవోన్నతులనీ,కవి బుధజన మిత్రులనీ,త్యాగంలో సముద్రులనీ, యాచకులకు పారిజాతంవంటివారనీ,కామినీ జనులకు జయంతులనీ తురగరేవంతులనీ, పరనారీ దూరులనీ, పరనారీ పుత్రులనీ, స్వామి ద్రోహులకు గండలనీ, శత్రువులకు భీములనీ (భయంకరుడు, రుద్రుడు, భీమసేనులు), విలువిద్యలో పరశురాములనీ, రణరంగభైరవులనీ, కారుణ్యసాగరులనీ, సమగత పంచమహాశబ్దాలైన శృంగం, మృదంగం, శంఖం, భేరి, ఘనం అనే వాద్య ధ్వనుల్ని నిరంతరం ఆకర్షించేవారుగా, బాహత్తర నియోగాధిపతి (డెబ్బది రెండు వినియోగపువారలు)గా, అరవైనాల్గు కళలల్లో ప్రవీణులుగా, ప్రత్యక్ష ధర్మరాజులుగా, శత్రువులనబడే తామరలకు ఏనుగులుగా, శరణాగతులకు వజ్రపంజరులుగా, అష్టాంగ హృదయాలను అనుష్టించేవారుగా, నిగమాగమాలను ఆపోశనం పట్టినవారుగా, ఆడితప్పినవారికి (రాజులకు) గండరుగా, పూర్వ పశ్చిమ సముద్రాధిపతులుగా. షడ్దర్శన స్థాపనాచార్యులుగా, శౌర్య నారాయణు లుగా, నీతిపారాయణులుగా, శీలంలో గాంగేయులుగా, సుజనజన హరిచందను లుగా, విద్వజ్జన రక్షకులుగా, అభినవ భరతులుగా, సత్కీర్తి కల్గినవారుగా, భయలోభదుర్లభులుగా, కవి, గమకివాది, వాగ్మి మొదలైన యాచకులకు చింతా మణులుగా, వనదుర్గ దావానలురుగా, జలదుర్గ బాడబజ్వాలనులుగా, ప్రతిజ్ఞా పరశురాములుగా, వర్ణాశ్రమధర్మ పరిపాలకులుగా, కుల వంశకర్త సూర్య సమానులుగా, ఛలములో దుర్యోధనులుగా, త్యాగంలో కర్ణులుగా, భోగంలో దేవేంద్రులుగా, సాహసంలో అర్జునులుగా, కాంతిలో నకులురుగా, ఉపాయాల్లో నారాయణులుగా ఆనాటి రాజులు, మహా వ్యక్తులు ఇట్లాంటి ప్రశస్తులతో, బిరుదాలతో కీర్తింపబడ్డారు. పైన ఇవ్వబడ్డ సంఖ్యా సూచికల వివరణలే ఇవి.

పాలకుల పరిపాలనా విధానాన్నిబట్టే ప్రజల జీవన విధానం, భాషా సంస్కృతులు ప్రతిబింబిస్తాయి. వ్యక్తి సంఘానికి మూలమైనట్లే, వ్యక్తి సంస్కారం సంఘ సంస్కృతికి పట్టుగొమ్మ. విజ్ఞాన సంస్కృతులు మానవత్వా

నికి పెట్టని సొమ్ములు. ఈ సులక్షణాలు, ఆనాటి మానవ సంఘంలో కోకొల్లలు అని నిరూపించేవే మన శాసనాల్లోని ప్రశస్తులు, అందులోని ఈ విశేషణాలు. ఈ సుదీర్ఘ పారిభాషిక పదజాలం శాసనకవుల భాషాపటుత్వానికీ, బహుపురాణ పరిచయానికి గీటురాళ్ళు.

'భారతస్య ప్రతిష్ఠేద్వే సంస్కృత స్సంస్కృతీ తథా' అన్న ఆర్యోక్తి ఇక్కడ స్మరణీయము. భారత దేశానికి రెండు ప్రతిష్ఠాకరాలైన సంస్కృతం, సంస్కృతి అనే విశేషాంశాలున్నాయని భావం ఈ ప్రశస్తుల్లో ఈ రెండు బింబ ప్రతిబింబాలుగా ప్రకాశిస్తున్నాయి. నాడే కాదు, నేడు కూడా పొగడ్తల రూపంలో ఇవి ప్రయోగింపబడుతున్నాయి. కాలవైపరీత్యంవల్ల, సామాజిక రుగ్మతలవల్ల నేటి ప్రశస్తుల్లో కృత్రిమత్వం కొంత వుండవచ్చు. ఐతే, దైవ సంబంధ ప్రశస్తుల పారాయణం మాత్రం దేవాలయాల్లోని ఘంటానాదాల్తో పాటు నిరంతరం జరుగుతూందనే చెప్పాలి.

## స్మారకశిలలు (వీరశిలలు లేక వీరగల్లులు) :

మనుష్యుల లేదా ఇతర ప్రాణుల జ్ఞాపకార్థం నెలకొల్పిన శిలలే స్మారక శిలలు. చనిపోయిన ప్రాణి సందర్భం, స్థితిగతుల్ని బట్టి స్మారకాన్ని ఏర్పాటు చేసే సంప్రదాయం బహుప్రాచీనమైంది. ఇది ఒక ఆరాధనా సంకేతం. లోకంలో యిది యెప్పుడు ప్రారంభమైందో చెప్పడం కష్టం. అయినా తోడిమనిషిని మనిషి గాను, ప్రాణిని ప్రాణిగా చూడలేని వారీలోకంలో అధికంగా ఉన్నప్పుడూ, మనుష ల్లోని మానవతాన్ని, దైవత్వాన్ని, ప్రాణిలోని ఆత్మీయతను చూడగల్గినవారు కొంద రైనా ఉన్నప్పుడు యీ స్మృతులు అజరామరాలై నిలుస్తాయి. ఇట్లాంటి కార్యాలు ప్రాచీన మానవ సాంఘిక జీవనానికి దర్పణాలుగా ప్రతిబింబిస్తు న్నాయి.

స్మారకాలన్నీ ఉదాత్తంగా మరణించిన వ్యక్తిని జ్ఞాపకం చేసే సంకేతాలు. ఇవి భావితరాల వారికి మార్గదర్శకాలుకూడా. ఆయా జాతి, మతం, పరిసరాలు, ప్రజల నమ్మకాలు, ఊహలనుబట్టి కూడ ఈ స్మారకాలు రూపు రేఖల్లో వైవిధ్యాలు చోటు చేసుకున్నాయి.

వేదాల్లో చెప్పిన 'పితృమేధ' అనే విధిలో, మరణించిన వానికి సంస్కారం చేసిన స్థలంలో స్మారకాన్ని నిల్పిన ఉదాహరణ లభ్యమౌతుంది. ఇక్కడ అంత్య సంస్కారం చేసిన కొన్ని మాసాలకు లేదా కొన్ని సంవత్సరాలకు ఈ స్మారకచిహ్నాన్ని యేర్పాటు చేయాలని చెప్పబడింది.

స్మారకాల్లోని (స్మారక చిహ్నాలు) చాలా భాగాలు శిలారూపాల్లో ఉన్నాయి. విగ్రహారాధనకు ప్రాధాన్యమిచ్చే భారతీయులు ఈ జ్ఞాపక చిహ్నాలను విగ్రహాల్లో చూసుకోవడం వారి ఆత్మీయతకు సంకేతం. పల్లెల్లో ఉండే ప్రతి రాయి,చెట్టూ, చేమా పల్లీయుల హృదయాల్లో దోబూచులాడే పవిత్రభావాలే! ఇవే క్రమక్రమంగా వారి గ్రామదేవతలూ, ఇలవేల్పులూ అయ్యాయని చెప్పవచ్చు. గ్రామ శ్రేయస్సుకో, అనాథ జన రక్షణకో, స్త్రీ మాన సంరక్షణార్థమో, పశు, గోగణాల్ని రక్షించడానికో, దేవాలయాన్ని కాపాడేందుకో వ్యక్తులు ప్రాణ త్యాగాలు చేసి వుండవచ్చు. అట్లాంటి వారి జ్ఞాపకార్థం కూడ ఈ స్మారకాలు చాలవరకు మనకు శిలారూపాల్లో అక్కడక్కడ దర్శనమిస్తాయి.

ఒక వ్యక్తి తన సాహస పరాక్రమాల్ని కేవలం యుద్ధంలోనే ప్రకటించాల్సిన అగత్యం లేదు. దైనందిన జీవితంలో, సమాజంలో జరిగే దురాచారాలను, దుర్మార్గాలను నిర్మొహమాటంగా ఎదిరించడం; దోపిడీలు, మానభంగాలు, ఆకస్మిక దండయాత్రలు మొదలైన ఉపద్రవాలు కల్గినప్పుడు, వ్యష్టిగానో, సమష్టిగానో పోరాడి గెలవడమో, వీరమరణం పొందడమో జరిగేది. ఇట్లాంటి దృష్టాంతాలు చరిత్రల్లో, శాసనాల్లో కోకొల్లలు. గెలిస్తే ఇహ లోకంలో కీర్తి, సుఖం; మరణిస్తే వీర స్వర్గం లభిస్తాయనే నమ్మకాలు ఆనాటి వారికి ఉండేవి.

ధైర్యం, త్యాగం బొమ్మ - బొరుసులుగా చూపించే ఈ త్యాగనిష్ఠమైన వీరమే శాశ్వతమైంది అని ఆనాటి వారు సంపూర్ణంగా విశ్వసించేవారు. ఇట్లాంటి విశ్వాసాలకు ప్రతిరూపాలే వీర శిలలు.

రాయలసీమలోని చిత్తూరు, అనంతపురం, కడప, కర్నూలు జిల్లాల్లో వీర శిలలు అనేకం మనకు కన్పిస్తాయి. పుంగనూరు తాలూకాలోని ఎంబాడి,

బోడినాయనిపల్లి, యాటవాకిలి మొదలైన ప్రాంతాల్లో వీర శిలలు దర్శనమిస్తాయి. వాటి విధానం చూస్తే ఆ ప్రాంతాల్ని కొంతమంది ప్రాంతీయ పాలకులైన సామంత రాజులు, పాలెగాళ్ళు పాలించినట్లు; వారి అధిపతులుగా వైదుంబ, బాణ, నోళంబ వంశాల రాజులుండినట్లు వ్యక్తమౌతూంది. వాళ్ళలో వాళ్ళకు జరిగిన అంతర్యుద్ధాలు, సరిహద్దు తగాదాలు, ఆ తగాదాల వల్ల ఆ వీర శిలలు యేర్పడేందుకు అవకాశాలు కూడా కల్గాయని తెలుస్తుంది. ఈ వీర శిలల్లో ఒక వీరుడి చిత్రం ప్రముఖంగా కన్పిస్తూ, నిలబడినట్లుగా ముఖాన్ని ముందుకు చూపిస్తూ, తన పాదాల్ని ఒక పక్కగా ఉంచి యెడమవైపు దృష్టి కేంద్రీకరించినట్టుగా చూపించ బడింది.83

భక్తుల వీర కృత్యాలను చిత్రిస్తున్న శిలలు వీరశైవమత ప్రాబల్యం కల కేంద్రాలకు నిదర్శనంగా ఉన్నాయి. త్రిపురాంతకం (కర్నూలు జిల్లా)లో త్రిపురసుందరి గర్భగుడి యెదుట వీర శిలలనేకం ఉన్నాయి. కత్తితో గొంతులో, కడుపులో పొడుచుకొంటున్నట్లు, ఎడమచేత్తో తొడలో పొడుచుకుంటూ, కుడి చేత్తో గుండెలో పొడుచుకొంటున్నట్లు చెక్కిన మనుష్యుల విగ్రహాలు అవి. వాటిలో కొన్ని విగ్రహాలకు మోకాలంటా వేలాడుతున్న జడలున్నాయి. కడప జిల్లా మోపూరివద్దనున్న గుట్టమీద కూడ అట్లాంటి శిలలున్నాయి. త్రిపురసుందరీ దేవాలయం శిలల్లో ఒకదానిమీద చెక్కిన రాతచూస్తే ఆనాటి (13 వ శతాబ్ది) అసలు పరిస్థితి అర్థమౌతుంది. ఆ రాత ఇది :

"స్వస్తిశ్రీమతుసోమ శివగురుదేవరు అల్లడ వీరమల్ల వీరుని వారికి మేలు గావలెన్ అని తన తల త్రిపురదేవికిన్ ఇచ్చె." మరొక శిల పూర్తిగా లేదు. చివరిమాట "దేవికి తల ఇస్తున్నాను." "తెలుంగునాయని బావ మరిది చావుండయ్య వీర" అని మరోశిలమీద వుంది. ఆత్మహత్య చేసుకొన్నవారివో, బలి ఇచ్చిన వారివో ఆ శిలలు అనుకోవాలి. ఆ విధంగా బలియిస్తే దేవి ఆపదలు తొలగిస్తుం దనే విశ్వాసం యెంత బలంగా ఉండేదో వానివలన తెలుస్తుంది."84

"పశువుల మందలు సంపదలుగా గ్రామాన్ని ఆదుకొంటున్నాయను కొన్నప్పుడు ఇరుగుపొరుగులకి కన్నుకుట్టి తగవులకు కారణం కావడం జరిగేది. గ్రామాల మీద దాడులు చేయడం, పశువుల్ని తోలుకుపోవడం, కొట్లాటలు,

మరణాలు - ఎంతో బీభత్సం జరిగేది. ఇటువంటి ఘట్టాలలో పశుసంపదను రక్షించడంలో ప్రాణాలిచ్చిన వీరుల సంస్మరణార్థం ఆనాడు నాటిన రాతి స్తంభాలు రాయలసీమ గ్రామాలలో నేటికి అనేకం కనిపిస్తాయి. చిత్తూరు, అనంతపురం జిల్లాల్లో ఎక్కువగానూ; గుంటూరు, కడప జిల్లాలో అక్కడక్కడ ఈ వీర స్తంభాలు కనిపిస్తున్నాయి. పల్లవ, చోళ, బాణ, గంగరాజుల పాలనకాలంలో ఈ పశుదాడులు యెక్కువగా జరిగేయి. చిత్తూరు జిల్లా పుంగనూరు తాలూకా బోడినాయకనూరు గ్రామంలో 11 వీర స్తంభాలున్నాయి. దోపిడిదారుల నెదుర్కొని ప్రాణాలు కోల్పోయిన వారి సంతానానికి భూముల నిచ్చినట్లు ఈ శాసనాలు తెలుపుతున్నాయి. అలాగ మరణించిన ఒక వీరుని దత్తపుత్రునికి ఆ వీరుడు మరణించి పడివున్న భూమినే ఇచ్చినట్లు ఒక శాసనం తెలుపుతూంది. అడవి పందిని చంపి పశువుల్ని కాపాడినందుకై ఒక కుక్కకు వీర స్తంభం వేశారు."[85]

కడప జిల్లా కసనూరు గ్రామంలోని క్రీ. శ. 8 వ శతాబ్ది శాసనంలో అగ్గలయ అనే వీరుడు వంమణయయరటరు అనేవాడితో పోరాడి చనిపోయినట్లు లిఖించబడింది.[86]

ఇదే జిల్లా రాయవరం గ్రామంలోని క్రీ.శ. 9 వ శతాబ్దికి చెందిన ఒక శాసనంలో కొటకిల అడియమ్మ అనే వీరుడు పశువులను కాపాడడానికై పోరాడి మరణించినట్లు పేర్కొనబడింది.[87]

ఇదే జిల్లా గురుగుపల్లి గ్రామంలోని క్రీ శ. 10 వ శతాబ్దికి చెందిన శాసనంలో కడసన్దికల్లు అనే వీరుడు ఒక పులితో పోరాడి వీర మరణం పొందినట్టు లిఖించబడింది.[88]

కడప జిల్లాలోనిదే అయిన అరిబల్లి గ్రామంలోని 9 వ శతాబ్దికి చెందిన ఒక శాసనంలో ఒక వీరుడు అనేకులతో పోరాడి పొడిచి పడిపోయినట్లు వర్ణించబడింది.[89]

చిత్తూరు జిల్లా చిన్నతిప్ప సముద్రం గ్రామంలోని ఒక శాసనంలో (కాలం లేదు) గండమయ్యలియ్య కుమారుడు ఒక యుద్ధంలో పోరాడి ఇంద్రలోకం ఏగినట్లు చెప్పబడింది.[90]



కడప జిల్లా తాళ్ళపొద్దుటూరిలో వుండే శాసనాలు పద్యరూపంలో ఉన్నాయి. ఒక శాసనంలో ఐదు పద్యాలు ఉన్నాయి. వీటిలో వీరరసం మనోహరంగా వర్ణించబడింది. ఇది క్రీ.శ. 14 వ శతాబ్దికి చెందిన శాసనం.[91]

ఈ శాసనం స్తంభం నాల్గువైపుల చెక్కబడి ఉంది. దీన్ని విషయ దృష్టితో రెండు భాగాలుగా చేయవచ్చు. మొదటి భాగం గంగయదేవచోళ మహారాజులు తమ తండ్రి అల్లగంగరాజు, తల్లి గంగాదేవి పేర్లతో గంగసముద్రం అనే తటాకాన్ని నిర్మించిన విషయాన్ని తెల్పేది. రెండవది అతని పరాక్రమాదుల్ని కీర్తించే ప్రశస్తి.

రెండ భాగం మొదటి పద్యంలో జగతాపిగంగడిని అజేయ, అద్వితీయ వీరుడని పొగిడే పద్యాలు. రెండవ పద్యం కేవలం వీరుడు, వీరునికి ప్రాప్తించే స్వర్గం అనే కల్పన (భావం). దక్షిణ భారత శాసనాల్లో - ముఖ్యంగా క్రీ.శ. 9, 10 శతాబ్దాల్లోనూ, ఆ తరువాతి శాసనాల్లోనూ ఈ భావం మిక్కిలి స్పష్టంగా వ్యక్తమవుతున్నది. ఈ భావం సాహిత్యానికేకాక శిల్పానికే పరాకాష్ఠ.

యుద్ధంలో మరణించినవారి జ్ఞాపకార్థం వేసే వీరశిలలు, శిల్పాలు వీరుడు స్వర్గంలో అప్సరసలతో విలాసవంతంగా ఉంటాడనే భావాన్ని ప్రస్ఫుటం చేస్తున్నాయి. వీరశిలలందుండే శాసనాల్లో సామాన్యంగా—

— "జితేన లభ్యతే లక్ష్మీః, మృతేనాపి సురాంగనా
క్షణవిధ్వంసినీకాయే, కాచింతా మరణేరణే।
(లేక)
ద్వావిమౌ పురుషౌ లోకే సూర్యమండల భేదినౌ,
పరివ్రాడ్యోగ యుక్తాశ్చ రణేగాభి ముఖేహతః॥[92]

— అనే శ్లోకాలుండి, అప్సరసలు వీరునికి అర్ఘ్యాన్నిచ్చి, చేయిపట్టి స్వర్గానికి స్వాగతంపలికే వర్ణనలు కన్నడంలోని వీరగల్లుల పాఠాల్లో కూడా ఉన్నాయి. క్రీ.శ. 10, 11 శతాబ్దుల్లోని కన్నడ రత్నత్రయంలోని మొదటి ఇద్దరైన పంప, రన్నల విక్రమార్జున విజయం, సాహస భీమ విజయాల్లో ఇట్లాంటి వర్ణనలు మనకు లభిస్తున్నాయి.

అప్సరసలు, యుద్ధంలో మరణించిన వీరులను మాకు మాకని ఒకరిపై ఒకరు పడి వరించి స్వీకరిస్తూ ఉండినారనీ, వారిలో యీ విషయంగా కలహాలు కలిగేవని కావ్యాలు వర్ణిస్తున్నాయి.

—తాళ్ళపొద్దుటూరు శాసన పద్యాల్లో వర్ణింపబడిన విషయభాగం చూస్తే ఇవే భావాలు కన్పిస్తున్నాయి. గంభ, జగతాపిగంగని ఖడ్గంవల్ల మరణించిన వీరభటులను తాను పొందాలనే ఆలోచన వీటిలో వ్యక్తమైంది.

యుద్ధంలో గెలుపు ఓటములు, చావు బతుకులు ఒక వ్యక్తిని వీరుడుగా గణించేందుకు తగిన కొలమానాలు కావు. వాడా యుద్ధంలో యే రీతిగా పోరాడి నాడనే అంశమే ముఖ్యంగా చూడాలి.

యుద్ధవర్ణనం వచ్చినపుడు కవులు, యుద్ధభూమిలో శాకినీ ఢాకినీల స్వైరవిహారాల్ని కూడ వర్ణించారు. ఈ శాకినీ ఢాకినీల శిల్పాల వీరశిలలు స్ఫుర ణకు తెచ్చుకొన్నపుడు - రెండు వీరశిలలు వెంటనే స్ఫురిస్తాయి.

ఒక వీరశిల ప్రస్తుతం బెంగుళూరు మ్యూజియంలోని బేగూరి వీరశిల. రెండవది గోల్కొండ మ్యూజియంలోని వీరశిల.

కన్నడ శాసన కవి యొకరు ఈ పిశాచాల స్వారస్యమైన ఆకారాన్ని వర్ణిస్తూ ఇలా అన్నారు: "ఒక పిశాచము యింకొక పిశాచంతో - 'నాకు అజీర్ణ మైంది యేమి చేయాలి?' అని అన్నదట. అందుకా రెండవది, 'ఇంకా రెండు ఏను గుల్ని తిను, నీ అజీర్ణం మటుమాయమౌతుందని చెప్పిందట." ఇట్లాంటి వర్ణనలు, రూపకల్పనలు అపురూపాలు.

పదిమంది బాగుకోసం, స్త్రీల మానసంరక్షణకోసం, దుర్మార్గాల్ని నిర్మూ లించడం కోసం తమ ప్రాణాల్నే త్యాగం చేసిన అమర వీరులకు ఆనాడు చక్కని గుర్తింపు లభించేది. ఇహలోకంలో కీర్తి, పరలోకంలో స్వర్గం అన్నవి ఆనాటివారి బలీయమైన ఆకాంక్షలు. నాటి సమాజంలో వీరునికి ఉండే గౌరవం మరెవరికీ లేదనడానికి ఈ వీర శిలలే సాక్ష్యాలు. ఖడ్గ తిక్కన (రణ తిక్కన) వీరోచిత గాథ, బాలచంద్రుని పల్నాటి వీరగాథ వీటికి తార్కాణాలు. వీరుల కథలు కావ్యాలయ్యాయి. కావ్యాలకు రూపకల్పనలు వీరశిలలు, శాసనాలూను. ఇవి అజరామరాలు, ఆచంద్రతారార్కాలు.

## యంత్రమంత్ర శిలాశాసనాలు :

శిలలపై యంత్ర సంబంధమైన లేదా మంత్ర సంబంధమైన రాతలు ఉండడం ప్రధానంగా గమనించదగ్గ అంశాలు. వీటిలో కేవలం కొన్ని కొన్ని అక్షరాలుగా ఉండవచ్చు. పూర్తి శ్లోక రూపంగా కానీ, పద్య రూపంగా కానీ వుండవచ్చు. ఇట్లాంటి కొన్ని శాసనాల్లో కాలం కూడ గుర్తించబడనివి వున్నాయి. ఈ శాసనాల్లో కొన్ని ప్రార్థనా రూపంలోను, కొన్ని మానవ వైద్య చికిత్సా విధాన రూపంలోను, మరికొన్ని పశు వైద్య విధాన రూపంలోను ఆయా అంశాలు స్పష్టంగా లిఖించబడ్డాయి.

కాగితాలు లేని నాటి కాలంలో తాళపత్రాలు, శిలలు లేఖన వస్తువులయ్యాయి. అక్షరాస్యుడైనవాడు శాసన రూపంలో రాయబడ్డ ఈ చికిత్సా విధానాల్ని నిరక్షరాస్యుడికి చెప్పి వివరించేవాడని తెలుస్తూంది. ఈనాటి పోస్టర్లు, కరపత్రాల వంటివే ఆనాటి శిలాశాసనాలని చెప్పవచ్చు.

అక్కడక్కడ పల్లెల్లో ఈ రకమైన శాసనాలుండడం మనం గమనించవచ్చు. అవి దేవతా రూపాలుగా, గౌరవార్హంగా పూజింపబడటం కూడా మనం చూడవచ్చు.

కర్నూలు జిల్లా త్రిపురాంతకం దేవాలయంలోని ఒక గదిలోని గోడపై క్రీ.శ. 13 వ శతాబ్దానికి చెందిన శక్తిని గూర్చిన ఒక మంత్ర శాసనం ప్రార్థనా పూర్వకమై, భక్తుల భక్తి శక్తులకు ప్రతీకయై ఉంది.[93]

కడప జిల్లా పొత్తపి గ్రామంలో జాంబవంత శిలపై, కాలం నమోదు చేయబడని ఒక శాసనం, ప్రణవ మంత్రంతో ప్రారంభమై మహావిష్ణువును నృసింహునీ స్మరిస్తూ మృత్యు దేవతకు చేసే నమస్కారంతో పూర్తవుతుంది.[94] ఇదే జిల్లాలోని భీమగుండం గ్రామంలోని కాలనిర్ణయంలేని ఒక శాసనం భువనైక మాత, మహా మాయా స్వరూపిణిగా శక్తిని వర్ణించే ఒక మంత్రంగా చెక్కబడి ఉంది.[95]

కర్నూలు జిల్లా తురిమెళ్ళ గ్రామంలోని సురభేశ్వర దేవాలయం యెదుట వుండే ఒక శిలపై తాంత్రిక చక్రం చెక్కబడి ఉంది.[96]

కడప జిల్లా యెల్లటూరు గ్రామంలోని శివాలయానికి ఒక ఫర్లాంగు దూరంలో రహదారి పక్కనే ఉన్న ఒక బండరాతిపై యంత్ర శాసనం ఒకటి ఉంది. ఇది పశు వైద్య చికిత్సా విధానాన్ని పేర్కొనేదిగా చెప్పవచ్చు.[97] ఇట్లాంటి శాసనాలే కడపజిల్లాలో రెండు మూడు గ్రామాల్లో వున్నట్లు తెలుస్తూంది.

-సర్వవ్యాధులకు భయంకరుడైనవాడు, పశువుల కాలిగిట్టల రోగాన్ని నాశనం చేసేవాడుగా, ప్రమథ గణాల్లో ఒక ప్రముఖుడుగా ఘంటాకర్ణుడు స్మరింపబడ్డాడు. విరటుని పట్టణంలో తంత్రీపాలుడుగ, పశుపాలకుడుగ, ఆవులకు చేసిన చికిత్సలో ఆచంద్రార్కంగా ప్రకాశించేవాడుగా ఈ యెల్లటూరు శాసనంలో సహదేవుడు వర్ణింపబడ్డాడు.

నకుల సహదేవులు అశ్వినీదేవతల వరపుత్రులు. వైద్య శాస్త్రానికి వీరి పేర్లు చిరపరిచితం కాకున్నా, సహదేవుని పేరిట మరెవరో వైద్య గ్రంథాన్ని రాసి ఉండవచ్చు. జానపదుల్లో మౌఖికంగా నెలకొనివున్న పద్యాలకు, పాటలకూ ఈ శాసనం ఒక దృష్టాంతం కావచ్చునేమో!

"శాసనాల్లో ఈ విధంగా ఉంటే యిక జానపద గేయాల్లోను, దేశి రచనల్లోను యిట్లాంటి శాస్త్రీయాంశాలు అనేకం చొరబడి పుక్కిటి పురాణాలై వికృతిని పొంది ఉన్నాయి. ఒక్కొక్క విమర్శక పండితుడు ఒక్కొక్క అర్థాన్ని విశ్లేషించి చెప్పే ఈ పాటలు విజ్ఞులెందరో ఆలోచించి నిగ్గు తేల్చ వలసిన అంశాలే!"[98]

బిడ్డకు ఉగ్గు పెట్టి జీర్ణం కావాలంటూ తల్లి పాడే గేయం జీర్ణింపచేసే మంత్ర మంటున్నారు. "జీర్ణం జీర్ణం వాతాపి జీర్ణం, గుజ్జాలు తిన్న గుగ్గిళ్ళు జీర్ణమై, అబ్బాయి తాగిన ఉగ్గుపాలు జీర్ణమై........" అన్న పాట పసిపిల్లల్ని లాలిస్తూ, బుజ్జగిస్తూ తల్లులు చెప్పే తెలుగు బాలగేయం.

ఇంకా —

"గుడుగుడు గుంచం గుండేరాగం
పాములపట్టం పడగా రాగం, అప్పలరాజుగుజ్జం
ఆడుకోబోతే, నీ గుజ్జం నీళ్ళకుబోతే, నా గుజ్జం పాలకుబోతే
వేన్నీళ్ళా, చన్నీళ్ళా! కత్తెయ్యనా, బద్దెయ్యనా" అన్న పాటలో పాము మంత్రం వుందంటున్నారు.

గర్భిణీ స్త్రీలు సుఖంగా ప్రసవించేందుకు మంత్రించిన విభూతి, తీర్థం ఇస్తారు. కొన్ని తంత్రాలు చేస్తారు. ఈ గేయంలో—

"త్రిప్పరే గుళ్ళోను నందిని త్రిప్పరమ్మా ఓయమ్మా!
నందిని తిప్పితే మంచిదందురేమో! అమ్మా!
జాగుచేయక పాల జలకము పొయ్యరమ్మా!
అమ్మా తలకుడులు నోటి కందియ్యరమ్మా! ఓయమ్మా!" అని అంటారు.

పంట పొలాల్లో ఎలుకల బాధ నివారించుటకు ఈ గేయం పాడుతూ చేను చుట్టూ తిరుగుతారు—

"కోతగాడు, కోతగాడు నీ పేరు, ముట్టకు అంటకు నా పైరు గుడ్డిదాని వైపో ఎలుకమ్మా, చెవిటి దానివైపో ఎలుకమ్మా, దూరకు దూరకు నా యిల్లూ, దూరాలంటే ఒక యిల్లు, ఊరంతా యిళ్ళూ, పాతళ్ళూను."
మంత్ర తంత్రాల్లాగే యంత్రాలు కూడా చోటు చేసుకొన్నాయి.

ఇంకా—

"శ్రీవత్స గోత్రము వారి సింహము వచ్చింది
పచ్చ పురుగుల్లారా విచ్చిపొండి" అన్న గేయం తాటాకు మీద రాసి సాంబ్రాణి దూపం వేసి చేన్లో కడితే పురుగు లేకుండా సస్యరక్షణ కల్గుతుంది అనేది జానపదుల విశ్వాసం.

కొన్ని బాల బాలికల పాటల్లో ఆయుర్వేద విజ్ఞానం వుందంటున్నారు కొందరు విజ్ఞులు.

"కాళ్ళా గజ్జీ కంకాళమ్మా, వేగులచుక్కా వెలగా మొగ్గా
లింగు లిటుకూ పందెమూల పటుకూ
కాలు పండినట్టూ కడకు తీసిపెట్టు" - ఇదె పాట కొంచెం హెచ్చు తక్కువలుగా ఆంధ్రదేశపు చాలా ప్రాంతాల్లో పాడబడుతూంది. మొత్తం మీద ఈ ఆట పాటల్లో కాళ్ళ మీద పుట్టే కర్పాణి అనే చర్మవ్యాధికి చక్కని ఆయుర్వేద వైద్య యోగం వుంది

ఈ విధంగా మంత్రతంత్రాలు, వైద్యవిధానాలు, చికిత్సలు జానపద గేయాలో కూడా నర్మగర్భితంగా వున్నాయి. వాటి అంతరార్థాలని పసిగట

గలిగిన హృదయాలు వుంటే యివన్నీ సుసాధ్యాలవుతాయి; లేకుంటే కాల గర్భంలో కలిసిపోతాయి.

నాటి మనవారు శాసనాల్లో చెప్పినా, విగ్రహాల్లో చెక్కినా, గేయాల్లో పాడినా- శక్తివంతమైన యిలాంటి మంత్ర తంత్ర శక్తులను నిగూఢ అంశాలుగా, అమూల్య సంపదలుగా భావించారు. ఆధునిక వైజ్ఞానిక యుగంలో జీవించే మనకు ఈ మంత్ర, యంత్ర చికిత్సా విధానం విచిత్రంగా, విపరీతంగా తోచవచ్చు. అయితే, వీటి మూలంగా నాటి ప్రజలు తమ శ్రేయస్సుకై చాలవఱకు ప్రయత్నించి సఫలురైనారన్నది మాత్రం సత్యదూరం కాదని ఈ శాసనాలవల్ల తెలుస్తూంది.

## కేవలం వ్యక్తుల పేర్లను తెలిపే శాసనాలు:

కొన్ని శాసనాల్లో వ్యక్తులు కేవలం తమ పేర్లనో, తమ ఆత్మీయుల పేర్లనో చెక్కించి, వాటిని దేవాలయం మెట్లపైన, ప్రాకారాల లోపలి బండల పైన, బావి, కోనేరు వంటి జలాశయాల సోపానాల రాళ్ళపైన వినియోగించిన దృష్టాంతాలు అనేకంగా ఉన్నాయి. భక్తి అనేక విధాలు. సప్తసంతాన ప్రతిష్ఠ, దేవాలయ నిర్మాణం, దేవతా ప్రతిష్ఠ, అశ్వత్థ ప్రతిష్ఠవంటివి వాటిలో కొన్ని.

భక్తిపంథాలో భక్తుడు దేవునికంటె గొప్పవాడు. తన్ను తాను అంకితం చేసుకొన్న భక్తుడికి దేవుడు దాసానుదాసుడే! అందుకే దేవుడికన్న అతడి భక్తులే మిన్న అనే సిద్ధాంతం కూడా ప్రబలింది. శైవ వైష్ణవ ధర్మాలకు ఇదే ప్రధాన ఆలంబన సూత్రం.

తమిళనాడులో భక్తులు తమను తాము 'అడియేన్ దాసన్' అంటే నీ దాసుని దాసుడను నేను' అని దేవుడిని పూజిస్తారు. వీరశైవ ధర్మంలో శివ శరణుడు శివునికంటె గొప్పవాడు అనే భావన ఉంది. అందుకే బసవణ్ణగారు తాము శివశరణుల వాకిలి కాపలాదారుడనౌతానని అంటారు. ఈ భావం శివ శరణులందరిలోను మనకు కన్పిస్తుంది. ఇక పురందరదాసుల వారు 'హువ్వ తరువర మనెగె హుల్లతరువ' అని అంటారు. ఈయన తనను తాను దాసులకు దాసుడనని ఘోషించి చెప్పాడు. నరసింహ శతకకారుడు శేషప్ప కవి కూడా యిదేవిధంగా చెప్పాడు.

ఈ భక్తిపంథా ప్రాచుర్యానికి వచ్చిన తరువాత దేవాలయ ప్రాంగణాల్లో భక్తులు తమ ప్రతిరూపాల్ని రాతిమీద చెక్కించుకునేవాళ్ళు అంటే- ఇది తమ గొప్పతనాన్ని చాటుకోవడానికిమాత్రం కాదు. ఆ దేవాలయానికి వచ్చే భక్తుల పాదధూళి తమ దేహంమీద పడి తమ జీవితాలు ధన్యమౌతాయనే భావంతోనే యిట్లాంటి రేఖాచిత్రాల కింద ఫలానా అని, దండం సమర్పించుకొంటున్నట్టు రెండు మూడు పంక్తుల్లో చెక్కించేవారు. ఇట్లాంటి శాసనాలు అనేక పుణ్య క్షేత్రాల్లోని దేవాలయాల్లో మనకు కన్పిస్తాయి. తిరుమలపై శ్రీ వెంకటేశ్వర స్వామి దేవాలయ ప్రాంగణంలో కన్పించే కృష్ణదేవరాయలు, చిన్నాదేవి, తిరుమల దేవుల విగ్రహాలను మనం జ్ఞాపకం చేసుకోవచ్చు. ఇలాంటి లబ్ధప్రతిష్ఠులైన వ్యక్తులు, తాము కట్టించిన దేవాలయ స్తంభాలపైన నమస్కారం చేస్తున్న భంగిమలో శిల్పం చెక్కించుకొనేవారు. ఇందుకు నిదర్శనాలుగా లేపాక్షిలోని విరూపణ్ణ, అహోబిలంలోని నరసింహస్వామి దేవాలయంలోని తొండమాన్‌రాజు మొదలైనవారిని పేర్కొనవచ్చు. ఈ నేపథ్యంలో ప్రస్తుత రాయలసీమ తెలుగు శాసనాలను చూచినపుడు, వీటిలో ఉక్తమైన వ్యక్తులు సామాన్య ప్రజలైన మహా భక్తులు. వీరు దేవాలయాల్ని నిర్మించిన దాతలుగారు. అయితే, వీరంతా యే దేవాలయంలో ఆ శాసనం ఉందో ఆ దేవుణ్ణే తమ కులదైవంగా కొలిచి తనివితీరని మహామహులు.

కడప జిల్లా కన్యేశ్వరం గ్రామానికి దగ్గర్లో చెయ్యేరు నది వద్ద క్రీ.శ. 8వ శతాబ్దికి చెందిన ఒక శాసనం మెట్లపైనే వుంది.99

ఇదే జిల్లా లంకమల్లేశ్వర గ్రామంలో ఒక దేవాలయంవద్ద ఒక పెద్ద రాతిపై ఒక చిన్న శాసనం ఉంది.100

కడప జిల్లా మొయిళ్ళకాల్వ గ్రామం వేంకటేశ్వర దేవాలయంలోని శాసనాలు యిలాగే క్లుప్తంగా వున్నాయి. ఇవి క్రీ.శ. 18 వ శతాబ్దికి చెందినవి 101

ఇదే ప్రదేశంలో యింకొక శాసనం ఉంది. నిత్య సేవగా చెక్కింపబడిన ఈ శాసనాలు ఒకే వాక్యంగా ఉన్నవి 102 ఇట్లాంటి శాసనాలు కడప జిల్లాలో అనేకం ఉన్నాయి.

ఇట్లా వారి వారి పేర్ల చివరల్లో సేవ అనీ, సాష్టాంగ నమస్కారములు అనీ, దండములు అనీ చెపుతూ చెక్కించేవారు. ఈ సేవలు భక్తాదులకు పుణ్యం కల్గించడమేకాక, జన్మరాహిత్యం (మోక్షం) కూడా కల్గిస్తాయని ఆనాటివారి విశ్వాసం. ఇప్పటివారుకూడా ప్రధాన ద్వారాలు నిర్మించడం, రకరకాల దానాలు యివ్వడం, నీటి సౌకర్యాన్ని చేయడం, మెట్లు, గదులు, కల్యాణ మంటపాలు మొదలైనవి నిర్మించడం ద్వారా తమ భక్తి ప్రపత్తుల్ని వెల్లడించు కుంటున్నారు. ఇవన్నీ భక్తుల భక్తిపంథాకు గీటురాళ్ళు.

## 'ఆత్మబలి'కి సంబంధించిన శాసనాలు :

అనేక ప్రాచీన సంప్రదాయాల్లో 'ఆత్మబలి' కూడ ఒకటి. ఏదో ఒక ధ్యేయాన్ని దృష్టిలో ఉంచుకొని వ్యక్తి తన్ను తాను బలి చేసుకోవడం జరుగు తుంది. దీనివల్ల ప్రాణాన్ని పోగొట్టుకున్న ఆ వ్యక్తికి ఏ విధమైన ప్రయోజనం కల్గుతుందనే ప్రశ్న ఉత్పన్నం కావచ్చు. ధ్యేయం లేకుండా గుడ్డిగా ఎవరూ ఏ పనీ చేయరు లక్ష్యంలేని కార్యం నిర్లక్ష్యానికి గురి ఔతుంది. నిర్లక్ష్యం అనాద రింపబడుతుంది. గౌరవహానికి మూలమవుతుంది. ఇట్లాకాకుండా వుండడానికే పూర్వకాలం నుండి ఉన్న ఆత్మబలి ఇప్పటికీ అక్కడక్కడ కొనసాగుతూనే ఉంది.

మోక్షంపై ఉండే ఆపేక్ష, స్వామిభక్తి, సాహసం - ఇవన్నీ ఆత్మబలి దానానికి ప్రేరణలు, ప్రాణమంటే ప్రతివాడికీ తీపి అయినా, ప్రాణాన్ని తృణ మాత్రంగా త్యజించడంలో చూపే సాహసం నిజంగా అద్భుత విషయం. ఇట్లాంటి త్యాగాలు గౌరవహేతువులు కూడా!

"ఆత్మహింసనం తాంత్రిక పూజారూపాల్లో ఒకటనీ, దైవప్రీతికై స్త్రీ పురుషులు ఆత్మహత్యలు చేసుకొనే గుడి (చంపుడు గుడి) ఒకటి వున్నట్లు 'సింహాసన ద్వాత్రింశిక'లో కొఱవి గోపరాజు వ్రాశాడు. అష్టదిశల్లోని ఎనమండు గురు భైరవులకు తన ఎనిమిది శరీరాంగాలను కోసి రక్తతర్పణం చేసి, చివరన తల నరుక్కున్న ఆరాధకులను ఆయన పేర్కొన్నాడు. శ్రీశైలంలో ఒక భక్తుడు వీరమండపం కట్టించేడనీ, దానిలో ఎందరో వీరులు నాలుకలు కోసుకొని సాయుజ్యం పొందేరనీ ఒక శిలాశాసనం తెలుపుతూంది."103

## ధార్మిక దేహత్యాగం ఆత్మబలి :

ఆత్మహత్య మహాపాపం అని భారతీయుల అభిప్రాయం. అందువల్లనే ఇది ప్రభుత్వంచే నిషేధింపబడుతూ వస్తూంది పురాణాలు, శాస్త్రాలు మాత్రం దేహ త్యాగాన్ని, ఆత్మబలిదానాన్ని అంగీకరించాయి. బ్రహ్మహత్య (బ్రాహ్మణ హత్య), సురాపానం మొదలైన పాతకాల్ని చేసినవారు ప్రాయశ్చిత్తంగా ఆత్మ హత్య చేసుకోవచ్చు. వానప్రస్థాశ్రమంలో వుండేవారు ఒకవేళ తీర్థయాత్రా కాలంలో భయంకర వ్యాధితో పీడింపబడిగానీ, మరేవిధంగా గానీ తమ నిత్య కర్మానుష్ఠానంలో అసమర్థులైతే దేహత్యాగాన్ని చేయవచ్చు. వృద్ధుడూ, దీర్ఘరోగి అయిన వ్యక్తి కర్మలను చేయలేనట్టి దుర్బలుడైతే ఎత్తైన ప్రదేశం నుండి దూకడం, అగ్నిప్రవేశం చేయడం, ఉపవసించడం, తీర్థయాత్రలకు వెళ్ళడంద్వారాగానీ, ప్రయాగలోని వటవృక్షంనుంచి దూకిగానీ దేహత్యాగం చేయవచ్చు. గృహస్తుడు ఆరోగ్యంగా ఉండికూడా, తన జీవిత కార్యాలన్నీ పూర్తయిపాయనే భావన వస్తే, లౌకిక భోగాలపై వైముఖ్యం పొందినపుడు, వేదాంతిగా జీవితం నశ్వరం అని భావించినప్పుడు బహిరంగంగా దేహత్యాగాన్ని చేయవచ్చు. ధార్మిక దేహత్యాగం (Religious Suicide) అంటే మోక్షాపేక్షగా ఆత్మహత్యను చేసుకోవచ్చు. భర్త మరణించిన భార్య దేహత్యాగాన్ని చేయ వచ్చు.[104]

కడప జిల్లా చిన్నదాసరిపల్లిలో ఒక దేవాలయంలోని బలిపీఠంపై "బలిర్విభీషణోభీష్మః" అనే శ్లోకం రాయబడి ఉంది. నరసింహస్వామికి గొప్ప భక్తులైన బలి, విభీషణుడు, భీష్ముడు, కపిలుడు, నారదుడు, అర్జునుడు, ప్రహ్లాదుడు, అంబరీషుడు, వసువు, వాయుసుతుడు, విశ్వసేనుడు, అక్రూరుడు, సనకుడు పేర్లను స్మరించే శ్లోకం ఇది.[105]

ఇదే జిల్లాలోని పొలిగ్రామంలో చెన్నకేశవ దేవాలయంలో మాదమల్లె నాధ్వునికి పుణ్యంగాను ఆయన మేనల్లుడు పొలందలూరి పెమ్మకొండ్డయ్య కొడుకు తిమ్మన కరియ మాణిక్య రాయణి బలిపీఠం చేయించిన శాసనం ఉన్నది [106]

కర్నూలు జిల్లా శ్రీశైలంలో గంగపల్లిశెట్టి బలిపీఠం ప్రతిష్ఠింపచేసిన శాసనం ఉంది. [107]

శ్రీశైలంలోని 'కనుమూరి' అనే కొండ ప్రదేశంలో మల్లికార్జున దేవాలయ శిఖరాన్ని చూస్తూ 'హరహరశంభో మల్లికార్జున' అంటూ భక్తులు ఆ కొండ కొమ్మనుండి లోయలోనికి ఉరికిన సందర్భాలు చాలా ఉన్నాయి. దీనివల్ల మోక్షం లభిస్తుందనీ, పునర్జన్మ ఉండదని శివ భక్తుల నమ్మకం.

ఆత్మబలి, ఆత్మత్యాగం అనేవి ఒక్కొక్క కాలంలో ఒక్కొక్కరీతిగా ఉంటాయి. సమాజంలో అనేక ఉద్యమాలు సంఘటిల్లినప్పుడు ఉద్యమస్ఫూర్తిగా ఈ ఆత్మబలిదానాలు జరుగుతున్నాయి. స్త్రీలలో సహగమనం, అనుగమనం భారతదేశంలో ఒకమూల జరుగుతూనే వున్నాయి.

ఇవన్నీ మానవజాతి స్వాభిమానానికి బావుటాలైనా మానవత్వానికి మాత్రం మాయని మచ్చలు. ఇట్లాంటి నమ్మకాలు ఉన్నవాళ్లు ఈ జన్మలోనే చేయవలసినవి చేస్తూ జన్మరాహిత్యానికై జాగ్రత్తపడేవారి తెంపరితనం వెనుక యెంత సాహసం ఉందో అంత పిరికితనమూ ఉంది అని తోస్తుంది.

## నిసిధి శిలలు :

సన్యాసదీక్షలో మరణించిన వారికి స్మారకంగా, వీరులకు వీరశిలను స్థాపించినట్లు కొన్ని స్మారకశిలల్ని స్థాపిస్తూ ఉండేవారు. వీనినే నిసిధి శిలలు (నిసిధి కల్లులు) అని పిలుస్తారు. సంస్కృతంలో 'నిషీధికా,' ప్రాకృతంలో 'నిసీహియా' అనే రూపాలు వున్నాయి. ఇవి అక్కడక్కడ మండపాల్లోను, కంబాలపైన, ఊళ్ళబయలు ప్రదేశాల్లోను మనకు దర్శనమిస్తాయి. వీటిలో సామాన్యంగా సన్యాసం విషయమూ, ఆ సన్యాసాన్ని గ్రహించిన వ్యక్తి విషయమూ ఉంటాయి. జైన సాంప్రదాయానికి సంబంధించినవై ఉండే ఈ రకం శిలలు విశ్రాంతి తీసుకొనే సమాధులుగా కూడ చెప్పవచ్చు. వీరశిల, మాస్తి శిల, మహాసతి శిలలకూ ఈ నిసిధి శిలలకు చాల దగ్గర సామ్యం ఉంది. ఇవి పుణ్యక్షేత్రాలంత పవిత్రమైనవికూడ. ఆంధ్రదేశంలోని కొన్ని శాసనాల్లో వీటి ప్రసక్తి అక్కడక్కడ ఉన్నా రాయలసీమ తెలుగు శాసనాల్లో మాత్రం ఇవి లేనేలేవని చెప్పవచ్చు.

ప్రారంభకాలనుంచి యిప్పటి వరకు వెలువడిన శాసనాల్ని పరిశీలిస్తే, వాటిలో వుండే విషయమేదైనా కానీ, అవి ఒక నిర్దిష్టమైన పాత స్వరూపాన్ని కలిగివున్నట్లు తెలుస్తూంది. వాటిని క్షుణ్ణంగా పరిశీలిద్దాం:

రాజ శాసనాలను ప్రధానంగా మూడు దశలుగా విభజించవచ్చు. 1. ఉపోద్ఘాతము లేదా ప్రస్తావన, 2. విషయ ప్రకటనము, 3. ముగింపు. ఆయా కాలాల్లో, సందర్భాల్లో అనేక రాజవంశాలకు, పరిపాలకులకు సంబంధించిన శాసనాలు క్రమరీత్యా వివరింపబడి ఉన్నాయి.

భారతీయ సంప్రదాయరీత్యా యే రాతనేకానీ శుభసూచకమైన పదాలతో ప్రారంభించడం పూర్వం నుంచీ అలవాటుగా వస్తూంది. ఆ పద్ధతి యిప్పటికీ కొనసాగుతూనే వుంది. లేఖలు, ఆహ్వాన పత్రికలు, జాతకాలు, లగ్న పత్రికలు మొదలగునవి రానేముందు శ్రీ, స్వస్తి, శుభం అన్న పదాలు తప్పక వుండవలసిందే!

భారతీయ భాషల్లోని చాలా శిలా శాసనాలు స్వస్తి అనే శుభకరమైన పదంతో ప్రారంభింపబడినాయి.

ఇదివరకు తెల్పిన రాజ శాసనాల మూడు దశల్లో మొదటిదైన ఉపోద్ఘాతం (ప్రస్తావన) లో మంగళవాచకం లేదా ప్రార్థనాశ్లోకం వుంటుంది. ప్రాచీన కాలపు చాలా శాసనాల మొదట్లో 'సిద్ధం' అనే శుభవాచకం ప్రసిద్ధంగా కన్పిస్తుంది. అందుకే పూర్వకాలంలో పిల్లలకు అక్షరాభ్యాసం చేయించేటప్పుడు 'ఓం నమశ్శివాయ సిద్ధం నమః' అనే అక్షరక్రమాన్ని ఇసుకపైనో, పలకపైనో బలపంతో రాసి (రాయించి) దిద్దించేవారు. దీన్ని శైవ సంప్రదాయంగాను, అద్వైత సిద్ధాంతానికి సన్నిహితంగా వున్నట్లు చెబుతారు.

తర్వాతికాలంలో స్వస్తి, శుభమస్తు, అవిఘ్నమస్తు, ఓం అనే శబ్దాలతో రాతలు ప్రారంభించారు. ఇవి కేవలం శాసనాలవరకే పరిమితం కాకుండా, భాషాపరిణామదశలో వూపిరి పోసుకొన్న కావ్యాలు, నాటకాల ప్రారంభాల్లో కూడ చోటు చేసుకున్నాయి.

కడప జిల్లా పోరుమామిళ్ళ గ్రామం క్రీ.శ. 1369 కాలంనాటి ఒక శాసనంలో శాసన (శ్లోక) లక్షణం ఇట్లా వుండాలని పేర్కొనబడింది. ఈ శాసన పాఠం కూడ పూర్తిగా సంస్కృతంలో వుంది.

"శ్రీబీజమాదావక్తవ్యం ప్రణవేషుచపంచసు।
రుత్వాద్రిదశరుద్రేషుచ కటహాన్ వివర్జయేత్॥
మోభూమిస్త్రి గురుశ్శుభం బహులఘునోర్నసౌ విధత్తేధనం
యోవాయూర్నాది లఘుశ్చహేమదినకృత్ మధ్యేగురుర్జోర్నరుజమ్।
రోగ్నిమర్నధ్యలఘుర్భయంలఘుయుగ ప్రాక్సమీరః క్షయం
ఖంతోంతే లఘురీశతాం కృతిముఖే భోబ్జశ్శమాదౌ గురుః।
అవిసర్గాంత పూర్వార్ధమసమస్త పదాదికం।
విసర్గ సే(శే) ఖరం రమ్యం శాసన శ్లోకలక్షణం॥(107a)

శ్రీకారంతో కానీ ఓంకారంతో కానీ శ్లోకాన్ని ప్రారంభించాలి. 6, 7, 10, 11 స్థానాల్లో క, ట, హ అనే అక్షరాలు రాకూడదు.

మ - భూమి (మూడు గురువులున్న గణం) - శుభం
న - ధనం (బహు లఘువులు 3) - శుభం
య - జలం - ఆదిలఘువు - బంగారం
జ - సూర్యుడు - మధ్యగురువు - రుజ
ర - అగ్ని - మధ్యలఘువు - భయం
స - సమీరుడు - ఆదిలఘుద్వయం - క్షయం
త - ఆకారం - అంత్యలఘువు - ఈశత్వం
భ - అబ్జం - ఆదిగురువు - చంద్రుడు
శం ........................... శమము

అవిసర్గాంతమైన పూర్వార్ధము కలిగినది, అసమస్తమైన ఆదిపదము కలిగినవి, కడపట విసర్గ కలిగినది అయిన శాసన శ్లోకము రమ్యమైనది.

కడపజిల్లా బలపనూరు గ్రామంలోని ఒక శాసనంలో 'స్వస్తి జగత్రయభివందిత సురాసురాధీశ'108 ఇదే జిల్లా బండపల్లి గ్రామంలోని ఒక శాసనంలో 'స్వస్త్యనేక సమరసంగట్ట నోపలబ్ధ,109 స్వస్తి రజతక్షీరశుక్తిముక్తా ఫలకీర్తి,110 స్వస్తి శాకేశ్వాంబకబాణ'111 అని వున్నాయి. స్వస్తి చిహ్నము అక్షరరూపము దాల్చకముందు ప్రతి శాసనము 'శ్రీ' అనే అక్షరంతోనే ప్రారంభమవుతూ ఉండేది.

సుమారు 7వ శతాబ్దం కాలం నుండి 'స్వస్తిశ్రీ'తో ప్రారంభమయ్యే శాసనాలు విపులంగా లభ్యమవుతున్నాయి.

స్వస్తిశ్రీ ప్రిథ్వీవల్లభ మహారాజాధిరాజ పరమేశ్వర[112].................

స్వస్తిశ్రీ పొర్మ్ముఖరామ[113]..............................................

స్వస్తిశ్రీ చోటి మహారాజాధిరాజ[114].......................................

స్వస్తిశ్రీ రణసిత్తుమగన్డు[115]............................................

స్వస్తిశ్రీ శకవరుషంబులు[116]..............................................

స్వస్తిశ్రీ శుభశకవరుషంబులు[117]..........................................

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ[118]..............................................

స్వస్తిశ్రీ జయాభ్యుదయ[119]...............................................

ఈ స్వస్తి అనే పదం స్వస్తిక చిహ్నం ఉన్నప్పుడు మనకు కనబడదు. 8వ శతాబ్ది కాలంనుండి 'స్వస్తి' అనే పదం వాడుకలో తగ్గుతూ శాసనాల్లో నేరుగా శ్రీ, శ్రీమత్, శ్రీమన్ అనే పదాలు కన్పిస్తాయి.

శ్రీ మను (జె) త్రినేత్ర[120] అనే సంవత్సర వివరాలు తెలియని ఒక శాసనం....

శ్రీ శ్రీత్రిపురాంతక శ్రీ మహాదేవరకు అనే 12వ శతాబ్దికి చెందిన శాసనం.[121]....

శ్రీ శాలివాహన శకాబ్దాః అనే 17వ శతాబ్దికి చెందిన శాసనం[122].........

శ్రీమత్, శ్రీమన్ అనే ప్రయోగాలు శాసనానికి శుభచిహ్నంగా ఉంచుతూ రాజులకు గౌరవసూచకపదంగా కూడ ప్రయోగింపబడ్డాయి.

శ్రీమత్ వ(య్యు)ంబ మహారాజు[123]....

శ్రీమత్ అడిదం మలుంగారు[124]....

శ్రీమత్ సజ్జశిద్ద సిహాచార[125] అనే క్రీ. శ. 16వ శతాబ్దానికి చెందిన శాసనం....

శ్రీమన్మహామండలేశ్వరం[126] అనే 15వ శతాబ్దికి చెందిన శాసనం....

క్రీ.శ. 15వ శతాబ్దం నుండి 'శుభమస్తు'తో మొదలైన శాసనాలలో స్వస్తిశ్రీ రెండవ పదంగా ప్రయోగింపబడింది.

...శుభమస్తు - స్వస్తిశ్రీ[127]....
శుభంఅస్తు స్వస్తిశ్రీ విజయాభ్యుదయ[128]....
శుభమస్తు। శ్రీ నారసింహాయ నమః[129]....
శుభమస్తు శ్రీగణాధిపతయే నమః[130]....

క్రీ.శ. 15 వ శతాబ్ది కాలంనాటి కొన్ని శాసనాల్లో అవిఘ్నమస్తు అనే పదం కన్పిస్తుంది. శాసనం రాయుటకు, శాసనంలోని దానం అవిఘ్నంగా కొనసాగడానికి ఈ పదాన్ని ఆనాటివారు ప్రయోగించారని తెలుస్తూంది.

అవిఘ్నమస్తు। సుభమస్తు। సౌమ్యనా[131]....
అవిఘ్నమస్తు శ్రీవాగ్గౌరీ వరాద్యా[132]....

ఆంధ్రదేశంలో శైవ వైష్ణవ భక్తి పంథాలు అభివృద్ధి పొందిన రీతిలోనే వాటి ఛాయకూడా శాసన ప్రారంభాల్లో కన్పిస్తాయి. 'శ్రీ', 'స్వస్తిశ్రీ' వీటన్నిటి కంటే మొదలు శాసనం వేయించినవాని ప్రియదైవాన్నో, కులదైవాన్నో స్మరించిన వాక్యాలు శైవ, వైష్ణవ ధర్మాల ప్రతీకలుగా మనకు శాసనాల్లో దర్శనమిస్తాయి.

క్రీ.శ. 17,18 శతాబ్దుల్లో శ్రీగిరీశాయ నమః[133]....
శ్రీచంద్రమౌళిస్వామి, శ్రీశివాయ నమః[134]....
శ్రీగణాపతయే నమః పితరౌయస్యజగతాం పితరావపితామహే[135]........ మొదలైన శైవసంబంధ వాక్యాలున్నూ—

క్రీ.శ. 17, 18 శతాబ్దులకు చెందిన శాసనాల్లో....
శ్రీ గోపాలస్వామి [136] ....
శ్రీ లక్ష్మినారాయణాయ నమః స్వస్తిశ్రీ జయాభ్యుదయ[137] ....
శ్రీ లక్ష్మివేంకటేశ్వరస్వామికి ప్రీతిగాను స్వస్తిశ్రీ విజయాభ్యుదయ[138] .... మొదలైన వైష్ణవ సంబంధ శాసనాలు కన్పిస్తున్నాయి.

ఈ విధంగా శాసన ప్రారంభాల్లో కేవలం ఒకటి రెండు పదాల్నో, సమాస పదాన్నో మంగళవాచకంగా వాడటంతోపాటు ఆయా దైవాన్ని స్మరించడం కూడ గమనింపవచ్చు.

కొన్ని శాసనాల్లో ప్రార్థనా శ్లోకాన్ని పూర్తిగా రాయడం చూడవచ్చు. ప్రసిద్ధ గ్రంథాల్లోని ప్రార్థనా శ్లోకాలని శాసనాల్లో ఉటంకించడం కొన్ని శాసనాల్లో చూడవచ్చు. తెలుగు శాసనమైనా, మరి ఏ భాషలో రాయబడ్డ శాసనమైనా సంస్కృత శ్లోకంతో ప్రార్థించే సంప్రదాయం పాటింపబడిందని తెలుస్తుంది.

అయితే, అన్ని శాసనాల్లోను ఈ ప్రార్థనా శ్లోకాలు కన్పించటం లేదు. ప్రాఙ్నన్నయ యుగంలోని చాలా శాసనాల్లో ప్రార్థనా శ్లోకాలు లేవనే చెప్పాలి.

ప్రార్థనలవల్ల శాసనం వేయించినవారికీ, రచయితకూ శుభం కల్గడమేకాక, ఆ శాసనం పదికాలాలపాటు మనగల్గుతుందనీ, అట్లాంటి శాసనాన్ని అందరూ గౌరవిస్తారనే విశ్వాసంకూడా ఉంది. ఈ ప్రార్థన వారి వారి మత సిద్ధాంతాలను ఇష్టదైవాలను అనుసరించి చేయబడుతుండేది. ఈ స్తుతుల్లో వివిధ దేవతల్ని అలంకారికంగా వర్ణించేవారు. రాయలసీమ శాసనాల్లోని చాలా వాటిల్లో ఈ విధానం పాటింపబడింది. కొన్ని శాసనాల్లో కేవలం శైవ సంబంధమైన ప్రార్థనా శ్లోకాలు, కొన్నింటిలో కేవలం వైష్ణవాలు, కొన్నింటిలో మిశ్రమాలు ఉన్నాయి. ఆయా కాలాల్లోని ప్రజల అభిరుచులకు ప్రతిబింబాలుగా ఈ దైవస్తుతులు పేర్కొనబడి ఉన్నాయి. మిశ్రమ ప్రార్థనా శ్లోకాలు నాటి ప్రజల అద్వైత ప్రతీకలని చెప్పవచ్చు. రాయలసీమ తెలుగు శాసనాల్లోని ఈ సమైక్యతా దృక్పథం తరువాతి కావ్యరచనల్లో చాలావరకు చోటు చేసుకున్నదనటంలో అతిశయోక్తి లేదు.

కర్నూల్ జిల్లా త్రిపురాంతకంలో క్రీ.శ. 15వ శతాబ్దానికి చెందిన ఒక శాసనంలో139 'దేవః శ్రీత్రిపురాంబాయా బంధుగంధవతీతటే। కుమార శైల నిలయః పాయాద్వస్త్రిపురాంతకః' అనే శ్లోకం ఉండగా, అదే ఊళ్ళోని మరొక శాసనంలో140 'శ్రీశైల శిఖర రత్నం శ్రీమాన్ త్రిపురాంతకోవతాద్యుష్మాన్, యత్కీర్తిః కల్పవల్లీ ఫలతి చతుర్వర్గ ఫల మజాదీనాం ఆస్తి ప్రశస్తః' అని వుంది త్రిపురాంతకానికి చెందిన ఈ రెండు శాసనాలు ఆనాటి ప్రజలకుగల శైవ భక్తి ప్రపత్తులకు ప్రతిబింబాలై ఉన్నాయి. కర్నూలు జిల్లా ఆత్మకూరు సిద్ధేశ్వర స్వామి ఆలయం వద్ద ఉండే క్రీ.శ. 1505నాటి ఒక శాసనంలో 141 'శ్రీకంఠాయ సమస్తలోకజయ మూలస్తంభ రూపాయతే, క్షీరాంబోధి మహానసాయ మహిత

శ్రీవామదేవాయతే, బ్రంహ్మేంద్రాది కపాలనిశ్చల పరీక్షాదక్షరక్షాగురో। శ్రీమత్ప ర్వత మల్లికార్జున మహాదేవాయ తుభ్యం నమః। నమస్తుంగ శిరశ్చుంబి చంద్ర చామర చారవే త్రైలోక్యనగరారంభ మూలస్తంభాయ శంభవే॥' అని వుంది. ఈ శ్లోకం శివభక్తి తత్పరతకు పరాకాష్ఠ. హృద్యమైన రచన కూడ. పాల సముద్రం మహానసంగా (వంటగదిగా) కలిగిన శ్రీకంఠుడు, వామదేవుడు, శ్రీపర్వత మల్లికార్జునుడు వర్ణింపబడుతున్నాడు. చమత్కార రంజకమైన ఈ స్తుతి ఔచిత్య వంతమై ఉన్నది 'నమస్తుంగ శిరశ్చుంబి........'అనే శివస్తుతి క్రీ.శ. 13వ. శతాబ్ది నుండి రాయలసీమ శాసనాల్లో పేర్కొనబడింది. ఇది బాణుని హర్ష చరిత్ర నుండి గ్రహింపబడింది.

అనంపురం జిల్లా, తాడిపత్రి రామేశ్వర దేవాలయంలోని ఒక శాసనంలో తాడిపత్రి క్షేత్రం, రామేశ్వరస్వామి మాహాత్మ్యం—

—"యత్ర నీలగిరిస్తత్ర పెంన్నాచోత్తర వాహినీ
యత్ర రామేశ్వరో దేవస్తత్ర ముక్తి ర్నసంశయః।
రక్షాయై జగతాంభూయాద్దయాళుద్వీర దాననః
ప్రాథక్రీడా విధౌయస్య పల్వంతి పయోధయః"[142] అని వర్ణింపబడి ఉన్నాయి.

—ఇక్కడ పెన్నానది ఉత్తర వాహినిగా ప్రవహించడం, ఈ నదీ తీరంలో ఉండే రామేశ్వరాలయం మోక్షస్థానమనీ, ఇది నిస్సందేహమైన విషయ మనీ చెబుతూ శాసనకవి గణపతిని స్తుతించడం ఔచిత్యపూర్వకంగా వుంది.

కడప జిల్లా దూలంవారిపల్లెలోని ఒక శాసనంలో—

"శ్రీ వాగ్గౌరీ పరాద్యాయం పూజయంత్తి తమ్రశయే।
స్థితి సృష్ట్యాది కామ్యేషు కారణం గణనాయకం॥
పాయ్యా ద్వారాహ రూపేణ పృథ్వీ ముధృత్య సాగరాత్।
జలాత్మా పూర్ణ సస్యాంతాం యఃకరోతి హరిస్సదా
పాతువందారు మందార శ్చాష్టమూర్తి స్సదాశివః
సురాసురగురోయన్య పాదపీఠో జగత్రయం॥[143]-అని ఉంది. కాలవివ రాలు లేవు. ఇందులో లక్ష్మి, సరస్వతీ, పార్వతీ, ధవులచేత పూజింపబడు గణ నాయకుని, జగద్రక్షకుడుగ వరాహరూపము చేత భూమిని సాగరమునుండి కాపాడిన హరిని, అష్టమూర్తి అయిన శివుని స్తుతించడం విశేషం.

సామాన్యంగా తామ్ర శాసనాల్లో కన్పించే ఈ శ్లోకం కడప జిల్లా రామేశ్వరంలోని శిలాశాసనంలో కూడ కన్పిస్తుంది.

"హరేర్లీలా వరాహస్య దంష్ట్రాదండస్సపాతువః।
హేమాద్రి కలశాయత్ర ధాత్రీ చ్ఛత్రశ్రియం దధౌ॥
కళ్యాణాయాస్తు తద్ధామ ప్రత్యూహతి మిరావహం।
యద్గజోప్యగజోద్భూతం హరిణాపిచ పూజ్యతే॥" 144

ఇది క్రీ.శ. 1510 నాటి శాసనం. ఇందు బంగారుకొండను కలశంగా, శ్రీహరి లీలారూపమైన వరాహ దంష్ట్రాదండ మాహాత్మ్యాన్ని తెలుపుతూ - చీకటిని పోగొట్టే ఆ ధామం శుభాన్ని కల్గిస్తుందని అభివర్ణింపబడింది.

రెండవ దేవరాయలు కాలంనాటి తెలుగు సంస్కృత తామ్రపత్రంలో—

"పితరౌ యస్య జగతాం పితరావ పితామహ,
యోగజోవై అగజోద్భూతన్ తస్మై విఘ్నచ్ఛిదే నమః
నీరజాతవా (మాషింవా) విజాసన వల్లభం
నారదాది మునిస్తుత్యం శారదం అభివాదయే,
దంష్ట్రియా సకల ఉర్వీం ధారయున్ లీలయైవయాః
సనం పాయాదపాయేభ్యో యజ్ఞ క్రోడాకృతిర్ హరిః
నమస్తుంగ..............................శంభవే"145

అని పేర్కొనబడింది. కాల వివరాలు లేవు. ఇందు సమస్త జగత్తుకు పితరులైన పార్వతీ పరమేశ్వరులను, గణనాయకుని, సరస్వతీదేవిని స్తుతించడం జరిగింది.

ఇవి శైవ, వైష్ణవపరమైన మిశ్రమ శాసనాలు. అప్పటివారు, శాసనాలను వేయించినవారు, వైష్ణవ శైవ (హరిహర) అభేదాన్ని పాటించినట్లు తెలుస్తూంది.

కర్నూల్ జిల్లా అహోబిలం వైష్ణవులకు పవిత్ర క్షేత్రం. ఇక్కడ శ్రీ నరసింహస్వామిని గూర్చిన ప్రార్థనా శ్లోకాలతో ప్రారంభింపబడిన శాసనాలున్నాయి. క్రీ శ. 1532 వ సంవత్సరం అచ్యుతరాయలవారి కాలంనాటి శాసనంలో 146—

'యేతత్సురాసురాధీశ మౌళిశ్రేణి విరాజితం, అహోబల నృసింహ
స్య, దేవదేవస్య శాసనం। దేవశ్రేణి శిరోరత్నం దైత్యద్విప
ఘటాంకుశం, జయతు శ్రీ నారసింహ్వాస్య దేవదేవస్య శాసనం'

—అని ప్రారంభంలో ప్రార్థనాపూర్వకంగా ఉంది. ఇదే ప్రారంభ శ్లోకంగా కల్గిన చాలా శాసనాలు ఈ క్షేత్రంలో నెలకొల్పబడి ఉన్నాయి.[147]

కర్నూల్ జిల్లా వెంకటాద్రిపాళెం గ్రామంలోని చెన్నకేశవస్వామి దేవాలయం స్తంభంపై క్రి.శ. 1622 కాలంనాటి శాసనంలో ఈ విధంగా ఉంది:[148]

'శ్రీ భూమీకుచ హేమకుంభ లలిత శ్రీఖండ కస్తూరికా, కాశ్మీరాంకిత
బాహుమధ్య విలసచ్ఛృంగార హారావళిః కళ్యాణాని విభావయస్క-
రుణ యా, పాదాబ్జ సంసేవినాం, నిత్యం రాజతి వెంకటాద్రి నగరే
శ్రీ చంనరాయో హరిః'

చన్నరాయుడైన హరి ఇక్కడ శృంగార రసపూర్వకంగా స్తుతింపబడుతున్నాడు.

వైష్ణవ సిద్ధాంతపరమైన ఈ శాసనాలు అప్పటి ప్రజలకున్న విష్ణుభక్తి పారమ్యాన్ని చెప్పకయే చెబుతున్నాయి. ఒక దేవుని అనేకమంది దేవతలు స్తుతించడంలో ఉపమేయ, ఉపమాన, విశేషణాదులతో అలంకారికమైన వీటి శైలి కావ్య శోభలతో అలరారుతున్నది. 'నమస్తుంగ....' వంటి శివస్తోత్ర సంబంధమైన శ్లోకాదులు శైవ సిద్ధాంతపరంగా చెప్పబడి ఉన్నా, 'ఏతత్సురాసురాధీశ' వంటి వైష్ణవ సంబంధమైన ప్రార్థనా శ్లోకాలు విరివిగా రాయబడివున్నా - ఈ రెండింటి భావ సమన్వయ సమ్మిశ్రిత శ్లోకాలు ఆనాటివారి భావ పరిణతికీ, సమైక్యతకీ, మతసహనానికీ అద్దం పడుతున్నాయి.

ప్రార్థనా శ్లోకాలూ, పద్యాలూ కేవలం శాసనాల వరకే పరిమితం కాకుండా కావ్యాల్లో, కావ్యాదిలో, ఆశ్వాసాల ప్రారంభాల్లో కూడా చోటు చేసుకున్నాయి. ఆదికవి నన్నయ కాలానికి తెలుగు శాసనాలకు, వాటి రచనకు ఒక పరిపూర్ణత సిద్ధించిందనవచ్చు. ప్రాఙ్నన్నయ కాలంలో వుండిన శాసన ప్రారంభ విధానానికి నన్నయ కాలంలో రచింపబడ్డ శాసన విధానానికీ అటు

తర్వాతికాలానికి భేదాలు ఉండటం సహజమే! ఎందుకంటే, నన్నయగారితో ప్రారంభమైన తెలుగు కావ్యత్వ శైలి కేవలం పద్యాల్లో, శ్లోకాల్లో మాత్రమేకాక వచనాల్లో కూడా దోబూచులాడింది.

నన్నయ తన తెలుగు భారతాన్ని—

'శ్రీవాణీ గిరిజాశ్చిరాయ దధతో వక్షో ముఖాఙ్గేషుయే,
లోకానాం స్థితి మావహ న్త్య విహితం స్త్రీపుంస యోగోద్భవాం,
తేవేదత్రయ మూర్తయ స్త్రిపురుషాస్సంపూజితా వస్సురై,
ర్భూయాసుః పురుషో త్తమామ్బుజభవః శ్రీకన్ధరాశ్శ్రేయసే'

అని ప్రారంభించాడు.

తిక్కనగారు తన విరాటపర్వ ప్రారంభంలో—

'శ్రీయన గౌరి నాబరగు చెల్వకు చిత్తము పల్లవింప, భ
ద్రాయిత మూర్తియై హరి హరంబగు రూపము దాల్చి 'విష్ణు రూ
పాయ నమశ్శివాయ' యని పల్కెడు భక్త జనంబు వైదిక
ధ్యాయిత కిచ్చమెచ్చు పరతత్త్వముగొల్చెద నిష్టసిద్ధికిన్'

—అని హరహరాభేదమైన మూర్తిని ధ్యానిస్తూ వర్ణించాడు. ఈ తత్వం తరువాతి కవులకు మార్గదర్శకమై, పరమత సహనాన్ని కల్గించడం మాత్రమే కాక, సమాజంలో ఉండే మత మౌఢ్యానికి చురక లేసింది. ఒకే మతానికి, సిద్ధాంతానికి పరిమితమై సంకుచిత మనస్కులైన కొందరికి ఈ విశాల దృక్పథం, విశ్వజనీనమై దారిదీపమైందని చెప్పవచ్చు.

## శాసనాల్లోని కాలం - దాని ప్రాధాన్యత :

"సర్వం కాలాధీనం" అన్నది ఆర్యోక్తి. కాలానికుండే విలువ దేనికి లేదు. పౌరాణికంగా, వేద సంబంధంగా, చారిత్రకంగా కాల విభజన చేయడం ప్రాచీన సంప్రదాయం. కవి, కావ్యం, రాజు, రాజ్యాల పరిపాలనలు- వీటి ఆధారంగా లెక్క కట్టటం ఒక పద్ధతి. శాసనాల్లో శాలివాహన శకం, విక్రమ శకం మొదలైనవి పేర్కొనబడ్డాయి. దక్షిణ భారత దేశంలో శాలివాహన శకానికే ప్రాచుర్య మెక్కువ. దీనివల్ల పాలకులు యెప్పటినుంచి యెప్పటివరకు

పాలించిందీ స్పష్టంగా తెలుసుకోవచ్చు. సౌర మానం, ద్వాదశరాశుల గమనం, తిథి, వార, నక్షత్రాదులను గణించి, గుణించి, పంచాంగరీత్యా లెక్కలు కట్టి సృష్ట్యాది నుంచి యుగ విభజన చేయడం భారతీయ సంప్రదాయ పండితులకు వెన్నతో పెట్టిన విద్య. దీని ప్రకారం, శాసనాల్లోనూ కేవలం సంవత్సరం పేరుకే పరిమితం కాకుండా మాస, వార, తిథులను, యోగ, కరణాలను, ముహూర్తాలను, లగ్నాలను, సంక్రమణాది విశేష విషయాలను కూడా మన ప్రాచీనులు పొందుపరిచారు. శాసనాల్లో ఇలా పొందుపరచడంవల్ల ఆనాటి వారి శాస్త్ర జ్ఞానం, చరిత్ర, సమాజ స్థితిగతులు, సంప్రదాయాలు తరువాతి తరాలు తెలుసుకొనేందుకు వీలు కల్గింది. కాల సూత్రంతో నిబంధించిన ఈ ఆణిముత్యాలు సర్వజనీనమైనవి, సార్వకాలికమైనవికూడ.

అనంతపురం జిల్లా కొర్రకోడు గ్రామంలోని గ్రామస్థుడైన చిట్రాయప్ప గారి స్వాధీనంలో వుండి, పరిశోధన నిమిత్తం పురావస్తుశాఖ, అనంతపురం వారిచే గ్రైకొనబడిన ఒక శాసనం 12 వ శతాబ్దికి చెందినదిగా పేర్కొనబడింది. ఇది అక్టోబరు 1980 భారతి మాసపత్రికలో ప్రకటింపబడింది. కడప జిల్లా, కమలాపురం తాలూకా పెద్దనపాడు గ్రామంలోని క్రీ. శ. 15 వ శతాబ్దికి చెందిన ఒక శాసనంలో తిథి, వార, నక్షత్రాదులు చక్కగా పొందుపరచబడినాయి.[149] ఇదే జిల్లా గడికోట గ్రామంలోని శాసనంలో ఒక కాలువను ఔరంగజేబు దేశాన్ని పాలించే కాలంలో ఒక సోమగ్రహణ పుణ్య కాలంలో స్థానిక ఫౌజుదారు ఇనాత్ ఖాను పునర్నిర్మించినట్లు పేర్కొనబడింది. దీన్నిబట్టి ఆ కాలంలోని యే మతస్థులైనా శిలా శాసనాల్ని హిందూ సంప్రదాయ పరిధిలోనే రాయించేవారని తెలుస్తూంది.[150] ఇది క్రీ. శ. 1696 వ సంవత్సరానికి చెందిన శాసనం.

చిత్తూరు జిల్లా తిరుమల దేవస్థానం లోపలిగోపురంవద్ద ఉండే శాసనంలో తిథి వార నక్షత్రాదులు పేర్కొనబడ్డాయి.[151] ఇది క్రీ.శ. 1359 వ సంవత్సరానికి చెందిన శాసనం.

కడపజిల్లా దిగువ కలపటాల గ్రామంలోని ఒక శాసనంలో పంచాంగాల్లో రాసే రీతిలో సృష్టిగతాబ్దాః, కలియుగ గతాబ్దాః అనే వివరణలు శాస్త్రోక్తంగా వ్రాయబడ్డాయి.[152] ఇది క్రీ.శ. 1403 కాలంనాటి శాసనం. కొన్ని శాసనాల్లో అసలు కాలవివరణలే పేర్కొనబడలేదు. కొన్ని వాటిల్లో కేవలం తెలుగు సంవత్సరం మాత్రం పేర్కొనబడింది.

ఒక రాజు పరిపాలనాకాలాన్ని దివ్య సంవత్సరాలుగా, వారి దానాది విశేషాలను వివరిస్తూ, కర్నూలు జిల్లా మార్కాపురం తాలూకా త్రిపురాంతకం శాసనాలు[153] తెలియజేస్తున్నాయి. ఇవి క్రీ.శ. 12వ శతాబ్ది ప్రారంభకాలం శాసనాలు.

కడప జిల్లా, జమ్మలమడుగు తాలూకా బుక్కపట్నం గ్రామంలో పాంచాల పురుషులైన తాతాచార్యుల సంతతి అప్పలాచార్యుల వద్దనున్న క్రీ. శ. 1644 కాలంనాటి (కాగితం) దానపత్రంలో[154] 'జయతిథి' అని పేర్కొనబడింది. హైందవ సాంప్రదాయంలో తిథి, వార, నక్షత్రాదులకు విశేష ప్రాధాన్యం ఉంది. శుక్లపక్షంలో వచ్చే తదియ, అష్టమి, త్రయోదశి తిథులకు జయ తిథులు అని పెద్దలు పేర్కొన్నారు. ఈ శాసనంలో శుద్ధ అష్టమి జయతిథిగా పేర్కొనబడింది.

కడప జిల్లా సిద్ధవటం గ్రామంలోని ఒక సంస్కృత శ్లోక శాసనంలో చమత్కార పూర్వకమైన సంకేత సంవత్సరం - 'శాకేऽశ్వాంబక బాణభూ పరిమితే వర్షేచ విశ్వావసౌ[155]. ......శాలివాహన నామ శకవరుషములు వేయినే నూటయిరువది యేడు చనిన విశ్వావసు వసంగ వెలయు వత్సరమున[156]...........' సంస్కృతంలో చెప్పబడిన అంశం పద్యరూపంలో తెలుగులో వివరించబడింది. పై శ్లోకంలో శక సంవత్సరం, అశ్వ- సప్త సంఖ్యకాగా, అంబకములు- రెండు, బాణ - ఐదు, భూ - ఒకటి సంకేతాలుగా ఉండే ఈ పాదాన్ని తిరగవేసి చదివితే 1527 ఔతుంది. ఇది చమత్కార జనకమైన కాలాన్ని తెల్పే శాసన ప్రారంభం. ఇట్లాంటి శాసనాలు మనకు అక్కడక్కడ దర్శనమిస్తాయి. నిర్దుష్టత, కాలపరిభ్రమణంలోని పరివక్వత, పరిణతి కాలసూత్రంలో బంధింపబడ్డ ఈ శాసనాలు సంస్కృతిచిహ్నాలుగా ప్రస్ఫుటిస్తున్నాయి.

## శాసనాన్ని ప్రకటించిన స్థలం :

శాసనాలు సామాన్యంగా రాజధాని నుండి జారీ చేయబడతాయి. ఇట్లాంటి సమయాల్లో ప్రత్యేకంగా స్థలాన్ని గూర్చిన ప్రసక్తి ఉండదు. రాజులు పర్యటనలు చేసినప్పుడు, పరిపాలనా సంబంధమైన పర్యవేక్షణలకు వెళ్ళినప్పుడు ఆయా స్థలాల పేర్లు శాసనాల్లో పేర్కొనబడతాయి. పుణ్యక్షేత్ర దర్శనాలకు

వెళ్ళినపుడు కానుకలు, దానాలు యిచ్చిన సందర్భాలను పురస్కరించుకొని అప్పటికప్పుడు శాసనాలను జారీ చేయడంకూడా సంప్రదాయంగా ఉంది. దాత పేరు, దానస్థలం కొన్ని శాసనాల్లో ముందు వెనుకలుగా ఉండవచ్చు, దాతపేరు తర్వాతనే దానగ్రహీత పేరు ఉంటుంది.

క్రీ శ. 14 వ శతాబ్దికి చెందిన చిలమకూరు (కడప జిల్లా) లోని ఒక శాసనంలో దాత, గ్రహీతల తర్వాతనే దానస్థలం వివరించబడి ఉంది.[157] చాలా శాసనాల్లో ఇలాగే వుంది.

## దాత ప్రశస్తి :

మొట్టమొదటి శాసనాల్లో కేవలం దాతపేరు మాత్రమే ఉండేది వంశం, తండ్రి, తాతల పేర్లు కూడా కొన్నిచోట్ల చెప్పబడినాయి. రానురాను ఈ సంప్రదాయం వంశవృక్షం. ప్రశస్తులు, బిరుదావళి, విశేషణాదులతోపాటు దాతల పేర్లు వివరించబడినాయి. దాతయొక్క ధర్మం, సత్యసంధత, త్యాగశీలత, సాహసాది విశేషగుణావళితో కూర్చబడిన ఈ భాగాన్ని ప్రశస్తి అనడం సమంజసం. శాసనాల్లో చాలాచోట్ల శాసనంలోని అసలు విషయంకంటే, ప్రశస్తి భాగమే యెక్కువ వుండటం కూడా గమనించవలసిన అంశం.

క్రీ.శ. 8 వ శతాబ్దంనాటి కడప జిల్లా కన్యేశ్వరం గ్రామ శాసనంలో "శ్రీ అరువత్రిపురణసింగంబు" అని చెక్కబడింది.[158] అరువ అనేవాడు మూడు లోకాలకు సింహంవంటివాడు అని దీని అర్థం. కర్నూలు జిల్లా త్రిపురాంతకం లోని అనేక శాసనాలు [159] అనేక విశేషణాలతో కూడివున్న ప్రశస్తి శాసనాలు.

## దాత బిరుదులు :

బిరుదు అనేది ఒక వ్యక్తి ప్రతిభా సామర్థ్యాలకు గీటురాయి అనవచ్చు. బిరుదు అంటే సామర్థ్య చిహ్నంగా ఇచ్చే మారుపేరు అని నిఘంటుకారుడు చెప్పిన అర్థం. అసలు పేరుకు ముందు ఉండే విశేషణాలతోకూడిన పారిభాషిక పదంగా చెప్పవచ్చు. ఇట్లాంటిది ఒకటి లేక అనేకంగాకూడా వుండవచ్చు. ఆ వ్యక్తికున్న కీర్తి ప్రతిష్ఠల్నిబట్టి ఆనాటి ప్రభుత లేదా సమాజం ప్రశంసా పూర్వకంగా యిచ్చిన ప్రత్యేక నామంగాకూడా దీన్ని పేర్కొనవచ్చు రాజులు

తాము చేసిన ఘనకార్యాలు, సాహసాలనుబట్టికూడా కీర్తింపబడి వుండవచ్చు. ఇట్లాంటి బిరుదావళి కేవలం రాజుల వరకే పరిమితం కాకుండా, కవులు, కళాకారులు, వీరులు మొదలైనవారు పొందిన సందర్భాలు కూడా వున్నాయి. వంశపారంపర్యంగాకూడా కొంతమంది బిరుదులను వారసత్వంగా పొందినవారూ ఉన్నారు. సామాన్యంగా 'రాజాధిరాజ రాజపరమేశ్వర' అనే ఈ బిరుదు వంశక్రమానుగతంగా వచ్చిందనే చెప్పవచ్చు. ప్రతి రాజునూ వందిమాగధులూ కవులూ ఈ విధంగా కీర్తించిన ఘట్టాలు కోకొల్లలు. శాసనాల్లోనూ ఇవే యెక్కువ కన్పిస్తున్నాయి. కడప జిల్లా మాలెపాడు గ్రామంలోని క్రి.శ. 8 వ శతాబ్దికి చెందిన ఒక శాసనం[160] దీన్నే పేర్కొంటూంది. ఇదే జిల్లా పెండ్లిమర్రి గ్రామానికి చెందిన క్రి.శ. 15 వ శతాబ్దికి చెందిన ఒకటవ దేవరాయల శాసనం[161] శ్రీమన్మహామండలేశ్వర రాజాధిరాజ రాజపరమేశ్వర అని పేర్కొంది. ఇట్లాంటివి శాసనాల్లో అనేకం ఉన్నాయి.

రాయలసీమలోని బిరుదుల్లో ప్రశస్తుల్లో ప్రధానంగా పేర్కొనదగ్గవి: సమధిగత పంచమహాశబ్ద, దాయగజసింహ జితరత్న, భాషెతప్పువరాయర గండ, కలికాల కులరత్న, వేశ్యాభుజంగుండు, శరణాగత వజ్రపంజర, షడ్దర్శన స్థాపనాచార్య, మూరురాయరగండ, సత్యమాంధాత, శౌచగాంగేయ, పరనారీ దూర - ఇవన్నీ ప్రాశస్త్యపూర్వకమైన బిరుదులే.

ప్రథమాంధ్ర కవి నన్నయకు ఆదికవి, వాగనుశాసనుడనీ; తిక్కనకు కవిబ్రహ్మ, ఉభయ కవి మిత్రుడనీ; ఎర్రనకు ప్రబంధ పరమేశ్వరుడు, శంభుదాసుడనీ; పోతనకు సహజ పండితుడనీ; శ్రీనాథునకు కవిసార్వభౌముడనీ; అష్టదిగ్గజ కవీశ్వరులందరికిని ఉండే బిరుదాలూ అందరికీ తెలిసి ఉన్నవే! శ్రీకృష్ణ దేవరాయలకు ఆంధ్రభోజుడనే బిరుదము సర్వజనవిదితమే! ఆధునిక యుగంలో ప్రజా ప్రభుత్వాలు యేర్పడిన తర్వాత బిరుదనామాల్లో కూడా ఆధునికీకరణం జరిగింది. నేటి మన ప్రభుత్వం, కొన్ని ప్రత్యేక రంగాల్లో కృషిచేసిన వ్యక్తులకు భారతరత్న, పద్మభూషణ వంటి బిరుదుల్నేకాక కృషిరత్న, కృషి పండిట్ వంటి బిరుదులనుకూడా ఇచ్చింది. రక్షణశాఖలో విశిష్ట సేవలందించిన సైనికులకు, అధికారులకు పరమవీరచక్ర, వీరచక్ర వంటి బిరుదులనిచ్చి సన్మానిస్తూంది. రాజకీయ, సాంస్కృతిక సంబంధమైన మార్పులు సామాజిక జాగృతికి సంకేతాలు.

దానాన్ని ప్రకటించడం, దానాన్ని గ్రహించినవారి పేర్లు తెల్పడం, దాన ఉద్దేశ్యాన్ని వివరించడం, దానమిచ్చిన ప్రదేశం ఒకవేళ గ్రామముకానీ, భూమి కానీ అయితే దానికి సరిహద్దుల్ని తెల్పడం (చెక్కుబందీల్ని పేర్కొనడం) ఉంటాయి. అయితే, ప్రతి శాసనంలోనూ ఈ వివరాలన్నీ ఉండవచ్చు, ఉండక పోవచ్చు. ఒకే క్రమపద్ధతిలో ప్రతి శాసనమూ ఉండదు. ఒక్కొక్క శాసనం ఒక్కోవిధంగా ఉంటుంది. కానుకల్ని, ఇతర వస్తువుల్ని దానంగా ఇచ్చివుంటే వాటి బరువు, కొలత, పరిమాణము, రంగు, నాణ్యతల్ని పేర్కొంటారు. ఉదాహరణకు తిరుమల - తిరుపతి దేవస్థానాల్లో శ్రీ కృష్ణదేవరాయలచే ఇవ్వబడిన వజ్రాలు, కిరీటాలు, నవరత్నాలవంటివి యిదే రీతిలో ఇవ్వబడినాయి.[162] ఈ విషయాలు 'దాన శాసనాలు' అన్న ప్రత్యేకించిన శీర్షికలో వివరింపబడినాయి.

## దాన వివరాలు :

భూమిని, లేదా అగ్రహారాన్ని దానం చేసేటప్పుడు అది యే రాజ్య విభాగానికి చెందిందీ, ఎవరి పరిపాలనలో ఉండేదీ స్పష్టంగా చెప్పబడుతుంది. భూమి వైశాల్యం, సమకాలీనమైన భూమి కొలతలు మర్తురు, పుట్టి, ఖండుగ వంటి కొలతలలో చెప్పబడి, తెలుగు అంకెలలో వివరించబడుతాయి. రేనాటి చోళుల పరిపాలనా కాలంలో "మరుతురు", మిగతా చాలావాటిల్లో ఖండుగ, పుట్టి యెక్కువగా పేర్కొనబడ్డాయి.[163] పన్నులపై, సుంకాలపై అక్కడక్కడ పాలకులు మినహాయింపులు యివ్వడం, పన్నులు కట్టలేని స్థితిలో గ్రామప్రజలు వలస వెళ్ళినప్పుడు మళ్లీ వారికి పునరావాసం కల్పించి, వెనక్కి పిలిపించి, వారి భూములను, ఇతర ఆస్తులను వారే అనుభవింపచేసుకొనే సదుపాయాల్ని కల్గించడం వంటివి జరిగేవని క్రీ.శ. 1533 వ సంవత్సరంలో విజయనగర రాజు అచ్యుతదేవరాయలకాలంనాటి అనంతపురం జిల్లా కనగానపల్లి శాసనం చెబుతూంది.[164] ఈ విషయాలు యింకా వివరంగా 'సామాజిక వ్యవస్థ' అన్న అధ్యాయంలో వివరింపబడినాయి.

గ్రహీత పేరును దాత పేరు తర్వాతనే పేర్కొంటారు. దాతలు కానీ, గ్రహీతలుకానీ ఒకరు, అంతకుమించి కూడ ఉండవచ్చు. శాసనాల్లో దాన భాగాల వివరణలు దాతల సంఖ్యనుబట్టి, గ్రహీతల సంఖ్యనుబట్టి కూడ విడివిడిగా ఉండవచ్చు. కొన్ని శాసనాల్లో ప్రత్యేకించిన స్థలనామ నిర్దేశాలు ఉండవు అట్లు

వంటప్పుడు ఆ దానం సామూహికమైనదిగా గ్రహించాలి. దానగ్రహీతల్లో చాలా భాగం బ్రాహ్మణుల పేర్లే మనకు శాసనాల్లో కన్పిస్తుంటాయి. గ్రహీత పేరు, తండ్రి, తాతల పేర్లు కూడా ఒక్కోసారి వివరంగా ఉంటాయి. సూత్ర, గోత్ర, వంశాలు కూడా పేర్కొనబడతాయి. దానగ్రహీత గుణగణాలు విశేషణాలతో కూడా పేర్కొననబడతాయి.

కడప జిల్లా చదిపిరేల (చదిపిరాళ్ళ) గ్రామంలోని ఒక శాసనం ఒక సత్రాన్ని సమస్త కులాలవారి సౌకర్యార్థం కట్టించి దానంగా ఇవ్వడం జరిగిందని తెలుపుతోంది. ఇది ఆనాటివారి పారమార్థిక చింతనకు నిదర్శనం.... 'గురుజపల్లి నరసప్పయ్యగారి కొమారుండు చంన్నయ్యగారు తమ పాలిటి స్వామి తిరువెంగళ నాథుని తిరుమల తిరునాళకు నడచపరుషకు సత్రం పెట్టేటట్టుగా చదుపరేల గ్రామంలో ధర్మసత్రం పెట్టేందుకు వైష్ణవులకు, చాత్తాద వైష్ణవులకు, బ్రాహ్మలకు మొదలైనవారికి ధర్మ సత్రానికిగాను' యిచ్చిన విలక్షణమైన సత్రపుశాసనం ఇది.[165] ఇది క్రీ.శ. 1520 సంవత్సరంనాటి శాసనం.

## దాన ఉద్దేశ్యం :

దశదానాల్లో ఒక్కొక్క దానం ఒక్కొక్క ఉద్దేశంతో కూడుకొని ఉన్నట్లు చెబుతారు. పూర్వపు పాలకులు, ధనవంతులు ఒక్కో సమయాన్ని, సందర్భాన్ని పురస్కరించుకొని ఈ దానాలు చేశారు ఇది ఈనాటికీ వుంది. దాతలు, సామాన్యంగా తమకో, తమ పితరులకో పుణ్యప్రాప్తి కల్గడానికి దానాలను చేస్తారు. ఈ విషయాలన్ని దానాల్లో సామాన్యంగా చెప్పబడి ఉంటాయి. అయితే, కొన్ని దాన శాసనాల్లో ఈ విషయాలు పేర్కొనబడి వుండవు. తమ పాలకుల పుణ్యానికి కొందరు దానం చేస్తే, దొమ్మరులు మొదలైనవారు తమ ఇరవైనాలుగు కులాలవారి పుణ్యానికిగాను దానం చేసినట్లు కొన్ని శాసనాల్లో చెప్పబడి ఉంది. అందే వ్యక్తిగతంగానూ, సమష్టిగాను కులవ్యవస్థను దృష్టిలో ఉంచుకొని వాని శ్రేయస్సుకై దానాలు చేసేవారని స్పష్టమవుతుంది.

## దానమిచ్చిన భూమి-దాని సరిహద్దులు :

భూమిని దానమిస్తే ఆ భూమియొక్క సరిహద్దులు ప్రత్యేకంగా పేర్కొనబడని శాసనాలు కూడ కొన్ని ఉన్నాయి. ఇట్లాంటి వాటిల్లో గ్రామస్థులకు బాగా

తెలిసిన భూములే అధిక సంఖ్యల్లో వుంటాయి. కొన్ని శాసనాల్లో భూమికి నాల్గు దిశల్లోను వుండే ప్రదేశాలను పేర్కొనడం గమనించవచ్చు.

కడప జిల్లా అప్పసముద్రం మొదలైన గ్రామాల్లోని అనేక శాసనాల్లో సహజ సరిహద్దులైన కాలువలు, వెలగచెట్లు, వ్యక్తుల స్వంత పొలాలు, రెడ్డి మాన్యం చేనువంటివి పేర్కొనబడ్డాయి. ఇవి క్రీ.శ. 18 వ శతాబ్ది ప్రారంభ కాలపు శాసనాలు. దానంగా ఇవ్వబడిన భూమికి నాల్గు దిక్కుల్లో నదులు, కొండలు, పెద్ద పెద్ద చెట్లు, కోనలు, తోటలు మొదలైన సహజ ప్రకృతి చిహ్నాలను హద్దులుగా పేర్కొనడం గమనార్హం. కొన్ని సందర్భాల్లో సరిహద్దు శిలా స్తంభాలకు బాణపు గుర్తులు మొదలైనవి వేయటంకూడ చూడవచ్చు. వీటి వివరాలు తరువాతి ప్రకరణాల్లో వివరింపబడ్డాయి.

## శాసనం ముగింపు :

ముగింపు భాగంలో దానాన్ని రక్షించమనీ, రక్షిస్తే కలిగే పుణ్యం శ్లోకాలు, సూక్తుల రూపాల్లో, మాటల్లో తెల్పడం చూడవచ్చు. ఇవి అనేక జిల్లాల్లోని శాసనాల్లో ఆయా మాండలిక శైలిలో మనకు కన్పిస్తాయి.

ఉదాహరణకు:—

'దానపాలన యోర్మధ్యే దానాచ్ఛ్రేయోనుపాలనం।
దానాత్స్వర్గ మవాప్నోతి। పాలనాదచ్యుతం పదం॥
స్వదత్తాం పరదత్తంవా। యోహరేతి వసుంధరా।
షష్ఠిర్వరుష సహస్రాణి విష్టాయాం జాయతేక్రిమిః
స్వదత్తా ద్విగుణం పుణ్యం పరదత్తానుపాలనం.'

దానం చేయడం, పూర్వులు చేసిన దానాన్ని అనుపాలన చేయటం అనే వాటిలో దానంకంటె అనుపాలనమే శ్రేష్ఠమైనది. దానంవల్ల స్వర్గాన్ని పొందుతాడు. అనుపాలనంవల్ల అచ్యుత పదవిని (మోక్షాన్ని) పొందుతాడు. వేయి తటాకాలు నిర్మించినా, నూరు అశ్వమేధాలు చేసినా, కోటి గోవులు దానం చేసినా భూమిని హరించినవాడు నశిస్తాడు.

"సామాన్యోయం ధర్మసేతు నృపాణాం,
కాలేకాలే పాలనీయో భవద్భిః
సర్వానేవా భావినః పార్థివేంద్రాన్
భూయోభూయో యాచతేరామచంద్రః॥"167

రాజులకు యిది సామాన్యమైన ధర్మసేతువు. తమ అందరిచేత ఆయా కాలాల్లో పాలింపబడవలసినది అని భవిష్యత్ రాజులందఁనీ రామచంద్రుడు మళ్ళీమళ్ళీ వేడుచున్నాడు.

శాసనాల్లో పేర్కొనబడుతున్న సంప్రదాయబద్ధమైన ఈ శ్లోకాల్లో ప్రాచీన కావ్యాలనుండి గ్రహించబడినవే అనేకం ఉన్నాయి.

'మద్వంశజాః పరమహీపతి వంశజావా,
యోభూమిపాః సతత ముజ్వల ధర్మచింతా
మద్ధర్మమేవ పరిపాలన మాచరంతి,
తత్పాదుకద్వయం శిరసానమామి"168

—నా వంశజులైనా, ఇతర వంశాలకు చెందినవారైనా ఉజ్వల ధర్మచిత్తులైన యే రాజులు సదా నా ధర్మాన్నే పాలిస్తారో, వారి పాదుకద్వయాన్ని నా తలపై ధరిస్తాను- అన్న వినమ్రమైన వేడికోలుకూడ కన్పిస్తుంది.

## శాపాశయాలు (ఫలశ్రుతులు) :

శాసనాన్ని పాలకుడుగానీ, మరియే వ్యక్తి కానీ రాయించి (చెక్కించి), లోకానికి వెల్లడించడంలో గల ముఖ్య ఉద్దేశం తన కాలంలోనేకాక, తన అనంతరం కూడా శాశ్వతంగా అది నెరవేర్చబడాలనీ, దానిలోని దానాది విషయాలు తు-చ తప్పక ప్రతివాడూ శిరసావహించాలనే పవిత్ర భావాలు ఉన్నట్లు స్పష్టమవుతూంది. దానకర్తృ గ్రహీతల మధ్య జరిగిన ఈ దానాన్ని రక్షించేవానికి శ్రేయస్సూ, ప్రేయస్సూ కల్గుతాయనీ; దానాన్ని, దానపాలనాన్ని నాశనం చేసేవానికి రకరకాల నరకాలు సంప్రాప్తిస్తాయనీ శాసనాల చివరల్లో పేర్కొనబడ్డాయి. ఇవి అనేక విధాలైన అశ్లీల పదజాలంతో కూడిన తిట్లు' నిందలు, శాపోక్తులు మొదలైన వాటితో కూడి ఉన్నాయి. అచ్చతెనుగులోను, గ్రామ్యభాషలోను వుండేవి కొన్నైతే, పూర్తిగా సంస్కృతంలో వుండేవి మరికొన్ని.

ఇట్లాంటి అంశాలు శాసనాల మధ్యభాగంలో వచ్చేవి బహు తక్కువ; చివర మాత్రం సామాన్యంగా పేర్కొనబడుతూ ఉంటాయి. ఇట్లా చివర పేర్కొనబడే ఈ రకమైన అంశాలను 'శాపాశయాలు' అని కానీ 'ఫలశ్రుతులు' అని కానీ అంటారు.

"ఈ ఫలశ్రుతులు కావ్యాల చివరల్లోను, స్తోత్ర పాఠాల్లోను వున్నాయి. ఇచ్చిన దానాన్ని రక్షించే విషయంలో ప్రజలు నిర్లక్ష్యం చేస్తారనే ఉద్దేశ్యంతో, శాసనాల్ని వేయించేటప్పుడు, ఈ శ్లోకాల్ని పేర్కొనే పద్ధతి ప్రారంభమై వుండాలి అనే అభిప్రాయంకంటె, తామ్ర శాసనాల్లోని స్మృతి, ధర్మశాస్త్ర, పురాణ శ్లోకాల్ని ఉదహరించే పద్ధతి శిలా శాసనాలకూ అన్వయించబడిందనే డా॥ యం. చిదానందమూర్తిగారి అభిప్రాయం చాలా సమంజసమైందని తోస్తుంది."169

భూదానంకన్నా ఉత్తమదానంలేదనీ, దత్తాపహారం కన్నా మహా పాపం లేదనీ అర్థంవచ్చే వ్యాస మహాభారత శ్లోక పరమార్థాల్ని ఇవి ప్రస్ఫుటం చేస్తున్నాయి. కొన్ని శాసనాల్లో దానాన్ని రక్షించేవారికి కలిగే పుణ్యం, సత్ఫలితాల్నీ; వక్రము చేసినవారికి ప్రాప్తించే ఘోరపాపాల్ని, నరకాల్నీ చక్కగా పేర్కొన్నారు. ఇంకా అనేక విధాలైన శాపోక్తులు వీటిల్లో చోటు చేసుకున్నాయి.

ఈ శాపాశయాలు, పైకి నిందా పూర్వకంగా కన్పించినా, వీటి వెనుక నిగూఢంగా దాగివున్న మానవ హృదయాన్నీ, సున్నిత తత్వాన్నీ పరమార్థాన్నీ తెలుసుకోవలసిన అవసరం ప్రతి వ్యక్తికీ తప్పకుండా ఉంది.

కడప జిల్లా మాలెపాడు గ్రామానికి చెందిన క్రీ.శ. 8వ శతాబ్దికి చెందిన ఒక శాసనంలో170 ___

'..........దేని సల్పినవానికి వేగుఱ్ఱుము, వేసెఱువు వేపాన్టుఱ్ఱు నిల్పిన పుణ్యంబు దీనికి వక్రంబు వచ్చువన్టు పుత్రవధ్య స్త్రీవధ్య గోవధ్య పఞ్చమహాపాతక ఞ్చేసినవానిలోకం బన్వాన్టుల'అని వుంది. అంటే ఈ దానాన్ని నిల్పిన (కాపాడిన) వానికి వేయి గుడులు, వేయి చెఱువులు మొదలైనవాటిని యేర్పర్చిన పుణ్యము; వీనికి వ్యతిరేకం చేసినవారు పుత్రవధ, స్త్రీవధ, గోవధ, పంచమహాపాతకాలు చేసినట్టివారి పాపాలు పొందుతారనే భావాలు పేర్కొనబడినాయి.

కడప జిల్లా పెద్ద ముడియం గ్రామంలోని క్రీ.శ. 8వ శతాబ్దికి చెందిన ఒక శాసనంలో 'దేవస్వంబులఞ్చంబు గొణ్ణ వాన్డు వారనాశి వ్దచ్చిన పాపంబు గొణ్ణవాన్డు'171 - అంటే దేవుని సొమ్ము లంచంగా తీసుకొన్నవారు వారణాశిలో చంపిన పాపం (హత్యాపాపం) పొందినవారు అని. అంటే- అవినీతిని ఆ కాలంలో యెంత పాపంగా తలచేవారో దీనివల్ల తెలుస్తుంది.

క్రీ శ. 13, 14 శతాబ్దులకు చెందిన అనేక శాసనాల్లో ఈ శాపాశయాలు నిందాపూర్వకంగా, కఠినంగా వుండేవని తెలుస్తుంది.

'ఇధర్మువునకు ఎవరేని లంఘనము తలంచినవారు గంగాతీరమందు తన పెద్దకొడుకు కపాలము పట్టుకొని శత్రుగ్రిహమునకు భిక్షానకుం బోయితేను, చీంపుఋకట్ట నాటువడి పదివేల కపిల గోవుల వధించిన పాతకానం బడగల వారు.'172

'ఈ ధర్మానకు ఎవ్వరు రహితం సెపిరి వారు శివద్రోహులు జింజలింగ విభూతి రుద్రాక్షకు వెలి.'173

"యీ ధర్మాన్కు యెవ్వరు విఘ్నమైరి గాడిది మోడ్ద దింన్నవారు."174

"ఇధర్మానకు యవడు తపినాను వారణాసిలోను సింద మోంద తినవాండు"175

"ఇంతపట్టు ఆచంద్రార్కం నడపంగలవార యవ్వరు తప్పక నడపిరి ఆ పుణ్యపురుషుల పాదాలు మా శిరస్సున ధరించేము ఈ ధర్మం యవ్వరు హాని తలచి నడపర్రైరి ఆ పాపకర్ములు తమ తల్లితండ్రులాను బ్రాహ్మలాను గురువులాను కాశిలోను గంగాతీరమందు చంపిన పాపాన పోంగలవారు."176

"యీ భూదానానికి యవ్వరు తప్పినను తప్పిన వానాలిని గుణ్ణింపాట్టే వానికిన్ని గొడుగు పాట్టేవానికి యిచ్చినవాండు."177

"-శునకమాంసములో సురపొశుక భక్షించిన పాపానం బోవుదురు. మాతృ సహోదరి గమనం సేసిన పాపానం బోవువారు. యీ ధర్మానకు మరిని యెవ్వరు తప్పినడిచినాను వాణిలింగమాని షొనిలికంటచూసేది.''178

15,16 శతాబ్దుల కాలాల్లో ని శాసనాల్లో ఈ విధంగా ఉన్నాయి:

"యిందుకు యేదొరలు తప్పికొన్నాను యల్లప్పనాయిని అయ్యవారి గురం పట్టేవానికి తన పెండ్లామును యిచ్చినవాండు ''179

"వొకతల్లికిన్ని ఒక తండ్రికిన్ని జెన్మించినవారు గారు అని యిచ్చిన ధర్మ శాసన పత్రం.''180

"యీ ధర్మానకు యవ్వరు తప్పినాను దేవపృథివి మహత్తుకు తపత భిక్షాపతికి తపతమగుదురు.''181

"యీ దానాన్కు గన్కు యవురె....తమయిరువై నాలుగు కులాలకు వెలి బెట్టినవాండ్లు తమ ఇళవారి గాడిది విషణాలు కుక్క మాంసమునను సుర సేవించినవారు....దేశాలకు వెలి.''182

'కాకి మావుసం శునుక మావుసం భక్షించినవారు.'183

'అందుకు ముందు వెనకలకు యెవ్వరు తప్పినాను రఘుపతి పాదాలకు తప్పినవారము.'184

'తెలుగువారు వ్యామాతం చేసినట్టైతే కాశిలో గోవును చంపిన పాపాన పోదురు. తురకలు వ్యామాతం చేసినట్టైతే మక్కాలో పందిని చంపిన పాపాన పోదురు' ఇది 18 వ శతాబ్ది కడప జిల్లాలోని శాసనం.185

'గోవులువచ్చి ఉదకము తాగక మగిడిపోయిన దోషాన పోదురు.'186

'యింతనుండి యవరుగనక తమశచేత విస్తిరాకులవెటి సేయించినాను తమ తల్లి తండ్రులను వారణాసిన చంపిన పాపానం బోయినవారు.'187

'దేవద్రవ్యం గురుద్రవ్యం విప్రద్రవ్యం తథైవచ
వుపేక్షితాని భక్షాణి కులక్షయమిదం భవేత్॥'188

దేవాలయ ద్రవ్యాన్ని, బ్రాహ్మణ ధనాన్ని ఉపేక్షిస్తే కులక్షయం కల్గుతుందని హెచ్చరిక ఇవ్వబడింది.

ఈ శాపాశయాలు శాసనాలకు ధృవతారలు. శాసనాలు వేయించడం ఒక గొప్ప కాకున్నా, వాటిని పరమ పూజ్యంగా కాపాడి,పాలించి, పదికాలాలపాటు

మనగల స్థితి కల్గించడం చాలా పవిత్రమైన, కష్టసాధ్యమైన పని. ఈ కార్యాన్ని నిర్వర్తించడంలో శాసనాలు, వాటి రచయితలు, కర్తలు నిర్విఘ్నంగా పరిపూర్తి చేశారు. వీటిద్వారా శాపాశయాలు సమకాలీన సమాజానికి స్పృహ కల్గించాయి. భవిష్యత్ సమాజాన్ని కూడా అవి శాసిస్తూ తమ అపూర్వ శాపాలతో, ఆశయాలతో చక్కని సందేశాలను ఇచ్చాయనడంలో కూడ అతిశయోక్తి యేమాత్రమూ లేదు. ఇవి మానవత్వానికి, సజీవ భారతీయ సంప్రదాయానికి పట్టుగొమ్మలు.

## సాక్షులు :

ఇప్పటి పత్రాలకు, ఒప్పందాలకు సాక్షులున్నట్లే నాడు శాసనాల చివర సాక్షుల్ని వేసేవారు. సాక్షుల సంఖ్య ఇంత అని పరిమితం లేదు. క్రయ, విక్రయ శాసనాల్లో తప్పకుండా ఈ సాక్షుల పేర్లు ఉంటాయి. లోకంలో యే విషయమైనా ప్రత్యక్ష ఋజువు లేకుంటే అది చెల్లదు. కంటితో చూచిందే నిజం అనే మాట మనకు యుగయుగాలనుండి వస్తున్న సిద్ధాంతం. ఈ సిద్ధాంతానికి స్వదస్తూరితో చేవ్రాలు చేయడం, ఎడమచేతి బొటనవ్రేలి గుర్తు వేయడం జరిగేది. అది ఇప్పటికీ జరుగుతున్నదే. క్రీ.శ. 9 వ శతాబ్దం నుండి తెలుగులో ఈ సాక్ష్యాధారాలను శాసనాల్లో వ్యక్తీకరించినట్లు తెలుస్తూంది.

ప్రత్యక్ష సాక్షులుగా పంచభూతాలు శాసనాల్లోను, కావ్యాల్లోనూ చోటు చేసుకున్నాయి. కడప జిల్లాలోని క్రీ. శ. 1473 వ సంవత్సరానికి చెందిన ఒక శాసనంలో —

'ఆదిత్య చంద్రావనిలో నలశ్చ,
ద్యౌర్భూమి రాపో హృదయం యమశ్చ
అహశ్చ రాత్రిశ్చ ఉభేచ సంధ్యే,
ధర్మశ్చ దేవా స్వహాసాక్షిణోత్ర'189

—అని ప్రకృతికి సంబంధించిన పంచభూతాలేకాక, ఉభయసంధ్యలు, రాత్రి, పగలు, ధర్మమును కూడా పేర్కొన్నారు.

కడప జిల్లా కొమ్మనూతల గ్రామంలోని క్రీ.శ. 1712 సంవత్సరమునకు చెందిన ఒక శాసనంలో 190 'యిందుకు హరిహరాదులే సాక్షులు'గా పేర్కొన

బడ్డారు. కడప జిల్లా నందలూరు గ్రామంలోని క్రీ.శ. 1433 వ సంవత్సరానికి చెందిన ఒక శాసనం[191] 'చొక్కరాజు కామనవ్రాలు వ్రాసే సాక్షుల వొప్పము' అని ఉంది సూర్యుడు, చంద్రుడు, వామనుడు మొదలైన చిహ్నాలు శాసనం మొదటనే వుండే అనేక శాసనాలు మనకు కన్పిస్తున్నాయి. అంటే సూర్యచంద్రుల సాక్షి శాసన ప్రారంభంలోనే ఉన్నదన్నమాట. సాక్షులుండే శాసనమే రానురాను పరమ ప్రమాణమైనట్లుగా తెలుస్తుంది. శాసన రక్షణకు, భద్రతకు యిది తప్పని సరి అయినట్లు తెలుస్తుంది.

## శాసనాల్లో ఒప్పం (వ్రాలు) :

శిలా, తామ్ర శాసనాల్లో శాసనాంతాల్లో సామాన్యంగా ఒప్ప అని కానీ, ఒప్పం అని కానీ, వ్రాలు అని కానీ వున్నాయి. ఆయా రాజుల ఆమోదముద్రలు ఉండే శాసనాలు కూడా ఉన్నాయి 'శ్రీ విరూపాక్ష' అన్నది విజయనగర రాజుల నామాంకితమైన సంకేతం ఇది వారి వ్రాలుగా లెక్కింపబడింది. 'చీటికి ప్రాణంబు వ్రాలు సిద్ధము సుమతీ' అన్న సుమతి శతకకారుడి సూక్తిమేరకు శాసనానికి కూడా ప్రాణం వ్రాలే!

కర్నూలు జిల్లా త్రిపురాంతకంలోని అనేక శాసనాల్లో ఈ 'వ్రాలు' పేర్కొనబడి ఉంది. 'తిక్కయ వ్రాలు పీరయ వ్రాలు, అన్నది వాటిలో ఒకటి. ఇట్లాంటివి అనేకం[192]. ఇవి క్రీ.శ. 15, 16 శతాబ్దుల శాసనాలు.

కడప జిల్లా మవుజే ఉప్పటూరికి చెందిన క్రీ.శ. 1708 వ సంవత్సరం శాసనంలో[193] 'గురువప్ప వ్రాలు, జమలారెడ్డి కరణాల చేవ్రాళ్లు' అని ఉంది.

కడప జిల్లా నంద్యాలంపేట గ్రామంలోని క్రీ శ. 18 వ శతాబ్దికి చెందిన ఒక శాసనంలో[194] 'నందూరి నీలకంఠయ చెక్కిన వ్రాలు' అని ఉంది.

కడప జిల్లా నందలూరు గ్రామంలోని ఒక శాసనంలో[195] '....కరెడ్ల నొప్పము' అని వుంది. ఇది క్రీ శ. 1433 నాటిది.

కడప జిల్లా ఒంటిమిట్ట గ్రామంలోని క్రీ.శ. 1793 వ సంవత్సరంనాటి ఒక శాసనంలో[196]....'యీ కరణాల సమ్మతిన పైగదరాజు చెంచ్చు వప్పితం శ్రీపతిరాజు రామక్రిష్ణప్ప వప్పితం....యీ రెడ్లసమ్మతిన మాదుపూరి పెదపిరారెడ్డి వప్పితం చంద్రుహయ మల్లారెడ్డి వప్పితం' అని వుంది.

అనంతపురం జిల్లా కొనకొండ్ల గ్రామంలోని క్రీ.శ. 1740 కి చెందిన ఒక శాసనంలో 197 '.... తిమ్మాజి స్వహస్తం' అని పేర్కొనబడింది.

కడప జిల్లా జిల్లేళ్ళమడక గ్రామంలో క్రీ.శ. 16 వ శతాబ్దికి చెందిన కొన్ని శాసనాల్లో 198 'శ్రీవిరూపాక్ష' అని రాయబడి ఉంది.

వ్రాలు, చేవ్రాలు, వొప్పం, వప్పితం, స్వహస్తం అన్నవి ప్రస్తుతం మనం చేసే సంతకానికి పర్యాయపదాలే! ఇవిగాక వ్రాలుకు బదులుగా రాజుల పేరిట వారివారి ఇలవేల్పుల ముద్రలు వేయడం కూడా ఒక సంప్రదాయంగా వచ్చింది. అవే శ్రీవిరూపాక్ష, శ్రీరామ, వెంకటాద్రి వంటివి.

## శాసన కవి :

శాసనాన్ని భాషతో, సాహిత్యంతో క్రమబద్ధంగా పరిపుష్టం చేయటంలో శాసన రచయిత పాత్ర చాలా కీలకమైంది. శాసన రచన ఒక కళాత్మక ప్రక్రియ. కేవలం భాషా పరిజ్ఞానమే కాకుండా శాసన కర్తల, గ్రహీతల పూర్వాపరాలు తెలిసివుండటం చాల అవసరం. శాసన ఉద్దేశాన్ని, పరమార్థాన్ని, లక్షణాన్ని సంపూర్ణంగా అవగాహన చేసుకొనగల్గిన పరిణత మనస్కుడే శాసన రచన చేయగలడు. ఇతడు శాసనానికి ప్రాణప్రతిష్ఠ చేయగల స్రష్ట.

క్రీ.శ. 1369 సం॥ చెందిన కడప జిల్లా పోరుమామిళ్ళ శాసనంలో శాసన రచయితకు ఉండవలసిన లక్షణాల్ని యిట్లా చెప్పారు:

'శ్రుతిస్మృతి పురాణేతిహాసాగమ విశారదః
దేశకాల విశేషజ్ఞః శుభవాక్ శాసనః (నం) వదేత్' 198(a)

—శాసన రచయిత శ్రుతి, స్మృతి, పురాణ, ఇతిహాస, ఆగమ విశారదుడు, దేశకాల విశేషజ్ఞుడు, శుభమనస్కుడు అయి ఉండవలెను. ఇట్లాంటి వాడే శాసనాన్ని రచించగలడు.

ఇది పూర్తిగా సంస్కృత భాషలో ఉన్న శాసనం.

"పూర్వ చాళుక్యయిగంలో రాజులొసగిన అనేక శాసనాలు బ్రాహ్మణ కవులచే రచింపబడినవే! ఆ కాలంలో భట్టదేవుడు (భట్ట గుండుడు), మాదవభట్టు, పోతనభట్టు తామ్ర శాసనములు వ్రాయుటలో నిపుణులు. రెండవ అమ్మరాజేం

ద్రుడు (క్రీ.శ. 945-970) ఇచ్చిన దాన శాసనము నన్నయ్యభట్టు రచించెను."199

'కాకతీయులనాటి శాసన రచయితలలో సత్కవులు, కవి చక్రవర్తులు, విచిత్ర కవితత్వజ్ఞులు, బాలసరస్వతులు ఉన్నారు. కొందరు శాసన రచయితలు సంస్కృతాంధ్ర భాషల్లో కావ్యాలు రచించారు. నాటి శాసన రచయితల్లో ఒకడైన నరసింహకవి శాస్త్రగ్రంథాలను, అష్టసర్గలతోనున్న కాకతీయ చరితను, దశరూపకాలను, మలయవతి అనే గద్య కావ్యాన్ని, సిద్ధోద్వాహమనే ఖండ కావ్యాన్ని రచించినట్లు శాసనాలే తెల్పుతున్నాయి. కాని, కరాళ కాలరాక్షసి గర్భంలో కలసిపోయినందువల్ల కాబోలు అవి నేడు కన్పించవు. ఆనాటి శాసన రచయిత దృష్టిలో శాసన రచన కావ్యరచన వంటిది. నన్నయ్యభట్టారకుడు నందంపూడి శాసనంలో తనను 'కావ్యానాంకర్తానన్నిభట్టః' అని పరిచయం చేసుకొన్నాడు. అప్పటికి ఇతడు రచించిన ఇతర కావ్యాలేవీ కన్పించవు. అందువల్ల నన్నయ్య తాను రచించిన శాసనాలనే కావ్యాలుగా పేర్కొన్నట్లు స్పష్టమవుతున్నది.'200

శాసనాలను కావ్యమయం చేయటంలో కవిపాత్ర చాలా ప్రధానమైనది. పద్య గద్యమయ శాసనాల్లోను, శాసన ప్రారంభ శ్లోకాల్లోను ఈ సాహితీదృష్టి కన్పిస్తుంది దైవస్తోత్రాలతో ప్రారంభింపబడిన శాసనరచన పద్య గద్యరూపాల్లో తాత్విక దృష్టిని సారించి శాపాశయాలతో పరిపూర్తి అవుతుంది.

రాయలసీమ తెలుగు శాసనాల్లో మనకు అక్కడక్కడ కొందరు శాసన కవులు తళుక్కుమని మెరుస్తున్నా మరి కొందరు అజ్ఞాతంగానే ఉండిపోయారు. కవులు శిల్పులు, శిల్పులు కవులైకూడ వుండవచ్చు. అయితే, యిట్లాంటివారు బహుతక్కువ.

కడప జిల్లా తాళ్ళపొద్దుటూరిలోని ఆరు పద్యాలున్న ఒక శాసనం అపూర్వమైన భాషాసంపన్నత, తాత్త్వికచింతన కలదిగా చెప్పవచ్చు. అయితే, ఈ శాసన కవి యెవరో తెలియదు. అది క్రీ. శ. 1322వ సంవత్సరమునకు చెందినది.201 'తన దంష్ట్రితుద........'అనే పద్యంతో ప్రారంభించి'......సురకాంతతోం బెండ్లి సేయునపుడు' అనే పాదంతో పూర్తి ఔతుంది.

—జగతాపి గంగని పరాక్రమాన్ని తెల్పే పద్యం, వీరస్వర్గం ప్రాపించిన వీరునికి అప్సరస స్త్రీలతో కల్గే సంపర్కము, వారిలో వారే వీరులకై పోటీపడే విధానాలు, ఈలోగా కులస్త్రీలు అగ్నిపథమున చేరుకొనడం, అప్పుడు అప్సరసల కోర్కెలు నిష్ఫలాలై పోవటం - ఈ చిత్రీకరణ చాలా హృద్యంగా చేశాడు కవి.

అనంతపురం జిల్లా తాడిపత్రి తాలూకా బొందలదిన్నె పొలిమేరనందున పుట్టుబండకు రాయబడిన శాసన పద్యాల్లో కవి[202]—

'శ్రీ నరసింహదేవుని.......................... బెణక కవిని' అని రాశాడు.

తెలుగు సాహిత్య క్షేత్రంలో గమక కళను గూర్చి కొంత పేర్కొంటూంది అందులోని రెండవ పద్యం! అది క్రీ. శ. 1699 వ సంవత్సరంకు చెందిన శాసనం. ఆ పద్యాల వివరణ ఒక ప్రత్యేక అధ్యాయంలో పేర్కొనబడింది.

ఇక మామూలుగా గద్యమయ, సంస్కృత భాషామయ శాసనాల్లో శాసన కవి తన భాషాప్రతిభకన్న కూర్పులోని ఔచిత్యాన్ని పాటింపవలసివస్తుంది.

శాసన కవి శాసనానికి మూలవిరాట్టు. రచనను పకడ్బందీగా చేసి, ఆద్యంతం జాగ్రత్తలు తీసుకోవడంలో కృతకృత్యుడైనప్పుడే శాసన ఉద్దేశ్యం నెరవేరుతుంది శాసనోద్దేశం స్పష్టమైనప్పుడే అది శాశ్వతత్వాన్ని సంతరించుకొంటుంది.

## శాసన శిల్పి :

శాసనాలను రూపకల్పన చేయడం, కవులచే రచింపబడిన శాసనాలను ఆయా లిపుల్లో ప్రారంభంనుండి చివరివరకు తగిన జాగ్రత్తలతో మలచడం శిల్పి పనితనానికి ఒక పెద్ద పరీక్ష! శిల్పి కవి కూడా అయ్యుంటే బాష, బావం చక్కగ సమన్వయింపబడతాయనటంలో యేమాత్రం సందేహం లేదు

శిల్పులు తమ శిల్పశాస్త్రాన్ని వంశపారంపర్యంగా నేర్వడం, రాజాస్థానాల్లో తగిన పదవుల్లో ఉండటం, నిష్ణాతులైన గురు శిష్యులు ఒకే ఆస్థానంలో కూడా ఉండటం కొన్ని సందర్భాల్లో జరుగుతుండేది.

వారి పేర్లలో చివర ఆచార్య. ఓజ అన్న పదాలుకూడా ఉండటం మన శాసనాల్లో గమనించవచ్చు కమ్మరి, కంసల, వడ్రంగి మొదలైన కులవృత్తులు కల్గినవారు విశ్వకర్మ కులానికి చెందినవారుగ లెక్కింపబడుతున్నారు. కంసాలి వాళ్లు అద్భుతమైన శాసనాలను చెక్కడం జరిగింది రాజముద్రికలను, నాణాలను రాజులు వారిద్వారా చేయించేవారు వారికి ప్రత్యేకించిన మాన్యాలు, వేతనాలు ఉండేవి. లోహనికి సంబంధించిన తామ్ర శాసనాలను కమ్మరివాళ్ళ ద్వారా తయారు చేయించేవారని తెలుస్తూంది. దారువు (చెక్క) ద్వారా రథ నిర్మాణం, ఇతర చెక్కడాలు వడ్రంగులద్వారా చేయించేవారు. శిలలపై బొమ్మలు, అక్షరాలవంటివి ఇతర శిల్పులు చేసేవారు. శిల్పశాస్త్రాన్నే కాక, ఇతర శాస్త్రాల్ని కూడా అధ్యయనం చేసిన శిల్పి ఆనాడు మహాప్రతిభావంతుడై ప్రకాశించేవాడు. శాసనాల చివరల్లో తమ పేర్లను కూడా చేర్చడం, శాసనాన్ని వేయించినవారి పేరు, సాక్షులు వగైరా అంశాలుండడం మనం చాలా శాసనాల్లో చూస్తున్నాము. అయితే, అన్ని శాసనాల్లోను ఆ నియమాలు లేవు. ఒకవేళ ఉండినా, కాలగర్భంలో, ప్రకృతిలో అవి చెరిగిపోతున్నాయి. ప్రాచీన కవుల కావ్యకర్తృత్వాల విషయంలోనూ అలాగే జరిగినట్లు తోస్తుంది.

కడప జిల్లా రామేశ్వరం గ్రామంలోని క్రీ.శ. 7వ శతాబ్దికి చెందిన ఒక శాసనంలో[203] '....విరిపటితి కమ్మటి వినియణ వ్రాసె' అని ఉన్నది . ఇంకా ఈ క్రింది శాసనాలు ఆయాకాలాల్లో మలచబడి ఉన్నట్లు తెలుస్తూంది:

కడప జిల్లా రామేశ్వరంలోని ఒక శాసనంలో '........
చాగదొర్తి బసవోజు కొడుకు చిటోజు మలిచిన శాసనం'[204] అని వుంది.

క్రీ.శ. 16, 17 శతాబ్దులకు చెందిన కడప జిల్లా కోకటం గ్రామంలోని శాసనంలో—

'ఈ శాసనం మలిచిన సంఘటూరి అక్కసాలిబయరోజ'[205] అని వుంది.

ఇదే జిల్లా కత్తెరగండ్ల గ్రామ శాసనంలో-[206]

'శ్రీమతు పోరుమామిళ వోబుళోజు పీరాబత్తుని కొడుకు ఓబుళోజు శేషిన శాసనం' అని వుంది.

ఇదే జిల్లా మిదావురంలోని క్రీ.శ. 18 వ శతాబ్దికి చెందిన శాసనంలో -
'.......శిలాక్షరంగా శిల్పి వెంకట్రాముడు'[207]అని వుంది.
ఇదే జిల్లా ములపాక గ్రామం శాసనంలో-
'మంగళ బసవోజు కొడుకు పారని నరసంనానకిలింగం'[208] అని వుంది.

ఓజ శబ్దం సామాన్యార్థంగా పేర్ల చివరల్లో ఇవ్వబడింది. ఓజ శబ్దంకు ఉపాధ్యాయ అని కూడ అర్థం ఉంది. ఇది మంగలి పేరు కాదు. చెక్కిన శిల్పిని ఓజ అనే ఆధారం మీద మంగలి అని అనుకోవడం పొరపాటు.[209]

శాసన కవి, శాసన కర్త యెన్ని పాట్లు పడినా శాసనం రాసేవాడు (శిల్పి) పూనుకోకపోతే శాసనం శాశ్వతత్వాన్ని సంతరించుకోదు. ఆ ముగ్గురూ శాసన ప్రతిష్ఠకు త్రిమూర్తులే!

## ఉపసంహారం (శాసనం ముగింపు) :

భారతీయ సాంప్రదాయం ప్రకారం, శాసన ప్రారంభంలోను, కృత్యాది లోను మంగళప్రదమైన పదాన్ని, పద్యాన్ని, శ్లోకాన్ని చేర్చడం శుభావహ మైనది. మంగళాదీని, మంగళమధ్యాని, మంగళాంతాని అనే సిద్ధాంతం అనాదిగా ఉంది. అది యే భాషకు చెందిన శాసనమైనా ఈ విధానం సామాన్యంగా పాటింపబడిందనే చెప్పాలి. శ్రీకారంతో ప్రారంభించి మంగళ మహా శ్రీశ్రీలతో ముగించినవి ఉన్నాయి. శుభం పరంపరలుగా రావాలనే ప్రగాఢమైన ఆకాంక్ష అప్పటివారికి ఉన్నట్లు దీనివల్ల తెలుస్తూంది. శాసనాల చివరల్లో శ్రీశ్రీ, మంగళమహాశ్రీలు ఆయా కాలాల్లోని శాసనాల్లో పేర్కొనబడ్డాయి.

కర్నూలు జిల్లా త్రిపురాంతకంలోని అనేక శాసనాల చివరల్లో మంగళ మహా శ్రీశ్రీ అని పేర్కొనబడింది. ఇవి అన్నీ 13, 15, 16 శతాబ్దులకు చెందినవి.[210]

శాసనాల చివరల 'శ్రీ'తో ముగింపబడినవి చిత్తూరు జిల్లా, తిరుమల మొదలైన చోట్ల ఉన్నాయి.[211] ఇవి క్రీ.శ. 16, 17 శతాబ్దులకు చెందినవి.

ఈ విధంగా శాసనాల చివర్లలో మంగళ మహాశ్రీని చేర్చి శాసనాన్ని శుభావహంగా దీద్ది తీర్చటంవల్ల శాసనం కొన్ని కాలాలపాటు చక్కగా అమలు జరగాలనే గొప్ప భావన ఆ కాలంవారికి ఉండేదని దీనివల్ల స్పష్టమవుతూంది.

## సూచికలు

1. ఈశ్వరదత్తు, కుందూరి ప్రా.చా భూ., - పు. 282
2. ఇన్స్.క.I - 159
3. తె.వి. సర్వస్వము (3 వ సం॥) - పు. 450-51
4. నాగరాజరావు,అవధానం, శీర్షిక ; రాయలసీమ పేరు పెట్టింది చిలుకూరి వారు (ఉదయం దినపత్రిక 12-11-1988, పు.2)
5. తె.వి. సర్వస్వము (3 వ సం॥) - పు. 455
6. సుబ్బారావు, ఆర్., J.A.H.R.S. XXX 6 (a) రామరాజభూషణుడు వసుచరిత్రం ప్రథమ అశ్వాసం- పు. 17 to 19
7. ఫాదర్ హెరస్, అరవీడు డైనాస్టీ I - పు. 37 & 38
8. -అదే- పు. 308-10
9. కర్నూల్ జిల్లా మాన్యుయల్, పు. 27&29
10. సుబ్బారావు, ఆర్., రాయలసీమ J.A.H.R.S. XVII 1,2,3,4 భాగాలు
11. ఈశ్వరదత్తు, కుందూరి ప్రా.చా భూ. - పు. 32.
12. ,, -అదే- - పు. 32-33
13. ,, -అదే- - పు. 33
14. ,, -అదే- - పు. 34
15. ,, -అదే- - పు. 34-35 15 (a) అదే పు. 287
16 ,, -అదే- - పు. 36-37
17. ,, -అదే- - పు. 37
18. ,, -అదే- - పు. 224
19. ,, -అదే- - పు. 39-40, 19 (a) అదే పు. 38
20. ,, -అదే- - పు. అదే.
21. ,, -అదే- - పు. 38-39
22. ,, -అదే- - పు 39

23. ఈశ్వరదత్తు, కుందూరి, ప్రా.దా.భూ. - పు 40
24. ,, - అదే - - పు. 162.
25. ,, - అదే - - పు. 163 - 64.
26. ,, - అదే - - పు. 283.
27. వెంకటరమణయ్య, నేలటూరి, క.శి.శా. వగయిరా- పు. 121.
28. ఈశ్వరదత్తు, కుందూరి, ప్రా.దా.భూ. - పు. 153 - 54.
29. ,, - అదే - - పు. 154.
30. 1) సౌ ఇం.ఇన్స్. IX : 233.
    2) - అదే - : 268.
    3) - అదే - : 273.
31. ఈశ్వరదత్తు కుందూరి, ప్రా.దా భూ. పు. 201;
    31 (a) అదే పు. 309,
32. ,, - అదే - - పు. 144.
33. ,, - అదే - - పు 71.
34. ,, - అదే - - 123 - 25.
35. నారాయణామాత్యుడు, అయ్యలరాజు, హం.విం. అ. I ప. 53.
36. సౌ.ఇం.ఇన్స్. IX, పార్టు I; 69.
37. - అదే - : 227.
38. - అదే - : 265.
39. ఎ.పి.ఇం., III, పు. 24.
40. ఈశ్వరదత్తు, కుందూరి, ప్రా.దా.భూ. - పు. 267 - 69.
40 (a) రామకృష్ణశర్మ, గడియారం
41. వెంకటరమణయ్య, నేలటూరి, క.శి.శా వగయిరా
42. ఈశ్వరదత్తు, కుందూరి, ప్రా.దా.భూ - పు. 39 - 40.
43. సౌ.ఇం ఇన్స్. X : 448
44. ఈశ్వరదత్తు, కుందూరి, ప్రా.దా.భూ. - పు. 53.
45. ,, - అదే - ద్వి భా. - పు. 91
46. ,, - అదే - ,, - పు. 31.
47. ,, - అదే - ,, - పు. 28.

47. (a) ఈశ్వరదత్తు, కుందూరి, ప్రా చా.భూ. - పు. 70.
48. ఇన్స్ క. I - 17.
49 - అదే - - 32.
50. - అదే - - 39.
51. సౌ. ఇం. ఇన్స్. X - 23
52. ఇన్స్. క. I - 31.
53. సౌ. ఇం. ఇన్స్. IV - 802.
54. - అదే - XVI - 211.
55. - అదే - VII - 334.
56. - అదే - 558.
57. వెంకటరమణయ్య, నేలటూరి, క. శి. శా. వగయిరా, - పు. 121.
58. అంచె మత్తు తెరపిన సంస్థె, మానస గంగోత్రి, మైసూరు, శాసన ప్రకారగళు - పు. 16.
59. లింగాభట్టీయ....గురుబాల ప్రబోధిక, - పు. 453.
60. వెంకటశాస్త్రి, మునునూరి, విద్యార్థి కల్పతరువు - పు. 41.
61 " - అదే - - పు. 41.
62. " - అదే - - పు. 38 & 88.
63. వెంకటరమణయ్య, నేలటూరి, క.శి.శా. వగయిరా - పు. 142-43.
64. చిదానందమూర్తి, ఎం., క. శా. సాం. అ. - పు. 39 -
— త్రిభోగ అనేది ధర్మశాస్త్రాల్లో వచ్చే పారిభాషిక పదం. మూడు తలలు మారినవారు (మూడు తరాలవారు) అనుభవించింది అని దీని అర్థం. త్రిపురుషభోగ అనేదానికి ఇదే అర్థం. చూడండి : త్రిభిరేవతు యాభుక్తా పురుషైర్భూ యథావిధి। లేఖ్యాభావేవి తాంతత్ర చతుర్థః సమవాప్నుయాత్ (హిస్టరీ ఆఫ్ ధర్మశాస్త్ర III - పు. 321)
65. చిదానందమూర్తి, ఎం., క. శా. సాం. అ., - పు. 46
66. సత్యనారాయణ, కంభంపాటి, ఆం. సం. చ. I - పు. 82.
67. ఇన్స్. క. I, - 107.
68. - అదే - II, - 291, 292.
69 వెంకటరమణయ్య, నేలటూరి, క శి శా. వగయిరా - పు. 23.

70. సౌ.ఇం ఇన్స్. X - 340.
71. ఇన్స్ క. II - - 27.
72. పెద్దన, అల్లసాని, మను చ.,(తేవప్పెరుమాళ్ళయ్య. తం. పీఠిక-పు.7).
73. ఇన్స్. క. I - 26.
74 - అదే - - 38.
75. - అదే - - 60, 61, 63.
76. - అదే - - 133.
77. - అదే - - 142.
78. - అదే - - 162.
79. - అదే - II - 13.
80. - అదే - III - 161.
81. సౌ.ఇం.ఇన్స్. X - 63.
82. వెంకటరమణయ్య, నేలటూరి, క.శి.శా. వగయిరా, - పు. 397.
83. సంపత్, యం.డి; చిత్తూర్ త్రూ ఏజెస్ - పు. 241.
84. సత్యనారాయణ, కంభంపాటి, ఆం.సం చ. II - పు. 50.
85. ,, - అదే - I - పు. 180 - 81.
86. ఇన్స్. క. I - 55.
87. - అదే - - 31.
88. - అదే - - 165.
89. - అదే - - 59.
90. సౌ.ఇం.ఇన్స్. X - 621.
91. వెంకటరమణయ్య, నేలటూరి, క.శి శా. వగయిరా, - పు. 702.
92. చిదానందమూర్తి ఎం; క.శా.సాం.అ. - పు. 249.
93. సౌ.ఇం ఇన్స్. XVI, - 370.
94. ఇన్స్ క. III, - 186.
95. -అదే- I, - 158.
96. వెంకటరమణయ్య, నేలటూరి,అన్యూయల్ రిపోర్ట్ ఆన్ ఎపిగ్రఫి-ఎ.పి. 1965.
97. ఇన్స్.క. III, - 40

98. గంగాధరం, నేదునూరి, జానపద గేయ వాఙ్మయ వ్యాసావళి, పుటలు - 130-134.
99 ఇన్స్.క. I, - 26.
100. - అదే - - 33.
101. - అదే - - 42.
102. - అదే - - 43
103 సత్యనారాయణ, కంభంపాటి, ఆం. సం. చ. II - పు. 99 100.
104. చిదానందమూర్తి, ఎం., క.శా.సాం.అ., - పు. 299-00
105. ఇన్స్.క. I - 64.
106. - అదే - - 259.
107. సుబ్బారావు, ఆర్., J.A.H.R.S. - పు. 137. (ఎం.ఇ ఆర్. 37, ఆఫ్ 1915).
107-a ఇన్ క. II, - నెం. 11.
108. ఇన్.క. I, - 48
109. - అదే - 61.
110. సౌ.ఇం.ఇన్స్. X - 202.
111. - అదే - XVI - 309.
112. అనంతపద్మనాభశాస్త్రి, చివుకుల (ఎతెయపోర్రి అంకాలమ్మ గూడూరు శాసనము) - భారతి, - పు, 60, డిసెంబరు 1982.
113. ఇన్.క. I - 15.
114. పరబ్రహ్మశాస్త్రి, జి., తెలుగు శాసనాలు, - పు. 25.
115. ఇన్స్.క. I - 36.
116. సౌ.ఇం ఇన్స్. X 164.
117. ఇన్స్.క. II - 29.
118. ఇన్స్. క. II, - 40.
119. - అదే - III - 147.
120. సౌ. ఇం. ఇన్స్. . 642
121. - అదే - 347.
122. ఇన్స్. క III - 42.

123. సౌ. ఇం. ఇన్స్. X - 636.
124. - అదే - XVI - 479.
125. - అదే - ,, - 175.
126. ఇన్స్. క. II - 42.
127. - అదే - - 136.
128. సౌ. ఇం. ఇన్స్. VI - శా.శ. 1428.
129. - అదే - XVI - 205.
130. - అదే - ,, - 82.
131. ఇన్స్. క. III - 66.
132. - అదే - II - 18.
133. - అదే - III - 161.
134. - అదే - III - 9.
135. ఎపి. ఆం. I - 3.
136. ఇన్స్. క. III - 180.
137. - అదే - - 109
138. - అదే - - 13.
139. సౌ. ఇం ఇన్స్. X - 26.
140. - అదే - - 33.
141. - అదే - XVI - 43.
142. - అదే - IV - 803.
143. ఇన్స్. క. II - 14.
144 సౌ.ఇం ఇన్స్. VI - 47.
145. ఎపి.ఆం. I - 3.
146. సౌ.ఇం.ఇన్స్. XVI - 96.
147. - అదే - ,, - 53.
- అదే - ,, - 235.
- అదే - ,, - 205.
148. - అదే - ,, - 316.
149. ఇన్స్.క. II - 40.

150. - అదే - III - 208.
151. ........తి.తి.దే. శాసనాలు - 179
152. వెంకటరమణయ్య, నేలటూరి, క.శి.శా. వగయిరా, - పు. 22, 23.
153. సౌ ఇం.ఇన్స్. X - 62.
 - అదే - ,, - 67.
 - అదే - ,, - 68.
154. వెంకటరమణయ్య, నేలటూరి, క.శి.శా. వగయిరా, - పు. 70.
155. ,, - అదే - - పు. 165.
156. సౌ.ఇం.ఇన్స్. XVI - 309.
157. ఇన్స్. క. II - 16.
158. - అదే - I - 26.
159. సౌ.ఇం.ఇన్స్. X - 63.
160. ఎపి.ఇం. XI - 35.
161. ఇన్స్.క. II - 34.
162. ........తి.తి.దే. శాసనాలు III - 32, 41, 51, 51 వగైరా.
163. ఇన్స్ క. I - 12
164. సౌ. ఇం. ఇన్స్ XVI - 106.
165. ఇన్స్. క. II - 82.
166. వెంకటరమణయ్య, నేలటూరి, క. శి. శా. వగయిరా, . పు. 219 221, - 230, 411 - 12 మొ॥
167. ,, —అదే— -పు. 175 - 76.
168. ,, —అదే— పు. 246.
169. చిరానందమూర్తి. ఎం., క. శా సాం. అ, -పు. 51.
170. ఎపి. ఇం. XI - పు 345 & ఇన్. క. I - 17 & 28.
171. ఇన్స్. క. I - 27.
172. సౌ. ఇం. ఇన్స్. - 332.
173. ఇన్స్. క. II - 13.
174. సౌ. ఇం. ఇన్స్. XVI - 37.
175. - అదే - ., - 41.

176 - అదే - ,, - 52 & 318.
177 - అదే - ,, - 78 & 207.
178. - అదే - ,, - 82.
179. - అదే - ,, - 110.
180. ఇన్స్. క. II - 178.
181. - అదే - - 213.
182. సౌ. ఇం. ఇన్స్. XVI - 197.
183. - అదే X - 203.
184. - అదే - XVI - 244.
185. వెంకటరమణయ్య, నేలటూరి, క. శి. శా. వగయిరా, - పు. 247- 48.
186. - ,, - అదే - - పు. 148.
187 సౌ. ఇం. ఇన్స్. XVI - 89.
188. ఇన్స్. క. II - 97 & సౌ. ఇం. అన్స్. XVI - 302.
189. - అదే - - 220.
190. ఇన్స్. క. III - 177.
191. సౌ. ఇం. ఇన్స్. XVI - 31.
192. - అదే - X - 241; ఇన్స్. క. II - 34, 90; సౌ. ఇం. ఇన్స్. XVI - 182.
193 వెంకటరమణయ్య, నేలటూరి, క. శి. శా. వగయిరా, - పు. 229-30.
194. ఇన్స్. క. III - 161.
195 సౌ. ఇం. ఇన్స్ XVI - 31.
196 ఇన్స్. క III - 228.
197 సౌ. ఇం. ఇన్స్. X - 777.
198. వెంకటరమణయ్య, నేలటూరి, క.శి.శా. వగయిరా, - పు. 1059, 796,- - 532 & 536 మొ॥
198(a). ఇన్స్. క. II నెం. 11
199 రామనరసింగరావు, కూరెళ్ల, పూర్వ చాళుక్యయుగంలో బ్రాహ్మణ ప్రముఖులు - - భారతి, ఏప్రిల్ 1948.
200. ఆచార్య, ఎన్. ఎల్. ఎన్., కాకతీయ శాసనాలు, - పు. 53.

201. వెంకటరమణయ్య, నేలటూరి, క. శి శా. వగయిరా, - పు. 701 - 02.
202. ,, - అదే - - పు. 680.
203. ఇన్స్. క. I - 14.
- అదే - - 12.
204. సౌ. ఇం. ఇన్స్. XVI - 47.
205 ఇన్స్ క. II - 80.
206. సౌ. ఇం. ఇన్స్. XVI - 79.
207. ఇన్స్. క. III - 106.
208. - అదే - - 36.
209. (1) ఓజ (సౌ. ఇం. ఇన్స్. III. 1) నేమ్ యాస్ ఓఝ డెసిగ్నేషన్ డిరైవ్డ్ ఫ్రమ్ ఉపాధ్యాయ, ఇం.ఎపి. గ్లాసరీ; డి. సి. సర్కార్ - పు. 222.
(2) సౌ. ఇం. ఇన్స్. XI, 102. క్రీ.శ. 1046. ఇల్లి ఓజ మత్తు ఓవజ ఎంబరూపగళు గమనార్హవాదువు - సం - ఉపాధ్యాయ - ప్రాకృ॰ ఉవజ్ఝాఅ - ఉవజ్ఝ - ఓవజ్ఝ - ఓజ (చిదానందమూర్తి, ఎం., క. శా. సాం. అ. - పు. 435).
210. సౌ. ఇం. ఇన్స్. X - 315, (ఇన్స్ క. II, - 34).
- అదే VII - 569; అదే XVI - 85 89, 82, 107 & 111 మొ॥
211. - అదే IV - 282; అదే VII - 495; అదే - 87 మొ॥

# 3. సామాజిక జీవనం

## రాజవంశాలు-వాటి పుట్టుపూర్వోత్తరాలు :

ఆంధ్రదేశాన్ని పాలించిన రాజ వంశాల్లో ప్రధానంగా ఇక్ష్వాకులు, ఆనందగోత్రులు, శాలంకాయనులు, విష్ణుకుండినులు, పల్లవులు, బాదామి చాళుక్యులు, రాష్ట్రకూటులు, కల్యాణీ చాళుక్యులు, అర్వాచీన గాంగులు మొదలైనవారు; తూర్పు చాళుక్యులు, పశ్చిమ చాళుక్యులు, చోళులు, రేనాటి చోళులు, వైదుంబులు, తూర్పుగాంగులు, కాకతీయులు, రెడ్లు, విజయనగర రాజవంశాలు (సంగమ, సాళువ, తుళువ, ఆరవీడు) మొదలైనవారున్నారు. అయితే, మౌర్యవంశానికి చెందిన అశోక చక్రవర్తి శాసనాలు ఆంధ్రదేశంలోని రాయలసీమ ప్రాంతంలోని కర్నూలు, అనంతపురం జిల్లాల్లో లభించినాయి.

ప్రస్తుత రాయలసీమ ప్రాంతమైన అనంతపురం, కర్నూలు, కడప, చిత్తూరు జిల్లాల ప్రాంతాలేకాక, పూర్వపు బళ్ళారి ప్రాంతపు చాలా భాగం విజయనగర రాజవంశాలవారు పరిపాలించారు కాబట్టి, ఈ ప్రాంతాన్ని పూర్వపు రాయలసీమ ప్రాంతంగాకూడా పరిగణించడం జరిగింది. అనంతపురం జిల్లాలోని కొంతప్రాంతం, కర్నూలు జిల్లాలోని కొంత ప్రాంతమూ పూర్వపు బళ్ళారి మండలంలో ఉండినవే. ఈ కారణంచేతనే ఆ ప్రాంతాన్నికూడ రాయలసీమ ప్రాంతంగా తెలుగు శాసన పరిధిలో చేర్చుకొనడం జరిగింది.

**మౌర్యులు :** మౌర్యులు శాతవాహనులకు పూర్వమే కొంత రాజకీయ చరిత్రను కలిగివున్నవారు. అనంతపురం జిల్లాలోని ఎర్రగుడిలోను, కర్నూలు జిల్లా పత్తికొండ తాలూకా (జొన్నగిరి) లోను దొరికిన క్రీ.పూ. 274-236 శాసనాలవలన వీరి చరిత్ర లభిస్తుంది. మౌర్యవంశానికి చెందిన అశోక శిలా శాసనాలు ఆంధ్రదేశంలోని రాయలసీమలోని అనంతపురం, కర్నూలు జిల్లా ప్రాంతాల్లో లభించడం నిజంగా గమనించదగ్గ, గణనీయమైన అంశంగా పరిగణించవచ్చు.'1

కర్నూలు జిల్లాలోని పత్తికొండ తాలూకాలోని స్వర్ణగిరి మౌర్యులకు దక్షిణాపథ రాజధానిగా ఉండేది. దానినిప్పుడు జొన్నగిరి అంటున్నారు.

**శాతవాహనులు :** 'మత్స్య, వాయుపురాణముల ప్రకారము ఆంధ్ర శాతవాహన రాజులు 29 లేక 30 మంది నాలుగు వందల ఏబది సంవత్సరములు దక్కనును పరిపాలించునట్లు తెలియుచున్నది. అనుకూలమగు సమయము లభించినపుడు మహారాష్ట్ర, మధ్యప్రదేశ్, కళింగ దేశములలోనికి వ్యాపించుటకు వారు వెనుదీయలేదు. ఆయా కాలముల రాజకీయావసరములను అనుసరించి వారు తమ రాజధానిని ధాన్యకటక, ప్రతిష్ఠాన, పాటలీపుత్రములకు మార్చుకొనుచువచ్చిరి.'[2]

"ఆంధ్రదేశ చరిత్రలో యావదాంధ్ర దేశాన్ని పాలించిన తొలిరాజులు ఆంధ్ర శాతవాహనులు. దక్షిణాపథాన్నంతా విస్తరించి ఉండిన ఆంధ్ర శాతవాహన సామ్రాజ్యంలో ఆంధ్రదేశమొక ప్రధాన భాగంగా ఉండినది. 'ఆంధ్ర' అనేది జాతినామం. 'శాతవాహన' అనేది కుటుంబ లేదా వంశనామం. శాతవాహన రాజులు భవిష్య, మత్స్య, వాయు, భాగవత, విష్ణు, బ్రహ్మాండ పురాణాలలో ఆంధ్రులనీ ఆంధ్ర సజాతీయులనీ, ఆంధ్ర భృత్యులనీ వివిధంగా పేర్కొనబడినారు. ముప్పయి మంది శాతవాహన రాజులు సుమారు 250 ఏండ్లు పాలించినట్లు పురాణాలలో చెప్పబడినా పురాణేతర వాఙ్మయం ద్వారా, శాతవాహన శాసనాల ద్వారా, నాణేలద్వారా వారిలో అయిదు లేక ఆరుగురి చరిత్ర మాత్రమే కొంత విపులంగా తెలుసుకోవడానికి వీలవుతుంది. ముప్పయి మంది శాతవాహనులు క్రీ.పూ. 174 వరకు పాలించారు. ఆంధ్ర శాతవాహన రాజ్య స్థాపకుడు శి(సి)ముకుడు లేక చిముకుడు (శ్రీముఖుడు) క్రీ.పూ. 271 - 248, కృష్ణుడు (క్రీ.పూ 248 - 230), రెండవ శాతకర్ణి (క్రీ.పూ. 184 - 128), మొదటి పులోమావి (క్రీ.పూ 43 - 19). హాలుడు (క్రీ.శ. 6 - 7), గౌతమీపుత్ర శాతకర్ణి (క్రీ.శ. 62 - 86) వాసిష్ఠీపుత్ర పులమావి (క్రీ.శ. 86 - 114), యజ్ఞశ్రీ శాతకర్ణి (క్రీ.శ. 128 - 157). ఖారవేలుడు కళింగాధిపతిగా రెండో శాతకర్ణికి (క్రీ.పూ. 184 - 128) సమకాలీనంగా కళింగదేశాన్ని పాలిస్తుండేవాడు."[3]

గౌతమీ బాలశ్రీ వేయించిన నాసిక్ శాసనంలో గౌతమీపుత్ర శాతకర్ణి ములకనాడు ప్రభువుగా చెప్పబడినాడు.[4] రాయలసీమ జిల్లాల్లో ఒకటైన కడప జిల్లాలోని కొంత ప్రాంతం ములకనాడుగా పేర్కొనబడింది. దొమ్మరి నంద్యాల, పెద్దముడియంలలో శాతవాహనులకు సంబంధించిన సీసపు నాణేలు, వారి కాలంనాటి ఇటుకలు లభించినాయి. నందలూరు ప్రాంతాల్లో శాతవాహనులకు సంబంధించిన సీసపు నాణేలు, బ్రాహ్మీలిపి శాసనం బయటపడింది.[5] అవన్నీ శాతవాహనులు ఆ ప్రాంతంలో ఉండినట్లు స్పష్టం చేస్తున్నాయి. కర్నూలు జిల్లా నందికొట్కూరు తాలూకాలో శాతన కోట వారి (శాతవాహనుల) దుర్గాల్లో ఒకటి. ఆదోని తాలూకా మేకదొన గ్రామంలో రెండవ పులమాయి శాసన మున్నది.[5(a)]

**ఇక్ష్వాకులు :** శాతవాహన వంశ రాజుల తర్వాత ఇక్ష్వాకు వంశజులు సుమారు నూరేండ్లు ఆంధ్రదేశాన్ని పరిపాలించినట్లు పురాణాలు చెపుతాయి. నాగార్జునకొండ, జగ్గయ్యపేటల్లో లభించిన బ్రాహ్మీలిపిలోని ప్రాకృత, సంస్కృత భాషా శాసనాల ఆధారాలవల్ల వారు ఆంధ్రదేశాన్ని పాలించినట్లు తెలుస్తూంది. క్రీ.శ. 3 వ శతాబ్దాంతం లేదా నాల్గవ శతాబ్దం ప్రారంభం నాటికి వారి పరిపాలన అంతమైనట్లు తెలుస్తూంది. ఇక్ష్వాకురాజైన పురుషదత్తుడు నాగార్జునకొండలో వేయించిన బ్రాహ్మీలిపిలోని ప్రాకృత శాసనంలో హిరణ్యక రాష్ట్రానికి చెందిన మహాతలవర, మహాసేనాపతి, వాసిఠీపుతకందచలికి రెమ్మణక అతని సామంతులలో ఒకనిగా చెప్పబడినాడు.[6] హిరణ్మక అనేది హిరణ్యక శబ్దానికి ప్రాకృతరూపమని శ్రీ నేలటూరి వెంకటరమణయ్యగారు అభిప్రాయపడి నారు.[7] ఇక్ష్వాకుల సైనిక వ్యవహారాలలో హిరణ్యకులు సమర్థవంతగా తమ పాత్రను నిర్వహించినట్లు తెలుస్తూంది. హిరణ్యక రాష్ట్రం రేనాటికి పర్యాయ పదం, రెమ్మణక రేనాటికి చెందినవాడు.

**పల్లవులు :-** పల్లవుల్లో క్రీ.శ. 575 వరకు తొలి పల్లవులు, ఆటు తర్వాత నవీన పల్లవులు, మహాపల్లవులు పాలించారని చరిత్ర ద్వారా తెలుస్తూంది. వీరికి సంబంధించిన శాసనాలేవీ రాయలసీమ ప్రాంతంలో లభించకపోయినా రెండవ సింహవర్మ క్రీ.శ. 5 వ శతాబ్దిలో వేయించిన శాసనాల్లో ముండరాష్ట్ర, హిరణ్య రాష్ట్రాలు వారి సామ్రాజ్యంలోని భాగాలుగా పేర్కొనబడినాయి.[8] మహాపల్లవుల్లో

చివరివాడుగా చెప్పబడుతున్న నందివర్మ క్రీ శ 485-510 ప్రాంతాల్లో తమ అధికారాన్ని స్థాపించుకున్నాడు. పల్లవ వంశానికి చెందిన కడప జిల్లా పుష్పగిరి గ్రామ శాసనం కన్నడ భాషలో చెప్పబడింది.[9] ఇదే వంశానికి చెందిన కర్నూలు జిల్లా త్రిపురంతకం శాసనం వారి పరిపాలనాపరిధిని తెల్పుతూంది.[10]

ఆనందగోత్రులు క్రీస్తు శకం మూడో శతాబ్దాంతంలో ఇక్ష్వాకు రాజ్యం అంతరించిన తర్వాత కృష్ణానది దక్షిణ తీరాన్ని పరిపాలిస్తున్న పల్లవులను తరిమి వేసి, గుంటూరు జిల్లా - దాని పరిసర ప్రాంతాల్ని పాలించారు.

బృహత్పలాయనులు ఇక్ష్వాకురాజ్యం అంతరించిన తర్వాత క్రీ.శ. నాలుగో శతాబ్దం ప్రథమపాదంలో కృష్ణానదీ ఉత్తరతీర ప్రాంతాన్ని పాలించారు.

శాలంకాయనులు శాలంకాయనసగోత్రులనీ విజయవేంగీపురాన్ని రాజధానిగా చేసికొని ఆంధ్రప్రాంతాన్ని పాలించారనీ తెలుస్తూంది.

విష్ణుకుండులు శాలంకాయనుల తర్వాత వేంగిదేశాన్ని పాలించారు. ఇక్ష్వాకుల తర్వాత వీరే ఆంధ్ర ప్రాంతంలోని అత్యధిక భూమిని పాలించారు.

క్రీ.శ. 625 ప్రాంతంలో చాళుక్యులు తీరాంధ్రదేశంలో తమ అధికారాన్ని నెలకొల్పారు. క్రీ.శ. 625 నుండి క్రీ శ. 1323 వరకు అనేక ప్రముఖ రాజ వంశాలు ఆంధ్రదేశాన్ని పాలించాయి. ఆ మధ్యకాలాన్ని పూర్వ మధ్య యుగంగా పిలిచారు. ఆ కాలంలో తెలంగాణా అధికప్రాంతం రాష్ట్రకూటుల అధికారాన్ని అంగీకరించిన వేములవాడ చాళుక్యుల ఆధీనంలో ఉండినది. బాదామి చాళుక్యుల కడప జిల్లా రామాపురం గ్రామానికి చెందిన క్రీ. శ. 8 వ శతాబ్ది శాసనం,[11] చాళుక్య వంశానికి చెందిన కడప జిల్లా సుంకేశుల శాసనం[12] వీరి వివరాలను అందజేస్తూంది.

**రేనాటి చోళులు :** తెలుగుదేశ చరిత్రలో - అందులోనూ ముఖ్యంగా రాయలసీమ ప్రాంతమైన కడప, కర్నూలు, చిత్తూరు, అనంతపురం జిల్లాల్లో రేనాటి చోళుల ప్రసక్తి అనేక శాసనాల్లో స్పష్టంగా కన్పిస్తుంది. వీరికి ఆంధ్రదేశ చరిత్రలో ఒక ప్రత్యేకస్థానం ఉంది. కడప జిల్లాలోని పులివెందుల, కమలా

పురం ప్రొద్దుటూరు, జమ్మలమడుగు తాలూకాలు; చిత్తూరు మండలంలోని మదనపల్లి, వాయల్పాడు తాలూకాలు, వీని పొరుగున ఉండే ప్రాంతాలు కలిపి ప్రాచీన శాసనాల్లో రేనాడుగా చెప్పబడింది. క్రీ.శ. 6వ శతాబ్దం వరకుగల చోళ వంశానికి చెందిన ఒక రాజవంశం యీ ప్రాంతాన్ని పాలించింది. క్రమక్రమంగా అది పొత్తపి మొదలైన ప్రాంతాలుగా విడిపోయి, ప్రాంతీయ చోళవంశాలుగా యేర్పడ్డాయి. వారి మూలవంశం రేనాటిని పాలించడంచేత వారికి రేనాటి చోళులు అనే పేరు వచ్చింది. ఈ రేనాటి రాజ్యం మొదట్లో 7000 (ఏడువేలు) గ్రామాల పరిమితిగల దేశంగా శాసనాల్లో పేర్కొనబడింది. చైనా బౌద్ధ యాత్రికుడు ఆ ప్రాంతాన్ని 'చుళియా' అని పేర్కొని వర్ణించాడు. రేనాటి చోళుల కాలం లోనే మనకు తొలి తెలుగు శాసనాలు కన్పిస్తున్నాయి.

"రేనాటి చోళుల రాజధానిని కమలాపురం తాలూకాలోని పెదచెప్పలిగా గుర్తించారు. తోకను వీపుపైన చుట్టుత్రిప్పి యెడమవైపుకు నిలుచున్న సింహం వీరి రాజలాంఛనం. రేనాటి చోళుల చరిత్ర తెలుసుకోవడానికి నాలుగు తామ్ర శాసనాలు, యాభై శిలాశాసనాలు ఆధారాలుగా ఉన్నాయి. ఈ శాసనాలనుండి కొద్దిమంది రాజుల పేర్లు తప్ప మరేమీ తెలియదు. ఈ రాజుల కాలక్రమం నిర్ణయించడం కూడా సాధ్యం కాదు. వీరు తాము కరికాల చోళ వంశమువారమని చెప్పుకొన్నారు. వీరి మూలపురుషుడు నందివర్మ. రేనాటి చోళరాజ్య స్థాపకుడు ధనంజయవర్మ (క్రీ.శ. 575 - 600 ప్రాంతం).

రేనాటి చోళులు మొదట పల్లవుల క్రింద, తరువాత బాదామి చాళుక్యుల సామంతులుగా ఉండినట్లు చెప్పడానికి అవకాశముంది. ధనంజయవర్మ నుండి మూడవతరంవాడైన పుణ్యకుమారుడు (క్రీ.శ. 625 ప్రాంతం), పల్లవ మహేంద్ర వర్మ కాలం (క్రీ.శ. 600-630)లో స్వతంత్ర ప్రతిపత్తితో రేనండు (ఏడువేల రాజ్యాన్ని) పాలించినట్లు అతని శాసనాలు సూచిస్తున్నాయి. పుణ్యకుమారుని తండ్రి పేరు మహేంద్రవిక్రముడు. రేనాటి చోళులందరిలోను పుణ్యకుమారుడు మిక్కిలి గొప్పవాడు. అతనివి రెండు తామ్ర శాసనాలు, మూడు శిలా శాసనాలు దొరికాయి. అతనికి గణ్యమానుండు, మాఱునఱిప్పిదుగు, మదముదితుణ్డు, పొర్మ్కఖరామ, పురుష శార్దూల అనే బిరుదులున్నాయి. అతని రామేశ్వర (ప్రొద్దుటూరు తాలూకా) శిలా శాసనంలో 'పృథ్వీవల్లభ' అనే విశేష బిరుదుకూడ

చెప్పబడింది. అది బాదామి చాళుక్యులు పెట్టుకొన్న విశేష బిరుదము దానినిబట్టి పుణ్యకుమారుడు తన అయిదవ పాలనాసంవత్సరం నాటికి బాదామి చాళుక్యులను ఎదిరించి, వారి బిరుదును తాను ధరించినట్లు తెలుస్తూంది. అతని భార్య పేరు వసన్తపోరి. పుణ్యకుమారుడు హిరణ్యరాష్ట్రం ఏలుతున్నట్లు ఒక శాసనం తెలుపుతూంది. హిరణ్యరాష్ట్రమంటే నెల్లూరు జిల్లాలోని ఉత్తర, పడమటి భాగాలు. పుణ్యకుమారుని మనుమడైన సత్యాదిత్యుడు రేనాడు ఏడువేలకు తోడుగ, సిద్దివేయి అంటే సిద్దవటం (ఇప్పటి సిద్దవటం తాలూకా కేంద్రం) వేయి గ్రామ పరిమిత దేశాన్నికూడా పాలించాడు. రేనాటి చోళులలో శ్రీకంఠుడు (క్రీ.శ. 850 ప్రాంతం) చివరివాడుగా కనబడతాడు. శ్రీకంఠుడు స్వతంత్రుడో, సామంతుడో తెలియదు. అతని తరువాత వైదుంబ రాజులు అను మరొక తెలుగు రాజవంశంవారు రేనాటిని ఆక్రమించుకొన్నారు.

రేనాటి చోళరాజులు తాము శంగం యుగం (క్రీ.శ. ఒకటి, రెండు, మూడు శతాబ్దాలు)లో ద్రావిడ మండలాన్ని పాలించిన కరికాలుని వంశానికి చెందినవారుగ చెప్పుకొన్నందువలన, కొందరి రాజుల పేర్లు చోళమహారాజులని ఉండడంచేత వారు కావేరీ తీరంలో ఉన్న మూల చోళవంశానికి చెందినవారని తెలుస్తుంది. వారిలో రేనాటి చోళ వంశస్థాపకుడుగ మనకు తెలిసిన ధనంజయ వర్మకు పూర్వమే వారు తెలుగుదేశానికి వలసవచ్చినట్లుంది. వారు ఏకారణంవలన ఎప్పుడు ద్రావిడదేశాన్ని వదలి అచ్చటికి వచ్చారో తెలియదు. కరికాల చోళుడను చోళ చక్రవర్తి త్రిలోచన పల్లవుడనే పల్లవరాజును జయించినట్లు కొన్ని తెలుగు దేశ శాసనాలు చెప్తున్నాయి. కాని, కరికాల చోళుడు, త్రిలోచన పల్లవుడు చరిత్రకు పూర్తిగా అందని వ్యక్తులు. అయినా, ఒక చోళరాజు ఒకానొక ప్రాచీన పల్లవరాజును జయించి తెలుగుదేశంలో వాని సంతతివారిని పాలకులుగా నిలిపినాడని అనుకోవచ్చు. ఇట్లు తెలుగుదేశంలో స్థిరపడిన ఆ చోళులు తెలుగు వారితో పూర్తిగా కలిసిపోయి, తెలుగుభాషనే మాతృభాషగా స్వీకరించారనే విషయం- వారు తమ శిలాశాసనాలను మొదటినుండి తెలుగులోనే రాయించడాన్ని బట్టి రుజువవుతుంది. వారిని గూర్చి తెల్పే మొదటి శాసనం 'ఎరికల్ ముతురాజు' అనే బిరుదు కల ధనంజయవర్మ కమలాపురం (కడప జిల్లా) తాలూకాలోని కలమళ్ళ గ్రామంలో వేయించిన శిలాశాసనం. మనకు లభ్యమవుతున్న తొలి తెలుగు శాసనం ఇది. తెలుగు భాషను రాజభాషగా, శాసన భాషగా స్వీకరించి

దానికి ఒక అధికార ప్రతిపత్తిని కల్గించి ప్రోత్సహించిన ఖ్యాతి రేనాటి చోళులకే చెందుతుంది."[13]

ఈ విషయాల ద్వారా రేనాటి చోళులకు ప్రాచీనాంధ్రదేశంలో సమున్నతమైన స్థానం వుందనీ, తెలుగు భాషా భవన నిర్మాణానికి వారే ఆద్యులని తెలిసిన మనం, వారిని తప్పక స్మరించుకోవాలి. రాయలసీమ ప్రాంతంలోని చాలా భాగం ముఖ్యంగా వారి ఏలుబడి కిందనే వుండేదని పై సమాచారంవల్ల వ్యక్తమౌతుంది.

కడప జిల్లా కలమళ్ళ గ్రామంలోని ఎరికల్ముతు రాజు ధనంజయుని రేనాణ్డు ఏళన్ అనే శాసనం,[14] అదే జిల్లా ఇందుకూరు గ్రామ శాసనం,[15] పొట్లదుర్తి,[16] గంగపేరూరు,[17] ఎర్రగుడిపాడు[18] గ్రామాల శాసనాలు రేనాటిచోళ రాజులు వేయించినవే. అవి అన్నీ క్రీ. శ. 6-7 శతాబ్దుల నాటివి. అవికాక ఆ రేనాటి రాజుల అనేక శాసనాలు కడప జిల్లాలోని వివిధ ప్రాంతాల్లో లభించి నాయి.

పూర్వ (తూర్పు) చాళుక్యులు బాదామీ చాళుక్యులనుండి విడివడినవారు. వేంగీ చాళుక్యులు కూడా వారే. వారు దాదాపు అయిదు వందల సంవత్సరాలు తీరాంధ్ర రాజ్యాన్ని పాలించారు. కర్నూలు జిల్లా డోన్ తాలూకాలోని రామళ్ళ కోట గ్రామంలోని ఒక శాసనం రాజరాజనరేంద్రుని కొడుకు కులోత్తుంగ చోళుని శాసనంగా ప్రకటించబడింది. నందికొట్కూరు తాలూకాలోని నివృత్తి సంగమ క్షేత్రము (సప్త నదీ సంగమం)లో వుండే రూపాల సంగమేశ్వరమును తూర్పు చాళుక్యులు కట్టించినట్లు పరిశోధకులు నిర్ణయించినారు. తూర్పు చాళుక్యుల్లో గుణగ విజయాదిత్యునికి రాష్ట్రకూటులతో వైరం యేర్పడింది. అతని కాలంలో ఇప్పటి రాయలసీమలోని అనంతపురం, కర్నూలు జిల్లాలు; బళ్ళారి జిల్లా, తెలంగాణ మొత్తం జిల్లాలు - అనగా ఆంధ్రదేశంలోని చాలాభాగం వారి ఏలుబడిలో వుంది.

క్రీ.శ. 8వ శతాబ్దానికి చెందిన బాదామీ చాళుక్యులను గూర్చిన శాసనం కడపజిల్లా రామాపురం గ్రామంలో ఉంది.[19] అసలు బాదామీ చాళుక్యుల మూలస్థానం కడప జిల్లా జమ్మలమడుగు ప్రాంతమని సుప్రసిద్ధ పరిశోధకులు శ్రీ మలంపల్లి సోమశేఖర శర్మగారు, శ్రీ నేలటూరి వేంకట రమణయ్యగారు

నిర్ణయించినారు. ఆ వంశంలో ప్రఖ్యాతుడు రెండవ పులకేశి. అనంతపురం జిల్లా పెద్ద వడుగూరు గ్రామంలో అతడు వేయించిన కన్నడ శాసనం చాలా ముఖ్యమైనది. అతని కుమారుడు మొదటి విక్రమాదిత్యుడు, గుత్తి తాలూకా తిమ్మగుడిలో తెలుగు శాసనం వేయించినాడు. పులకేశి మనుమడు వినయాదిత్యుడు యిచ్చిన తామ్ర శాసనాలు కర్నూలు, తొగర్చేడు, మాయలూరు, దైనందిన్నెలలో లభించినాయి. అతని కొడుకు వినయాదిత్యుని శాసనం రామాపురం లోనిది. రాయలసీమ కొంతకాలం వారి పరిపాలనలో వుంది.

వేములవాడ చాళుక్యులు రాష్ట్రకూట సామంతులుగా తెలంగాణాలో రాజ్యం చేశారు. వారి మూలపురుషుడు బాదామీ చాళుక్య చక్రవర్తి రెండవ పులకేశి. వారి వంశకర్త వినయాదిత్య యుద్ధమల్లుడు (క్రీ.శ. 750-780). ముదికొండ చాళుక్యులు తెలంగాణా రాష్ట్రకూటయుగంలో ప్రభవించిన రెండవ చాళుక్య రాజ్యపాలకులు. వారు చాలామంది సమకాలీన రాజవంశాలకు ఎదురు నిల్చి పోరాడారు.

కడప జిల్లా సుంకేశుల గ్రామంలోని విజయాదిత్య సత్యాశ్రయ మహారాజుకు చెందిన, అదే జిల్లా క్ర్రరపాడు శాసనాలు క్రి. శ. 8 వ శతాబ్దానికి చెందినవే.[20]

**గాంగులు :** 9 వ శతాబ్దిలో కడప జిల్లాలోని గంగపేరూరు ప్రాచీన గాంగులకు రాజధానిగా ఉండినట్లు అక్కడి ఒక ప్రాకృతభాషా శాసనం చెబుతూంది.([20a])

**బాణులు :** మహాబలి కుమారుడైన బాణునివల్ల ఆ వంశానికి బాణవంశమని పేరు వచ్చింది. వారు పాలించిన భూభాగానికి బాణప్పాడి అనే పేరు వచ్చింది. మహాబలి (బలి చక్రవర్తి) శ్రీ మహావిష్ణువునకు దానం చేసిన మూడు అడుగుల భూమి (నేల)ని గూర్చిన పౌరాణిక వివరాలు బాణవిక్రమాదిత్య III ఉదయేందిర శాసనంలో పేర్కొనబడింది. బాణులు కర్నాటకంలోని కోలారు జిల్లా చిక్కబళ్లాపురం తాలూకా నందగిరి (నందిదుర్గం) ప్రభువులనీ, పరివిపురం అంటే అనంతపురం జిల్లాలోని హిందూపురం తాలూకా పరిగిని కేంద్రస్థానంగా చేసుకొని ఆ ప్రాంతాన్ని పాలించారని చెప్పబడుచున్నారు.

ఆంధ్ర మండలంలోని 12000 గ్రామాలు, వడుగావళి 12000 గా ముదియనూరు తామ్రపలకాల్లో పేర్కొనబడ్డాయి. ఆ ప్రాంతాలతోపాటు దత్త మండలం జిల్లాలోని చిత్తూరు దక్షిణభాగం, సిద్ధవటం ఉత్తరభాగం. అనంతపుర మండలప్రాంతం-ఇవన్నీ కలిసి పశ్చిమాంధ్ర ప్రాంతంవైపు పోయే రహదారికి చేరువలో ఉండే ప్రాంతాన్ని 'పెరుంబాణప్పాడి'గా చెప్పబడింది. ఆ ప్రాంతం వుంగనూరు, కాళహస్తికి పశ్చిమ ప్రాంతం; చిత్తూరుకు తూర్పు ప్రాంతం - అదంతా బాణవంశ రాజులచే పరిపాలింపబడినట్లు చెప్పబడుతూంది.

ఆ బాణవంశ రాజుల శాసనాలు అనేకాలు కడప, అనంతపురం జిల్లాలో కన్పిస్తున్నాయి. వాటిలో మహాబలి బాణరాజు (9 వ శతాబ్ది చివరి భాగం) (శాసనం నెం. 43) శోర్మడి యుద్ధాన్ని ప్రశంసిస్తూ వుంది. మహాబలి బాణరాజు వైదుంబరాజైన గండత్రినేత్రునితో కలసి నొలంబ రాజుతో ఘోర యుద్ధం చేసినట్లు తెలుస్తూంది. కడప చోళుల శాసనాల్నిబట్టి బాణ దేశము పడమట వుంగనూరు వరకు, తూర్పున కాళహస్తివరకు వ్యాపించినట్లు తెలుస్తూంది.

"బాణవంశం (12-16 శ. మధ్య):

బాణ వంశీకులు మొదటినుంచీ సామంతులుగానే రాజ్యపాలన చేశారు. పరిగి (హిందూపురం తాలూకా) రాజధానిగా పెరుంబాణపాడిని పాలించారు. క్రీ.శ. 1250 ప్రాంతంలో నెల్లూరు ప్రాంతంలో బాణవంశీయు డొకడు, కాకతీయ సామ్రాజ్య కాలంలో తెలుగుదేశంలో మరొక బాణ వంశీయుడు ఉన్నట్లు ఆధారాలు ఉన్నాయి. తెలుగు చోళుల దగ్గర ఉద్యోగులుగా చాలమంది బాణ వంశీయులు సేవలు చేశారు. క్రీ.శ. 1546 ప్రాంతంలో విజయనగర రాజుల వద్దకూడా ఉద్యోగులుగా బాణ వంశీయులున్నట్లు తెలుస్తూంది."[21]

"బాణ వంశీకులు (రాజులు) పశ్చిమ చాళుక్యులతోపాటు రేనాడుకు వచ్చారు. చోళుల నుండి రేనాడును జయించిన చాళుక్య శ్రీవల్లభ మహారాజాధిరాజుకు సామంతుడుగా, పెర్బాణ కుటుంబానికి (వంశానికి) చెందిన భూపాదిత్యుడు ముఖ్యుడుగా వుండేవాడు అని తెలుస్తూంది.

అయితే, వీనికి అపవాదాలుగా మరికొన్ని విషయాలుకూడా తెలుస్తున్నాయి. వీరు తురమర విషయము (గుత్తి తా॥, అనంతపురం జిల్లా) నకు సమీప ప్రాంతములోనే పరిపాలిస్తుండేవారని, జమ్మలమడుగు ప్రాంతంలో పెనా

నదీ పక్కన తిప్పలూరు (కమలాపురం తా॥) ప్రాంతం, బాణరాజుల అధికారం క్రింద వుండేదని తెలుస్తూంది."[22]

కడప జిల్లా అరకటవేముల గ్రామంలోని 9 వ శతాబ్దపు శాసనం,[23] అదే జిల్లా కొర్రపాడు గ్రామ శాసనం,[24] బలపనూరు,[25] చిలంకూరు[26] శాసనాలు బాణవంశపు రాజుల పరిపాలనా కాలాన్ని, ఇతర విశేషాల్ని పేర్కొంటున్నాయి.

**వైదుంబులు** (క్రీ. శ. 13 వ శ॥) : చోళ చక్రవర్తులకు తెలుగు పల్లవులకు సామంతులుగా నెల్లూరు ప్రాంతాన్ని పాలించారు. రేనాడును వీరు పాలించిన దాఖలాలు అనేకం ఉన్నాయి. వైదుంబులు ధర్మపురి, కడప మండలాల్ని పాలించిన గంగశివకుమారుడు II కు సామంతులుగా ఉన్నట్లు తెలుస్తూంది. కడప జిల్లాలో వైదుంబులను గూర్చిన ప్రత్యేక దాఖలాలు ఉన్నాయి. వారి అసలు నివాస స్థలం వైదుంబప్రోలుగా చెప్పబడుతూంది. ఈ 'ప్రోలు'ను చిత్తూరు జిల్లాలో పట్టణంగా, అది వైదుంబుల రాజధానిగా, ఉత్తర ఆర్కాటు జిల్లాలోని 'తుంబ' అనేది వారి అసలు వాసస్థానమని 'రైస్' పండితుడు చెప్పాడు. అయితే, ఆర్కాటు జిల్లాలోని ఆ స్థలం వారి నివాసస్థలం కాదని కొన్ని సాక్ష్యాధారాలవల్ల తెలుస్తూంది.

"వైదుంబ మహారాజుల శాసనములు కడప కోలారు మండలములలోను చిత్తూరు జిల్లాలోని పెద్ద తిప్ప సముద్రము, మదనపల్లి, చిప్పిలి, ముదివేడు, తుపాకులోల్లపల్లి, రామానాయుని కోట మున్నగు గ్రామములలోను దొరికినవి. వీరు రాష్ట్రకూటులకును, నొలంబులకును, చోడులకును, కల్యాణీ చాళుక్యులకు లోబడి ఆంధ్ర కర్నాటక దేశములందలి కొంత ప్రదేశమును పరిపాలించుచుండిరి."[27]

వైదుంబులు లేక బైదుంబులు - వారి కొన్ని శాసనాల్లో చెప్పబడినట్లుగా ప్రస్తుత రాయలసీమ ప్రాంతం దక్షిణ భాగంలో క్రీ. శ. 7 వ శతాబ్దిలోనే వున్నట్లు తెలుస్తోంది. వారు క్షత్రియులు, తెలుగు భాష మాట్లాడేవారని తెలుస్తూంది. వారు అనంతపురం, కడప, చిత్తూరు, కోలారు ప్రాంతాల్లో వ్యాపించి ఉండేవారని 30 కి పైగా శాసనాలు ఋజువు చేస్తున్నాయి. వారికి సంబంధించిన ఆ శాసనాల్లో అధికంగా యుద్ధాల్లో వీరమరణం పొందినవారు, పశురక్షణకై

పోరాడినవారికి సంబంధించిన వీర శిలలు ఉన్నాయి. వారిని యుద్ధాభిలాషులుగా కూడ గణింపవచ్చు.

వైదుంబులలో గండతినేత్రుడు శక్తివంతుడైన రాజుగా చెప్పవచ్చు. గండత్రినేత్ర వైదుంబ మహారాజు చిత్తూరు, అనంతపురం, కడప, కోలారు జిల్లాల ప్రాంతాల్ని పరిపాలిస్తూ ఉండినట్లు తెలుస్తూంది. కడప జిల్లా వందాడి గ్రామ శాసనం,[28] అదే జిల్లా బండపల్లి శాసనం గండత్రినేత్రుని, అదే జిల్లా ఉప్పరపల్లి శాసనం[29] భువనత్రినేత్రుని, వందడి గ్రామ శాసనం[30] బిరుద త్రినేత్రుని, అనిమెల శాసనం[31] ఇరిగెయ మహారాజు మొదలగు రాజులను పేర్కొంటున్నాయి. అవి అన్నీ క్రీ.శ. 10 వ శతాబ్దికి చెందిన వైదుంబ రాజులవే.

**నొళంబులు:—** వీరు నొళంబ పల్లవులుగా పిలువబడ్డారు. వీరు పల్లవ వంశీయ శాఖకు చెందినవారు. ప్రథమంగా వీరిని క్రీ.శ. 8 వ శతాబ్ది కాలం వారుగా చెప్పవచ్చు.

"వీరే హెంజేరు (హేమావతి)ను (అనంతపురం జిల్లా) ఒక చిన్న పరిపాలనా స్థావరంగా చేసుకొని వుండినారనేందుకు చారిత్రక ఆధారాలు వున్నాయి. ఉత్తర పినాకినీ తీరంలో ఉండే హెంజేరు ముఖ్యపట్టణంగా, దగ్గర్లో ఉండే అనంతపురం, చిత్రదుర్గ, తుంకూరు ప్రాంతాల భాగాలను నొళంబాళిగె - 1000 గా వారు పాలిస్తూ వుండేవారని తెలుస్తూంది. పెన్నా, హగరి నదులను పూర్వ పశ్చిమ దిశల్లో సహజ సరిహద్దులుగా ఈ ప్రాంతాల్ని పాలించేవారు. వీరు చేసిన అనేక జైత్రయాత్రలవల్ల నొళంబాళిగె - 1000 నొళంబాలిగె - 32000 గా అభివృద్ధి చెందింది. ఇది క్రీ.శ. 9 వ శతాబ్ది కాలానికి ఒక రూపానికి వచ్చిందనీ, వీరి అధికారం ఉచ్ఛస్థితిలో చేరిందనీ చెప్పవచ్చు."[32]

**రాష్ట్రకూటులు :** రాష్ట్రకూటులు క్రీ.శ. 6 వ శతాబ్దం నుండి దక్షిణ హిందూ దేశంలోని చాలా భూభాగాన్ని పరిపాలిస్తూ ఉండేవారు. రాష్ట్రకూట రాజుల్లో దంతివర్మ సుప్రసిద్ధుడు.

కడప జిల్లా దానవులపాడు గ్రామంలోని కాల వివరాలు తెలియని ఒక శాసనం,[33] అదే జిల్లా కమలాపురం గ్రామంలోని క్రీ.శ. 10 వ శతాబ్దపు శాసనం,[34] రాష్ట్రకూటరాజైన నిత్యవర్ష ప్రభు పేరిట శాసనాలు లభిస్తున్నాయి.

**చోళులు :** రాష్ట్రకూటుల పతనం తర్వాత ఆంధ్ర ప్రాంతంలో చాలా భాగం కొంత అనిశ్చిత పరిస్థితికి గురయ్యింది. దాన్ని అవకాశంగా తీసుకొన్న చోళులు, చాళుక్యులు, తమ అధికారాన్ని ఆ ప్రాంతంలో విస్తరింపచేసే ప్రయత్నంలో అంతర్యుద్ధాలు ప్రారంభించారు. రాయలసీమలోని కడప ప్రాంతమే వీరికి యుద్ధరంగంగా యేర్పడింది.

పొత్తపి తెలుగు చోళులు రేనాడు, కడప ప్రాంతాల్ని పొత్తపి రాజధానిగా (కడప జిల్లా), రెండు శతాబ్దాలు పాలించారు. మధ్యయుగానికి చెందిన పొత్తపి తెలుగు చోళరాజు ఒప్పిలిసిద్ధి (క్రీ.శ. 1224) కొణిదెన చోళరాజును ఓడించి, ఆ ప్రాంతాన్ని కూడా కలుపుకొని పాలించాడు.[35]

"హేమావతి తెలుగు చోళులు కల్యాణి చాళుక్యులకు సామంతులుగా వుండి నిడిగల్లు, హేమావతి ప్రాంతాల్ని (అనంతపురం జిల్లా) పరిపాలించారు[36] వీరిని గూర్చిన వివరాలు కడప జిల్లా ముద్దనూరుకు చెందిన క్రీ.శ. 10 వ శతాబ్దికి చెందిన శాసనం,[37] ఇదే జిల్లాకు చెందిన కొనిసేపల్లి,[38] అరకటవేముల[39] శాసనాలు పేర్కొంటున్నాయి. ఇదే జిల్లా ముద్దనూరు గ్రామానికి చెందిన 10 వ శతాబ్దపు శాసనం,[40] కర్నూలు జిల్లా త్రిపురాంతకంకు చెందిన క్రీ.శ. 12 వ శతాబ్ది శాసనం,[41] అదే గ్రామానికి చెందిన వెలనాటి గొంకరాజు శాసనం,[42] కులోత్తుంగ చోడదేవ శాసనం,[43] రాజేంద్ర చోడప్రభుని శాసనం[44] - ఇవి అన్నీ చోళరాజుల పరిపాలనా విశేషాల్ని తెలుపుతూన్నాయి. ఇవి క్రీ.శ. 12వ శతాబ్దికి చెందిన శాసనాలే."

**కాయస్థులు :** కాయస్థులు ప్రారంభంలో కాకతీయులకు సామంతులుగా ఉండి, స్త్రీ పరిపాలకురాలైన రుద్రమదేవి కాలంలో స్వతంత్ర రాజులుగా ప్రకటించుకున్నారు. కాయస్థ వంశీయులలో కాకతి గణపతిదేవ చక్రవర్తి సేనాని గంగయసాహిణి ముఖ్యుడు. అతని మేనల్లుండ్లు వరుసగా జన్నిగదేవుడు, త్రిపురాంతకుడు, అంబదేవుడు అనువారు. గంగయసాహిణి మహా

పరాక్రమశాలి. త్రిపురాంతకంలోని మూలస్థాన బ్రహ్మేశ్వరాలయంలో గంగయ సాహిణి వేయించిన శక సంవత్సరం 1172 = క్రీ శ. 1250 నాటి శాసనంలో "శ్రీమన్మహామండలేశ్వర బాహత్తరి నియోగాధిపతి, చాతుర్వర్ణ సముద్ధరణ, పశ్చిమరాయ దామోదర సైన్యదిశావట్ట, ఏకాంగవీర, అతివిషమ హయారూఢ, ప్రౌఢరేఖా రేవంత, గణపతిదేవ శ్రీపద్మారాధక" అని వర్ణింపబడ్డాడు. కాయస్థులు పానుగల్లునుండి మహారాజవాడి (మార్జవాడి - రేనాడు) వరకు పాలించినట్లు శాసనాలు తెల్పుతున్నాయి.

మొదటి కాయస్థరాజు శా.శ. 1161 (క్రీ.శ. 1239) గంగయ సాహిణి అని గుంటూరు జిల్లా, గుండ్లపాడు శాసనంవల్ల తెలుస్తూంది. ఆ శాసనంలో అతడు గండ పెండార గంగయసాహిణి అని మాత్రమే చెప్పబడినాడు.

"అంబదేవుడు, అతని అనుచరులు వేయించిన శాసనములవలన అంబ దేవుని విషయము, కాయస్థ వంశజుల చరిత్రము తెలియుచున్నది. త్రిపురాంత కమున కాయస్థ వంశీయులకు సంబంధించిన 33, 43, 52, 67, 68, 71, 72, 73, 75 సంఖ్యగల శాసనములీ సంపుటిలో నున్నవి.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | క్రీ శ. | 1272 | త్రిపురాంతక శాసనము | - | అంబదేవుడు |
| 2. | ,, | 1279 | అత్తిరాల (కడప మండలము) | - | |
| 3. | ,, | 1288 | త్రిపురాంతకము | - | మహాప్రధాని అంబయ రెడ్డివారు |
| 4. | ,, | 1290 | పోలి (కడప మండలము) | - | అసమగ్రము |
| 5. | ,, | 1290 | త్రిపురాంతకము | - | అంబదేవుడు |
| 6. | ,, | 1290 | ,, | - | ,, |
| 7. | ,, | 1291 | ,, | - | ,, |
| 8. | ,, | 1291 | ,, | - | అంబదేవుని పాదపద్మోప జీవి - అసమగ్రము |
| 9. | ,, | 1291 | సిలగంగవరం శాసనము | - | ఎపి ఇం. XX పు. 227 |

క్రీ.శ. 1290 నాటి త్రిపురాంతకములోని వికృత భాద్రపద బహుళ అమావాస్య మంగళవారము సూర్యగ్రహణకాలమందివ్వబడిన శాసనము, క్రీ.శ.

1272 శ్రీముఖ జ్యేష్ఠ బహుళ అమావాస్య సోమవారము నాడొసంగబడిన శాసనముల వలన అంబదేవుని విజయములు తెలియుచున్నవి.[45]

కడప జిల్లా పుష్పగిరి గ్రామంలోని క్రీ.శ. 1255 నాటి శాసనంలో 'గండ పెండారక నామధేయః కాయస్థ వంశార్ణవకర్ణధారః శ్రీ గంగ సేనాపతిరస్య' అని పేర్కొనబడింది. ఇది సంస్కృత శాసనం.[46] పుష్పగిరిలోని మరొక శాసనం.[47] అదే జిల్లాలోని ఇటిగుళ్ళపాడు గ్రామంలోని తేదీ వివరాలు తెలియని ఒక శాసనం[48] జన్నిగదేవరాజును గూర్చి తెలుపుతాయి.

**కాకతీయులు** (క్రీ. శ. 1160 - 1323) : ఆంధ్రదేశ పరిపాలనలో తమ ప్రత్యేకతను సంతరించుకొన్నవారు వీరు. తమ పాలనలో అనేక సంస్కార సంస్కృతీపరములైన మార్పుల్ని తెచ్చారు. వీరి ప్రధాన కేంద్రస్థానం తెలంగాణమే. అప్పుడు రాయలసీమలో తెలుగు చోళులు బలవంతులై పరిపాలిస్తూ ఉండినారు. కాకతీయుల పరిపాలానా వైభవానికి మాత్రం ఒక ప్రత్యేక చరిత్ర వుంది.

రుద్రదేవుడు (కీ.శ. 1158 - 1195) రెండవ ప్రోలరాజు కుమారుడు. అతడు స్వతంత్ర కాకతీయ రాజ్యాన్ని స్థాపించిన ప్రతిభాశాలి. మహావీరుడు. తన తండ్రి ప్రోలరాజు నిర్మించిన స్వయంభూ దేవాలయ సన్నిధిలో రుద్రుడు ఓరుగల్లు కోట నిర్మాణానికి పునాదులు వేశాడు. అనుమకొండలో తన పేరుతోనే రుద్రేశ్వరాలయాన్ని నిర్మించాడు. గణపతిదేవుడు కాకతీయ రాజవంశంలోనేకాక దక్షిణాంధ్ర దేశ చక్రవర్తులలోనే పేరెన్నిక గన్నవాడు. మహా యోధుడు. కొన్ని శాసనాల్లో గణపతి దేవుడు క్రీ.శ. 1269 వరకు జీవించివున్నట్లు తెలుస్తుంది. రుద్రమదేవి (క్రీ.శ. 1262-1280 వరకు) కడు సమర్థంగా రాజ్య పరిపాలనా భారాన్ని నిర్వహించి, వీరనారిగా చరిత్రలో చిరకీర్తి నార్జించిన స్త్రీ. ప్రతాపరుద్రుడు క్రీ. శ. 1289 లో కాకతీయరాజుగా పరిపాలించాడు. కాకతీయుల సామ్రాజ్యంలోని పరిపాలనా భాగంగా ప్రస్తుత కర్నూలు జిల్లా త్రిపురాంతకం ప్రాంతం వుండినదని అక్కడి శాసనాలవల్ల తెలుస్తూంది. కడప జిల్లాలోని కొన్ని ప్రాంతాలు కాకతి ప్రతాపరుద్రదేవుని నామాన్ని ఉటంకిస్తున్నాయి.

కర్నూలు జిల్లా త్రిపురాంతకంలోని క్రీ.శ. 12 వ శతాబ్దికి చెందిన ఒక శాసనం[49] కాకతీయ రుద్రదేవుని, ఇదే గ్రామానికి చెందిన 13 వ శతాబ్దికి చెందిన ఇంకొక శాసనం[50] కాకతీయ గణపతిదేవుని సోదరి మల్లాంబికను, కాకతీయ గణపతిదేవుని ధర్మంగా ఆయన సర్వాధికారి పోచన ప్రెగ్గడ వేయించిన క్రీ.శ. 13 వ శతాబ్ది శాసనం,[51] క్రీ.శ. 13 వ శతాబ్దిదే అయిన గణపతిదేవ మహారాజుల కాలంనాటి శాసనం,[52] కడప జిల్లా సందలూరు గ్రామంలోని శాసనం, అదే జిల్లా ఉప్పరిపల్లి శాసనం[53] ప్రతాపరుద్రదేవ మహారాజులవారి శాసనాలుగా పేర్కొనబడుతున్నాయి. ఇవి అన్నీ క్రీ.శ. 12, 13 శతాబ్దులనాటి కాకతీయ రాజులకాలంనాటి శాసనాలే.

**రెడ్డిరాజులు :** కొండవీడును పాలించిన రెడ్డి రాజ వంశానికి మూల పురుషుడు ప్రోలయ వేమారెడ్డి క్రీ.శ. 1325 నాటికి తీరాంధ్రమును జయించి, అద్దంకిని రాజధానిగా చేసుకొని పాలించాడు. శ్రీశైలం నుండి తూర్పు సముద్రం వరకు, కొండపల్లినుండి కందుకూరి వరకు ప్రోలయ వేమారెడ్డి తన రాజ్యాన్ని విస్తరించాడు. అతని పరిపాలనా కాలం క్రీ.శ. 1326-53. ప్రోలయ వేమారెడ్డి తర్వాత అతని కుమారుడు అనపోతారెడ్డి రాజ్యానికి వచ్చాడు. అతని జీవిత మంతా శత్రువులతో పోరాడటంతోనే గడిచింది. త్రిపురాంతకమున రెడ్డిరాజులకు సంబంధించిన రెండు శాసనాలు మనకు కన్పిస్తున్నాయి. క్రీ.శ, 1246 వ సంవత్సరంనాటి అనవేమయ ఆనపోతయరెడ్డిల పేర్లతో ఒకటిన్నీ,[54] అడప వేమన, అనపోతయరెడ్డిల పేర్లతో రెండవదిన్నీ కన్పిస్తున్నాయి.[55] కర్నూలుజిల్లా శ్రీశైలం గ్రామంలో క్రీ.శ 1377నాటి అనవేమారెడ్డి వీరమంటపం కట్టించిన శాసనం,[56] కడప జిల్లా టంగుటూరు గ్రామంలో మల్లారెడ్డి కొడుకు అన్నారెడ్డి (వేమారెడ్డి సోదరుడు) పేర్లువుండే శాసనం,[57] కర్నూలు జిల్లా పెద్ద అహోబలములో కొమరగిరిరెడ్డి ప్రభువుల పేరిట కాటయవేమారెడ్డి గ్రామాలను దానంచేసిన శాసనాలు[58] ఉన్నాయి.

వాటన్నింటి వలన రెడ్డిరాజులు రాయలసీమ ప్రాంతంలో కూడా తమ పరిపాలనను సాగించినట్లు తెలుస్తూంది.

## విజయనగర రాజవంశాలు:

కటకంనుండి కన్యాకుమారి వరకుగల ప్రాంతాన్ని ఆనాటి విజయనగర రాజులు పాలించినట్లు చరిత్రలో పేర్కొనబడి ఉంది. వీరిలో ముఖ్యంగా శ్రీకృష్ణదేవరాయల కాలంలో విజయనగర సామ్రాజ్యం అత్యున్నత స్థితిలో ఉన్నట్లు చరిత్ర చెబుతూంది.

విజయనగర సామ్రాజ్య నిర్మాణానికి మూలపురుషుడు విద్యారణ్య మునీంద్రులనీ, వీరి ప్రోత్సాహంతోనే ఆనెగొందికి యెదురుగా కొంచెం దిగువన తుంగభద్రా నదీతీరంలో విద్యానగరం అనే మరొక పేరుగల విజయనగరం నిర్మించి దానినే తమ రాజధానిగా చేసుకొన్నారనీ, విజయనగర సామ్రాజ్యం కర్నాటక, ఆంధ్ర, ఓఢ్ర, తమిళ ప్రాంతాలకు విస్తరించి ఉండేదని తెలుస్తూంది.

ఈ రాజ్యాన్ని ప్రధానంగా నాలుగు వంశాల రాజులు పాలించారు. వీరు వరుసగా సంగమ, సాళువ, తుళువ, ఆరవీటి వంశీయులు. వీరు ఆంధ్రదేశపు ప్రాంతమై, ప్రస్తుత రాయలసీమ అని పిలువబడే అనంతపురం, చిత్తూరు, కర్నూలు, కడప ప్రాంతాల్ని (మండలాల్ని) పాలించినట్లు శాసనాధారాలు మనకు తెలియజేస్తున్నాయి. రాయలసీమ శాసనాల్లో క్రీ.శ. 14 వ శతాబ్దం నుండి 17 వ శతాబ్దాంతం వరకు వీరి పేరిట వేయింపబడిన శాసనాలు అనేకం లభించాయి.

**సంగమ వంశం :** సంగమ వంశంలో మొదటివాడు మొదటి హరిహర రాయలు (క్రీ.శ. 1336-1355) విజయనగర రాజ్య సంస్థాపకుడుగా యదువంశ క్షత్రియుడుగా సుప్రసిద్ధుడైనవాడు. విజయనగరాన్ని పాలించిన మొదటి రాజు లందరూ సంగమ రాజ సంతతివారు కావటం మూలాన హరిహరుని వంశానికి సంగమ వంశంగానే పేరు వచ్చింది.

ఇతని తర్వాత మొదటి బుక్కరాయలు (క్రీ.శ. 1355-1377) విజయ నగరాన్ని పాలించాడు. బుక్కరాయలు తన అన్న అయిన హరిహరరాయల అడుగుజాడల్లో నడిచి విజయనగరమును చాలా గొప్ప రాజ్యంగా రూపొందిం

చాడు. ఇతని మహామంత్రి అనంతరాయలు. ఇతడే పెనుగొండ దుర్గాన్ని నిర్మించాడు. ఇతని పేరనే భాస్కరరాయలు కడప మండలంలోని పోరుమామిళ్ళ గ్రామంలో పెద్ద తటాక మొకదాన్ని నిర్మించి దానికి అనంతసాగరమని పేరు పెట్టాడు. బుక్కరాయలకు తాను కూడ మంత్రిగా ఉన్నట్లు విద్యారణ్యులు తన పరాశర మాధవీయ వ్యాఖ్యలో తెలిపాడు.[58(a)] ఈ బుక్కరాయల కాలాన్నే నాచన సోమనాథుడు ఉత్తర హరివంశ కావ్యాన్ని రచించాడు. బుక్కరాయలు అతనికి పెంచుకలదిన్నె గ్రామాన్ని అగ్రహారంగా ఒక దాన శాసనం కూడా రాయించి యిచ్చాడు. రెండవ హరిహరరాయలు (క్రీ శ. 1377 క్రీ.శ. 1404) కూడా సమర్థుడైన చక్రవర్తి. రాజాధిరాజ, రాజపరమేశ్వర బిరుదాలను వహించినవాడు. రెండవ బుక్కరాయలు (క్రీ.శ. 1404 - 1406) కొంత కాలం మాత్రమే విజయనగర రాజాన్ని పాలించాడు. మొదటి దేవరాయలు (క్రీ. శ. 1406 - క్రీ.శ. 1422) పరిపాలించిన 16 సంవత్సరాల్లో బహ్మనీ సుల్తానులతో, రాచకొండ వెలమనాయకులతో, కొండవీటి రెడ్డి రాజులతో నిరంతర పోరాటాలు సాగించాడు. దేవరాయలు క్రీ.శ. 1413 - 14 ప్రాంతాల్లో కందుకూరి శాఖ రెడ్డి మన్నీలు రాయరాజ్యంపై దండెత్తి వెళ్ళి కడప జిల్లాలోని పొత్తపినాటిని, దానికాగ్నేయంలో వుండిన పులుగులనాటిని ఆక్రమించుకోగా వారిని ఓడించి తరిమివేసి, మరలా ఆ ప్రాంతాన్ని రెడ్ల అధీనంలోనే వుంచాడు. ఇమ్మడి ప్రౌఢ దేవరాయలు (క్రీ. శ. 1423 - క్రీ శ. 1446) సంగమ వంశరాజుల్లో అగ్రగణ్యుడు. ఇతని కాలమున రాజ్యము మహోన్నతస్థితికి వచ్చింది. పారసీక రాయబారి అబ్దుల్ రజాక్ కూడా ఇతని కాలాన్నే వచ్చి విజయనగర రాజ్య మహోన్నతస్థితి వర్ణించాడు. ఈ ప్రౌఢ దేవరాయలకు గజబేంట (ఏనుగువేట) దేవరాయలనీ, ప్రతాపదేవరాయలనీ బిరుదాలు వున్నాయి.

మల్లికార్జున రాయలు (క్రీ. శ. 1446 - 1465) శ్రీ పర్వత మల్లికార్జున కృపా కటాక్షమున ప్రౌఢ దేవరాయలకు పొన్నలదేవి అనే భార్యద్వారా జన్మించాడు. ఇతడు సుమారు 19 సంవత్సరములు విజయనగర రాజ్యాన్ని పాలించాడు.

విరూపాక్షరాయలు (క్రీ.శ. 1465 - 1478) మల్లికార్జున రాయల పిన తండ్రి కుమారుడు. ఈతడు ప్రతాపదేవరాయలకు సింహళదేవి ద్వారా జన్మిం

చిన కుమారుడు. ఈతని కాలముననే సాళువ నరసింహరాయలు చంద్రగిరి రాజ్యమును విజయనగర సామంతుడుగా పాలిస్తూ వుండినాడు. విరూపాక్ష రాయల వ్యసనములవలన, అసమర్థతవలన సాళువ నరసింహరాయలు విద్యానగరమును ఆక్రమించి విజయనగర రాజ్యాధీశుడై సాళువ వంశములో ప్రథమ పాలకుడయ్యాడు.

సంగమ వంశంలో హరిహరరాయ - I బుక్కరాయ - I మొదటివారైనా వీరి ముందు సావణ్ణ ఒడెయలు పేరిట క్రీ.శ. 14 వ శతాబ్ది మధ్యకాలానికి చెందిన మూడు శాసనాలు కడప జిల్లా మోపూరు గ్రామంలో ఉన్నాయి.[59]

కడప జిల్లా రామాపురం గ్రామంలోని క్రీ.శ. 14 వ శతాబ్దానికి చెందిన శాసనం శ్రీ వీరబుక్కరాయలను పూర్వ పశ్చిమ సముద్రాధిపతిగా కన్నడ భాషలో వర్ణిస్తూ ఉంది.[60] అనంతపురం జిల్లా కదిరి గ్రామంలోని 14 వ శతాబ్దికి చెందిన శాసనం, ఇదే జిల్లాకు చెందిన పట్నం గ్రామ శాసనం తెలుగు, కన్నడ భాషల్లో శ్రీ బుక్కరాయలకు సంబంధించినవి.[61] చిత్తూరుజిల్లా తంబళ్ళపల్లె గ్రామంలోని క్రీ. శ. 14 వ శతాబ్ది ప్రారంభ కాలంలోని శాసనం శ్రీ వీరదేవ రాయలను పేర్కొన్నది. ఇది కన్నడ - తెలుగు భాషల మిశ్రమ శాసనం.[72] కర్నూలు జిల్లా త్రిపురాంతకం గ్రామంలోని విజయబుక్కరాయలు కాలంనాటి క్రీ.శ. 15వ శతాబ్దినాటి శాసనం ఆయనకుండే విశేష బిరుదాల్ని పేర్కొన్నది.[63] కడప జిల్లా మోపూరు గ్రామ శాసనం క్రీ.శ. 15 వ శతాబ్ది కాలంనాటి రెండవ కుమారదేవరాయలది. ఇదే జిల్లా ఉలిమెళ్ల గ్రామంలోని ఒక శాసనం, కడప జిల్లా నందలూరు గ్రామ శాసనం, కర్నూలు జిల్లా త్రిపురాంతకం గ్రామ శాసనాలు రెండవ దేవరాయలు (15 వ శతాబ్ది నడిమి) కాలంనాటివిగా పేర్కొనబడ్డాయి.[64]

**సాళువ వంశం** : సాళువ వంశానికి మొదటి నివాస స్థానము చాళుక్య చక్రవర్తులకు రాజధాని అయిన కళ్యాణ కటకము. వీరు మొదట విజయనగర రాయ వంశపువారితో సంబంధబాంధవ్యాలు కల్గివుండి, అక్కడ మాండలికులుగా సామంతులుగా కూడా వున్నారు. సాళువ వంశంలో ప్రసిద్ధి పొందినది చంద్రగిరి శాఖ. మొదట ఈ శాఖవారు ములికినాటిలో అమరాలను అనుభవిస్తూ, ఉదయగిరి దుర్గాధ్యక్షుని పాలనకింద వున్నారు.

సాళువ నరసింహదేవరాయలు (క్రీ.శ. 1485 - 1490) పట్టాభిషిక్తుడైన తర్వాత 6 సంవత్సరములు సామ్రాజ్యాన్ని పాలించాడు. రాజ్యము అల్లకల్లోలంగా ఉన్నది. ఇతడు విజయనగర రాజుల్లో అగ్రశేణికి చెందిన వాడనేందుకు తార్కాణంగా చితికిపోతున్న రాజ్యాన్ని పునరుద్ధరించి, దాక్షిణాత్య హైందవుల్లో రాజభక్తినీ, రాజ్యానురక్తినీ పెంపొందించాడు.

సాళువ నరసింహుని సంతతి (క్రీ.శ. 1490-1506) పేర చాలామంది విజయనగర రాజ్యాన్ని పాలించినా చివరివరకు పొరుగురాజ్యాలతో ఇబ్బందులతోనే గడిచింది. ఇమ్మడి నరసింహరాయలు (క్రీ.శ. 1503-1506) నరసనాయకుని మరణం తర్వాత రాజ్యాధికారి అయినా, రాజ్యాన్నిపాలించే ప్రాప్తి ఇతనికి లేకపోయింది. తండ్రిచేత నియమింపబడిన సంరక్షకుడే యితని పాలిటి శత్రువైనాడు.

రాయలసీమ శాసనాల్లో సాళువ వంశానికి చెందిన వాటిల్లో ముఖ్యంగా కడప జిల్లా అత్తిరాల గ్రామంలో సాళువ నరసింగయ్య దేవమహారాజుల పేరిట క్రీ.శ. 15వ శతాబ్ది శాసనం,[65] ఇదే జిల్లా ముత్తుకూరు గ్రామంలో, యితని కుమారుడైన నరసింగదేవ మహారాజుల పేరిట 15వ శతాబ్ది చివరి భాగంలో వేయబడిన శాసనం,[66] అనంతపురం జిల్లా రామాపురం గ్రామంలోని శాసనం,[67] కర్నూలు జిల్లా పాణ్యం గ్రామంలోని (16వ శతాబ్ది) శాసనం[68] పేర్కొన దగ్గవి.

**తుళువ వంశం :** తుళువ వంశంలో మొదటివాడు తుళువ నరస నాయకుడు. ఇతని కుమారుడు వీర నరసింహరాయలు (క్రీ.శ. 1506-1509). ఇతడు రక్తపాతం జరిపి సింహాసనాన్ని అధిష్టించాడు. విదేశీయులతో వర్తకవ్యాపారాలను అభివృద్ధి చేయించాడు. అశ్వదళాన్ని వృద్ధిపరచాడు.

వీర నరసింహ రాయల తర్వాత అతని సవతి తల్లి నాగలాంబ కొడుకైన శ్రీకృష్ణదేవరాయలు (క్రీ.శ. 1509-1530) సింహాసనాన్ని అధిష్టించాడు. ఇతడు ఉమ్మత్తూరు, ఉదయగిరి, కొండపల్లి దుర్గాలను జయించాడు. మహామంత్రి తిమ్మరుసు తనకు బాసటకాగా కటకము నుంచి కన్యాకుమారి వరకు వున్న ప్రాంతాన్ని తన యేలుబడికిందికి తెచ్చుకొన్నాడు. విజయనగర చక్ర

వర్తుల్లో శ్రీకృష్ణదేవరాయలు చాలా గొప్పవాడు. సర్వసమర్థుడు. రాజనీతి మర్మజ్ఞుడు, సమరంలోనేకాక సాహిత్యంలోను దిట్ట. తన ఆస్థానంలోని కవుల చేత వారి కావ్యాలను అంకితంగా గ్రహించడమేకాక, ఆముక్తమాల్యద అన్న ఉద్గ్రంథాన్ని స్వయంగా రచించినాడు. ఇతడు అనేక గ్రామాలు, భూములు దానం చేయడమే కాకుండా, తిరుమల-తిరుపతి దేవస్థానాల నిర్వహణకు, శ్రీ వేంకటేశ్వరస్వామి వారికి తన దేవేరులతో పాటు అనేక విలువైన కానుకల్ని సమర్పించుకొన్నాడు. అహోబిలం, శ్రీశైలం, శ్రీకాళహస్తి దేవాలయాలకు కూడా అనేక విలువైన కానుకల్ని సమర్పించినట్లు శాసనాలు ఋజువు చేస్తున్నాయి. శ్రీ వేంకటేశ్వరస్వామి వారి నిరంతర భక్తులుగా శ్రీ కృష్ణరాయలు, ఆయన భార్యలైన తిరుమలాంబ, చిన్నాదేవుల లోహవిగ్రహాలు ఆలయప్రాంగణంలో నిల్పబడి ఉన్నాయి.

కడప జిల్లా పులివెందల గ్రామంలోని క్రీ.శ. 1509 కాలంనాటి శాసనం,[69] కర్నూలు జిల్లా పాణ్యం గ్రామంలోని క్రీ శ. 1510 కాలంనాటి శాసనం,[70] చిత్తూరు జిల్లా రంగసముద్రం గ్రామంలోని క్రీ శ. 1510 కాలంనాటి శాసనం,[71] అనంతపురం జిల్లా మిడుతూరు గ్రామంలోని క్రీ శ. 1517 కాలంనాటి శాసనం[72] మొదలైన అనేక శాసనాలు, తి.తి. దేవస్థానాలకు సంబంధించిన చాలా శాసనాల్లో, శ్రీ వీరకృష్ణరాయమహారాయలు తిరువేంగళనాథునికి సమర్పించిన నవరత్న ఖచితమైన కిరీటం మొదలైన కానుకలు, రత్నాలు, ముత్యాలు మొదలైన అతి విలువైన వస్తువుల్ని సమర్పించిన వివరాలు చోటు చేసుకున్నాయి.[73] ఇవి క్రీ.శ. 1512, 1515 కాలాల నాటివిగా పేర్కొనబడినాయి. ఇవి అన్నీ శ్రీకృష్ణ దేవరాయలవారు వేయించినవే!

అచ్యుత దేవరాయలు (క్రీ.శ. 1530 - 1542) కృష్ణరాయల తర్వాతి విజయనగర రాజ్యపాలకుడు- రాయలసీమ ప్రాంతంలో అనేక గ్రామ, భూదానాలకు కర్తగా, ప్రజాహిత కార్యాలకు ప్రతినిధిగా, తెలుగు భాషా పోషకుడుగా గణుతికెక్కాడు. కడప జిల్లా మోపూరు గ్రామంలోని శ్రీ వీరప్రతాప అచ్యుత రాయ మహారాయల కాలంనాటి శాసనం,[74] అనంతపురం జిల్లా గౌనివారిపల్లి గ్రామంలోని శాసనం,[75] కర్నూలు జిల్లా శ్రీశైలంలోని ఒక శాసనం,[76] చిత్తూరు జిల్లా కాళహస్తి గ్రామంలోని శాసనం[77] అచ్యుతరాయ రాయల శాసనాలుగా

పేర్కొనబడుతున్నాయి ఇవి అన్నీ క్రీ.శ. 1530 - 35 మధ్య కాలపు శాసనాలు. ఇవికాక ఇతని పేర అనేక శాసనాలు రాయలసీమ ప్రాంతంలో చాలా చోట్ల లభిస్తున్నాయి.

వెంకటపతిదేవ మహారాయలు (1542) : అచ్యుతదేవరాయల తర్వాత అతని కుమారుడు వెంకటాద్రి అనే పేరున్న వెంకటపతి దేవరాయలు రాజైనాడు. మేనమామ సలకం తిరుమలరాజు ఇతనికి రక్షకుడుగా ఉండి రాజకీయ వ్యవహారాల్ని నిర్వహించేవాడు.

సదాశివదేవమహారాయలు (క్రీ.శ. 1543 - 1576) : వెంకటపతిదేవ రాయలను చంపిన రామరాజుచే ఇతడు రాజ్యాభిషిక్తుడైనాడు. అధికారము రామ రాజుది. ఇతడు పేరుకు మాత్రం ప్రభువుగా కొనసాగుతుండేవాడు. అనేక రాజ్యాల్ని జయించడం, సామంతుల్ని రామరాజు సాయంతో అణచివేయడం చేస్తుండేవాడు. సదాశివదేవ రాయలతోపాటు, రామరాజు రామరాయలుగా అధికారాన్ని, రాచమర్యాదల్ని పొందుతూ, సామ్రాజ్యంలో అనేక మార్పుల్ని తెచ్చాడు. పొరుగు రాజ్యాలపై దండయాత్రల్ని సాగించాడు. క్రీ.శ. 1565 లో రక్షసతంగడి (తాళికోట) యుద్ధంలో తురుష్కరాజులు యితన్ని మోసంతో చంపారు. రామరాజు భాషాభిమాని. ఆంధ్ర ప్రబంధ కవుల్లో ఖ్యాతి వహించిన భట్టుమూర్తి తాను రచించిన వసుచరిత్ర కావ్యాన్ని రామరాయల తర్వాత అతని తమ్ముడు తిరుమల రాయలకి అంకిత మిచ్చాడు. రామరాయలకు యిష్టుడై నందున రామరాజభూషణుడైనాడు. శ్రీ వీర సదాశివరాయలపేరిట కడప జిల్లా గోపవరం గ్రామంలోని క్రీ.శ. 1542 వ సం॥కు చెందిన శాసనం[78] కర్నూలు జిల్లా కోవెలకుంట్ల గ్రామానికి చెందిన క్రీ. శ. 1542 నాటి శాసనం[79] అనంత పురం జిల్లా మిడుతూరు గ్రామానికి చెందిన క్రీ.శ. 1544 కాలంనాటి శాసనం[80] చిత్తూరు జిల్లా ములకలచెర్వు గ్రామంలోని క్రీ.శ. 1546 వ సం॥ నాటి శాసనం[81] మొదలైనవి వేయబడ్డాయి. ఇవికాక రాయలసీమలోని అనేక ప్రాంతాల్లోని మరికొన్ని శాసనాలు సదాశివరాయల పరిపాలనా కాలాన్ని తెల్పుతున్నాయి.

అరవీటి వంశం (అరవీడు వంశం) : విజయనగర రాజ్యాన్ని కాపాడుకొనడంకన్నా, అక్కడ ఉండే అమూల్య ధనరాసుల్ని రక్షించుకోవడం

కోసం, అప్పటికింకా జీవించి ఉన్న సదాశివరాయలను, తన ఆత్మీయ బంధువులను, పదిహేనువందల ఏన్గులపై కనక రత్నాలను తరలించుకొని, అతని తమ్ముడు తిరుమలరాయలు పెనుకొండకు చేరుకున్నాడు. తురుష్క సేనల అగడాల తర్వాత జీర్ణావస్థలో ఉండిన విజయనగరాన్ని మళ్ళీ చేరుకొన్న తిరుమల రాయలకు అపకీర్తి, అవిశ్వాసమే ప్రజలనుండి యెదురైంది.

**తిరుమల దేవరాయలు** (క్రీ. శ. 1571 - 72) : ఇతడు విజయనగర రాజ్యాన్ని పాలించే కాలంలో, ఇతని అధికార పరిధిలోని సామంత రాజ్యాలు, పాలేలలో ఉండే ప్రజలు అప్పటి ఆ చిన్నరాజ్యాల అధికారులకింద నలిగి పోయారు. ఇతని కాలానికి సంబంధించి కర్నూలు జిల్లా కోవెలకుంట్ల గ్రామంలో క్రీ.శ. 1571 సం॥కు చెందిన శాసనాలు[82] లభిస్తున్నాయి.

మొదటి శ్రీరంగదేవరాయలు (క్రీ.శ. 1572 - 1585): శా.శ. 1490 (క్రీ.శ. 1568) లో పెనుకొండలో రాజ్యాభిషిక్తుడయ్యాడు. క్రీ.శ. 1572 లో సింహాసన మధిష్ఠించి పాలన మొదలుపెట్టాడు ఇతని పేరిట అనంతపురం జిల్లా వడిగేపల్లి గ్రామంలో క్రీ.శ. 1573 వ సం॥కు చెందిన, కర్నూలు జిల్లా మిడుతూరు గ్రామంలో క్రీ.శ. 1581 సం॥కు చెందిన శాసనాలు లభిస్తున్నాయి.

రెండవ వెంకటపతిరాయలు (క్రీ.శ. 1586 - 1614) మధ్యకాలంలోను, రెండవ శ్రీరంగ దేవరాయలు (క్రీ.శ. 1614 - 1619) మధ్యకాలంలోను, రామ దేవరాయలు (క్రీ.శ. 1619 - 1629) నడిమి కాలంలోను, మూడవ వెంకటపతి రాయలు (క్రీ.శ. 1630 - 1642) మధ్యకాలంలోను, మూడవ శ్రీరంగ దేవ రాయలు (క్రీ.శ. 1642-1678) మధ్య కాలంలోను పరిపాలించారు. కర్నూలు జిల్లా చిన్న అహోబలం గ్రామంలో శ్రీ వీరప్రతాప శ్రీ వెంకటరాయల శాసనంలో క్రీ.శ. 1586 వ సం॥ పేర్కొనబడింది.[84] కడప జిల్లా, కోకటం గ్రామంలోని క్రీ.శ. 1589 వ సం॥కి చెందిన శాసనం, అనంతపురం జిల్లా మధురాపురం గ్రామంలోని క్రీ.శ. 1590 వ సం॥కి చెందిన శాసనం, చిత్తూరు జిల్లా నారాయణవనం గ్రామంలోని క్రీ.శ. 1590వ సం॥కి చెందిన శాసనాలు[85] రెండవ వెంకటపతి రాయలను పేర్కొన్నవే! కడప జిల్లా సిద్దవటం గ్రామంలోని సీస పద్యాలతో కూడిన ప్రశంసా (ప్రశస్తి) పూర్వక మైన క్రీ.శ. 1605 సం॥కి చెందిన శాసనమూ రెండవ వెంకటపతిరాయల కాలంనాటిదే.[86]

రామదేవరాయలను పేర్కొన్న క్రి.శ. 1622, క్రి.శ. 1626 కాలాలకు సంబంధించినవి - మొదటిది కర్నూలు జిల్లా వెంకటాద్రిపాలెం గ్రామంలోను, రెండవది అనంతపురం జిల్లా అనుంపల్లి గ్రామంలోను లభించాయి.[87] వెంకటాద్రిపాలెం గ్రామ శాసనం పూర్తిగా సంస్కృతంలో ఉంది.

మూడవ శ్రీరంగరాయదేవ మహారాయలను పేర్కొన్న కర్నూలు జిల్లా కోవెలకుంట్ల గ్రామంలోని క్రి.శ. 1643 వ సంవత్సరంకు సంబంధించిన, అనంతపురం జిల్లా కొడిగేపల్లి గ్రామంలోని క్రి.శ. 1645 సంవత్సరంకు చెందిన, ఇదే జిల్లా గంగవరం గ్రామంలో 1656వ సం॥కి చెందిన శాసనాలు[88] లభిస్తున్నాయి.

అరవీటి వంశంతోపాటు విజయనగర సామ్రాజ్యం కూడ అంధకారంలో అంతరించింది.

విజయనగర రాజులకాలంలో రాయలసీమలోని చాలా ప్రాంతాల్లో అనేక విధాలైన శాసనాలు రాజులు వేయించినవేకాక, రాజులపేరిట కొందరు స్థానిక ప్రముఖులు వేయించినవి కూడా ఉన్నాయి. ఆ శాసనాల్లో ఆ కాలపు సాంఘిక, ఆర్థిక, రాజకీయ పరిస్థితులకు దర్పణాలుగా నిల్చిన సంఘటనలు కోకొల్లలు. వర్తక వ్యాపారాలు. పన్నులు, సుంకాలు, దానాది విశేషాలు మొదలైనవన్నీ ఈ శాసనాల్లో చోటు చేసుకున్నాయి. ఇన్ని రాజవంశాల పరిపాలన అనంతరం క్రి.శ. 17 వ శతాబ్ది చివరి భాగంనుండి రాయలసీమ ప్రాంత పరిస్థితులు చాల అస్తవ్యస్తంగా తయారయ్యాయి. ఉత్తర భారతాన మొగలాయి సామ్రాజ్యం విచ్ఛిన్నమైంది. ఈ ప్రాంతమంతా హైదరాబాదు సుబేదారుని పరిపాలనలో ఉన్నది. మహారాష్ట్రులు అప్పుడప్పుడు ఈ హైదరాబాదు అధికారులపై దండయాత్రలు చేస్తూ వచ్చారు. వీటి ఫలితంగా సాండూరు, పెనుగొండ, గుత్తి, గుర్రంకొండ మొదలైన దుర్గాలను, వీటి దగ్గరి ప్రదేశాల్ని వారు ఆక్రమించుకొని 'చౌతు' అనే పన్నును అప్పుడప్పుడు వసూలు చేస్తూ ఉండేవారు. దీనితో పాటుగా కడప, కర్నూలు, ఆదోని నవాబులు నైజాం (హైద్రాబాద్) నవాబుపై తిరుగుబాటు చేయడం కూడా అప్పుడప్పుడు జరుగుతూ వుండేది. నవాబుల కింద వుండిన పాలెగాళ్ళు ప్రజలనుండి అనేక పన్నులు పిండుతూ వచ్చారు. అధికారాలకై ప్రాకులాడుతుండిన మహారాష్ట్రులు, నైజాము నవాబులకు మధ్యలో

మైసూరు సుల్తాను హైదర్ అలీ క్రీ.శ. 1763 లో కడుసమర్థంగా దూరదృష్టితో ప్రవేశించాడు. ఒక్కొక్క రాజవంశంలోని రాజులు వారివారి పరిపాలనా కాలాల్లో అనేక సంస్కరణలు చేయడం, పన్నులు సుంకాలు విధించడం, వాటికి మళ్ళీ మినహాయింపులు యివ్వడం వంటివి కూడా చేశారు.

ఢిల్లీ సుల్తాన్ మహమ్మద్‌బిన్ తుగ్లక్ ప్రతినిధిగా కంపిలి రాజ్యాన్ని పరిపాలిస్తున్న సంగమ వంశానికి చెందిన మొదటి హరిహరరాయలు విజయనగర రాజ్యస్థాపకుడు. ఆయన గురువు శ్రీ విద్యారణ్య స్వాములవారి ఆశీస్సులతో విజయనగర సామ్రాజ్యములోని అంతర్భాగంగా రాయలసీమ నాలుగు జిల్లాలు, మూడు పువ్వులారు కాయలుగా విలసిల్లినాయి.

## పరిపాలనా వ్యవస్థ :

"పాలకులకు పాలితులకు మధ్య ఉండే అంతస్సూత్రమే పరిపాలన." ప్రాణి సర్వావస్థలకు దేవుడెలా కారణభూతుడో తమ సుఖదుఃఖాలకూ దేవుడే రాజు రూపంలో సాక్షాత్కరించిన కారణ జన్ముడుగా ప్రజలు విశ్వసించేవారు. రాజ శాసనాన్ని అధికారులు అమలు చేస్తే ప్రజలు వాటిని శిరసావహించేవారు.

ధర్మాన్ని రక్షించడం, ధర్మం చేత రక్షింపబడటం కనీస ధర్మంగా భావించారు ఆనాటివారు. దేవాలయాలు, విద్యాలయాలు, ధార్మిక పీఠాలు - వీటన్నింటినీ నడిపించే అధినేతలు, వీటిని సాంస్కృతిక, మతకేంద్రాలుగా, పరిపాలనా వికేంద్రీకృత వ్యవస్థలుగా తీర్చిదిద్దారు. మానవత్వం, విశాల హృదయం కల్గిన ఇలాంటి సంస్థలు విశ్వశ్రేయస్సుకు దారి తీసిన సందర్భాలు మన శాసనాల్లో, చరిత్రలో కన్పిస్తాయి.

ఒక్కొక్క రాజ వంశ పరిపాలన ఒక్కొక్క రీతిలో సాగింపబడినా ప్రధాన పద్ధతిలో మాత్రం అంతగా భేదం కన్పించదు. కాకతీయుల పరిపాలనా విధానం, రెడ్డిరాజుల పరిపాలన వ్యవస్థ ఇంచుమించు ఒకేరీతిలో ఉన్నాయి. ఈ రెండింటి కంటే విజయనగర రాజుల పాలన విశిష్టంగా, విలక్షణంగా కన్పిస్తుంది. ఆటు తర్వాత నాయక రాజుల పాలన మరో ప్రత్యేకతని సంతరించుకుంది. చాలా ప్రాచీన రాజవంశాలు, వారి పరిపాలనా వ్యవస్థలు కేవలం

పరిమితమైన రాయలసీమ తెలుగు శాసనాలనుబట్టి మాత్రమే విశ్లేషించడానికి సులభసాధ్యంకాదు. రేనాటి చోళులు, వీరికి ప్రాచీనులైనవారు కేవలం దానాలు, రాజ్య విస్తరణలు చేసుకొని మనుగడ సాగించారు కానీ, ప్రత్యేకించిన పరిపాలనా వ్యవస్థతో రాణించారని చెప్పజాలము. ఇదివరకు చెప్పినట్లు, రాయలసీమ ప్రాంతాన్ని అనేక రాజవంశాలవారు పాలించినా, అన్ని రాజవంశాలవారి పరిపాలనా విధానాలు శాసనాల ద్వారా ప్రత్యక్షంగా తెలియడానికి వీలు కల్గడం లేదు. అయితే, కొన్ని ప్రధాన రాజవంశాలవారి పరిపాలనా విశేషాలు, విధానాలు చాలా శాసనాల ద్వారా తెలియవస్తున్నాయి.

## కాకతీయుల పరిపాలనా విధానం :

రాజు సర్వాధికారి. సర్వసైన్యాధ్యక్షుడు. న్యాయనిర్ణేత. రాజనీతిజ్ఞుడు. యుద్ధ విశారదుడు. ప్రజా రంజకుడు. శత్రు భయంకరుడు. ధర్మశాస్త్రాలు ఏ విధంగా ఉండాలని చెప్పాయో ఆ విధంగానే ప్రధాన పరిపాలకుడైన రాజు ఉన్నట్లు చరిత్ర చెప్తుంది. కాకతీయులు సార్వభౌమత్వానికి భిన్నమైన వ్యవస్థను స్థాపించడానికి ప్రయత్నించినట్లు తెలుస్తుంది. సామంతరాజుల (**Feudatories**) మీద నామకః అధిపత్యాన్ని నెరపుతూ, వారికి స్వతంత్ర పాలనచేసే అవకాశ మిచ్చినట్లు తెలుస్తుంది. మాండలిక విధానం కాకతీయుల కాలంలో చక్కగా నిర్వహించబడింది. దీనివల్ల అధికార వికేంద్రీకరణ జరిగింది. మధ్యయుగంలో వచ్చిన మౌలిక మార్పుగా దీన్ని గుర్తించవచ్చు.

కేంద్ర పాలన : మంత్రిమండలి సలహా సంప్రదింపులతో రాజు పరిపాలన నిర్వహించేవాడు. మంత్రిమండలి మహాప్రధాని అధ్యక్షతన పనిచేస్తుంది. ప్రధాని, ప్రెగ్గడ, అమాత్యులు, మంత్రులు ఈ మంత్రిమండలిలో ఉంటారు. ఈ అధికారుల విధులు, అధికారాల మధ్య తేడాలు తెలుసుకోవటానికి ఆధారాలు లభించటం లేదు. సౌలభ్యం కొరకు డెబ్బైరెండు శాఖలుగా పరిపాలన విభజింపబడింది. ఈ శాఖలే బహత్తర నియోగాలు. ఈ శాఖలన్నీ బాహత్తర నియోగాధిపతి అజమాయిషీలో ఉండేవి. మంత్రులు, సాహిణులు, ప్రెగ్గడలు ఈ పదవిని నిర్వహించినట్లు ఆధారాలు ఉన్నాయి. ఉదా : గంగయ సాహిణి, ఇందులూరి అన్న మంత్రి, మహాప్రధాని మల్లయ ప్రెగ్గడ.

**రాష్ట్ర - స్థానిక పాలన :** పరిపాలనా సౌలభ్యం కోసం దేశాన్ని నాడులుగా విభజించారు. నాడులు స్థలాలుగా విభజింపబడ్డాయి. ఒక్కొక్క స్థలం ఇరవై గ్రామాలు లేక అంతకు తక్కువ గ్రామాల పరిమితిలో ఉంటుంది. నాడు యొక్క పరిపాలనా బాధ్యత స్థల కరణాలు, స్థాయి ఉద్యోగులకు అప్ప గించబడింది. గ్రామం అతి చిన్న పరిపాలనా విభాగం. గ్రామపాలన ఆయగా ర్లనబడే ఉద్యోగులు నిర్వహించేవారు. రెడ్డి, కరణం, తలారి మొదలైనవారు గ్రామోద్యోగులు. కాకతీయుల కాలంలోనే గ్రామపాలన గ్రామసభల అధీనం నుండి తప్పుకొని ఆయగార్ల హస్తగతమయింది. ఈ ఆయగార్లలో ఊరి ఆయ కట్టు, గుడికట్టు లెక్కలు, ఆదాయం పన్నులు మొదలైనవాటి లెక్కలు చూసే వాడు కరణం. పన్నులు వసూలు చేసేవాడు రెడ్డి. ఊరిని కాపుదల చేసి రక్షించే వాడు తలారి. మిగతావాళ్ళు కమ్మరి, కుమ్మరి మొదలైన వృత్తి పనులు చేసే వాళ్ళు. ఈ ఆయగార్లు గ్రామసేవకులే కానీ గ్రామాధికారులు కారు. ప్రభుత్వో ద్యోగులు కారు. దేవాదాయ, బ్రహ్మదేయ గ్రామాలలో ఆయగార్లు ప్రభుత్వంతో సంబంధం లేకుండా గ్రామ మహాజన సభకు, దేవస్థానానికి లోబడి పనులు చేసేవారు.

**సైనిక పాలన-నాయంకర విధానం :** 'విజయంకన్న గొప్ప సంతోషం ఓటమికన్న గొప్ప దుఃఖం' లేదన్న నమ్మకం ఆనాటి పాలకుల్లో బలంగా నాటుకుపోయి వుండటంవల్ల ఏ విధంగానైనా శత్రువుని తుదముట్టించడమే ధ్యేయంగా పెట్టుకొన్న రాజులకు పటిష్ఠమైన సైనిక వ్యవస్థను ఏర్పరచుకోక తప్పిందికాదు. విజయనగర సామ్రాజ్య చరిత్రలో చాలా ప్రాముఖ్యం పొందిన నాయంకర వ్యవస్థకు పునాదులు వేసింది కాకతీయులే. అవసరమైనప్పుడు రాజుకు సైన్యాన్ని సమకూర్చే పద్ధతిలో నాయకులకు కొన్ని గ్రామాలమీద పన్ను వసూలు చేసుకునే అధికారాన్నిచ్చే పద్ధతి నాయంకర విధానం. కాకతీయ సామంతులు కూడా ఇదే విధంగా సైన్యాన్ని రాజుకు అవసర సమయంలో పంపడం ఉంది. ప్రతాపరుద్రుడు ఈ నాయకులకు డెబ్బై ఏడు కోటల మీద అధికారాన్ని, రాజ్యంలో నాలుగోవంతును యిచ్చినట్లు ప్రతాప చరిత్ర చెప్తుంది. రాజు సర్వ సైన్యాధిపతి అయినా దండనాథుడు, సకల సేనాధిపతి, సేనాధిపతి మొదలైన సైనికోద్యోగులు కూడా ఉన్నారు. గజ సైన్యం, అశ్వసైన్యం బలంగా ఉండనేందుకు నిదర్శనం సాధనికులనే ఉద్యోగులు గజయూథ

శిక్షణలో, అశ్వికయోధ శిక్షణలో ఆరితేరి ఆయా బలాలకు ఆధిపత్యం వహించి నట్లు ఆధారాలుండటమే. 'గజసాహిణి' శాసనాల్లో ఎక్కువగా కనిపిస్తుంది. ఈ నాయకులేగాక, లెంకలనబడే రాజు అంగరక్షకులకు కూడా నాయంకరాల మీద ఆధిపత్యం ఉండేది. ఈ లెంకలు కూడా సైన్యాన్ని పోషించేవారు. సైనికోద్యోగు లకు కూడా పోషణకు వృత్తి మాన్యాలు ఇచ్చేవారు. దినసరి వేతనము ఇచ్చే పద్ధతిలో కూడా కొంత పదాతిదళం ఉండేది. కైజీతగాండ్లు, చేజీతగాండ్లు ప్రస్తావన పల్నాటి వీరచరిత్రలో కన్పిస్తుంది.89

సమయం : ''నేటి ఉద్యోగుల సంస్థల్లాంటివి సమయాలు. మధ్యయుగ సంఘంలో చాలా ప్రాచుర్యంలో ఉన్న అంశం సమయ విధానం. సమయాలు ప్రజలలో సహకారం పెంపొందడానికి ఉపయోగపడే విధంగా రూపొందాయి. ప్రతి సమయానికి కొన్ని ఆచారాలు, నియమాలు, దాని ప్రకారం అధ్యక్షుడు ఉండేవాడు. సమయాధ్యక్షుని నియామకం అతని తెలివితేటలు, అనుభవం, నీతి నియమాలు, సామర్థ్యం ఆధారంగా సభ్యుల పరస్పర అంగీకారంతో జరుగు తుంది నేరస్థునికి రాజదండనతోపాటు సమయదండన కూడా ఉండేది.''90

## రెడ్డి రాజుల పరిపాలనా విధానం :

"రెడ్డి రాజుల పరిపాలనా విధానం కాకతీయుల, తమ సమకాలీనులైన విజయనగర రాజుల పాలనా విధానాలవలెనే వుంది. రాజు, మంత్రి, రాజ్యం, దుర్గం, కోశం, సైన్యం, సామంతులు - ఈ యంత్రాంగమంతా ఉంది. రాజే సర్వాధికారి. మంత్రి మండలి సలహాతో రాజు రాజ్యాన్ని పాలిస్తాడు. రాజ్య భాగాల్ని తమ సౌలభ్యం కోసం భూములుగా, సీమలుగా, నాడులుగా విభజిం చారు.

వివిధ సుంకాలు, పన్నులు కూడా విధింపబడ్డాయి."91

## విజయనగర రాజు పరిపాలనా విధానం :

"విజయనగర సామ్రాజ్య పాలకుల్లో సుప్రసిద్ధుడైన కృష్ణదేవరాయల ఆముక్తమాల్యదలో రాజనీతి విపులంగా వర్ణింపబడింది. ఉత్తమ ప్రభువు ఎలా ఉండాలి? పరిపాలన ఎలాచేయాలి? సామంతులను ఎలా లొంగదీసుకొని ఉండాలి?

రాజుకు మిత్రులెవరు? శత్రువులెవరు? మొదలైన విషయాల్ని విపులంగా వివరించాడు. తన పాలనలోకూడా రాయలు అదే విధమైన జాగ్రత్తలు తీసుకొన్నట్లు గ్రహించవచ్చు.

కృష్ణదేవరాయలు బహిరంతశ్శత్రువుల నుంచి రక్షణ కొరకు గూఢచారులను నియమించినా, రాత్రులు తాను స్వయంగా 'నగర శోధన' చేసి చారులు తెచ్చిన వార్తల సత్యాసత్యాలను తెలుసుకునేవాడని రాయవాచకం చెప్తుంది. రాజులు స్వయంగా రాజ్య వ్యవహారాలు చూసుకునేవారు."92

కేంద్ర పాలన : "మంత్రులు, అనుకూలులైన సామంతులతో ఏర్పరచిన మంత్రిమండలి సహాయంతో చక్రవర్తి పరిపాలన జరుపుతాడు. ముఖ్య అధికార్లతోను, రాజప్రతినిధులతోను రాజ్యవ్యవహారాల గురించి సంప్రదింపులు జరిపేవాడని పోర్చుగీసు యాత్రికుడు న్యూనిజ్ (నన్నజ్) రాశాడు. అర్హులైన వారినే మంత్రులుగా తీసుకొనేవారు. కొందరు రాజోద్యోగుల ప్రసక్తి చారిత్రక గ్రంథాల్లో ఉంది. సంప్రతులు బొక్కసానికి సంబంధించిన వ్యవహారాలు చూస్తారు. ప్రధాన గణకులుగా కానీ, ప్రధాన కార్యదర్శులుగా కానీ వీరని భావించవచ్చు. రాయసం పేరుతో వ్యవహరింపబడే ఉద్యోగి చక్రవర్తి ఆజ్ఞలను రాసుకునేవాడు. చక్రవర్తి అంతఃపురంలో ఉన్నప్పుడు మొగసాలలో జనం దర్శనంకోసం ఉన్నప్పుడు గుర్తు చేయడానికి 'అవసరంవారు' అనబడే ఉద్యోగులు ఉండేవారు. రాచకరణాలు ప్రభుత్వ లెక్కలు చూసుకునేవారు."93

రాష్ట్రీ స్థానిక పాలన : "విజయనగర సామ్రాజ్యం కొన్ని రాజ్యాలుగా విభజింపబడింది. రాజ్యం సీమలుగా, సీమ స్థలాలుగా విభజింపబడింది. ప్రతి స్థలంలో నియమిత సంఖ్యలో గ్రామాలుంటాయి. ఒక బలమైన కోట, దానిచుట్టూ ఉన్న మండలం, ఆ కోటపేరుతో రాజ్యంగా పిలువబడుతుంది. దుర్గనాయకుని భృతికి భూము లివ్వబడినాయి. అమర నాయకులకు పాలెగార్లకు ఇవ్వగా పోను 'రాజ్యం'లోని గ్రామాల మీదనే దుర్గ నాయకునికి అధికారం. ఇతడు కూడా చక్రవర్తికి నిర్దిష్ట సంఖ్యలో సైన్యాన్ని అవసర సమయంలో పంపాలి. దుర్గ నాయకుడు రాజధానిలో ఉంటాడు. అతని తరఫున ప్రతినిధి పరిపాలనా వ్యవహారాలను చూస్తాడు. అతనే కార్యకర్త. అతనే ఆ రాజ్యానికి సంబంధించిన సర్వ

వ్యవహారాలు చూసుకుంటాడు. సీమ వ్యవహారాలు చూసే అధికారి పారుపత్య గాడు. స్థల వ్యవహారాలను 'స్థల కరణం' చూసుకుంటాడు. చుట్టుప్రక్కల గ్రామాల ఉద్యోగులతో కలిసి స్థానిక వ్యవహారాలు, తగాదాలు విచారించే హక్కు స్థలకరణానికికుంది. అధికారి అనే ప్రత్యేక పదవి శాసనాల్లో కనిపి స్తుంది. ముఖ్యమైన నగరాల్లోను గ్రామాల్లోను ఈ అధికారిని రాజు నియమి స్తాడు."94

సామంతరాజులకు చక్రవర్తులు కొన్ని గ్రామాల్ని ఇవ్వడంవలన వారిని అమరనాయకులని పిలిచారు. చక్రవర్తి అధీనంలో కొంతమంది పాలెగాళ్ళు కూడా వుండేవారు. వీరు సైన్యానికి నాయకులుగా, సైన్యనాయకులుగా పిలువ బడినారు. చక్రవర్తి సామంతులు చెల్లించే కప్పంలో కొంతభాగం సైన్యం ఖర్చుకు వినియోగిస్తాడు. సర్వసైన్యాధ్యక్షుణ్ణి దండనాయకుడు, దన్నాయకుడు అనేవారు.

గ్రామస్థాయిలో గ్రామరక్షకుడు తలారి. ఇతనికి తలారి కట్నం అని మామూళ్ళు ఇచ్చేవారు. తలారు లందరి మీద తలారి జంగమయ్య అనేవాడు అధిపతిగా ఉండేవాడని రాయవాచకం చెప్తుంది.

విజయనగర రాజుల కాలంలో వారపు సంత లుండేవి. వర్తకులంతా శ్రేణులు (Guild) గా ఏర్పడి, కొన్ని అధికారాలను కల్గి ఉండేవారు.

దేవాలయానికి, మఠానికి సమున్నతమైన స్థానం ఉండేది. విజయనగర చక్రవర్తులు, అధికారులు, ప్రజల్లో సామాన్యులు కూడా తమ తమ శక్త్యనుసారం దేవాలయాలకు, వాటి నిర్వహణల నిమిత్తం అనేక మాన్యాలు, గ్రామాలు, రక రకాల విలువైన కానుకలు దానం చేసి, తమ భక్తి ప్రపత్తుల్ని నిరూపించు కున్నారు. వీటికి తార్కాణంగా అనేక శాసనాలు ఉన్నాయి.

దేవాలయ ఉద్యోగుల్లో అనేక తరగతులవారున్నారు. ఆదాయవ్యయాలు చూసుకునే అధికారులు, స్థానాపతులు, కరణాలు మొదలైనవారు. వీరిలో కొందరు దేవుని సేవకై సేవకులు ఉండేవారు. వీరినే నిబంధకాండ్రు అంటారు. భారతీయ నాగరికతా చిహ్నంగా, సంస్కృతికి సంకేతంగా చక్రవర్తుల (రాజుల) భక్తి

భావాలకు, శ్రద్ధకు ప్రతీకగా ఆనాటి దేవాలయాలు ప్రజల మనోభావాలకు అద్దం పట్టేవిగా ఉండినాయి. రాజు, అధికారులు- వీరి పరిపాలనా విధానాన్ని బట్టే ప్రజా జీవనం జరిగేదని ఆనాటి శాసనాలు వ్యక్తం చేస్తున్నాయి. నాటి పరిపాలనా వ్యవస్థలో శాసనస్థమైన కొన్ని పరిపాలనా సంబంధమైన సమస్యలు - పరిష్కారాలు మొదలైన విశేషాలు మనకు ప్రత్యక్షంగా గోచరిస్తాయి. అనాడు పాలకులు విధించిన సుంకాలు - పన్నులు, ప్రజలు వాటిని చెల్లించలేక బాధపడడం వంటివి మనకు శాసనాల్లో కన్పిస్తాయి. వీటికి సంబంధించిన వివరాలు 'పన్నులు - సుంకాలు' అన్న ప్రత్యేక అధ్యాయంలో వివరించబడినాయి.

అనంతపురం జిల్లా కసగానపల్లి గ్రామంలోని క్రీ. శ. 1533 వ సం॥ నాటి అచ్యుతరాయల కాలంనాటి ఒక శాసనంలో[95] పంచాళంవారైన (వడ్రంగి, కమ్మరి, కంచరి; కంసాలి, కాసె [వడ్డి] ) ఈ అయిదు రకాల వృత్తులవారు పన్నులు కట్టలేని స్థితిలో పాకాల ప్రాంతానికి వలస వెళ్ళగా, మళ్ళీ వాళ్ళందర్నీ ఆ 32 గ్రామాల రెడ్లు, కరణాలున్ను వెనక్కు పిల్చుకొనివచ్చి, వారి వృత్తులపై అన్ని పన్నులను మినహాయించినట్లుగా పేర్కొనబడింది.

ఇదే జిల్లా, బుక్కపట్నం గ్రామానికి చెందిన క్రీ.శ 1542 వ సం॥ నాటి ఒక శాసనంలో[96] బ్రాహ్మణులను పెండ్లి సుంకం నుండి మినహాయించినట్లు వివరించబడింది.

కర్నూలు జిల్లా త్రిపురాంతకం గ్రామంలోని క్రీ.శ. 1245 వ సం॥ కాకతి గణపతిదేవ చక్రవర్తి కాలమునాటి శాసనంలో[97] అతని ప్రతినిధి పోచన ప్రెగ్గడ గణపయ్య అనేవారు గణపతిదేవుని ధర్మంగా 300 పెఱుక ఎడ్లను (రెండు పక్కల ధాన్యాదులు పోసి ఎద్దు, గుఱ్ఱం మొ॥ జంతువుల మీద మోయించెడు గోనెమూట [పెఱుకను మోసుకొని తెచ్చు ఎడ్లు] శ్రీ త్రిపురాంతకేశ్వరుని సేవలకుగాను ఉపయోగించేందుకున్నూ; వాటిపైన యెలాంటి సుంకం విధించకూడదని శాసించినాడు. ఇతడు సర్వాధికారిగా ఇలాంటి శాసనాలు వేయించినాడు.

మధ్యయుగపు శాసనాల్లో రాజులు, ఇతరులు కేవలం దేవాలయాలకు, కొంతమంది కళాకారులకు, వృత్తి పనివారలకు గ్రామ, భూదానాదులు, దేవర, దేవతల అఖండ దీపాలకు మొదవులు, గొఱ్ఱెలు, మేకలు, ఇతర కానుకలు

ఇవ్వడం వరకు ఉంది. పన్నులు, మాన్యాలు- వీటి విషయాలు తప్పితే, ప్రత్యేకంగా పరిపాలనా సంబంధమైన విషయాలు తెలిపే శాసనాలు రాయల సీమలో కన్పించవు. కాకతీయుల కాలంలోని శాసనాలు త్రిపురాంతకం (కర్నూలు జిల్లా) గ్రామంలోనే అధికంగా లభ్యమయ్యాయి. ఆ శాసనాల్లో దేవునికి, దేవ తలకు ఇచ్చిన కానుకలు, గ్రామ, భూదానాలు, మోదాల వంటివి ఉన్నాయి. ఆంధ్రదేశంలోని కాకతీయ చరిత్ర, శాసనాల స్వరూపాన్నిబట్టి వీరి పరిపాలనా విధానాన్ని గూర్చి తెలుసుకోవచ్చు.

కాకతీయుల ఒరవడిలో కొంతవరకు నడిపి, తమ ముద్రలో పరిపాలన నెరపినవారు విజయనగర రాజులు. వీరి పాలనా వైశిష్ట్యాన్ని తెల్పే శాసనాలు, చరిత్రలు రాయలసీమలో కోకొల్లలు. కృష్ణదేవరాయలు, అచ్యుతరాయలు, సదాశివరాయల కాలంనాటి శాసనాలు దాదాపుగా ప్రతి జిల్లాలోను ఉన్నాయి. ఆనాడు ఈ రాజుల పేరిట స్థానిక పాలకులు విధించిన సుంకాలను, ప్రజల కష్ట సుఖాలను గమనించి వాటిని మినహాయించడం చూస్తే, పాలకుల అధికారానికి బలికానట్టి వృత్తి, సామాన్య మానవుడు లేరేమోనని అనిపిస్తుంది.

పాలకులకు పాలితులకు మధ్య అధికార యంత్రాంగం ఒక వారధిగా మాత్రమే ఉపయోగపడితే రాజ్యంలోని ప్రజలకు యే బాధా ఉండదు. పై వాడి పేరు చెప్పుకుని, స్వార్థంతో బతికే ఈ మధ్య దళారీలవంటి అధికారులు సామాన్య ప్రజల్ని, పేదల్ని అనవసర ఇబ్బందులపాలు చేయడం మనకు అక్క డక్కడ శాసనాల్లో కన్పిస్తున్నాయి. అచ్యుతరాయల కాలం నాటి క్రీ.శ. 1553 వ సం॥కు చెందిన అనంతపురం జిల్లా కనగానపల్లి శాసనం ఈ విష యాన్ని ఋజువు చేస్తూంది. దీన్ని సోదాహరణంగా వివరించడం జరిగింది. పరదేశీయుల పాలన, స్వదేశీ రాజుల భోగపరాయణత్వం, ప్రాంతీయ అధికారుల (పాలకుల) స్వార్థం ప్రజలకు ప్రజాస్వామ్యంపై మొగ్గు చూపిందనటంలో యేమాత్రం అతిశయోక్తి లేదు.

**సరిహద్దులు :** క్రయ విక్రయాల్లో కానీ, దానాది విషయాల్లోకానీ పొలము, గ్రామము, ఇల్లు, స్థలము- వీటిని గూర్చిన ఉనికి (Location) ని తెల్పేందుకు నిరయించే విధానమే ఈ సరిహదులు అన్నది. దీనికి పర్యాయవాచకంగా ఎల్లలు,

చెక్కుబందీ అని వాడటంకూడా చాలాచోట్ల జరుగుతూంది. భౌగోళికంగా ప్రపంచపటంలోను, దేశపటాల్లోను, రాష్ట్ర, జిల్లా, సీమ అవధుల్లో ఈ ఎల్లలకు ప్రత్యేక స్థానముంది. సరిహద్దులు నిర్ణయించుకోకపోతే దేశాలమధ్య అస్తవ్యస్త పరిస్థితి యేర్పడుతుంది. ప్రాచీన రాజులు తమ రాజ్యాల్ని విస్తరించుకోవటంలో బలవంతపు యుద్ధాల్ని సృష్టించుకొని మానవత్వాన్ని మంటగలిపిన దారుణ సంఘటనలు చరిత్ర పుటల్లో రక్తాక్షరాలతో నిఖింపబడ్డాయి. అలెగ్జాండర్, అశోకుడు, నెపోలియన్, హిట్లర్ అట్లాంటి వారిలో కొందరు మాత్రమే. రాజ్యకాంక్షకు హద్దూ అదుపూ లేనపుడు పాలకులు పాలించే భూభాగానికి హద్దు వుండదు.

ఒక ప్రాంతాన్ని, స్థలాన్ని దానం లేదా క్రయ విక్రయ పద్ధతుల్లో పేర్కొన్నపుడు దానికి సంబంధించిన ఎల్లలను తెల్పడం నియమంగా చెప్పబడుతుంది. ఆ స్థలాన్ని గూర్చిన పొడవు వెడల్పులు (వైశాల్యం) గణించడం ఒక సంప్రదాయంగా ఉంది. భౌతిక సరిహద్దుల్ని గూర్చిన విషయాలు అక్కడక్కడ శాసనాల్లో పేర్కొనబడ్డాయి.

మనుధర్మ శాస్త్రంలో ఈ ఎల్లలను గూర్చిన వివరణ మార్గదర్శకంగా ఉంది.[98]

సీమాం ప్రతిసముత్పన్నే వివాదే గ్రామయోర్ద్వయోః
జేష్టేమాసిన యేత్సీమాం సుప్రకాశేషు సేతుషు.

—ఇరు గ్రామములకు నెల్లలను గూర్చి సంశయము కలిగినప్పుడు రాజు జ్యేష్ఠ మాసమునందు గడ్డి మున్నగునవి యెండి యుండుటవల్ల చక్కగా కనబడునట్టి యెల్లల గురుతులనుబట్ట యెల్లలను నిర్ధారణ చేయవలయును.

సీమా వృక్షాంశ్చకుర్వీత న్యగ్రోధాశ్వత్థ కింశుకాన్
శాల్మలీన్ సాలతాలాంశ్చ క్షీరిణశ్చైవ పాదపాన్.

—అట్టి ఎల్లలు తెలియుటకై ఎల్లలందు మఱ్ఱి, రావి, మోదుగు, బూరుగు, మద్ది, తాటి, పాలు గారునట్టి అత్తి మొదలగు చెట్లను నాటవలయును.

గుల్మాన్ వేణూంశ్చ వివిధాఞ్చమీ వల్లీ స్థలానిచ
శరాన్ కుబ్జక గుల్మాంశ్చ తథాసీమా నసశ్యతి

—ఊటి చెట్లు మొదలైన ముండ్ల పొదలను ఎల్లల ముగింపునందు నాటి నట్లయిన ఎల్లలు మాసిపోనేరవు.

—చెఱువులు, బావులు, వాగులు, వంకలు, ఊటవెల్లువలు, దేవాలయాలు- ఇట్లాంటివాటిని సరిహద్దుల్లో నిర్మించాలి.

దురాక్రమణ దారులు ఆయాకాలాల్లో ఉంటూనే ఉంటారు. ఇట్లాంటివారు కబళించకుండా ఉండేందుకే రహస్యమైన సరిహద్దులు ఏర్పరచాలి.

రాళ్ళు, ఎముకలు, ఆవు వెంట్రుకలు, బూడిద, ఎండిన ఆవుపేడ, ఇటుకలు, గులకరాళ్లు, ఇసుకవంటి పదార్థాలను ఉపయోగించడం-కాల్చడం లాంటివి చేస్తే ఇతరుల భూభాగాలు కలిసిపోకుండా వుండేవని తెలుస్తుంది.

ఇట్లాంటి గుర్తుల ద్వారా, నీటి ప్రవాహాల ద్వారా పాలకులు వారివారి రాజ్యాల్లోని ప్రజల ఆస్తి పాస్తుల ఉనికి పట్టుల్ని నిర్ణయించడం, తగవులు వస్తే తీర్పులివ్వడం జరుగుతుండేది.

దాన శాసనాలవల్ల ఆయా గ్రామాలకు, పొలాలకు సంబంధించిన పొలిమేర రాళ్ళు అనేక సంకేతాలద్వారా అవి దేవాలయానివో లేక వ్యక్తులవో కూడా నిర్దిష్టంగా తెలిసే అవకాశం ఉండేది.

శాసనాల్లో కూడా క్రీ.శ. 10వ శతాబ్దం తరువాత ఈ సరిహద్దుల్ని గురించిన సుదీర్ఘ అంశాలు, వాటి వివరణలు ఇవ్వబడ్డాయి. మనువు తన ధర్మ శాస్త్రంలో పేర్కొన్నట్లు, ఇతర శాస్త్రాలు ఉటంకించినట్లుగానే చెప్పబడ్డాయి.[99]

కొన్ని గ్రామాల్లోను, పొలాల్లోను మనం శివలింగం, సూర్యచంద్రులు, నంది, పొట్టివ్యక్తి చేతిలో కమండలం, గొడుగు, ఇరువైపులా సూర్యచంద్రులు, శంఖచక్రాలు, మూడు నామాలు-ఇంకా కొన్నిచోట్ల హద్దుల్ని సంకేతించే బాణపు గుర్తులు ఉండిన బండరాళ్ళను చూస్తుంటాము. వీటినే ఆయా ప్రదేశాల సరిహద్దు రాళ్ళుగా చెప్పవచ్చు.

వీటిని అక్కడక్కడ ఇలా వేయడంలో ఆనాటి పాలకులు కొన్ని సంకేతాలను, భూపరిమితులను దృష్టిలో ఉంచుకొని, ప్రజలకు అన్యాయం జరక్కుండా,

ముందు జాగ్రత్తచర్యలుగా ఇలాంటివి వేయిస్తూ ఉండేవారని తెలుస్తోంది. ఈ సరిహద్దు రాళ్ళపై ఆ పొలం సొంతదారుడి పేరుకూడా రాయిస్తుండడం జరుగుతుండేది.

"ఏ వ్యక్తికానీ, సంస్థకానీ ఈ దానాన్ని అర్పిస్తారో ఆ వ్యక్తి యొక్క, సంస్థయొక్క ధర్మపరమైన అంశాలు ఆ సరిహద్దు రాళ్ళపై కన్పిస్తాయి. శైవ ధర్మాన్ని సూచించే బసవణ్ణ, శివలింగం, సూర్యచంద్రులుండే శిల; వైష్ణవ ధర్మాన్ని సూచించే దానం విషయంలో వామనుని చిత్రముండే రాయి (చేతిలో కమండలం, గొడుగుఉండే పొట్టి బ్రాహ్మణాకారం), జైన సంప్రదాయంలోని దాన విషయంలో తీర్థంకరుడు, లేక జైన సాంప్రదాయ చిహ్నాలు మనకు కన్పిస్తాయి. వీటిపై రాతలు పూర్తిగా ఉండవు. ఒకటి రెండు వాక్యాలు ఉండవచ్చు. దానాన్ని యెవరికి ఇచ్చి ఉంటారో వారి ప్రస్తావన మాత్రం ఉంటుంది. ఈ సరిహద్దు రాళ్ళవల్ల దాత ఏ ప్రమాణంలో దానం ఇచ్చి ఉండేదీ సులభంగా గ్రహించ వచ్చు."[100]

రాయలసీమ శాసనాల్లో ఈ సరిహద్దులను (ఎల్లలను) గూర్చిన వివరాలు అనేకం ఉన్నాయి.

కడప జిల్లా తిమ్మారెడ్డిపల్లె గ్రామానికి చెందిన సంవత్సర వివరాలు తెలియని ఒక శాసనంలో[101] 'చిలకాంపల్లెకు ప్రతినామం హరిహరపురం యల్ల' అని ఒక సరిహద్దు రాయిగా వామనుని ఆకారం చిత్రించబడి ఉండడం గమనించవచ్చు.

ఇదే జిల్లా నందలూరు గ్రామంలోని క్రీ.శ. 1501వ సం॥ శాసనంలో[102] కొండలు, కుంటలు, జువ్విమాను మొదలైనవి మేరలుగా అంకిపోడనే గ్రామాన్ని, పర్వతనాయనిం గారు నందలూరు చొక్కనాథదేవునికి దానంగా ఇచ్చిన వివరాలు ఉన్నాయి. ఇది విజయనగర ప్రభువైన ఇమ్మడి నరసింహ రాయల కాలం నాటిది.

కర్నూలు జిల్లా పాణెం గ్రామంలోని క్రీ. శ. 1503 వ సం॥ ఇమ్మడి నరసింహరాయల కాలంనాటి మరొక శాసనంలో[103] హొన్నప్పనాయకుడు అను

వాడు పల్లె కట్టుకోవడానికి స్థానికులకు ఇచ్చిన ధర్మశాసనంలో చతుస్సీమగా, నాల్గువైపులా ఉండే హద్దులుగా తోవలు, కొన్ని శాసనాల రాళ్ళు, కొండమోటు మొదలైనవాటిని పేర్కొన్నారు.

కడప జిల్లా కత్తెరగండ్ల గ్రామంలోని క్రీ. శ. 1525 సం॥ శ్రీకృష్ణదేవ రాయల కాలంనాటి ఒక శాసనంలో[104] అన్నాజయ్య అనువాడు కత్తెరగండ్ల చెన్నకేశ్వర దేవరకు యిచ్చిన భూదానక్రమంలో ఒక్కొక్క దిక్కున వాగులు, వంకలు పొలిమేరలుగా నిర్ణయించి వ్రాసిన వివరాలున్నాయి.

ప్రస్తుత అనంతపురం జిల్లా, పూర్వపు తాడిమర్రి (తాలూకా) గ్రామంలోని మవుజేవెలివుట్ల గ్రామంలోని క్రీ. శ. 1676 వ సం॥ నాటి ఒక శాసనంలో[105] పొలిమేర త్రొక్కడానికి వచ్చినవానికి జయస్థుడైనందుకు జయించిన పొలానికి సరిహద్దులు వేయించి, శిలా శాసనాలు వేయించి నిర్వహించినట్లుగా పేర్కొన బడింది.

కడప జిల్లా మద్దూరు గ్రామంలోని కాల వివరాలు తెలియని పొలిమేర శాసనపు రాతికి[106] సూర్యుడు, లింగం, చంద్రుడు చెక్కబడి ఉన్నాయి. ఇది వరికుంట అనే గ్రామానికి పొలిమేరగా చెప్పబడింది.

ఇదే జిల్లా కత్తెరగండ్ల గ్రామానికి చెందిన క్రీ. శ. 1427 వ సం॥కు చెందిన ఒక శాసనంలో[107] వివాదాన్ని రాజువరకూ తీసుకొని వెళ్ళడం, అక్కడ ఆ తగాదా తీర్చుకొని ఆ తర్వాత వివరంగా రాయించినట్లు తెలుస్తుంది. ఇది ప్రౌఢదేవరాయల కాలంనాటిది.

కడప జిల్లా కవిలింగయపల్లె కొండూరు గ్రామంలోని క్రీ. శ. 1773 వ సం॥ ఒక శాసనంతో[108] కవిలింగయపల్లె సందుకట్టునవారు, కొండూరువారు వివాదపడి తీర్చి తేరుగడ చేసేందును కొండూరి పొలిమేర కాపుదేవి రెడ్డి పుళికి రెడ్డి ప్రమాణపూర్వకంగా తొక్కేటట్టుగా నిర్ణయించినట్లుగా చెప్పబడింది. 21 దినాలు జయకమ్మ కట్టుకొని, కొండపైన కోనేటిలో స్నానంచేసి, ఆర్ద్ర వస్త్రము లతో స్వామి సాన్నిధ్యంలో అఖండదీపం ముట్టించి, తీర్థప్రసాదాలు తీసుకొని, పసులగంధ మెడలో వేసుకుని పొలిమేర తొక్కి 21 దినం జయించి వేసిన

హద్దుల వివరం అని ఒక్కొక్క దిక్కులో దేవళం, కొండబండ, వాకిటి బండ, మూలబండ అని వివరించడం జరిగింది.

ఒక స్థలం యొక్క పొలిమేరలు లేక సరిహద్దులను నిర్ణయించేటప్పుడు ఆ స్థలానికి నాలుగు దిక్కుల్లోని గ్రామాలను, సహజ వనరులను పేర్కొనడం ద్వారా దాని యొక్క ఉనికిని స్పష్టంగా, నిర్దుష్టంగా శాసనంలో నిబంధించేందుకు, గ్రహీతకు శాశ్వతంగా అనుభవించేందుకు అవకాశం అధికంగా యేర్పడింది.

ఒక్కొక్క ప్రాంతంలో కొన్ని కొన్ని ప్రత్యేకించిన, ప్రసిద్ధిచెందినట్టి చారిత్రాత్మక స్థలాలు, సహజ స్థలాలు ఉంటాయి. వాటిని ఆయా దిశల్లో పేర్కొంచేనే పొలాల, ఇండ్ల ఉనికిని గుర్తించేందుకు సులువుగా వుంటుంది. తెలుగు శాసనాల్లో కాలువలు, చెట్లు, త్రోవలు, కొండకోనలు మొదలైనవి స్పష్టంగా చెప్పబడి ఉన్నాయి.

గ్రామాల్లో తగాదాలు యేర్పడినపుడు గ్రామ పెద్దలు అన్నీ తీర్చలేరు. ఆ సమయంలో రాజు వద్దకు వెళ్ళి ఆయన ఆజ్ఞలను శిరసావహించేవారు. ఒక్కొక్కసారి జయకమ్మ కట్టుకొని, తడిబట్టలతో పొలిమేర తొక్కడంవంటి సాంప్రదాయాలద్వారా, తమ నమ్మకాలను దృఢపరచుకొనేవారు.

పొలిమేరలు పొలాలకు గ్రామాలకు మాత్రమేకాక, ఆయా దేశాలకు కూడ హద్దు గీతలు. రాజైనా, రైతైనా వారివారి హద్దుల్లోనే ఉండాలన్నది ప్రధాన ధ్యేయం. సముద్రానికి చెలియకట్ట, గ్రహరాశులకు వాటి పరిధులు పొలిమేరలే! సాక్షులుగా, మత చిహ్నాలుగా, విశ్వాసాల ప్రతీకలుగా, సరిహద్దుల సంకేతాలుగా సూర్య చంద్రాదులను సరిహద్దు బండరాళ్ళపై మలిచారని చెప్పవచ్చు.

## బాహత్తర నియోగాలు (డెబ్బదిరెండు వినియోగాలవారు):

రాజరిక వ్యవస్థల్లో వృత్తి వంశ పారంపర్యం అన్నది ఒక వ్యవస్థగా రూపుదిద్దుకొనగా, దానికి తగిన పరివారం, మందీ మార్బలం లేకుండే పరిపాలన సజావుగా సాగడం జరగదు అన్నది నగ్న సత్యం. మంత్రాంగం, దానికి తగిన

యంత్రాంగం రాజుకు రెండు కళ్ళవంటివారు రాజ్య విస్తీర్ణం ప్రజల సంఖ్య, వనరులు- వీటినిబట్టి రాజ పరివారములోని వారి సంఖ్య ఉండేదని తెలుస్తూంది. అయితే, రాజ్యం యెంత చిన్నదైనా ఒక్కొక్క శాఖకు ఉండవలసిన కనీస అధికారులు ఉండక తప్పదు.

కాకతీయులు, రెడ్లు, విజయనగర రాజుల కాలంలో అధికారుల సంఖ్య, అధికారాల వినియోగము సందర్భోచితంగా జరిగిందని శాసనాలు, సాహిత్యము చెబుతున్నాయి. ముఖ్యంగా కాకతీయ రాజుల కాలంలో అధికారులను డెబ్బై రెండు విధాలైన వైవిధ్యాలతో కూడిన వారుగా యేర్పరచారు వీరిని సామూహికంగా బాహత్తర నియోగులుగా చెప్పారు. వీరి అత్యున్నత అధికారి బాహత్తర నియోగాధిపతి. అతని పర్యవేక్షణలో మిగత అధికారులు తమతమ విధుల్ని నిర్వర్తించేవారని తెలుస్తోంది. తూర్పు చాళుక్యుల కాలంలో నియోగాధి కృత లేక నియోగాధి వల్లభ అనే పేరు కల్గిన ఒక పర్యవేక్షక అధికారి ఉన్నట్లు తెలుస్తూంది తర్వాత ఇతడే బాహత్తర నియోగాధిపతిగా పరిణామం చెంది ఉండవచ్చు.

కల్యాణి పశ్చిమ చాళుక్యులకు సామంతులుగా ఉండిన కాకతీయులు, అన్య రాజకీయ సంబంధాల నుండి పారంపర్యమైన ఈ విభాగ క్రమాన్ని సరళిలో యేర్పరచారు. గణపతిదేవ మహారాజు గంగయ సాహిణి అనే కాయస్థ ప్రముఖుని క్రీ.శ. 1251 లో బాహత్తర నియోగాధిపతిగా నియమించినట్లు, అతనిపై గల విశ్వాసంతో ఆ పరిపాలనా ప్రాంతాన్ని పానుగల్లు వరకు విస్తరింప చేసినట్లు SII X No. 332 శాసనం చెపుతూంది.

రాణి రుద్రమదేవి అధికారం కింద కాయస్థ ప్రముఖుడు త్రిపురాంతకానికి చెందిన త్రిపురారి మహాప్రధానమల్లయ ప్రగ్గడ ఈ అధికారంలో ఉన్నట్లు మరొక దృష్టాంతం చెపుతోంది.[109]

డెబ్బైరెండు నియోగాలను, వారివారి అధికార నామాలను దిగువ పేర్కొనడం జరిగింది. దీనికి ముందుగా నియోగం అన్న పదానికిగల అర్థ పరిమితిని పేర్కొనడం సముచితము. 'నియోగము - ఆజ్ఞ, ఆజ్ఞాపించిన పని, పరిజనము మొ॥ నియోగి - నియోగించెడు అధికారము కలవాడు, ఒక తెగ బ్రాహ్మణుడు నియోగుఁడు - నియోగించుటకు తగిన యోగ్యత కలవాడు (ప్రభువు)'[100]

"నియోగములు-పదములు, ఉద్యోగములు, ప్రభుత్వ కొలువుకూటమున నుండెడి వివిధ రాజకీయ సైనికోద్యోగములవారు, రాజాంతఃపుర సేవకులు, వాద్య వైద్య నాట్యాది వివిధ కళాపారీణులు, వేశ్యాజనములు మొ॥ డెబ్బదిరెండు నియోగములవారు కలరు. వీరికే బాహత్తర నియోగమువానియు, వీరు వహించు పదములకు బాహత్తరి నియోగములనియు పేర్లు."111

డెబ్బదిరెండు నియోగములు:112

1. గురు - గురువు (శిక్షకుడు); 2 మహాప్రధాని (ప్రధాని); 3. సామంత (సామంతుడు); 4. సేనాపతి - సైన్యాధిపతి; 5. ద్వారపాలక - ద్వారపాలకుడు; 6. అవసారిక - అంతరంగికుడు (ఆప్తస్నేహితుడు); 7. ఘటికా నిర్ధారిక - కాలనిర్ణాయకుడు (నిర్ధారకుడు); 8. గణక - గణకుడు (లెక్కలు చూచేవాడు); 9. లేఖక - లేఖకుడు (వ్రాయసగాడు) 10. పౌరాణిక - పౌరాణికుడు, (పురాణ పఠనంచేసే బ్రాహ్మణుడు); 11 పురోహిత - పురోహితుడు; 12. జ్యౌతిషిక - జ్యోతిష్కుడు; 13. కావ్యజ్ఞ - కవి; 14. విద్వజ్జన - విద్వాంసుడు, 15. దేవతార్చక - గృహదేవతార్చన చేసే ప్రత్యేక బ్రాహ్మణుడు, 16. మాల్యకారక - మాలాకరుడు (పూలదండలు తయారుచేసేవాడు); 17. పరిమళకారక - సువాసన ద్రవ్యాలు చేసేవాడు; 18. గోష్ఠాధికార - గోశాలాధ్యక్షుడు; 19. గజాధికార - గజశాలాధ్యక్షుడు; 20. అశ్వాధికార - అశ్వశాలాధ్యక్షుడు; 21. భాండాధికార-కోశాధికారి; 22. ధాన్యాధికార - ధాన్యాగారపు అధ్యక్షుడు; 23. అంగరక్షక - అంగరక్షకుడు - 24. సూత - రథచోదకుడు. 25. సూద - పాకశాలాధ్యక్షుడు;

26. బేతాళ - మాంత్రికుడు; 27. మల్ల - మల్లుడు (కుస్తీ మొ॥ చేసేవాడు); 28. తాంబూలిక - తాంబూలము చేసేవాడు; 29. తాళ వృంతక - వింజామర వీచేవాడు; 30. నరవాహక - నరవాహకుడు (శవ వాహకుడు); 31. ఛాత్రిక - గొడుగు పట్టేవాడు; 32. చామరిక - చామరాన్ని (చమరీ మృగపు వీవన ధరించి) వీచేవాడు; 33. కళాచిక - కాహళను ఊదేవాడు; 34. కరశారిక - పావురాల్ని కల్గి ఉండేవాడు; 35. పాదుకాధార - పాదుకలను ధరించేవాడు; 36. నర్తక - నర్తకుడు (నాట్యాచారుడు); 37. గాయక - గాయకుడు; 38. వైణిక - వైణికుడు; 39. శాకునిక - శకున శాస్త్రజ్ఞుడు; 40. మాగధ -

వందిమాగధ స్తోత్రము చేయువాడు; 41. వైతాళిక - మేలుకొల్పు చెప్పేవాడు (మాంటికుడు); 42. పరిహాసక - విదూషకుడు; 43. కరదీపికాకార - కరదీపికను ధరించువాడు; 44. కంచుక - అంతఃపుర కావలివాడు; 45. క్షౌరక - మంగలి; 46. రజక - చాకలి; 47. సౌచిక - బట్టలు కుట్టేవాడు; 48. చర్మకారక - చర్మకారుడు; 49. ముద్రాధికార - ముద్రాధికారుడు (రాజముద్ర కల్గినవాడు); 50. పురపాలక - పురపాలకుడు;

51. వనపాలక - వనము (తోటలు, ఉద్యానవనాలు) రక్షించేవాడు; 52. నరవైద్య - నరులకు వైద్యం చేసేవాడు; 53. గజవైద్య - ఏనుగుల వైద్యుడు; 54. అశ్వవైద్య - అశ్వ వైద్యుడు; 55. పశువైద్య - ఇతర పశువుల వైద్యుడు; 56. భేరివాదక - భేరి (ఢంకా) మ్రోగించేవాడు; 57. మురజవాదక - పెద్ద ఢంకా మ్రోగించేవాడు; 58. రౌమక - ఉప్పును తయారు చేసేటప్పుడు పర్యవేక్షించేవాడు (సంభరి దేశమున రుమ యను గనియందు పుట్టిన ఉప్పు - శ. దీ. పు 1133); 59. శిలాచ్ఛేదక - రాతిని (శిలను) ఛేదించేవాడు (రాతి పనివాడు); 60. కాంస్యకారక - కంచును చేసేవాడు (లోహకారకుడు); 61. కుంభకారక - కుమ్మరి; 62 చిత్రకారక - చిత్రకారుడు; 63. వ్యవహారక - వర్తకుడు; 64. మృగయాత్రిక - వేటకాడు; 65. పక్షిపోషక - పక్షులను పెంచేవాడు; 66. పణిహారక - వేత్రహస్తుడు; 67. రాయబారక - రాయబార; 68. ఉగ్రాణాధికార - ఆహార వస్తువులు మొ॥ వస్తువులను భద్రంగా గాచేవాడు; 69. వేశ్యాజన - వేశ్యాసమూహము; 70. బంటు - సైనికుడు (కాల్బలానికి చెందినవాడు); 71. స్వర్ణకార - స్వర్ణకారుడు (కంసలి); 72. కఠారిక - కత్తిని ధరించినవాడు.

కర్నూలు జిల్లా త్రిపురాంతకం గ్రామంలోని అనేక శాసనాల్లో[113] బాహత్తర నియోగాధిపతి, అనేక దేశాధిపతిగా గంగయసాహిణి మొదట వర్ణింపబడినాడు. గండుపెండారు అంబదేవ మహారాజుల కాలంనాటి శాసనాల్లో ఈ పద ప్రయోగాలు చేయబడినాయి బాహత్తర నియోగాలు, నియోగాధిపతులు వారి వారి కాలాల్లో ఉండేవారనీ, పైస్థాయి నుండి దిగువస్థాయి వరకు అంచెలంచెలుగా పరిపాలన వికేంద్రీకరింపబడి ఉండేదనీ స్పష్టమవుతూంది.. ఈ శాసనాలన్నీ క్రీ.శ. 1450 నుండి క్రీ.శ. 1312 వరకు, అంటే 13, 14 శతాబ్దులవిగా పేర్కొనబడినాయి.

ఇంకా హంసవింశతి కావ్యంలో[114] 'వైశ్యజనంబులాదియైన డెబ్బది రెండు వినియోగంబుల వారు సేవింప నతండు వెలయుచుండు' అనీ, రాయ వాచకంలో[115] 'రవుతురాణువును డెబ్బైరెండు వినియోగాలవారున్ను కొలువు నకు రమ్మని' పేర్కొనబడ్డాయి.

డెబ్బదిరెండు వినియోగాలవారి ప్రసక్తి శాసనాల్లోను పేర్కొనబడింది. కాకతీయరాజుల కాలంలో వ్యాప్తినందిన అధికారాలు విజయనగర రాజుల కాలంలో కూడా నిర్వహింపబడ్డాయి. ఈ అధికారులలో ఒక్కొక్కరు ఒక్కొక్క వృత్తి పనికి పర్యవేక్షక అధికారిగా ఉంటూ రాజరిక కార్యకలాపాల్లో రాజుకు ఇతర ఉన్నతాధికారులకు సహాయపడుతుండేవారని తెలుస్తోంది. వీరి వల్ల రాజు, ప్రధాని మొదలగువారికి పరిపాలన సుంకరంగా ఉండేది.

## పన్నులు - సుంకాలు :

సంఘంలోని వ్యక్తుల అభిరుచుల్నిబట్టి జీవిత మార్గాలు కూడ యేర్పడ తాయి. వీటిని అనుసరించి పాలకులు అనాదినుండి కొన్ని కట్టుబాట్లు యేర్పర చారు. ఆర్థిక శాస్త్రవేత్తలు ఈ కట్టుబాట్లకు రూపకల్పన చేసి, ప్రజలనుండి ప్రతి ఫలాన్ని పొందడం ద్వారా కోశాగారాన్ని పరిపుష్టం చేశారు. ఈ ప్రతిఫలం ధనరూపంలో వస్తురూపంలో కూడా ఉండేది. ఈ ఇచ్చి పుచ్చుకొనే వ్యవస్థ రాజుకూ, సమాజానికి మధ్య ఒక అంతస్సూత్రంగా పనిచేసింది. అది ఈనాటికీ కొనసాగుతూనే ఉంది. ఆర్థిక సంబంధమైన ఈ విధానమే పన్నులు - సుంకాల రూపంలో పాలకులకు హక్కుల్ని, పాలితులకు బాధ్యతల్ని కల్గించింది. పన్నులు - సుంకాలు - ఈ రెండు ప్రభుత్వానికి ఆదాయాన్ని కల్గించేవే అయినా వాటి విధింపుల్లో, విధానాల్లో కొంత భేదం ఉందనే చెప్పాలి.

అగ్రహారాలు, సర్వమాన్యంగా ఇచ్చిన భూములు, గ్రామాలు - వీటిలో చాలా వాటిపై పన్నుల మినహాయింపులుండేవని శాసనాలు సోదాహరణంగా వివరిస్తున్నాయి.

''దిగుమతి చేసుకున్న వస్తువు మీద వేసే పన్నును స్థలసుంకం లేక స్థుంకవరం అంటారు. నేత పనివాడు 'మగ్గరి,' నూనెగానుగలవారు 'గానుగరి',

లేక గానుగ సిద్దాయం, కల్లుగీత పనివారు 'ఈడిగె సిద్దాయం', మంగలివారు మంగలి పన్ను చెల్లించేవారు. ఆశివెచ్చం (అసుమీద పన్ను), నగరి, బిడారం (విరాళం), బేడిగ, అంపనం, గ్రామవెట్టి పోషణకోసం వెట్టి లేక వెట్టివేములు వసూలు చేసేవారు. కడ్డాయం, అడ్డగడ సుంకం, మార్గాదాయం, సమయ సభ్యులు చెల్లించు సమయ సుంకం లేక కుల సిద్ధాయం (ఉద్యోగ సంస్థల సంఘాలవారు), వీరశైవ భక్తుల్నుంచి వసూలుచేసే వీరముష్టిపన్ను, మహారాచ తేవలు (గ్రామదేవతలకి నైవేద్యాలిచ్చి తృప్తిపరచేందుకు) ప్రజల్నుంచి వసూలు చేసేవారు. గారడీవిద్యలతో ప్రజల్ని ఆనందపరచే దొమ్మర్లకు ప్రజలు చెల్లించే పన్ను 'దొంబరి పన్ను' లేక దొంబరికాసు, బ్రాహ్మణులు తమకు వినోదం కల్గించే విప్రవినోదులకు విప్రవినోది పన్ను చెల్లించేవారు. దేవదాసీల పోషణకై 'లంజ కట్నం' ప్రజల నుంచి వసూలు చేసేవారు. పెళ్ళికి కూడా పన్ను ఉండేది."[116]

పన్నులు, సుంకాలు అనేవి పరిపాలనా దశలో పాలకులు పాలితులపై వేసే ధన రూపమైన విధింపులు. కోశాగారాన్ని నింపిన రాజులు, అధికారులకు, సైనికులకు, ప్రజలకు కావలసిన సౌకర్యాలను, ఇతర పాలనా నిర్వాహణలకు కావలసిన వ్యయాన్ని చేసేవారు.

రాయలసీమ తెలుగు శాసనాల్లో పేర్కొనబడ్డ అనేక విధాలైన పన్నులు-సుంకాలు ఆనాటి పరిపాలనా వ్యవస్థలోని ఆర్థిక స్థితిగతులను తెలియజేస్తున్నాయి.

కడప జిల్లా నందలూరు గ్రామంలోని క్రీ. శ. 1433 సం॥ ఒక శాసనంలో[117] అయిదూళ్ళరెడ్లు పొత్తిపినాటి భూమి మీదవచ్చే వీసబడి పన్ను,[118] కానికగప్పాలు,[119] వెట్టినేమి,[120] అసప్రయాలు[121] మొదలయిన పన్నులు బాహు నదీతీరంలో శ్రీ చొక్కనాథ పెరుమాళ్ళ సన్నిధిలో సర్వమాన్యంగా[122] ఇవ్వబడినట్లు పేర్కొనబడింది.

అనంతపురం జిల్లా కనగానపల్లి గ్రామం క్రీ. శ. 1533 వ సం॥ శాసనంలో[123] గ్రామ రెడ్డి కరణాలు ముప్పైరెండు గ్రామాల పంచాళంవారికి వారు సీమ విడిచి వలస వెళ్ళినందులకు వారిని మరలా పిలిపించి అన్ని రకాల పన్నుల

నుండి మినహాయింపు ఇచ్చినట్లు పేర్కొనబడింది. (వడ్రంగి, కమ్మరి, కంచరి, కంసాలి, కాసె (రాతిపనివాడు) - వీరి నైదుగురినీ పంచాళంవారుగా పిలుస్తారు.)

కడప జిల్లా పుష్పగిరి గ్రామంలోని క్రీ.శ. 1540 సం॥ శాసనంలో[124] దళవాయి తిమ్మరుసు, పుష్పగిరి మహాజనులకు దుర్గాదాయ నివర్తన,[125] బేడిగె,[126] చిన్న చిన్న పన్నులు గ్రహించి వహిశుద్ధి[127] చేయించి సర్వమాన్యంగా ఇచ్చినట్లు పేర్కొనబడింది.

అనంతపురం, మిడుతూరు గ్రామం క్రీ శ. 1544 వ సం॥ శాసనంలో[128] మంగలివార్రపై విధించే పన్నును రద్దు చేసినట్లు తెల్పబడింది. ఇదే జిల్లా నసన కోట గ్రామంలోని క్రీ.శ. 1546 నాటి శాసనంలో[129] ఇదేరకపు మినహాయింపు ఇవ్వబడింది.

కడపజిల్లా పెద్దముడియం గ్రామంలోని క్రీ.శ. 1551 సం॥ శాసనంలో[130] శివార్చనచేసి జీవించే తమ్ముళ్ళు మొదలైన జాతివారు వాళ్ళు చెల్లించే వీరముష్టి పన్ను సోమేశ్వరదేవుని దీపారాధనకు అర్పించినట్లుగా చెప్పబడింది.

గ్రామంలో కంసాలి, వడ్రంగి, కమ్మరి, మంగలి మొదలగు వృత్తులవారు శివభక్తితో జీవించే జాతివారు. వీరముష్టి పన్ను వీరశైవ భక్తులనుంచి వసూలు చేసి, ఏదో ఒక మఠానికి అందజేస్తారు మఠాధిపతి లేక ఆయన కార్యకర్త ఆ పన్నును ఏ దేవాలయానికో దాఖలు పరుస్తాడు. ఇది రాజుకు చెందదు.[131]

ఇదే జిల్లా మోటకట్ల గ్రామంలోని క్రీ.శ. 1552 సం॥ శాసనంలో[132] దొమ్మరివారు తమ 24 కులాలవారి పుణ్యానికిగాను దొమ్మరి పన్నును అదే గ్రామంలోని నరసింగదేవునికి కానుకగా ఇచ్చినట్లు పేర్కొనబడింది.

ఇదే జిల్లా క్రిష్ణంగారిపల్లెలోని క్రీ శ. 1554 సం॥ శాసనంలో[133] విప్ర వినోదులకు ఇచ్చే పన్నును చెన్నకేశవరాయనికి, హరిహరాదులకు కానుకగా ఇవ్వబడినట్లు చెప్పబడింది. ఈ విప్రవినోదులనబడేవారు బ్రాహ్మణులకు వినోదం కల్గిస్తూ వారినుంచి వార్షికం వసూలు చేసుకొనేవారు. ఈ బ్రాహ్మణశాఖ విజయ నగర రాజుల కాలంలో ఉండేదనీ వీరినుండి పన్ను వసూలుచేసి ఆ పన్నును ధైవార్పణంగా వారు త్యాగం చేసేవారని తెలుస్తూంది.[134]

ఇదే జిల్లా గండికోట దుర్గంలోని క్రీ.శ. 1578 సం॥ ఒక శాసనంలో[135] దెస్తవారికి, రాజు అన్ను వన్ను లేకుండా (ఏమాత్రం పన్ను లేకుండా) వారు జీవనం గడిపేందుకు సర్వమాన్యం ఇచ్చినట్లు పేర్కొనబడింది. సర్వమాన్యం అంటే అన్ని పన్నుల నుండి మినహాయింపు.

ఇదే జిల్లా నరుసుపల్లి గ్రామంలోని క్రీ.శ. 1594 సం॥ శాసనంలో[136] అంకా ఇదేజిల్లాలోని అనేక శాసనాల్లో ప్రజలకు దసవందం[137] మినహాయింపులు ఇచ్చినట్లు పేర్కొనబడింది.

కర్నూలు జిల్లా త్రిపురాంతకం గ్రామంలోని క్రీ. శ. 1245 సం॥ శాసనంలో[138] సర్వాధికారి పోచెనప్రెగ్గడ గణవయ అనువాడు 300 పెఱుకలకు ఆచంద్రార్కము సుంకము మన్నించి ఇచ్చినట్లు పేర్కొనబడింది. ఈపక్కను అవక్కను ధాన్యాదులుపోసి ఎద్దు, గుఱ్ఱము మున్నగు జంతువులమీద మోయించెడి గోనె మూటలుగా ఇవి చెప్పబడినాయి.

స్థల సుంకాన్ని (స్థలంలో వసూలయ్యే అంగడి సుంకం) వివరించే కడప జిల్లా నెమళ్ళదిన్నె గ్రామానికి చెందిన క్రీ.శ. 1517 సం॥ శాసనం,[139] ఇదే జిల్లా అనిమెల గ్రామానికి చెందిన క్రీ.శ. 1517 సం॥ శాసనం,[140] మగమ (పేంట సుంకము, వర్తకులు, కర్షకులపై దేవభోగము నిమిత్తము విధింపబడే సుంకము) సుంకాన్ని, ఇదే జిల్లా కత్తెరగండ్ల గ్రామపు క్రీ.శ. 1525 సం॥ము ఉభయమార్గ సుంకము (దారిసుంకము) శాసనం,[141] ఆనాటి వైవిధ్యాలతోకూడిన సుంకాలతోపాటు ఇల్లరి (ఇంటిపన్ను), పుల్లరి (పచ్చికపై పన్ను), మగ్గరి (మగ్గాలపీద పన్ను), గానుగరి గానుగరి (గానుగమీద వన్ను) - ఈ పన్నుల్ని దేవునికి, దేవాలయాలకు దానపూర్వకంగా కానుకగా ఇవ్వబడినట్లు పేర్కొన బడింది.

కడప జిల్లా రామేశ్వరం గ్రామంలోని క్రీ.శ. 1510 సం॥ శాసనంలో[142] చిత్తూరు జిల్లా రంగసముద్రం గ్రామంలోని ఇదే సంవత్సరము శాసనంలో[143] అనంతపురం జిల్లా బుక్కపట్నంలోని క్రీ.శ. 1542 సం॥ శాసనంలో[144] సర్వజనులకు, బ్రాహ్మణులకు పెండ్లి సుంకాన్ని సర్వసామాన్యంగా చేసిన వివరాలు ఇవ్వబడాయి.

కర్నూలు జిల్లా మార్కాపురంలోని క్రీ.శ. 1569 సం॥ శాసనంలో[145] ఆకుల మంత్రాయం పేరిట తమలపాకుల మీదవచ్చే పన్నును చెన్నకేశవ స్వామికి సమర్పించినట్లు చెప్పబడి ఉంది. ఇది ప్రత్యేక పన్నుగా చెప్పవచ్చు.

గ్రామాల్లో ఉండే ఆయా వృత్తుల్నిబట్టి పనుల్ని వృత్తి పన్నులు విధించేవారని తెలుస్తూంది. ఈ వివరాలు కడప జిల్లా చిడిపిరాల శాసనం[146] వివరిస్తుంది.

ఉభయ నానాదేశ పెక్కండ్రు[147] అంటే స్వదేశ, పరదేశ సంచార వర్తకులనుండి సుంకాల్ని వసూలు చేయడం, విప్రవినోదులనబడే బ్రాహ్మణ శాఖనుండి పన్నులు వసూలుచేసి కొంత దైవార్పణం చేయడంకూడ జరిగేది.

సుంకం అనేది సామాన్యంగా సంచార వ్యాపారులపై ఎక్కువగా ఉండేదని తెలుస్తూంది. అయితే, స్థానవర్తకులపై స్థల సుంకం రూపంలో విధింపబడే సుంకానికి కూడ తక్కువ చేయకుండా ఆనాటి పాలకులు జాగ్రత్త పడ్డారు.

''సదాశివరాయల కాలంలో అనంతపురం జిల్లా చాబాల గ్రామ ప్రజలు పన్నులు ఇచ్చుకోలేమని ఊరు వదిలి లేచిపోయారు. ఆ మండలాన్ని అమర మాగాణిగా పొందిన కొండయదేవ మహాఅరసు ప్రజల్ని పిలిపించి పాత పన్నులే తీసుకొంటానన్నాడు.... భూసారం పట్టి రాజుకు ఇచ్చే పన్ను నిర్ణయించుతాము అని వారికి హామీలిచ్చేడు"[148]

వర్తకులు పౌరులుగా, శ్రేణీ సభ్యులుగా అనేక రకాల పన్నులు, సుంకాలను సంవత్సరానికొకసారి వేలంపాట పాడి, దానిలోవచ్చే ఆదాయంలో కొంత భాగాన్ని దేవాలయాలకు దానాలు చేసేవారు.

అప్పటి శాసనాల్ని బట్టి చూస్తే ప్రజల నుంచి పాలకులు వసూలుచేసే పన్నులకు అంతువున్నట్లు కనబడదు. పంటనుబట్టి భూమి పన్ను; వస్తువుల్ని, సరకుల్ని, వ్యాపారాన్ని బట్టి స్థలసుంకాలు, ఇతర సుంకాలు ఉండేవని తెలుస్తూంది. ఇంటిపన్ను, పెండ్లిసుంకం, పశువుల సుంకం మొ॥ ఆనాటి ఆర్థిక వ్యవస్థకు అద్దం పడుతున్నాయి.

పన్నులు/సుంకాలు వీటిని వసూలు చేయడానికి అనాడు కిందనుండి పై వరకు అనేక రకాల ఉద్యోగులు ఉండేవారు. వీరిలో మొదటివాడు సుంకాధికారి,

సుంకపు తలారి, సుంకమణియగాండు, సుంకరవారు (సుంకరులు) మొ॥ ముఖ్యులు సుంకగుత్తకాండు సుంకాన్ని రాబట్టేందుకు వేలంపాటద్వారా గుత్త చేసేవాడు.

ప్రస్తుత ఆర్థిక వ్యవస్థ, పూర్వపు వ్యవస్థకు పరిణామ సూచి. పన్నులు, సుంకాలు ఈనాడు కూడా అనేకం ఉన్నాయి. ఆనాటి పెండ్లి సుంకం వంటివి ఈనాడు లేకున్నా, వాటి స్థానంలో నీటి పన్ను, వస్త్రాలపై పన్ను, వాహనాల పన్ను, ఆదాయపు పన్నులు కొన్ని అలాంటివి ఉన్నాయి.

## మాన్యాలు :

'మాన్యము అంటే మన్నన, గౌరవము, పన్ను కట్టనవసం లేకుండ అనుభవించునట్లు సత్కరించి ఇవ్వబడిన భూమి.'[149]

పన్ను కట్టక అనుభవించునట్లు సన్మానించి ఇయ్యబడిన భూమి.[150]

మన్నన[151] ఏ విధమైన కిరాయి (బాడుగ) పన్ను కట్టనవసరం లేని ఆస్తి. పన్ను కట్టే అవసరంలేని భూమి. ఇట్లా యింకా అనేక నిఘంటుకారులు విభిన్న కోణాల్లో నిర్వచించారు.

రాజుకు, సంఘానికి రాజ్యానికి వీటిలో యే ఒక్క అంశానికైనా విశిష్ట సేవలు చేసిన వ్యక్తికి లేక సంస్థకు గౌరవప్రదంగా ప్రతిఫలంగా భూమిని లేదా గ్రామాన్ని మాన్యంగా ఆనాటి పాలకులు ఇచ్చేవారు. రాజుల మెప్పును పొందిన అనేకులు, ఈ మాన్యాల్ని పొందిన సందర్భాలు శాసనాల్లో అనేకం కన్పిస్తున్నాయి. స్థలమాన్యం, గ్రామ మాన్యం, మడి మాన్యం, చేను మాన్యం, స్థాన మాన్యం, దసవంద మాన్యం, సర్వమాన్యం, దేవునికి (దేవాలయానికి) ఇచ్చే మాన్యం (దేవమాన్యం) మొదలైన అనేక విధాలైన మాన్యాలు శాసనాల్లో చోటు చేసుకున్నాయి. ఇవన్నీ నాటి రాజులు, ఆ యా కాలాల్లో సందర్భోచితంగా ఆ యా వ్యక్తులకు, సంస్థలకు అవి స్వయంపోషకాలుగా ఉండగల్గేందులకు సమర్పించిన కానుకలు. ప్రజలనుండి కానీ, ప్రభుత్వంనుండి కానీ ప్రతిఫలం ఆశించకుండా, స్వయంప్రతిపత్తి కల్గి మనగల్గేందుకే ఈ మాన్యాల రూపంలో ఇట్లాంటి సత్కారాలు చేశారని తెలుస్తుంది.

దేవమాతృకాలుగా ఉండే చేనులు, నదీమాతృకాలైన మాగాణి భూములు వారి వారి వృత్తులరీత్యా అనుభవంలో ఉండేవి. ఇట్లాంటి మాన్యాలు రాయలసీమ ప్రాంతంలో బీడు భూములుగా చాలా భాగం నిర్వీర్యంగా నిలిచి ఉన్నాయి. దీనికి కారణం అనావృష్టి అని చెప్పవచ్చు. ఇట్లా నిలిచి ఉండేవాటిలో దేవ మాన్యాలు అత్యధికంగా ఉన్నాయి. కనీస వర్షపాతంగల కొన్ని ప్రాంతాల్లో మాత్రం ఈ మాన్యాలు కొంతవరకు సాగుబడిలో ఉన్నాయని చెప్పవచ్చు.

సర్వమాన్యం అంటే అన్ని పన్నులనుండి మినహాయింపు - ముఖ్యంగా ఇది దేవాదాయాలకు మాత్రం వర్తిస్తుంది.

కర్నూలు జిల్లా త్రిపురాంతకంలోని క్రి. శ. 1308 సం॥ ఒక శాసనములో[152] త్రిపురాంతకదేవుని అంగరంగభోగాలకుగాను 'సర్వమాన్యం'గా ఆ ప్రాంతంలోని అన్ని రకాల ఆదాయాలను నూరు పశువుల ఆదాయాన్ని ఇచ్చినట్లు పేర్కొనబడింది.

సర్వమాన్యానికి చెందిన ఇంకా అనేక శాసనాలు[153] (క్రి. శ. 14, 15 శతాబ్దులవి) ఆనాటి పాలకులకు ప్రత్యేకించిన కొన్ని వృత్తులవారికి, దేవాలయాలకు సంబంధించినవిగా ఉన్నాయి.

కడప జిల్లా పందిళ్ళపల్లి గ్రామంలోని క్రి. శ. 1528 సం॥ ఒక శాసనం[154] డోలు, నాగస్వరాలు, సంకీర్తనపరులకు వారి వారి పేర్లను పేర్కొంటూ కొంత చేను మాన్యంగా ఇచ్చినట్లు చెప్పబడింది. ఇట్లాంటివే మరి కొన్ని శాసనాలున్నాయి.

ఇదే జిల్లా సుంకేశుల గ్రామంలోని సంవత్సర వివరాలు లేని ఒక శాసనంలో[155] కొండోజు తిమ్మయ్యగారికి యిచ్చిన నూతి మాన్యక్రమము అని పేర్కొనబడింది. అంటే-ఆ గ్రామంలో నూతిని తవ్వినందుకు, నిర్వహించేందుకు కొంత చేను (పొలం) ఇచ్చిన వివరం అందులో ఉంది.

అనంతపురం జిల్లా అనుంపల్లి గ్రామంలోని క్రి శ. 1626 సం॥ ఒక శాసనంలో[156] గోపాలస్వామికి (దేవుడికి) స్థానమాన్యంగా (ఉచితంగా కానుకగా ఇస్తూ అన్ని పన్నులనుంటి మినహాయింపుగా) పెద్ద చెరువు కింద కొంత భూమిని ఇచ్చినట్లుగా చెప్పబడి ఉంది.

ఇంకా దసవంద మాన్యాలని కొన్ని ఉన్నాయి. పంటపై పదియవ వంతు పన్ను విధించి ఇచ్చిన మాన్యమే దసవందము లేక దశబందం.

అనంతపురం జిల్లా మేడిరెడ్డిపల్లి గ్రామంలోని క్రీ.శ. 1388 వ సం॥ ఒక శాసనంలో[157] పెద్దబయిరోజుకు, చిన్నబయిరోజుకు పోలినాయునింగారు చిత్తేరు నుండి చెరువుకు కాలువ తవ్వినందుకుగాను దసవందంగా కొంత భూమిని మాన్యంగా ఇచ్చినారు. ఇట్లాంటి శాసనాలు కడపజిల్లా దేవగుడి గ్రామంలోను[158] ఇంకా అనేక ప్రదేశాల్లో లభ్యమయ్యాయి.

ఇదివరకు పేర్కొన్నట్లు మాన్యం అంటే గౌరవంగా ఇచ్చే గ్రామం కానీ, భూమికానీ మరేదైనా స్థిరమైన ఒక ఆస్తిగా ఇచ్చేది. ఇది దానం కాదు.

వివిధ మాన్యాలను గూర్చిన నిర్వచనాలు ఇలా ఉన్నాయి:[159]

**స్థానమాన్యం :-** రాజుచేత అతని కింది అధికారులకు వేతనానికి బదులు వారి ఖర్చులు గడుపుకొనుటకుగాను ఇవ్వబడే భూమి. (దేవుడికికూడా ఆలయ ఖర్చులకు, సేవలకు ఇచ్చే మాన్యం.)

**సర్వమాన్యం :-** భూమికానీ, గ్రామంకానీ ఏ పన్నులూ దాని మీద విధింపబడకుండా ఇచ్చే జాగీరువంటిది. ఇది దేవాలయానికో, వ్యక్తికో కూడా ఇవ్వవచ్చు.

**నూతిమాన్యం :-** నూతిని తవ్వినందుకు, నిర్మాణం చేసినందుకు యిచ్చే భూమి. ఎటువంటి పన్ను దీనిమీద ఉండదు.

దసవందమాన్యం - పంటపై పదవ వంతు పన్ను.

**అగ్రహారం :-** బ్రాహ్మణులుకానీ, వైశ్యులుకానీ నివసించుటకై నిర్మింపబడిన గ్రామభేదము. వారికి సర్వకర పరిహారముగా పోషణార్థమిచ్చెడు వసతి. [160]

ముఖ్యాగ్రహారము అనేది మంచళ్ళ శాసనములో (అనవేమారెడ్డిది) కనిపిస్తుంది. పౌరోహిత్య, యాజకత్వ, ప్రభుత్వ, జ్యోతిస్సార, హేమముద్రా పరీక్ష, సాముద్ర, లేఖక, యాజమానములనెడు భోగాష్టకములలోను; నిధి, నిక్షేప, జలాశ్మసార, అక్షిణ, ఆగామి, సిద్ధసాధ్యమను అష్టతేజ స్వామ్యములు గలిగిన అగ్రహారము.[161]

ముఖ్యాగ్రహారం విషయంలో మూడు హక్కులు ఉంటాయి. (1) ఎనిమిది రకాలైన గ్రామానికి సంబంధించిన అనుభవాలు; (2) గ్రామానికి సంబంధించిన భూమిపై ఎనిమిది విధాలైన అనుభవాలు; (3) విక్రయం చేయడానికికానీ, కానుకగా ఇవ్వడానికిగాని ఉండే హక్కు.[162]

పైన చెప్పినవే అష్టభోగతేజస్స్వామ్యాలుగా వివరింపబడినాయి.

సర్వాగ్రహారం అనేది[163] సర్వకర పరిహారంగా ఇచ్చిన గ్రామంగా, అంటే సర్వమైన పన్నుల విడుపుగా, మినహాయింపుగా ఇవ్వబడినట్లు శాసనాల్లో అక్కడక్కడ పేర్కొనబడినాయి.

'అగ్రహారం, అగ్రాహారంగా ఉండినది' అని అభిజ్ఞుల అభిప్రాయము. అగ్ర-శ్రేష్ఠమైన, హారము దేశము లేదా స్థలము-అంటే శ్రేష్ఠులైనవారికి ఇవ్వబడిన గ్రామం లేదా ఊరు అని అర్థం.

ఈ అగ్రహారాల్లో బ్రాహ్మణులే ఉండాల్సిన అవసరం లేదు. పలువిధాల వృత్తులవాళ్ళు, కులాలవాళ్ళు ఉండవచ్చు. అయితే ఈ ఊళ్ళోని ఉత్పత్తులు, ఆదాయ కందాయాలు అన్నీ అగ్రహార యజమానికి లేదా బ్రాహ్మణునికి చెల్లుతాయి. అంటే, ఆ ఊరికి సంబంధించిన బహుముఖ ఆదాయాల్ని అధికారికంగా అగ్రహారపు యజమానులైన బ్రాహ్మణులు అనుభవిస్తూ ఉండేవారు.[164]

అగ్రహారాలు వైదిక సంప్రదాయానికి విద్యాకేంద్రాలుగా ఆర్థికంగా సాంస్కృతికంగా పాడిపంటలతో విలసిల్లే ఆదర్శ గ్రామాలుగా ఉండేవని తెలుస్తుంది. ఇవి స్వయంప్రతిపత్తిని కల్గి ఉండటం మూలాన, వాటిని పాలకులే శ్రోత్రియులకు, ఇతర బ్రాహ్మణ శ్రేష్ఠులకు సర్వాధికారాలతో దానం చేయడం వల్ల రాజులు వీటిపై అధికారాల్ని కోల్పోవటం, ఆదాయాలు లేకపోవటం వల్ల, క్రమ క్రమంగా వీటిద్వారా సంక్రమింపచేసిన సౌకర్యాలను తగ్గించటం చేసినట్లు తెలుస్తుంది.

"అగ్రహారాన్ని దానంగా పొందిన బ్రాహ్మణులే మహాజనులు, వారే అగ్రహారానికి ప్రభువులు మహాజనులు బ్రాహ్మణులే కావలసిన అవసరంలేదనీ, బ్రాహ్మణేతరులూ ఉండొచ్చని డా॥ ఆల్టేకర్‌గారి అభిప్రాయంగా కొన్ని శాసనాల్లో ఉదహరించిన వివరాల్నిబట్టి తెలుస్తుంది. అయితే, వీరు సరిగా అర్థం

చేసుకోలేదనేది స్పష్టంగా తెలుస్తుంది. మహాజనులు అంటే బ్రాహ్మణులే కానీ ఇతరులు కారు అనేది అనేక శాసనాల వల్ల స్పష్టంగా అవగతమవుతూంది."165

ఈ మహాజనులు అగ్రహారాల్లో అనేక సామాజిక కార్యాల్ని నిర్వహిస్తూ ఉండేవారు. పోరాటంలో మరణించిన వీరుని స్మారకంగా వీరశిలలు నిర్మించడం, గ్రామకార్యాలకు, గ్రామాభివృద్ధికి యెవరైనా దానంచేస్తే వాటిని స్వీకరించి రక్షించడం చేసేవారు. ధనాన్ని అప్పుగా వడ్డీంకు ఇవ్వడం, వాటిని ధార్మిక కార్యాలకు వినియోగించడం చేసేవారు. అగ్రహారాల్లో అనేకమైన దేవాలయాలు, సత్రాలు, సభలూ వీరిద్వారాచే నిర్వహింపబడేవి.166

కడప జిల్లా తుడుముల దిన్నె గ్రామంలోని కాలవివరాలు తెలియని ఒక శాసనంలో167 ఉత్తర హరివంశ కృతికర్త అయిన నాచన సోమునికి ఏకభోగ అగ్రహారంగా ఒక గ్రామాన్ని దానం చేసినట్లుగా పేర్కొనబడింది.

శ్రోత్రియం కూడా అగ్రహారం మాదిరిగనే సర్వహక్కులూ అనుభవింపబడే ఒక గ్రామం, లేదా కొన్ని గ్రామాలు. కర్నూలు జిల్లా పాణెం గ్రామంలోని క్రీ.శ. 1503 వ సం॥కు చెందిన ఒక శాసనం,168 అదే జిల్లా కోటపాడు గ్రామంలోని క్రీ శ. 1544 సం॥నకు చెందిన మరొక శాసనం169 శ్రోత్రియం వివరాలను గూర్చి తెలియజేస్తూంది.

అనంతపురం జిల్లా మరవపల్లి అగ్రహారంలోని క్రీ. శ. 1529 వ సం॥కు చెందిన ఒక శాసనంలో170 'మహాజనాలు' అన్న పదప్రయోగం, వారికి ఉండే హక్కుల వివరాలు తెలియజేయబడి ఉన్నాయి. ఈ వివరాలు వారికి అగ్రహారంపై ఉండిన సర్వహక్కుల్ని తెలియజేస్తున్నాయి.

ఇదే విధంగా కర్నూలు జిల్లా కొలిమిగుండ్ల గ్రామానికి చెందిన క్రీ. శ. 1544 వ సం॥నాటి ఒక శాసనంలో171 'అశేషవిద్యన్మహాజనాలు' అని కూడా పేర్కొనబడింది. అంటే, మొత్తం అగ్రహారంలో ఉండే విద్వాంసులైన ప్రజలు అని చెప్పవచ్చును. ఇది సదాశివరాయల కాలంనాటి శాసనం.

అనంతపురం జిల్లా వడిగేపల్లి గ్రామంలోని మొదటి శ్రీరంగరాయల కాలంనాటి (క్రీ. శ. 1573 వ సం॥) శాసనం172 పెనుగొండ తిరుమల కొమార తాతాచార్యుల అయ్యవారికి వడిగెపల్లె గ్రామాన్ని సర్వమాన్య అగ్రహారంగా ఇచ్చిన వివరణలు ఉన్నాయి.

కడప జిల్లా చిటివేలు తాలూకాలో నూకునేనిపల్లె అనే వూరి సరిహద్దులో అప్పటికి కలెక్టరు థామస్ మన్రో దొరవారి అనుమతితో జాగీర్దారు కృష్ణరావు గారు ఒక అగ్రహారం కట్టించి, దానికి కుంఫిణీపురం అని పేరు పెట్టినారు. ఇది క్రీ.శ. 1806లో కట్టించినట్లుగా నమోదు చేయబడింది.[173]

అగ్రహారాలు అనే పేర్లతోనే ఆంధ్రదేశంలో అనేక గ్రామాలు పిలువబడుతున్నాయి. ఆయా అగ్రహారాలకు దగ్గర్లో ఉన్న గ్రామాలకు వాటికి అనుసంధానమైన పేర్లతోనే ఇప్పటికీ పిలుస్తున్నారు. ఉదాహరణకు అనంతపురం జిల్లాలోని మరవపల్లి అగ్రహారం, కడప జిల్లాలోని నాచన సోముని అగ్రహారం ఇలాంటివే.

అగ్రహారాలను గురించిన ప్రసక్తులు కావ్యాలూ పేర్కొన్నాయి. పెద్దన తనకు శ్రీకృష్ణదేవరాయలు, 'కోకట గ్రామాద్యనేక అగ్రహారము లడిగిన సీమల యందునిచ్చె' అని తన మనుచరిత్ర ప్రారంభంలో పేర్కొన్నాడు.

స్వయం ప్రతిపత్తి కల్గి బ్రాహ్మణాధీనంలో వుంటూ ఈ అగ్రహారాలు అన్ని విధాలా అభివృద్ధి చెందేందుకు ప్రయత్నాలు జరిగినాయి. అధికారుల్లో అవగాహన, ప్రజల్లో సంయమనం ఉండిన అగ్రహారాలు సర్వపరిపూర్ణమై వెలిశాయి.

**బ్రాహ్మణులు :** బ్రహ్మజ్ఞానం కలవాడు బ్రాహ్మణుడు అని వ్యుత్పత్తి. ప్రస్తుతం ఇది కులవాచకంగా యేర్పడింది. ప్రాచీన, మధ్య యుగాల్లో బ్రాహ్మణులను మంత్రులుగా నియమించుకొనేవారు.

శాసనాల్లో చాలాచోట్ల బ్రాహ్మణులు లేదా విప్రుల ప్రసక్తి వచ్చింది. 'విప్రవినోదులు' అనబడేవారు కూడా శాసనాల్లో అక్కడక్కడ పేర్కొనబడ్డారు. బ్రాహ్మణులు తమ కులవృత్తుల్లో ఆరితేరి, రాజాదరణా, ప్రజాదరణా పొంది అగ్రహారాలు, మాన్యాలు, వృత్తివన్ను మినహాయింపులు పొందిన సందర్భాలు శాసనాల్లో చెప్పబడి ఉన్నాయి.

క్రీస్తుపూర్వ మగధదేశపు రాజులు పాటలీపుత్రాన్ని కేంద్ర స్థానంగా చేసుకొని పాలిస్తూ, బ్రాహ్మణ మంత్రుల్నే నియమించుకొన్నారు. తిక్కన కవీంద్రుడు నెల్లూరు పాలకుడైన మనుమసిద్ధి ఆస్థానంలో మంత్రిగా, కవిగా ప్రసిద్ధికెక్కాడు.

విష్ణుకుండినులు బ్రాహ్మణులను, అందులోనూ వేదసంపన్నులైనవారిని ఆదరించి పోషించారు. తూర్పు చాళుక్యరాజైన మొదటి విష్ణువర్ధనుడు 4,000 నివర్తనల భూమిని, నానాగోత్రీకులైన 40 మంది స్వాధ్యాయపరులైన యమ నియమ షట్కర్మల నభ్యసిస్తున్న వేదాధ్యయనపరులైన బ్రాహ్మణులకు దానం చేసినట్లు విష్ణువర్ధనుని తిమ్మాపురం శాసన ఫలకాల ద్వారా తెలుస్తూంది.[174]

ఆనాటి బ్రాహ్మణులకు వారి పేర్ల చివరల్లో సహస్ర, వేది, సోమయాజి, భట్ట, షడంగవిద్ అనే నామాంకితాలున్నాయి. ఇవి ఆనాటి వారి వేదజ్ఞాన సంపదను, గొప్పదనాన్ని తెలియజేస్తున్నాయి.

వేదాల్లో నిష్ణాతులైన బ్రాహ్మణులకు అనేక దానాలు చేసినట్లు శాసనాలు చెబుతున్నాయి. యజుర్వేదంలోని శుక్ల, కృష్ణ యజుర్వేద భాగాల్ని ఆపోశనం పట్టిన బ్రాహ్మణులకు నాటి సమాజంలో సమున్నత స్థానముండేది. బ్రాహ్మణుల పేర్ల చివర భట్ట, పండితులు, దేశపురీయభట్ట, ద్వేది, ద్వివేది, త్రివేది, చతుర్వేది, సోమియాజి, భటసోమయాజి, ఘటశాసి, యజ్వ, సుధి, సూరి, మఖి, భట్టారక, అవధాని వంటి బిరు నామాలు ఉండేవి.[175]

ఆరు విధాలైన అధికారికమైన రాజ కొలమానాల్లో, రాజనీతి విధానాల్లో ఒక విద్వాంసుడైన బ్రాహ్మణుడు ఉండి తీరాలని మను ధర్మశాస్త్రంలో చెప్పబడింది.[176]

బ్రాహ్మణుల్లోనే ఒక తెగవారు 'విప్రవినోదులు'గా శాసనాల్లో పేర్కొనబడినారు. విప్రవినోదులను సి.పి. బ్రౌన్ గారడి విద్యగాండ్రుగా ఉండే బ్రాహ్మణులుగా పేర్కొన్నాడు. ప్రజలకు వినోదం కల్గిస్తూ వారినుండి వార్షికం వసూలు చేసుకొనే 'విప్రవినోదులు' అను బ్రాహ్మణుల శాఖ విజయనగర రాజుల కాలంలో ఉండేదని తెలుస్తూంది.[177]

"విజయనగర రాజుల కాలంలోనూ ఆటు తర్వాతి కాలంలోను సాంఘిక స్థితిగతుల్లో, కులవ్యవస్థలో అనేక మార్పులు వచ్చాయి. ప్రతి కులంలోను కొన్ని ప్రత్యేక హక్కులు, కుల మర్యాదలు మిగత కులాలకంటె విభిన్నంగా వుండినాయి.

ఈ నేపథ్యంలో ఒకానొక కులంలో జరిగిన ఒక విధమైన ప్రయత్నమే విప్రవినోదుల శాఖగా పరిణామం చెందింది. సి.పి. బ్రౌన్ [illegible]

గాండ్లుగా ఉండే బ్రాహ్మణులుగా చెప్పాడు. అయితే, హెచ్. కృష్ణశాస్త్రిగారు వీరిని గంజాం, విశాఖపట్నం జిల్లాల్లోని బ్రాహ్మణేతరులుగా, వారి వృత్తిపరంగా కొంత దిగజారినవారుగా వుండినట్లు తోస్తూందని చెప్పారు. వీరు విజయనగర, బేదకోట, కటకం, ద్రవిడ దేశం ప్రాంతాల్లో 16 వ శతాబ్దంలో ఉండినట్లు తెలుస్తూందని చెప్పాడు. క్రీ. శ. 1554 - '55 ప్రాంతాల్లో కొంతమంది విప్ర వినోదులు కార్తీకపూజలో భాగంగా హనుమంతుని పూజించేవారని రంగనహళ్ళి అనే గ్రామ శాసనం తెల్పుతూంది.''[178]

రాయలసీమ శాసనాల్లో అక్కడక్కడ బ్రాహ్మణులను, విప్రవినోదులను పేర్కొనడం జరిగింది. కడప జిల్లా ఇందుకూరు గ్రామంలోని క్రీ. శ. 7 వ శతాబ్దికి చెందిన ఒక శాసనంలోను, ఇదే జిల్లా పోట్లదుర్తి గ్రామంలోని ఇదే కాలానికి చెందిన ఒక శాసనంలోను ఒక్కొక్క బ్రాహ్మణునికి 'పన్నస' అంటే వరిపండు పొలాన్ని దానంగా ఇచ్చినట్లు పేర్కొనబడింది.[179]

బ్రాహ్మణ ప్రసక్తి శాపాశయాల్లో చెప్పబడింది. బ్రాహ్మణుని చంపితే వచ్చే పాపం చాలా ఘోరమైందని చాలా శాపాశయాల్లో వివరించబడింది.[180]

అనంతపురం జిల్లా బుక్కపట్నం గ్రామంలోని క్రీ.శ. 1542 వ సం॥కు చెందిన ఒక శాసనంలో[181] బ్రాహ్మణులకు తమకు వచ్చే ఆదాయంలో పన్ను మినహాయింపు, పెండ్లిపన్ను మినహాయింపులు చెప్పబడినాయి.

కర్నూలు జిల్లా బోయల ఉప్పలపాడు గ్రామంలోని క్రీ. శ. 1547 వ సం॥ నాటి ఒక శాసనంలోను, ఇంకా అనేక శాసనాల్లోను[182] విప్రవినోదులు అనబడే బ్రాహ్మణ జాతినిగూర్చి, వారికిచ్చే వర్తనలను గూర్చి వివరింపబడి ఉంది. విప్రవినోదులను గూర్చిన ఈ శాసనాలన్నీ క్రీ. శ. 16 వ శతాబ్ది మధ్య కాలానికి చెందినవే యెక్కువగా ఉండడం విశేషం.

ఈ శాసనాలన్నిటివల్ల బ్రాహ్మణులు వారి వారి ప్రతిభల్నిబట్టి రాజుల, అధికారుల, అశేషవిద్వన్మహాజనాలనుండి కానుకలను, అగ్రహారాలను, మడులను పొందేవారని తెలుస్తుంది. బ్రాహ్మణుల్లో విప్రవినోది శాఖ ఒకటి ఉండేదని స్పష్టంగా తెలుస్తుంది. యక్షిణీవిద్య, ఇతర తాంత్రిక విద్యలలో నిపుణులైన వీరు, వాటిద్వారా వచ్చే ఆదాయాన్ని ఆయా దేవతలకు అర్పించేవారని కడప జిల్లా పెద కొమ్మర్ల గ్రామానికి చెందిన క్రీ.శ. 1551 వ సం॥ నాటి ఒక

శాసనం,[183] ఇదే జిల్లాకు చెందిన పొన్నతోట గ్రామంలోని క్రీ.శ. 1554 వ సం॥ నాటి మరొక శాసనం వివరిస్తున్నాయి.

బ్రాహ్మణులు, ఆనాటి సమాజంలో పలురకాల జీవనోపాదుల్ని కల్గివుండే వారని వ్యక్తమౌతోంది. అధికారం, సమాజం మనిషి మనుగడను శాసించే నేతలుగా ఆవిర్భవించినప్పుడు, ప్రతి వ్యక్తీ ఆ సమకాలీన ధర్మానికి తలవొగ్గ వలసిందే!

**గ్రామ ప్రతినామాలు :** ప్రతి మనిషికీ ఒక పేరున్నట్లే ప్రతి గ్రామానికి ఒక పేరుండటం సహజం. మనుష్యులు తమ పేర్లను ఒక దశలో మార్చు కోవడం అప్పుడప్పుడు జరుగుతుంటుంది. ఇదే విధంగా కొన్నికొన్ని సందర్భాల్లో గ్రామాల పేర్లను కూడా మార్చటం జరుగుతూ వుండేదని శాసనాలద్వారా తెలుస్తుంది. ఎవరైనా రాజులు యే గ్రామాన్నైనా దానమిచ్చినపుడు దానికి తన పేరును ప్రతినామముగా చెప్పి (పేర్కొని), శాసనాల్లో చెక్కించేవారు. ఇతర సందర్భాల్లో యీ మార్పు అంతగా కన్పించదు. అయితే, ప్రభుత్వరికార్డుల్లో మాత్రం పూర్వనామాన్ని పరిహరించక, అనంతర నామాన్ని పాటిస్తూ ఉండటం కూడా గమనించవచ్చు. ఈ పద్ధతి శాసనాల్లో కూడా వుంది.

రాయలసీమలోని అనేక గ్రామాలకు ప్రతినామాలుండినట్లు, ఆయా పేర్లతో అవి వ్యవహరింపబడినట్లు శాసనాలు ఋజువు చేస్తున్నాయి. కడపజిల్లా అరకటవేముల గ్రామంలోని క్రీ శ. 1508 వ సం॥కు చెందిన ఒక శాసనం[185] వల్ల అక్కడికి దగ్గర్లో నిత్యానందపుష్టినాథపురం అనే గ్రామం ఉండేదనీ, దానికి ప్రస్తుత ప్రతినామం నీళ్ళులేని పోటిపాడుగా వుందని తెలుస్తూంది.

ఇదే జిల్లా వల్లూరు గ్రామంలోని క్రీ. శ. 1553 వ సం॥పు ఒక శాసనంలో[186] పెద వల్లూరికి ప్రతినామం తిమ్మసముద్రంగా పేర్కొనబడింది.

ఇదే జిల్లా భీమగుండం గ్రామంలోని క్రీ. శ. 1555 వ సం॥నాటి ఒక శాసనంలో[187] భీమగుండం గ్రామానికి ప్రతినామంగా అచ్యుతరాయపురం అని తెల్పబడింది.

అనంతపురం జిల్లా భూపతిరాయసముద్రం గ్రామంలోని క్రీ. శ. 1556 వ సం॥కు చెందిన ఒక శాసనంలో,[188] ప్రస్తుత భూపతిరాయసముద్రం అను పేరు కల్గిన ఈ గ్రామం, పూర్వం సర్వజ్ఞక్రియా శక్తిపురంగా పిలువబడుతూ ఉండే దని తెలుస్తూంది.

ఇదే జిల్లా రాయదుర్గం తాలూకా బాగినాయనిపల్లెకు మాధవరాయపురం అనే ప్రతినామం ఉన్నట్లు క్రీ. శ. 1556 వ సం॥ నాటి రాయదుర్గంలోని ఒక శాసనం[189] చెపుతూంది.

కడప జిల్లా సంబటూరు గ్రామానికి ప్రతినామం శ్రీభాష్యపురంగా ఆ గ్రామాన్నే ఉన్న క్రీ. శ. 1557 వ సం॥ నాటి ఒక శాసనంలో[190] తెల్పబడింది.

అనంతపురం జిల్లా బయనగుంటపల్లి గ్రామంలోని క్రీ. శ. 1638 వ సం॥కు చెందిన ఒక శాసనం[191] వానవోలుకు ప్రతినామం కమలాజపురం అనీ, ఇదే జిల్లా సంగాల గ్రామానికి ప్రతినామం విజయభూపతిపురంగా క్రీ. శ. 1559 వ సం॥పు ఒక శాసనంలోను[192] పేర్కొనబడ్డాయి.

కొన్ని ఊళ్ళు పురములుగాను, సముద్రములుగాను, వ్యక్తుల పేర్లమీదను వ్యవహరింపబడినాయి. ఇవి పరిశీలనార్హములైన అంశాలు.

## బావి, చెరువు (తటాకం) వగైరాలు కట్టించిన విశేషాలు తెలిపే శాసనాలు :

మన దేశం వివిధ సంప్రదాయాలకు పుట్టినిల్లు. మానవ జీవితానికి వీటి అవసరం కూడా యెంతో ఉంది. సమాజాభివృద్ధికి ప్రాచీన పాలకులు, సంఘ శ్రేయోభిలాషులు వీటి అవసరాన్ని గుర్తించారు. ప్రజా ప్రగతికి వీటిని సోపానాలుగా, సత్సంప్రదాయ చిహ్నాలుగా అభివర్ణించారు. ఇట్లాంటి వాటిలో యెన్నదగ్గవి సప్తసంతానాలు ఆంధ్ర వాఙ్మయంలో వీటి ప్రసక్తి ఉంది. అంతకు మునుపే శాసనాల్లో కూడా ఇవి పేర్కొనబడి ఉన్నాయి. క్రీ.శ. 1132 (శ.సం. 1054)లో గుంటూరు మండలంలోని నిడుబ్రోలు గ్రామంలోని ఒక శాసనంలో[193] వీటి పేరు చెప్పకున్నా వీటిలో కొన్ని పేర్కొనబడి ఉన్నాయి.

నన్నెచోడకవి కుమారసంభవ కావ్య పీఠికలో శ్రీ వేదం వారు—

'గుడియునుఁ జెఱువును వనమును
నడరిన నల్లిండ్లుం గృతియు నలపెన్నిధియున్
గొడుకులును సప్తసన్తతి
నొడగూడగ నిలిపి నరనండొ ప్పెంగీర్తిన్'[194]

—అని ఉదాహరించారు.

శాసనాల్లో వీటి ప్రసక్తి క్రీ. శ. 1170వ సం॥ నుండి కన్పిస్తుందగా, వాఙ్మయంలో ఆ తర్వాతి రెండు వందల సంవత్సరాలకు కానీ కన్పించడంలేదు.

నగరాలు అభివృద్ధిచెంది ఒక వైపు సహజత్వం మరుగయిపోతుండగా, ప్రాచీన సంప్రదాయం ఛాయామాత్రంగా అయినా శాసనాల్లో కన్పింప ప్రారంభించింది. రాజులు చేసిన దానధర్మాదులకు లిఖిత సాక్ష్యాలు, ప్రబల ప్రమాణాలు శాసనాల ద్వారా తెలియవచ్చినాయి. ఇవే క్రమంగా సప్త సంతానాలుగా వెల్లడయ్యాయి. వీటిలోనూ కావ్యం ఉత్కృష్ట సంతానమని నన్నెచోడుడు తన కుమారసంభవ కావ్యంలో చెప్పినందువల్ల వీటి చరిత్ర కూడా కొంత చర్చనీయాంశమైంది.

ఆంధ్ర వాఙ్మయంలో సప్త సంతానాలను పేర్కొన్న మొదటి కావ్యకర్త మంచన తన కేయూరబాహుచరిత్ర కృత్యాదిలో—

'నందనుడు, వనమ్ము, నల్లిల్లు, నిధి, సుర
గృహము, చెఱువు, మేలికృతి యనంగ
జగతివెలయు సప్తసంతానములు; వీనఁ
బుణ్యమును యశంబుఁ బొందవచ్చు'— అని చెప్పినాడు.

బహుజనపల్లి సీతారామాచార్యులవారు తన శబ్దరత్నాకరం అనే నిఘంటువులో ఇదే భావానిచ్చే పద్యాన్ని ఉటంకించారు.

నీటి సదుపాయాల్లో అతి ప్రతిధానమైంది తటాకం. ఇది ప్రజలందరకూ బహుళ ప్రయోజనాన్ని కల్గించేది. ప్రేతాత్మలు దప్పికగొన్నప్పుడు అదృశ్య రూపాల్లో వీటివద్దకు వచ్చి తమ దప్పికలు తీర్చుకొంటాయనీ, తటాక నిర్మాణం ధర్మకార్యం కాబట్టి, వాటి దప్పిక సులభంగా తీరుతుందని ప్రాచీనుల విశ్వాసం. పశుపక్ష్యాదులకు, మనుష్యులకు, సకల ప్రాణులకు ఆధారభూతంగా నిర్మించిన ఇట్లాంటి తటాక కర్తలకు అశ్వమేధయాగ ఫలం కల్గుతుందని మహాభారతంలో చెప్పబడి వుంది.

తటాక నిర్మాణానికి అనువైన స్థలం, తగిన ధనం, నిరంతర ప్రవాహ గమనం (లేదా వర్షాకాలపు నీరు వచ్చేందుకై వలసిన వనరులు), తప్పనిసరిగా ఉండాలి. నిర్మాణ విధానం సాంకేతిపరంగా వుంటూ పది కాలాలు భద్రంగా ఉండేట్లు నిర్మించాలి. తూములు, మరవలు నిర్మించాలి, మరవల ద్వారా అద

నంగా ఉప్పొంగే నీరు పంటభూములకు, మిగిలిన చెరువులకు ఉపయోగపడేటట్టు యేర్పాటు చేయాలి. తటాకపు నీరు పరిశుభ్రంగా ఉంచితే మనుష్యులు ఉపయోగించుకొనేందుకు వీలవుతుంది పూర్వకాలంలో చెరువునుండి నీళ్ళు వదలడానికి, నీళ్ళు పెట్టడానికి గ్రామాధికారుల అజమాయిషీలో 'నీరుగట్టువాండ్రు' అనే వృత్తి పనివారు చాలా మెలకువతో నిర్వహించేవారు. ఇప్పటికీ గ్రామాల్లో చాలా భాగం వీరి నిర్వహణ ద్వారానే నీటి సరఫరా జరుగుతూంది. వీరికి పంటలో కొంత భాగం ఇవ్వబడుతూంది.

నూయి, బావి, కోనేరు, కాలువల నిర్మాణాల ద్వారా వాటిని నిర్మించిన వారికి, కాపాడిన వారికి అనంత పుణ్యాలు కల్గుతాయని కావ్యాల్లో, శాసనాల్లో చెప్పబడింది.

నన్నయభట్టు తన భారతం ఆదిపర్వంలో "నుతజలపూరితంబులగు నూతులు నూరిటికంటె సూనృతవ్రత! యొక బావిమేలు మరి బావులు నూరిటి కంటె నొక్క సత్క్రతువదిమేలు!" అనే సూక్తిని దుష్యంతోపాఖ్యానంలో శకుంతలతో చెప్పించాడు.

తటాకం, నూయి, బావి నిర్మించడం, వాటిని పదిమంది శ్రేయస్సుకై వినియోగించడం యెంతో పుణ్యప్రదమని ప్రజల విశ్వాసం. రాయలసీమ తెలుగు శాసనాల్లో వీటి వివరాలు కొన్ని ఇవ్వబడ్డాయి. కడప జిల్లా పెద్ద ముడియం గ్రామంలోని క్రీ.శ. 8 వ శతాబ్దిలోని ఒక శాసనంలో[195] నూయి తవ్వడం, ప్రజోపయోగార్థం దాన్ని రక్షించవలసిన కర్తవ్యాన్ని వివరించారు. అనంతపురం జిల్లా బూడిదగడ్డపల్లి గ్రామంలోని కాల వివరాలు తెలియని ఒక శాసనంలో[196] అవిమన, గంగకేసురాజు అనేవాళ్ళు లోకశ్రేయస్సుకై, ప్రజల ఉపయోగార్థమై ఒక చెరువును నిర్మించినట్లు తెల్పబడింది.

కడప జిల్లా జ్యోతి గ్రామంలోని క్రీ.శ. 1247 వ సం॥ నాటి ఒక శాసనంలో [197] జ్యోతినాథస్వామి భక్తుడైన చెంతేరామినాయకుడు బేటూరు వద్ద రెండు చెరువులు తవ్వించినట్లుంది.

కర్నూలు జిల్లా త్రిపురాంతకంలోని క్రీ.శ. 1293 వ సం॥ నాటి ఒక శాసనంలో[198] ఒకానొక భక్తుడు తమ తల్లిదండ్రుల పుణ్యానికిగాను రెండు చెరువులు తవ్వించినాడని చెప్పబడి ఉంది.

కడపజిల్లా దూలంవారిపల్లె గ్రామంలోని చెరువుకట్టపై గల క్రీ.శ. 14 వ శతాబ్దికి చెందిన ఒక శాసనంలో[199] తటాక నిర్మాణాన్ని గూర్చిన ఒక శ్లోకం గమనింపదగినది. తటాక నిర్మాణం దాన సిద్ధిని కల్గిస్తుందని ఇందులో వ్యక్తం చేయబడి ఉంది.

ఇదే జిల్లా దిగువ కలపటాల గ్రామంలోని క్రీ.శ. 1403 వ సం॥ కు చెందిన ఒక శాసనంలో[200] తిప్పినాయుడు అనేవాడు తన తండ్రి తిప్పినాయుడి పేరిట పిత్రార్పితంగా 'కల్పవల్లి' పేరుతో ఒక ధర్మబావిని ప్రతిష్ఠచేస్తూ ఈ పేరు సార్థకం కావాలని వ్యక్తం చేసినట్లుగా ఉంది.

ఇదే జిల్లా రావులకొలను గ్రామంలోని క్రీ.శ. 1494నాటి ఒక శాసనంలో[201] నరసానాయనిగారు తమ తల్లి కావేరమ్మ పేరిట కట్టుకాలువ నిర్మించినట్లుగా ఉంది.

రాయలసీమలో ఇట్లాంటి శాసనాలు అనేకం క్రీ.శ. 14,15,16 శతాబ్దుల్లో వేయింపబడిన దాఖలాలు ఉన్నాయి. వీటిలో కడప జిల్లా సిద్ధవటం గ్రామంలోని క్రీ.శ. 1605 వ సం॥కు చెందిన ఒక శాసనం[202] పద్యరూపంలో ఉంది- ఇది పరిశీలించదగ్గది. ఇది శ్రీమదెల్లమ రాజు చెరువు పేర నిర్మించబడింది.

దైవ సంప్రీతిగా, తమ తల్లి దండ్రుల పుణ్యంగా సమస్త ప్రాణుల నిత్యావసరాలైన కోనేరులను, తటాకాలను, బావులను, నూతులను నిర్మించారు. ఇవన్నీ 'మానవ సేవయే మాధవ సేవ' అన్న నానుడిలోని పరమార్థమే!

**చలివేంద్రము** (ప్రప) : శాసనాల్లో 'చలివెందర', 'చలివెందల' అని పేర్కొనబడిన ఈ పేరుకు 'ప్రప' అన్నది సంస్కృత నామం. శబ్దకోశాల్లో ఇది 'చలిపందిరి' అనికూడా పిలవబడుతూంది.

ఇంకా దీన్ని 'బాటసారులు పిపాసార్థము పానీయముల నిచ్చుటకు నిర్మింపబడ్డ శాల',[203] "తాగడానికి నీళ్ళు పోసే పందిరి"[204], 'ప్రపాపానీయ శాలికా'[205] అని అనేక శబ్దకోశాల్లో వివరణలు ఇవ్వబడినాయి.

ఇప్పటికీ కుగ్రామాల్లో, గ్రామాల్లో ఒక మాదిరిగా ఉండే పట్టణాల్లో కొత్త కుండలు తెచ్చి అక్కడక్కడ రహదార్ల పక్కల కానుగ, వేప మొదలైన ఆకు

లతో కప్పి నిర్మింపబడిన పందిళ్ళక్రింద ఉంచి, మంచినీళ్ళు పోయించి, వీటిని ఒక మనిషి ద్వారా ప్రతిరోజు బాటసారులకు సౌకర్యం కల్గించి, దప్పిక తీర్చడం జరుగుతూంది. పూర్వకాలంలో వీటికై, వీటి నిర్వహణకై మడిమాన్యాదులను కేటాయించేవారు అనేందుకు శాసనాలు అక్కడక్కడ కన్పిస్తున్నాయి.

బావులను, నూతులను, తటాకాదులను ప్రజోపయోగార్థం తవ్వించడంలో యెంత పరమార్థం, కీర్తి ఇమిడిఉన్నాయో, చలిపందిరిని యేర్పాటుచేయడంలో కూడా అంతే సార్థక్యం చోటుచేసుకుందని మనం తెలుసుకోవాలి.

కడప జిల్లా నిడుజువ్వి గ్రామంలోని క్రీ.శ. 1545 వ సంవత్సరము ఒక శాసనంలోను[206] ఇదే జిల్లా దేవుని కడప గ్రామంలోని క్రీ.శ. 1551 వ సం॥ ఒక శాసనంలోను,[207] ఇదే జిల్లా ఇదే గ్రామంలోని క్రీ.శ. 1552 సం॥ము ఒక శాసనంలోను[208] చలివేందర పెట్టించినందులకు మడిమాన్యాదులు, చేను, పొలము ఇచ్చినట్లుగా పేర్కొనబడి ఉన్నాయి.

బాటసారులకు ఇవి ఎండాకాలంలో ఎడారుల్లోని ఒయాసిస్సులవంటివి. అయ్యలరాజు నారాయణామాత్య హంసవింశతి కావ్యంలో—[209]

''అట్టి వేసవివేళ ధనాఢ్యుడైన
యచ్చటి నియోగి చలివెంద్రలాదియందు'

..................................................

..................................................

లవణశుంఠీ జంబల రసానుయుక్తమౌ నీరు మజ్జిగకుండ బారు
లలర లఘులయైలానూన లలితసౌరభమిశ్ర శీతల జలకుంభజాతమమర,
జీరకైదర్య చారుగంధములొల్కు పలుచని యంబళ్ళ పంట్లుదనర
లవయుప్పు నీరుల్లి రసమునించిన చోళ్ళ గంజకాకుల గుంపు కదురహింప
గంధ బర్విష్ఠలామజ్జిక ప్రశస్త
కాయమాన డూహూర్మహూరాయమాన
మద పవమాన ఘనసార బృందవేది
కాలయవిశాల పానీయశాల యొప్పె.

...మఱియు నచ్చటి పందిరి గవాక్షాది సమాకలిత వాయుజాత సంచారంబుగావున రఘురామ మనోరంజకంబును, బాంధవజన సంతాపహరణంబు గావున సత్కృత సంగమంబును...."అని వర్ణించాడు.

పూర్వకాలంలో చలివేందర్లలో కేవలం తాగే నీళ్ళే కాకుండా, సుగంధ భరితమైన నీరు మజ్జిగ కూడ ఉండేదనీ, పానీయశాలలు సర్వసౌకర్యాలతో మనోహరంగా ఉండేవని వీటివల్ల వ్యక్తమౌతూంది.

'మరుదేశమధ్యమ ప్రప కులపతి'[210] అని మనుచరిత్రకారుడు వర్ణించాడు. ఏది యేమైనా చలిపందిళ్ళ అవసరం ఈనాడూ ఉంది అనేది అందరూ గమనింపవలసిన ముఖ్యాంశం.

**సత్రము - మఠము :** 'అతిథిదేవోభవ' అన్నది ఆర్యోక్తి. అతిథి అభ్యాగతులను ఆదరించడం, గౌరవించడం సనాతన భారతీయ సంప్రదాయం. శాసనాల్లోను, కావ్యాల్లోను ఈ సంప్రదాయాన్ని గూర్చిన ఉపాఖ్యానాలు కోకొల్లలు ఉన్నాయి. దశదానాల్లో అన్నదానం కూడా ఒకటి. గృహస్థులు ఈ అన్నదాన కార్యక్రమాన్ని పవిత్ర యజ్ఞంగా ప్రతి రోజూ చేసేవారని తెలుస్తూంది. ఆనాటి పాలకులు, ధనవంతులు ఉచిత భోజనశాలలు, వసతులు యేర్పరచారు. ఇట్లాంటి అన్న శాలల్నే సత్రాలు అని కూడా పిలిచారు. 'సత్రము' అన్న పదానికి ధర్మశాల, అన్నదాన గృహము,[211] బాటసారులు దిగడానికి కట్టివుండేదని, నిత్యాన్నదానము చేసే ఇల్లు అని నిఘంటుకారులు[212] వ్యాఖ్యానించారు.

సామాన్యంగా సత్రాలు దేవాలయాలకు అనుబంధంగా వుండేవి. కొన్ని విద్యాలయాలకు కూడ ఇవి చేర్చబడి వుండేవి. కల్పవృక్షం, కామధేనువుల్లాంటి ఈ సత్రాల అవసరం ఆనాడు ఎంతైనా ఉండేది. బాటసారులకు, యాత్రికులకు పరదేశీయులకు, విద్యార్థులకు, భక్తాదులకు ఇవి నిజంగా కామధేనువులే!

రాయలసీమ శాసనాల్లోని కొన్నింటిలో వీటి ప్రసక్తి మనకు అక్కడక్కడ కన్పిస్తూంది. కర్నూలు జిల్లా త్రిపురాంతకంలోని శ్రీ త్రిపురాంతక దేవర గుడి సమీపంలో కట్టించిన మఠంలో శుద్ధశైవ క్రమంలో అతిథి అభ్యాగతులకు ఉపచారాలు చేసేటందుకు మఠము, సత్రము నిర్వహిస్తూ ఉండినట్లు ఒక శాసనం[213] తెలుపుతూంది. ఇందులో సంవత్సర వివరణ లేదు ఈ సత్రంలో పనిచేస్తున్న వంటవాళ్ళకు మాన్యాలు, కట్టడులు చేసినట్లు మాత్రం పేర్కొనబడింది.

ఇదే జిల్లా మార్కాపురం గ్రామంలోని సదాశివరాయల కాలంనాటి (క్రి.శ. 1555 సం॥) శాసనం[214] పరదేశి బ్రాహ్మలకు ప్రసాదపడి సత్రంలో పెట్టించినట్లుగా చెప్పబడింది.

కడప జిల్లా విరూరు గ్రామంలోని క్రీ.శ. 1527 వ సం॥ నాటి ఒక శాసనంలో[215] సురదేశి పరదేశికి అన్నదానం చేసేందుకు ఆ గ్రామ అయ్యావళి[216] చాలుమూల సమస్త పెక్కండ్రు సమక్షమున నిర్ణయం చేసిన వివరాలు పేర్కొన బడినాయి.

అతిథి పూజా తత్పరత్వం కల్గిన ప్రాచీనులు అరదేశి పరదేశి జనులకు అక్కడక్కడ సత్రాలు, మఠాలు కట్టించి వాటి నిర్వహణకు కొంత భూమిని, నిధులను యేర్పాటు చేసేవారని తెలుస్తూంది. అరదేశి - యాత్రికుడు, పరదేశి - ఇతర దేశమునుండి వచ్చినవాడు - (అతిథి).[217] సత్రాలు భోజనం చేయడానికి, మఠాలు వసతి గృహాలుగ వినియోగింపబడేవని అర్థం చేసుకోవచ్చు. ఇవి ప్రాచీనకాలంలో అక్కడక్కడ గ్రామాల్లోను, తిరుపతి, శ్రీశైలంవంటి పుణ్య స్థలాల్లోను నిర్వహింపబడుతూ వుండేవని తెలుస్తూంది. సత్రం (Chowltry) అన్నది ఈనాడు ఉచిత నివాసస్థలం లేదా కొంత సొమ్ము ప్రతిఫలంగా తీసుకొని కొంతకాలం నివసించేందుకు అనుకూలమైన ఒక భవనంగా చెప్పవచ్చు. మఠం ఈనాడు ఒక మతానికి కేంద్రస్థానంగా వుండే స్థలం. ఉదా:- వ్యాసరాయ మఠం, శంకరమఠం మొదలగునవి.

దానం, ధర్మం, మానవత్వం, పారమార్థిక చింతన, అతిథి - అభ్యాగతులను పూజించడంవంటి సంస్కృతి ఆనాటి సమాజంలో మెండుగా ఉండేదని ఈ సత్రాల, మఠాల ప్రసక్తి శాసనాల్లో అక్కడక్కడ ఉండటం వల్ల వ్యక్తమవుతుంది.

## స్త్రీలు - వారి స్థానం :

ప్రాచీన మానవ సమాజంలో స్త్రీలకు విశిష్టస్థానం ఉండేదని తెలుస్తూంది. స్త్రీలలో ద్రష్టలున్నారు. ద్రష్ట అంటే మంత్రాలను కనుగొన్నవారు లేదా వాటిని రచించినవారు. ఉదాహరణకు లోపాముద్రా, విశ్వవారా, సికతానివావరి, ఘోషా అనేవాళ్ళు క్రమంగా ఋగ్వేదంలోని I - 79, V - 28, VIII - 91, IX 81-10-20 మరియు X 39-40 మంత్రాలకు భాష్యం చెప్పారు. క్రీస్తుశకారంభం నాటికి స్త్రీలను వేదాధ్యయనానికి, ఉపనయనానికి అనర్హులుగా, కుటుంబానికి అలంకారప్రాయంగా, చాలవరకు వ్యక్తిత్వాన్ని, స్వాతంత్ర్యాన్ని కోల్పోయిన వ్యక్తులుగా పరిణమించేందుకు వలసిన పరిస్థితులు యేర్పడినాయి.[218]

పురాణాల్లోను, వైదిక సంప్రదాయానికి సంబంధించిన రాతల్లోను స్త్రీని ఆదిశక్తిగా, అమ్మలగన్న అమ్మగా మనవారు వర్ణించారు. అలాగే అల్పురాలిగా, అబలగా, కొన్ని పవిత్ర కార్యాలకు అనర్హురాలిగా ప్రకటించిన సందర్భాలూ ఉన్నాయి.

క్రీస్తు పూర్వయుగములో మాతృస్వామ్య వ్యవస్థ ఉండేదని అప్పటి వంశ నామాలు, గృహ నామాలనుబట్టి తెలుస్తూంది. ఉదాహరణకు మౌర్య వంశం లోని మురి అనే రాణి కుమారుడే చంద్రగుప్తుడు. ఇతడే మౌర్య చంద్ర గుప్తుడుగా ప్రసిద్ధికెక్కాడు.శాతవాహనులుకూడ తమ తల్లి పేరుతో గౌతమిపుత్ర శాతకర్ణి, వాసిష్ఠిపుత్ర పులమాయి మొ॥ పేర్లు పెట్టుకున్నారు.

నాగార్జునకొండ, జగ్గయ్యపేట ప్రాంతాల్లో లభించిన బ్రాహ్మిలిపిలోని ప్రాకృత, సంస్కృత శాసనాల్లో ఐదుగురు ఇక్ష్వాకు వంశ రాజుల్ని గూర్చి చెప్ప బడింది. వాసిష్ఠి పుత్ర శ్రీశాంతమూలుడు తన తల్లి ('వాసిఠీపుతసిరిచాంత మూల') పేరును చేర్చి శాసనాల్లో ప్రకటించుకున్నాడు. ఈ వంశానికే చెందిన వీరపురుషదత్తుడు అనే రాజును తల్లి మాఢరి పేర 'మాఢరీపుత్ర శ్రీ వీరపురుష దత్త'గా శాసనాలు పేర్కొన్నాయి.

స్త్రీకి మాతృస్థానం మహోన్నతంగా చెప్పబడింది. వీరమాతలుగా, వీర నారులుగా స్త్రీలు చరిత్రలో సమున్నతలుగా ఖ్యాతి చెందారు.

విజయనగర రాజుల కాలంలో స్త్రీలకు కొంత చదువుతోపాటు లలితకళ లందునూ ప్రావీణ్యతను కల్గించేవారు. రాజుల, ధనవంతుల ఇళ్ళల్లో ఇది సాంప్ర దాయ సిద్ధంగా జరిగేవి. దేవదాసీలు, వేశ్యలు మొదలగువారి సాంప్రదాయాల్లో తప్పనిసరి కళలుగా వీటిని అభ్యసించేవారు. గోవిందసాని, హనుమసాని, లింగ సాని, కుప్పాసాని, బెజ్జమ్మ వంటి దేవదాసీలు ఆలయ నర్తకీమణులుగా, దేవా దాసీలుగా నియమింపబడినట్లు తిరుమల తిరుపతి-దేవస్థాన శాసన సంపుటాల219 వల్ల తెలుస్తూంది. ఈ విషయాలను గూర్చి ప్రత్యేక ప్రకరణంలో వివరించ బడింది.

ప్రాచీన, మధ్య కాలాల్లోని మొల్ల, తరిగొండ వెంగమాంబ, తాళ్ళపాక చిన్నక్క, ముద్దుపళని, కృష్ణాధ్వరి, రంగాజమ్మ వంటి విదుషీమణులైన స్త్రీలు సాహిత్యం చరిత్రలో ధ్రువతారల వంటివారు.

ఆధునిక యుగంలోని స్త్రీలు ఎంత విద్యావంతులైనా, తోడి స్త్రీలచేత కొంతా, కొందరు పురుషపుంగవులచేత మరికొంతా స్వార్థబలిపీఠాలకు ఆహుతయి పోతున్నారు. ఈ యంత్రయుగంలో స్త్రీని కూడా ఒక యంత్రంగా చూస్తున్నారన్నది యేమాత్రం అతిశయోక్తి కాదు.

## దేవదాసీలు :

'దేవదాసి' అంటే దేవతల పరిచారిక.220

దేవాలయములందు సేవచేసెడు భోగ స్త్రీ.221

దేవాలయాల్లో జరిగే గీత నృత్యాల ద్వారా దేవునికి యథాశక్తి సేవచేసి జీవితం గడిపే ఒక పరిచారిక. దేవాలయ వ్యవస్థలో చేసే అనేక పూజా పురస్కారాల్లో, ఉపచారాల్లో గానం, నృత్యం కూడా ఉన్నాయి. ఇది కేవలం భారతీయ సంప్రదాయానికే పరిమితం కాలేదు. కొన్ని పాశ్చాత్య దేశాల్లో కూడా ఈ పద్ధతి ఉన్నట్లు తెలుస్తూంది.222

పూర్వపు రాజులు, అధికారులు, పూజాదులద్వారా నిర్వహింపచేసే అనేక భగవత్సేవల్లో రంగభోగం కూడా ఒకటి. నృత్య, గీత, వాద్యాదులతో ప్రత్యేక రంగ మంటపంలో ఈ పూజ దైవప్రీతికై నిర్వహింపబడుతుంది. భక్తులు ఆలయ నిర్వాహకుల ద్వారా ఈ కార్యక్రమాన్ని నిర్వహిస్తారు. దేవాలయంలోని దైవకార్యాలకే అంకితమై దైవప్రీతికై నర్తించే వీరిని దేవదాసీలని పిలుస్తూ వచ్చినారు.

దేవరబసివి, దేవరసాని అన్న పదప్రయోగం క్రీ.శ. 1518 వ సం॥నాటి ఒక శాసనంలో ''శ్రీమన్మహా శిరః ప్రధాన సాళువ తిమ్మరుసయ్యవారి రాజ్యభార దురంధరులైన....రెంటూరి చిటమరుసుంగారు వీరేశ్వరుని అంగరంగభోగాలకు ......దేవరబసువులు లింగిఅక్క యెల్లిపెదనాగి అవిరిమెచ్చుతునుకసైతమైన వారికి గ్రామం దక్షిణాన గుంటూరి తెరువు పడమటను క్షేత్రం ....''223

దేవదాసీలకు దేవరబసువులకు ఒక ముఖ్యమైన భేదం ఉంది. దేవదాసీలకు వృత్తి (పదవి) ఒకరినుండి ఒకరికి సాంప్రదాయబద్ధంగా వచ్చేది. 'బసివి'గా రూపొందే బాలికను తల్లిదండ్రులు,ఏదో ఒక కారణంతో దేవునికి అర్పించేందుకు మొక్కుబడిగా మొక్కుకొంటారు. ఇదే దేవునికి బసవని, లేదా మరొక పశువుని

మొక్కుబడిగా వదలినట్లే! ఈ బసవికూడా దేవుని సేవకుగాను అంకితమయ్యే దేవదాసీయే! ఈ అర్థం స్ఫురించే విధంగా పై శాసనంలో ఈ విషయం స్పష్టంగా పేర్కొనబడింది.

ప్రాచీన దేవాలయ సాంప్రదాయాల్లో ఒక భాగంగా దేవదాసీలను దేవాలయ పరిచారకులుగా నియమించుకొనే పద్ధతి ఉండేదని తెలుస్తూంది. దేవుడిని సజీవమూర్తిగా చూడడం, అష్టైశ్వర్యాలతో ఒకానొక వ్యక్తి పొందే భోగాలన్నింటినీ భగవదర్పితం చేయడం జరుగుతూంది. వీటిలో ఒక భాగమే దేవదాసీలను అర్పించడం కూడా! దైవపూజాసమయాల్లో సంగీతానికై స్త్రీలను నియమించుకోవాలని కొన్ని పురాణాలు చెబుతాయి. ఈ స్త్రీలు సామాన్యంగా వేశ్యలు. దేవాలయాలకుగాను వేశ్యలను కొనడం కూడా చేయవచ్చని కొన్ని పురాణాలు సూచిస్తున్నాయి.[224]

క్రీ.శ. పదవ శతాబ్దం తర్వాతి శాసనాల్లో వీరిని 'పాత్ర'లనీ విలాసినులనీ పేర్కొనటం జరిగింది.

గుంటూరు జిల్లా దావులూరు గ్రామంలోని క్రీ.శ. 1132 వ సం॥నకు చెందిన ఒక శాసనంలోను,[225] ఇదే జిల్లా దుర్గి గ్రామంలోని మరొక శాసనంలోను[226] పాత్రలు అనీ, పాత్రభోగమువారనీ పేర్కొనబడింది.

'పాత్ర' అంటే సంస్కృతంలో 'నట' అనే అర్థంకూడా వుంది. నాటకాల్లోని పాత్రను 'Role' అని అంటాము. ఉత్తర భారతంలో పాతర్, పాతుర్, పాతురీయ అంటే వేశ్య అనే అర్థం ఉంది.

దేవదాసీలందరూ వేశ్యలయినా, వేశ్యలందరూ దేవదాసీలుకారు. దేవాలయ దానాల్లో 'వేశ్య' అనే మాటవస్తే, దాన్ని దేవదాసిగా అర్థం చేసుకోవచ్చు వేరే చోట ఈ పదం వస్తే 'వేశ్య'గానే లెక్కించపబడాలి.

తిరుమల - తిరుపతి దేవస్థానాల్లో ఆనాడు కొంత మంది స్త్రీలు దేవాలయ నర్తకీమణులుగా (దేవదాసీలుగా) నియమింపబడినట్లు తి. తి. దే. శాసన సంపుటి ద్వారా తెలుస్తూంది.

క్రీ.శ. 1535 సం॥ము నాటి ఒక శాసనంలో,[227] క్రీ. శ. 1538 సం॥ నాటి ఒక శాసనంలో,[228] క్రీ. శ. 1540 సం॥ నాటి శాసనంలోను,[229] ఇంకా అనేక శాసనాల్లోను[230] చిక్కయసవాయి, గోవిందసాని, బెజ్జి, హనుమసాని, లింగసాని మొదలైన నర్తకీమణులు దేవాలయ సేవలకై తమ జీవితాలను అర్పించినట్లు పేర్కొనబడినవి.

దేవాలయ వ్యవస్థలో దేవదాసీ పాత్ర నిజంగా మరువలేనిది. దేవునికి భోగవస్తువుగా, దేవాలయానికి అలంకారంగా, రంగమంటపానికి సజీవమూర్తిగా రాజులచే, ప్రజలచే, దేవాలయ నిర్వాహకులచే అంకితం చేయబడిన కళాజ్యోతి ఈ దేవదాసి. భరతముని నాట్యశాస్త్రానికి సజీవ కళారూపాలుగా నిలిచి, నటరాజమూర్తికి నిరంతర నివాళులర్పించే దేవదాసీలు నిజంగా ధన్యమూర్తులు.

## ధార్మిక జీవనం :

'మతం' అనే పదానికి అభిప్రాయము, జాతి, శాస్త్రము, సమ్మతి అనే అర్థాలను ప్రధానంగా స్వీకరించవచ్చు. వారి వారి సిద్ధాంతాలకు అనుగుణ్యంగా ఇవి యేర్పడ్డాయనీ, రానురాను వీటికే 'మతాలు' అనే పేర్లు వచ్చాయనీ చెప్పుకోవచ్చు. ఇప్పుడు మనం వ్యవహరించే ఈ మతాన్ని మన పూర్వులు ధర్మమనీ, సమయమనీ చెప్పుకొనేవారు.

సంప్రదాయాలు, సంస్కృతులు మతాలకు అంతర్వాహినులై భిన్న భిన్న మతాల్లోని తత్వాలను వివరింపసాగాయి. వీటిని అనుసరించడంవల్ల ఆయా మతాలకు భిన్నమైన పేర్లను కూడా పెట్టడం జరిగింది.

మన దేశంలో వైదిక సంప్రదాయము అతి ప్రాచీనమైనది. గంగా సింధూ నదీపరీవాహక ప్రాంతాన్ని ఆర్యావర్తంగా పిలుస్తూ, దక్షిణభారతంలో గోదావరి, కృష్ణ, కావేరి నదుల మధ్య ఆర్యావర్త సంస్కృతికి ప్రతిరూపంగా గణిస్తున్నాము. అంటే, భారతదేశమంతటా ఆర్య సంస్కృతి నిండి వుందని దీనివల్ల తెలుస్తుంది. అర్షవిజ్ఞాన భాండారమైన వేదాలు, శాస్త్రాలు, ఉపనిషత్తులు మహర్షి ప్రోక్తములై పరంపరానుగతములై మానవ ధర్మ నిష్కములై సంప్రదాయబద్ధాలై ఆసేతు హిమాచలం ఉరకలు వేసి, యావద్భారతాన్ని పునీతం చేశాయి.

వైదిక మతంగా పిలవబడే హిందూమతానికి వేదాలు, శాస్త్రాలు; వీటికి మూల విరాట్టులుగా మహర్షులు, ప్రవక్తలు ఉద్భవించి ప్రకాశింపచేశారు. వైదిక మార్గాన్ని అనుసరించిన వారంతా హిందువులే అనే విశ్వాసం లోకంలో నెలకొని ఉంది.

''హిందూమతంలో ప్రధానంగా శైవ, వైష్ణవాలు, అద్వైత, విశిష్టాద్వైత, ద్వైత సిద్ధాంతాల్ని ప్రతిపాదిస్తున్నాయి.

"శైవంలో అనేక విధాలున్నట్లు శాస్త్రాలు చెబుతున్నాయి. 'శివస్య ఇదమ్' అను వ్యుత్పత్తితో శైవ మేర్పడినందువల్ల శైవమతం మంగళమూర్తి అయిన శివుని గూర్చి తెల్పేది అని తెలుస్తుంది భరతఖండంలో ఇదే ప్రాచీన మతమని తెలుస్తూంది. హరప్పా, మొహంజదారో త్రవ్వకాల్లో కూడా శివలింగం లభించడం అందరికీ తెలిసిందే. సిందులోయ నాగరికత క్రీస్తుపూర్వం కొన్ని వేల సంవత్సరాల నాటిది. శ్రుతి, స్మృతి, పురాణాదులు, ఇతిహాసాలు శైవమత ప్రాచీనతనే అధికంగా వర్ణిస్తున్నాయి. శైవమతంలో అనేక రకాలున్నాయి. సామాన్య శైవము, మిశ్రశైవము, శుద్ధశైవము, పూర్వశైవము, శ్రౌతశైవము, మార్గశైవము, వీరశైవము, సామాన్య వీరశైవము, విశేష వీరశైవము, నిరాభార వీరశైవము అనే పది రకాలైన శైవాలు ఉన్నట్లు శివాగమాలు చెబుతున్నాయి.

''ఇంకా పురాతన భారతీయ ధర్మసంప్రదాయాల్లోని ఈ శైవంలో పాశుపతమని, కాలాముఖమని, కాపాలికమని చాలా సంప్రదాయాలున్నాయి. ఈ అన్నింటిలోను పాశుపతశైవ సంప్రదాయం చాలా ప్రాచీనమైనది. కలియుగంలో పాశుపతశైవ సంప్రదాయాన్ని వ్యాప్తిచేసినవాడు లకులీశ శివాచార్యుడు. ఇతడు చారిత్రక పురుషుడనీ, క్రీస్తుశకం మొదటి శతాబ్దిలో, అనగా యిప్పటికి సుమారు రెండువేల సంవత్సరముల కిందట వుండినాడని చరిత్రకారుల అభిప్రాయం.

"హాలుడు సంకలితం చేసిన 'గాథాసప్తశతి'లోని మొదటి, చివరి పద్యాలు శివస్తుతికి సంబంధించినవి. పశుపతి స్తుతి 'మొదటి గాథ'లోను, గౌరీస్తుతి చివరి గాథలోను ఉన్నది. ఇంకను మరికొన్ని గాథలలో గణాధిపతికి, గౌరీదేవళము లకు సూచనలు కలవు. ప్రాయికముగా ఆ కాలపు దేవళములు దారువులతో నిర్మించుటవలననేమో అవి నశించిపోయినవి"231 అని పేర్కొనబడింది. అయినా

యిప్పటికి నేపాల్, భూటాన్, సిక్కిం మొదలైన ప్రాంతాల్లో దారువుతో నిర్మించిన దేవాలయాలు కన్పిస్తున్నాయి,

శాతవాహనులు, శాలంకాయనులు, చాళుక్యులు, కాకతీయులు, యాదవ వంశ రాజులు, కొండవీటి రెడ్డిరాజులు శైవులే! ఇందుకు దృష్టాంతాలుగా అనేక శిలాశాసనా లున్నాయి.

"శివపారమ్యమును అంగీకరించు వారందరు శైవులే! వీరిలో అనేక అంతశ్శాఖ లున్నాయి. పాశుపతం, లకులీశం, కాలాముఖం, ప్రత్యభిజ్ఞా, వాసేశ్వరం, వీరశైవములు ముఖ్యమైనవి. పాశుపత, లకులీశ, కాలాముఖములకు యెక్కువ భేదము లేదు. ఇవి ఇంతకుముందే పేర్కొనబడ్డాయి. వీరశైవము బసవనకు ముందే ఉదయించింది. ఆరాధ్యబ్రాహ్మణులు యజ్ఞోపవీతాన్ని, లింగాన్ని ధరిస్తారు. వీరశైవులు లింగధారులు మాత్రమే! శైవశాఖల్లో సిద్ధాంత భేదా లున్నాయి. ప్రాచీన పాశుపతాదులు, శివాద్వైతులు, కాపాలికులు, వామమార్గీయులు, ప్రత్యభిజ్ఞాశైవులు, అద్వైతులు, వీరశైవులు, శక్తి విశిష్టాద్వైతులు. శ్రీపతి పండితుడు శ్రీకరభాష్యంలో వీరశైవులను భేదాభేదవాదులు, విశిష్టాద్వైతులు అని చెప్పినాడు.

"శైవగురు పరంపరలో పంచాచార్యులు ముఖ్యులు. రేవణసిద్ధ, మరుళసిద్ధ, ఏకోరామ, పండితారాధ్య, విశ్వారాధ్యులు, శైవపంచాచార్యులు, కాపాలికులు గుజరాత్ రాష్ట్రంలో యెక్కువగా ఉండినారు."231(a)

శైవగురువులలో అద్వైతమత స్థాపనాచార్యుడైన శ్రీ శంకరాచార్యుల వారిని తప్పక స్మరించుకోవాలి. అతి తక్కువ కాలంలోనే యావద్భారతాన్ని పర్యటించి హిందూ ధర్మాన్ని పునః ప్రతిష్ఠించారు వీరు. అత్యంత ప్రాచీనమైన ఈ శైవధర్మం ఋగ్వేదంలో మొదట పేర్కొనబడింది. శివుడినే రుద్రుడిగా, పశుపతిగా ఆరాధించి వైద్యవిధానంలో, విద్యావిధానంలో ఆది దేవునిగా విశ్వసించి ఆరాధించారు. శివుడిని గురించి చెప్పే ఆగమాలే శైవాగమాలు, శక్తిని ఆరాధ్యదైవంగా భావించి పూజించేవి శాక్తాగమాలు లేదా తంత్రాలు. విష్ణువును ఆరాధించేవి పాంచరాత్ర ఆగమాలు, ఈ విధంగా మూడురకాల ఆగమాలున్నాయి. దేవాలయ నిర్మాణాల్లో, విగ్రహారాధన సంప్రదాయాల్లో వైదిక ధర్మబద్ధమైన హైందవం అంతర్వాహినిగా ప్రవహిస్తూంది.

శాసనాల్లో స్థానం, నైష్ఠికస్థానం, స్థానపతి అనే పదాలు ఒక విధంగా సంప్రదాయబద్ధమైన పారిభాషికాలే! శైవగురువులు నివసించిన దేవాలయాలు స్థానాలు. ఈ దేవాలయ నిర్వహణ భారాన్ని వహించేవారు స్థానపతులు లేదా స్థానికులు శైవగురులు తాము అఖండ బ్రహ్మచారులుగా ఉంటూ, బ్రహ్మ చర్యాన్ని పాటించే విద్యార్థులకు విద్యాదానం చేసే స్థానమే 'నైష్ఠిక స్థానం.'

శైవధర్మంలో ఒకశాఖగా వామాచారపద్ధతిలో వుండేవారు కాపాలికులు. వీరు శ్రీశైలంప్రాంతంలో వుండేవారని తెలుస్తూంది. ఆంధ్రదేశంలో ఆరాధ్యులు అనబడేవారు బ్రాహ్మణ, వీరశైవ సంప్రదాయాలను రెండింటినీ సమన్వయం చేసుకొన్నవారు. వీరు బ్రాహ్మణులవలె యజ్ఞోపవీతమూ, వీరశైవులవలె ఇష్ట లింగాన్నీ ధరిస్తారు; వేదాలనీ నమ్ముతారు. వీరశైవులకు వేదాలపై నమ్మకం తక్కువ. వీరు శవాలను ఖననం చేస్తారు; దహనం చేయరు. వీరు సుమారు 10 వ శతాబ్దికి ముందువారేనని తెలుస్తూంది.

విజయనగర రాజుల కాలంలో విద్యారణ్యస్వాములవారు అద్వైత సిద్ధాంతానికి అచార్యులు. దాని ప్రాభవానికై విశేషకృషి చేశారు. విజయనగర రాజుల కాలంలోని స్మార్తులు, శైవులు తమతమ దేవతల్ని ఆరాధించడంలో సమత్వం పాటించారు. వీరు గణపతి, శివుడు, అంబిక, విష్ణువు, సూర్యుడు మొదలైన వారిని ఆరాధించేవారు.

"వీరశైవ సిద్ధాంతమునకు భేదాభేద సిద్ధాంతమని పేరు. దీనిని కొందరు శివ విశిష్టాద్వైతమంటారు, కాని, శివవిశిష్టాద్వైతమునకున్ను, దీనికిన్ని భేద మున్నది. శంకరాచార్యులది అద్వైత సిద్ధాంతము. రామానుజునిది వైష్ణవ విశిష్టా ద్వైతము. శ్రీకంఠునిది శివాద్వైతము. ఆనందతీర్థునిది ద్వైతము. వీరశైవము భేదాభేద సిద్ధాంతము ననుసరిస్తుంది. ఇది రామానుజు డంగీకరించిన ద్వైత భావము నంగీకరిస్తూ నిత్యసామీప్యము, సారూప్యము, భోగమంత్రము అయిన సమత్వరూపముగల శివజీవాద్వైతమును ప్రతిపాదిస్తుంది. దీని ప్రకారం శివునికి, జీవునికి అభేదత్వము చాలాకొంచెము మాత్రమే. ఇద్దరున్ను నిత్యులే! అంతటితో అభేదత్వము సరి. ఇద్దరికిన్నీ భేదమే ఎక్కువ. శివుడు పూర్ణుడు, జీవుడపూర్ణుడు. ఈశ్వరుడు ప్రభువు, శక్తుడు, ముఖ్యుడు; జీవుడు భక్తుడు, అశక్తుడు, అముఖ్యుడు. ఈశ్వరుడు సర్వస్వతంత్రుడు. జీవుడు సర్వాధీనతంత్రుడు.

జీవునికి సారూప్యముక్తి మాత్రమున్నది. ఇదే శివసామరస్యము. జీవునికి సారూప్యమేకాని సాయుజ్యము లేదు. ఈశ్వరునికే కర్తృత్వ శక్తి ఉన్నది. భేదాభేద సిద్ధాంతమును విశ్వసించి షట్ స్థలమనే అభ్యాస యోగము చేయుట చేత శివత్వము ప్రాప్తిస్తుంది. దీనికి ఉపాసన, ధ్యానము, ధారణము, జ్ఞానము అనేవి సాధనములు. జ్ఞానము చేతనే శివత్వము కలుగుతుంది. ఈశ్వరుడు ద్రష్టవ్యుడు, శ్రోతవ్యుడు, మంతవ్యుడు, నిదిధ్యాసితవ్యుడు. అట్లు చేస్తేనే జ్ఞానోత్పత్తి అవుతుంది. షట్‌స్థలజ్ఞానము లేక యోగము కుదరదు. వీరశైవ సిద్ధాంతములో షట్‌స్థలజ్ఞానము చాలా ముఖ్యమైనది.[232]

ఈ విధంగా శైవము అద్వైత సిద్ధాంత ప్రాతిపదికతో విస్తరించింది. రాయలసీమ జిల్లాల్లో శైవ సంబంధ ప్రార్థనా శ్లోకాలు, శైవభక్తి పరమైన సంకేతాలతో అనేక శాసనాలున్నాయి. కడప జిల్లా కోడూరు గ్రామంలో క్రీ.శ. 9వ శతాబ్దికి చెందిన ఒక శాసనం[233] ప్రారంభంలో 'నమశివాయ' అని రాయబడి ఉంది. శాసనం పైభాగంలో శివలింగం ఆకృతి ఉంది.

ఇదే జిల్లా పుష్పగిరి గ్రామంలోని క్రీ.శ. 13,14,15 శతాబ్దులకు చెందిన అనేక శాసనాల్లోను,[234] రాయలసీమలోని ఇతర శాసనాల్లోను[235] శివ స్తుతి పరమైన సంస్కృత ప్రార్థనా శ్లోకాలతో శాసనాలు ప్రారంభింపబడి ఉన్నాయి.

కర్నూలు జిల్లా పాణ్యంలోని క్రీ.శ. 1510వ సంవత్సరానికి చెందిన ఒక శాసనంలో[236] 'శ్రీశ్రీశ్రీ పాణికేస్వర లింగాయ నమః' అని రాయబడి వుంది.

కడప జిల్లాలో అధిక ప్రాంతాన్ని పాలించిన చోళులు శైవధర్మాన్ని అవలంబించారు. పుణ్యకుమారుని దొమ్మరి నంద్యాల తామ్ర శాసనంలో[237] శివుడు లకుటపాణిగా అభివర్ణించబడ్డాడు. లకుటపాణి అంటే బహుశః దండపాణి కావచ్చు.

రాష్టకూట వంశపు రాజులు, వారికింది అధికారులు శైవ సాంప్రదాయాన్ని అనుసరించారు. వైదుంబులు శైవ మతాన్ని అనుసరించినట్లు తెలుస్తూంది. వైదుంబ వంశపురాజైన కలిగ త్రినేత్ర భీముడు పాలగిరిలోని సమర్థేశ్వర దేవాలయాన్ని జీర్ణోద్ధారం చేసి, రెండు వందల మత్తరుల భూమిని దానంగా యిచ్చినట్లు శా.శ. 978 దుర్మతి సంవత్సర పాలగిరి శాసనం పేర్కొంటూంది.

కాకతీయులు, వారి సామంతులైన కాయస్థులు మొదలైనవారు శైవ ధర్మాన్ని అనుసరించినవారే!

విజయనగర సామ్రాజ్యపు ప్రథమపాలకులు శైవధర్మాన్ని అవలంబించారు. శివాలయాల నిర్వహణకోసం వీరు కొన్ని దానాలను ఇచ్చినట్లు శాసనాలు పేర్కొంటున్నాయి. వీరి పాలనలో కొందరు సామంతులు శివభక్తితత్పరులై శివాలయాలకు దానాలిచ్చారు. శా.శ. 1388 నాటి ఎనుమలచింతల శాసనం239 ఈ విషయాన్ని తెలుపుతూంది.

ఈ విషయాలన్నిటిబట్టి రాజులు అనేకులు శివభక్తితత్పరులుగా ఉండేవారని తెలుస్తూంది.

వైష్ణవము : "క్రీస్తుకు పూర్వం సాత్వతమనియు భాగవతమనియు వ్యవహరింపబడుచూ వచ్చిన వైష్ణవ మతమునకు మొదట వాసుదేవుడు ప్రధాన దైవము. భాగతమతావలంబులను వాసుదేవ భక్తులనియు, భాగవతులనియు వ్యవహరించువారు. భాగవత మతము వాసుదేవోపయజ్ఞము. వాసుదేవుడు వృష్ణి కులసంభవుడు. ఇతనికి కృష్ణ, వాసుదేవుడనియు పేర్లు. కృష్ణ బోధితమైన ఈ మతమును అవలంబించినవారు యాదవులు. అందునను ముఖ్యముగా సాత్వత శాఖవారు. కృష్ణుడీ శాఖవాడే.''240

''తెలుగుదేశమును పాలించిన తూర్పుచాళుక్యుల కాలంలో ఈ వైష్ణవ సాంప్రదాయమున కంతకు పూర్వముకంటెను వ్యాప్తి అధికమైనట్లు కన్పించుచున్నది. తూర్పుచాళుక్య రాజ్యమును స్థాపించిన మహారాజు విష్ణువర్ధనుడు. ఇతని పేరునుబట్టి ఇతడు వైష్ణవ సంప్రదాయమునకు చెందినవాడని ఊహింపవచ్చును. కాని, ఇతని సంతతివారిలో చాలమంది విష్ణువర్ధన నామాంకితులైనను వారందరును వైష్ణవ సంప్రదాయమునకు చెందినవారు కారు.''241

"వైష్ణవ సంప్రదాయాభ్యున్నతికి కారకులైనవారు ఆచార్యపురుషులు. నాథముని, పుండరీకాక్షుడు, రామమిశ్రుడు, యామునాచార్యులను ఆళవందారు, రామానుజాచార్యులు మొదలైనవారు. వీరిలో నాథముని అను రంగనాథాచార్యులవారు. పాంచరాత్ర తంత్రముల నాధారము చేసుకొని ప్రపత్తి అను నూతన సిద్ధాంతమును ప్రతిపాదించి వైష్ణవమునకు ఒక కొత్త రూపమిచ్చినారు. ఈయన

పౌత్రుడే యామునాచార్యులవారు. శ్రీ రామానుజాచార్యులవారి సిద్ధాంతములకు ప్రాతిపదికలన్నియు ఈ యామునాచార్యులు వేసినవే అని చెప్పుదురు. ఈయన క్రి. శ. 1040 లో వైకుంఠవాసుడైనట్లు చరిత్రకారులు నిర్ణయించుచున్నారు. ఈ విధముగా ద్రవిడ దేశములో ఆళ్వారులు, ఆచార్య పురుషులు ఈ వైష్ణవ సంప్రదాయమునకు క్రొత్త జీవము పోసి క్రొత్త రూపము నిచ్చుచున్నప్పటికీ, దాని ప్రభావము ఈ కాలములో తెలుగుదేశములో యెక్కువగా కనబడకపోవుట విచిత్రము."[242]

"మహాభారతమున పాశుపత శైవము, పాంచరాత్ర వైష్ణవము పేర్కొనబడినవి. వైష్ణవము అవైదికము కాదు. వేదానుకూలముగా విష్ణుపారమ్యములను ప్రచారము చేయునది. పాంచరాత్రమునే శ్రీకృష్ణుడు సాత్వతముగా ప్రచారము చేసినాడు. అట్టిదే భాగవత సంప్రదాయము. అది చతుర్వ్యూహాత్మకము. సంకర్షణ, వాసుదేవ, ప్రద్యుమ్న, అనిరుద్ధములు చతుర్వ్యూహములు. శ్రీ రామానుజులు ఈ సంప్రదాయమును ప్రచారము చేసినాడు. అంతకుముందు ఆళ్వారులు అను భక్తులు తమిళ కీర్తనల ద్వారా ఈ సంప్రదాయమును గానము చేసిరి. వైష్ణవములో ద్వైతము శ్రీ మధ్వాచార్యులు ప్రతిపాదించినది. బ్రహ్మ సంప్రదాయ వైష్ణవము యొక్క సిద్ధాంతము ద్వైతము. వల్లభాచార్యులది రుద్ర సంప్రదాయ వైష్ణవము. ఇది శుద్ధాద్వైతము చైతన్య ప్రభువు ప్రతిపాదించినది సనకాది సంప్రదాయ వైష్ణవము. ఇది అచింత్యభేదాభేద వాదము. ఆంధ్రదేశములో శ్రీవైష్ణవమే ప్రచారమందున్నది. నన్నయ తర్వాత ద్రావిడ దేశమున ఉదయించిన శ్రీవైష్ణవము, కన్నడ దేశమున ప్రవర్తిల్లిన వీరశైవము అల్ప కాలములోనే ఆంధ్రదేశమున వ్యాపించినవి. తిక్కన కాలమునకు రెండూ విజృంభణ దశలో ఉండినందువల్లనే తిక్కన సోమయాజి హరిహరాద్వైతమును ప్రచారము చేయవలసి వచ్చెను."[242(a)]

పశ్చిమాంధ్ర ప్రాంతంలోని విజయనగర పాలకుల్లో సంగమ వంశపు రాజులు శైవమత సంప్రదాయాన్ని అనుసరించినా, ఇతర సంప్రదాయాల్ని కూడ గౌరవించారు. సంగమవంశంలోని కడపటి పాలకుల్లో మొదటి విరూపాక్ష మహారాయలే వైష్ణవమత మవలంబించిన కర్ణాటాధీశుడు. సంగమ వంశజులను త్రోసిరాజని, విజయనగర సింహాసన మెక్కిన సాళువ నరసింహరాయలు

పరమవైష్ణవుడు ఇతనికి శ్రీ తిరుపతి వేంకటేశ్వరస్వామి ఇష్టదైవము. క్రీ. శ. 15, 16 శతాబ్దుల్లో చిత్తూరు జిల్లా తిరుపతి వైష్ణవానికి ప్రధాన కేంద్రమైనది. దాదాపు విజయనగర చక్రవర్తు లందరూ వైష్ణవమతావలంబకులే! వీరందరూ తిరుమలాధీశునికి వైష్ణవమత ప్రోత్సాహకంగా కానుకలు, ఇతర దానాలు చేసిన వారే! కర్ణాటక సామ్రాజ్యంలో వైష్ణవ ధర్మాన్ని ప్రవర్తింప చేయడంలో, విద్యా వ్యాప్తిని కల్గించడంలో వైష్ణవ మతాలు చాలా తోడ్పడ్డాయి వడగలై, తెంగలై అని విశిష్టాద్వైత మతాలు రెండు రకాలు. ఇవి తిరుపతి, అహోబిల క్షేత్రాల్లో బాగా వేళ్ళూనుకున్నాయని చెప్పవచ్చు.

విష్ణువు వేదాల్లో ప్రధాన దేవత కాకున్నా అప్రధానుడు మాత్రం కాదు. వైకుంఠవాసుడైన విష్ణువు విశిష్టాద్వైతానికి మూలవిరాట్టు. నిరంతర భగవన్నామ స్మరణ, అంకితభావం, భక్తితత్పరతలు క్రమక్రమంగా భగవంతుని సాన్నిహిత్యానికి తీసుకొనిపోతాయి. భగవంతుడు భక్తులకు దాసుడు. భక్తుడు తనకు తాను అంకితభావంతో అర్పించుకోవటమే ప్రపత్తి. ఇదే విశిష్టాద్వైత సిద్ధాంతానికి ప్రధానమైన ధ్యేయం!

విష్ణువు అనేక అవతారాలెత్తినట్లు శాసనాల్లో వర్ణింపబడ్డాయి. అనేక శాసనాల్లో విష్ణువును దశావతారాల్లో ఒకటైన వరాహావతారంలో స్మరించటం కన్పిస్తూంది.

తెలుగు దేశానికి పొరుగున వుండే తమిళ దేశంలో పన్నిద్దరాళ్వారులు జన్మించారు. వీరిలో కడపటివాడు తిరుమంగై ఆళ్వారు. ఈయన కాంచీపురం రాజధానిగా పరిపాలించిన పల్లవరాజు నరసింహవర్మ సమకాలికుడు. అంటే, క్రీ.శ. 8వ శతాబ్దివాడు. అంతకుముందే 11 మంది గానంచేసిన దివ్య సంకీర్తనల మొత్తం దివ్య ప్రబంధమే (నాలాయిర ప్రబంధం) కాక, అదనంగా ఆరు ప్రబంధాలను రచించినవాడు తిరుమంగై ఆళ్వారు. ఈయన వేయికి పైగా ప్రబంధాల్ని రచించాడు. నమ్మాళ్వారు తిరువాయ్ మొయి(ఴి) అనే పేరు కల దివ్య ప్రబంధాన్ని రచించాడు. ఈ ఆళ్వారులంతా నారాయణున్ని విష్ణువు అవతారంగా భావించి, త్రివిక్రమావతారమును స్మరించి స్తోత్రం చేస్తుంటారు. కృష్ణ లీలలను అభివర్ణిస్తుంటారు.

అనేక దేవాలయ నిర్మాణాల్లో, పూజాదుల్లో, అంగరంగ విశేషాల్లో వైష్ణవ సంప్రదాయాలు నెలకొని ఉన్నాయి. వీటికి సంబంధించిన చాలా శాసనాలు 12, 13 శతాబ్దులవి. తత్సంబంధిత నియమాలు దేవాలయ కుడ్యాలపై చెక్కబడ్డాయి. శాసనాల ఆధారంగా పరిశీలిస్తే, 11వ శతాబ్దం నుండి దేవాలయ నిర్మాణ విధానాల్లో కొంత మార్పు జరిగింది. గర్భ గృహము, అంతరాళ మండపము, రంగ మండపము మొ॥ నిర్మింపబడటమేకాక పన్నిద్దరాళ్వారుల విగ్రహాల్ని కూడ దేవతామూర్తుల శ్రేణిలో ఆరాధించడం జరిగింది. ద్రవిడ దేశం నుంచి అనేక మంది వైష్ణవాచార్యులు తెలుగు ప్రాంతానికి వచ్చి శైవాది మతాచార్యులతో శాస్త్రవాదాలు చేస్తూ, తమ వైష్ణవ మతాధిక్యతను నిరూపించటానికి తగిన ప్రయత్నాలు చేయసాగారు. దీనికి ఆనాటి పాలకుల తోడ్పాటు కూడ యెంతో ఉండేది.

కడవ జిల్లా పెద్దముడియం గ్రామంలోని క్రీ శ. 12వ శతాబ్దికి చెందిన ఒక శాసనంలో[243] శ్రీ మహా విష్ణువును వరాహ రూపంలో వర్ణిస్తూ—

"జయత్యావిష్కృతం విష్ణోర్వారాహం క్షోభితార్ణవం
దక్షిణోన్నత దంష్ట్రాగ్ర విశ్రాన్త భువనం వపుః"

—వరాహరూపంలో, సముద్రాన్ని తన దక్షిణ దంష్ట్రాగ్రంచేత క్షోభింప చేసిన శ్రీ మహా విష్ణువుకు జయమగు గాక!

—అని ప్రార్థించబడి ఉంది. ఇది సంస్కృత శ్లోకారంభంతో చెప్పబడిన కన్నడ శాసనం. భావం యెంత చక్కగా వుందో చెప్పాల్సిన పనిలేదు.

ఇంకా కర్నూలు జిల్లా చిన్న అహోబలంలోని—[244]
ఏతత్సురాసురాధీశ మౌళిశ్రేణి విరాజితం
అహోబల నృసింహస్య దేవ దేవస్యశాసనం
దేవ శ్రేణి శిరోరత్నం దైత్యద్విప ఘటాంకుశం
జయతు శ్రీ నారసింహస్య దేవ దేవస్య శాసనం॥

(సురాసురాధీశ మౌళియై ప్రకాశించే అహోబల నృసింహ దేవ దేవుని శాసనంగాను, సకల దేవతా సమూహానికి శిరోరత్నంగా, రాక్షసులనే ఏన్గుల గుంపుకు అంకుశంగా విరాజిల్లే దేవ దేవుడైన శ్రీ నారసింహుని శాసనం ఇది.)

—మొదలైన వైష్ణవ సంబంధిత శాసనాలు, ఇదే జిల్లా పెద్ద అహోబలం లోని మరికొన్ని శాసనాలు[245] నరసింహస్వామిని స్తోత్రం చేస్తున్నాయి. శైవ- వైష్ణవ, వైష్ణవ- శైవ మిశ్రిత శాసనాలు కొన్ని ఆనాటి సైద్ధాంతిక సమన్వయ సామరస్యానికి ప్రతీకలుగా నిలిచి వున్నాయి.

కర్నూలు జిల్లా త్రిపురాంతకంలోని క్రీ. శ. 1209 వ సం॥ కి చెందిన ఒక శాసనంలో[246] శ్రీశైలగిరిపతియైన అర్థేందువరాశినీ, శాశ్వత విశ్వహితావతారుడై హరినీ ఒకేసారి పేర్కొనటం జరిగింది.

కడప జిల్లా రామాపురంలోని క్రీ.శ. 1350 సం॥ కి చెందిన ఒక శాసనం[247] వరాహావతారుడైన శ్రీహరినీ, త్రైలోక్యనగరారంభమైన, మూల స్తంభమైన శంభుని క్రమపద్ధతిలో స్మరించటం జరిగింది. ఇట్లాంటి రీతిలో వుండే అనేక శాసనాలు[248] కడప జిల్లాలో కొన్ని వున్నాయి. ఇవి అన్నీ 14, 15, 16 శతాబ్దులకు చెందినవి.

మాధ్వమతం హిందూమతంలోని ఒక అంతర్భాగమే! ఇది క్రీ.శ. 13 వ శతాబ్దిలో బయల్దేరింది. ద్వైత సిద్ధాంతాచార్యులు శ్రీ మధ్వాచార్యులవారు దీనికి ప్రవక్త. విజయనగర రాజుల కాలంలో దీనికి కొంత ప్రోత్సాహం లభించింది. రాయలసీమ జిల్లాల్లో ఒకటైన కర్నూలు జిల్లా మంత్రాలయం శ్రీ రాఘవేంద్ర స్వాములవారి మఠంలోను కర్నాటక రాష్ట్రంలోని ఉడిపిలోను ఇది కొంత ఎక్కువగా ప్రచారాన్ని పొందుతున్నది.

జైనమతం : ఈ అన్ని మత సాంప్రదాయాల మధ్య జైన సంప్రదాయం కూడా విజయనగర రాజుల కాలంలో కొంతవరకు వ్యాప్తమయ్యేందుకు ప్రయత్నించింది. మత ధర్మంలోను, వ్యాపార ధర్మంలోను జైనులు కొంతవరకు అభివృద్ధి చెందారు. జైనమత స్థాపకుడు వర్ధమానుడు అనే నామాంతరంగల మహావీరుడు. ఇతడు క్రీ.పూ. 599 జన్మించి, క్రీ.పూ. 527 లో బీహార్‌లోని పావాపురి వద్ద నిర్వాణము చెందినట్లు జైనులు చెబుతున్నారు. జైనగురువులను తీర్థంకరులని పిలుస్తారు. వీరిలో మొదటివాడు ఋషభదేవుడు. ఇరవైమూడవవాడు పార్శ్వనాథుడు. ఇరవైనాల్గవ తీర్థంకరుడు మహావీరుడు. మహావీరునికి జినుడని కేవలి అని పేర్లు. జినుడు బోధించినదే జైనము. కర్మబంధం నుండి ఆత్మ

విమోచనం పొందటం ద్వారా మోక్షం సాధించవచ్చుననే సిద్ధాంతం వీరిది. జైనులు తమ మతం చాలా ప్రాచీనమైనదనీ, మహావీరునకు పూర్వమే ఇరవై మూడుమంది తీర్థంకరులుండినారనీ, వారే జిన ధర్మాన్ని బోధించారని చెబుతారు.

"జైనమతము చాల పురాతన కాలములోనే రాయలసీమలో వ్యాపించిన దనుటకు అవకాశము కలదు; కడప జిల్లాలోని ఒంటిమెట్టకు మూడుమైళ్ళ దూరములో గంగపేరూరను గ్రామమున్నది. ఇది పూర్వపు జైన స్థావరమే! ఇక్కడ సింహనంది అను జైనాచార్యుడుండేవాడట. ఒకప్పుడు ఆయాచార్యుని వద్దకు గంగాన్వయము నందు పుట్టిన దడిగ, మాధవులను రాజకుమారులను ఉత్తర దేశములోని అహిచ్ఛత్ర పురమను నామాంతరముగల విజయపురమును ఉజ్జయినీ పురాధిపతి అయిన మహీపాలుడు ముట్టడించుటచేత వారితండ్రి పద్మ నాభ నృపతి కొంత పరివారమును తోడిచ్చి యచ్చటనుండి రహస్యముగా పంపగా వారు దక్షిణాపథమునకు వచ్చి సింహనంద్యాచార్యులవారి దర్శనము చేసికొని తమ దీనావస్థను వారి కెరిగించినారట. ఆ యాచార్యులవారి అనుగ్రహముచేత వారు గంగరాజ్య స్థాపకులైనారట! వారికి కువలాలపురము (ఇప్పటి కోలారు) రాజధానియు, నందిదుర్గము కోటయు అయెనట. ఈ వృత్తాంతమువల్ల దడిగ, మాధవులను రాజకుమారులు గంగరాజ్యమును స్థాపించునప్పటికే రాయలసీమలో జైనమతము వరలుచుండెనన్న విషయము స్పష్టమగుచున్నది. చరిత్రకారులు గంగరాజ్యము క్రీ.శ. నాలుగవ శతాబ్దిలో స్థాపితమయినట్లు చెప్పుదురు."[250]

కర్నూలు జిల్లా రామళ్ళకోట తాలూకా నాయకల్లులోని శిథిలాలు, ఆ చుట్టు పక్కల కన్పించిన యితర శిథిలాలు జైనులకు సంబంధించినవని చరిత్రకారుల అభిప్రాయం. ఈ ప్రాంతాల్లో జైనులు నివసించినట్లు ఆధారాలు లభించాయి.

కడప జిల్లా దానవులపాడు గ్రామంలోని ఒక శాసనం[251] 'భద్రమస్తు జినశాసనాయ' అనే సంస్కృత వాక్యంతో పేర్కొనబడే కన్నడ భాషా వివరణ లతో కూడి ఉంది. అయితే, ఇందులో కాలవివరములు లేవు. అనంతపురంజిల్లా కొనకొండ్ల గ్రామములోని ఒక జైన శాసనం జైనధర్మాన్ని పేర్కొనేదే! అయినా, ఇది కూడా కన్నడ భాషలోనే ఉన్నట్లు తెలుస్తుంది. ఈ గ్రామంలో పూర్వం కొండకుందాచార్యుడనే ప్రసిద్ధ జైనాచార్యుడు ఉండేవాడు. అయన

సంస్కృతంలో చాలా గ్రంథాలు రాశాడు. ఇతడు దిగంబర జైన ప్రచారకుడు. ఇదే జిల్లా పెనుకొండలో యిప్పటికీ ఒక జైనాలయం భక్తులచేత ఆరాధింప బడుతూంది. 251(a)

బౌద్ధము : బుద్ధుడు ప్రవక్తగా ఏర్పడిన మతమే బౌద్ధమతం. ఈ మతం ఆంధ్రదేశములో ఆంధ్ర శాతవాహనుల కాలంనాటికి బాగా వేళ్లూని ఉండినది. మౌర్య చక్రవర్తి అశోకుడు పరిపాలించునప్పటికే ఇది ఇక్కడ కూడా వ్యాపించి ఉంటుంది.

"బుద్ధుని జీవితకాలములో బుద్ధుని ధర్మబోధలును, బౌద్ధాచారములును గ్రంథస్థము కాలేదు. ఇందునిమిత్తమై బుద్ధుని మహాపరినిర్వాణమునకు పిదప వెంటనే రాజగృహమున ఒకటియు, అటుతర్వాత వంద సంవత్సరములకు వైశాలిలో ఒకటియు రెండు మహాసభలు జరిగినవి. బౌద్ధధర్మ, ఆచార (శిక్షా) నిర్ణయము నిమిత్తము జరగిన ఈ సభలకు మహా సంగీతులని పేరు. ఈ సంగీతులలోనే బౌద్ధుల ఆచార వ్యవహారములును, బుద్ధుడు చెప్పిన ధర్మబోధము నిశ్చితమై గ్రంథస్థము కావింపబడినవి. బౌద్ధుల ఆచార వ్యవహారములను (శిక్ష) గురించి తెలుపు గ్రంథమునకు 'వినయ' మనియు, బుద్ధప్రోక్త ధర్మమునకు 'సుత్త' మనియు పేరు. అటు తర్వాత కొంతకాలమునకు బౌద్ధ వేదాంతమును తెలుపు 'అభిదమ్మము' వచ్చినది. హిందువులకు వేదము లెట్టివో బౌద్ధులకు 'వినయ', 'సుత్త', 'అభిదమ్మము' లట్టివి. ఇవి బౌద్ధుల వేద గ్రంథములు. వీనిని బౌద్ధు లొక్కొక్క దానిని ఒక్కొక్క పిటకమున (పేటికలో) పెట్టి కాపాడుకొనుచు వచ్చిరి. అందువలన వీనికి 'పిటకములు' లేక 'పిటక గ్రంథ ముల'ని పేరు. వీనిని 'త్రిపిటకముల'ందురు. 'వినయపిటక, సుత్తపిటక, అభిదమ్మపిటక'ముల లోని భాష పాలీ. ప్రాకృత భాషా గ్రాంథికరూపము పాలీ."252

"ఆంధ్ర సాతవాహనుల కాలములో హిందూ దేశమంతటిలోను ఆంధ్ర దేశము బౌద్ధమునకు ప్రధాన కేంద్రమయినది. మహాయాన సంప్రదాయ ప్రవర్త కుడయిన ఆచార్య నాగార్జునుడు ఒక సాతవాహన భూపతికి కడుంగడు మిత్రుడు. అతడా భూపతికి 'సుహృల్లేఖ' అను గ్రంథమును రచియించి యిచ్చి

నట్టు బౌద్ధ గ్రంథములన తెలియవచ్చుచున్నది. ఆచార్య నాగార్జునుడు ధనకటక మహాచైత్యమునకు నానా విచిత్రమైన గొప్ప ప్రాకారమునేకాక 'శ్రీపర్వతము'న శైలమంటపాలయములను కూడ కట్టించెను. శ్రీపర్వతమన్నది నాగార్జునుని కొండయే యనుటకు సందియము లేదు. (నాగార్జునుని కొండవద్దనుండి శ్రీశైలము వరకుగల పర్వతశాఖకు శ్రీపర్వతమన్న పేరు ఉండినను ఉండవచ్చును.) నాగార్జునాచార్యులవారు బౌద్ధములో బుద్ధుని తరువాత బుద్ధునియంతటివాడు; రెండవ బుద్ధుడే అని ప్రసిద్ధిగాంచెను. ఆ ఆచార్యుడు నివసించిన స్థలమగుట వలన బౌద్ధులాకొండను 'శ్రీపర్వత'మని గౌరవాభిధానముతో వ్యవహరించి యుందురు."[253]

కర్నూలు జిల్లా పత్తికొండ తాలూకాలోని జొన్నగిరివద్ద అశోక శిలా శాసనాలు వున్నట్లు శాసన పరిశోధకులు కనుగొన్నారు. ఇవి భోషాణపు పెట్టెల వలె చాల పెద్దవయిన నాపరాతి బండలు. గుట్టమీదవుండే ఈ బండలపైనే అశోకుని శిలాశాసనాలు చెక్కబడి వున్నాయి. వీటిలోని లిపి బ్రాహ్మీలిపి. భాష ప్రాకృతము. ఈ శాసనాల్లో బౌద్ధమత సంబంధమైన అనేక సూక్తులు వున్నా యని పరిశోధకులు చెబుతున్నారు. అవేకాక, అశోకుడు ప్రజలకు చేసిన సౌక ర్యాలు కూడా వీటిలో వివరింపబడినట్లు తెలుస్తూంది.

ప్రాఙ్నన్నయ యుగంలోని ధార్మిక వ్యవస్థ హిందూ, జైన, బౌద్ధ మతాల త్రివేణి సంగమంగా ఆయా మతాల ప్రవక్తల సిద్ధాంతాలతో ప్రజల్ని ఉక్కిరిబిక్కిరి చేసింది. ప్రవక్తల మాటలు, సిద్ధాంతాలు, రాజుల అధికారాల మాటున మతాల విజృంభణలు నాటి సమాజాన్ని అనేక విధాలుగా కుదిపినాయని చెప్పవచ్చు. ఈ కుదుపులకు లొంగక తమ తమ ఆత్మ విశ్వాసాలతో, స్థైర్యంగా మనుగడ సాగించిన ఒక మానవ వ్యవస్థ అలా కొనసాగుతూనే వచ్చింది.

వైదికపరమైన శైవ, వైష్ణవాది మతాలు ఆయా సిద్ధాంతాలకు ప్రతీకలై నిలిచి, మఠాలను, దేవాలయాలను స్థాపించి మత, విద్యాకేంద్రాలకు పునాదులు వేశాయి. రాజుల ఆదారాలవల్ల మడిమాన్యాదులను పొంది స్వయంపోషకాలై, సుస్థిరమైన మత సాంప్రదాయ వ్యవస్థకు, ధార్మిక జీవనం సాగించేందుకు దోహదకారులైనాయి.

క్రీ.శ. 12, 13 శతాబ్దుల్లో భిన్న మతాలు వీరవిహారం చేసి మళ్ళీ స్థిరత్వాన్ని పొందుటకో అన్నట్లు ఒక నూతన సిద్ధాంతానికి నాందీవాక్యం పల్కింది. అదే హరిహరనాథతత్వం. రాయలసీమలోని కొన్ని ప్రాంతాల్లోని తెలుగు శాసనాల్లో ఈ హరిహరనాథస్వామిని ప్రథమంగా పేర్కొనటం జరిగింది.

కడప జిల్లా పలుకూరల్లపల్లి గ్రామంలోని కొండశిఖరంపై వున్న భైరవ దేవాలయంలోని శాసనంలో సూర్యచంద్ర చిహ్నాలు, ప్రారంభంలో శ్రీ హరిహరనాథాయ నమః అని వుంది. ఇది క్రీ.శ. 1396 నాటి శాసనం.[254]

హరి, హరుడు, గణపతి, శ్రీరాముడు మొదలగు దేవుళ్ళను స్మరిస్తూ రాయబడిన శాసనాలు భిన్నభిన్నాలుగా కన్పించినా ఏకీకృతమైన మిశ్రమ శాసనాలు అక్కడక్కడ కన్పించటం జరిగింది.

కులంకానీ మతంకానీ అహంకారానికి దూరంగా వుండాలనీ కులాన్ని, తత్వాన్ని, ధర్మాన్ని గోప్యంగా వుంచుకొనే రాజును (శ్రీకృష్ణదేవరాయలును) మోసం చేయాలనే దుర్బుద్ధులతో తమ్మళ్ళు (తంబళవారు) బ్రాహ్మణ సాంప్రదాయాల్ని అనుసరిస్తూ, బ్రహ్మ వంశస్తులుగా ప్రవర్తిస్తూ రాయలవారిచే నమస్కృతులనుపొందగా అటుతర్వాత నిజము తెలిసిన రాయలువారు వారి తప్పిదాన్ని తెలుసుకొని, వారికి తగిన శిక్ష అప్పడే వేయించి, అక్కడ ఒక బ్రాహ్మణాగ్రహారాన్ని నిర్మించేందుకు ఆనతియిచ్చి, సర్వమాన్యులుగా వృత్తులు యిచ్చి బ్రాహ్మణులచే అక్కడ దేవాలయాల్లో నిత్య వేదపారాయణం జరిగేటట్లు యేర్పాటు చేశారు. ఇది పుష్పగిరికి చెందిన గోటూరు గ్రామంలోని క్రీ శ.1518 వ సం॥కి చెందిన ఒక శాసనం.[255]

వీటన్నిటివల్ల ఆనాడు రాజులు మతధర్మాల్ని, కులధర్మాల్ని అతిక్రమించే వారికి తగిన శిక్షలు విధించేవారనీ ధర్మస్థాపన చేసేందుకు దుష్ట శిక్షణ, శిష్ట రక్షణ చేసేవారనీ వ్యక్తమవుతూంది.

దేవాలయ నిర్మాణం : గుడియును౯ జెఱువును
నడరిన నల్లిండ్లు గృతియు నలపెన్నిధియున్
గొడుకులును సప్తసంతతి
నొడగూడగ నిలిపి సరనం డొప్పెంగర్తిన్.[256]

సప్తసంతానాల్లో గుడి లేక దేవాలయం ఒకటని ఈ పద్యం ద్వారా తెలుస్తూంది. తనకన్నా అతీతమైన ఒక శక్తి ఒకటి ఉందని మానవుడు భావించినప్పటి నుండీ దానికతడు మోకరిల్లి భయభక్తుల్ని ప్రకటించాడు. తాను నివసించటానికి ఇల్లు నిర్మించుకొన్నట్లే ఆ శక్తికీ ఒక ఇంటిని నిర్మించాడు. అదే దేవాలయమయ్యింది.

దేవస్థానాల్ని నిర్మించటంలో ప్రాచీనులు విశేషమైప శ్రద్ధ, నిష్ఠ కనబరచినట్లు శాసనాలద్వారా తెలుస్తూంది. వీటి నిర్మాణాలకై ధనం, ధాన్యం, మందీ, మార్బలం, శాస్త్రజ్ఞానం, స్థలం - ఇవి అన్నీ అత్యావశ్యకాలే! రాజులచే నిర్మించబడినవి కొన్నైతే, సామాన్యులైన భక్తాదులచే నిర్మించబడినవి మరికొన్ని. కేవలం దేవాలయం నిర్మించటం వల్లనే దైవకృప కల్గదు. పూజారులు, పరిచారకులు, నీళ్ళు - వీటికయ్యే ధనం ఇదంతా ఒక వ్యవస్థీకృతమైన పవిత్రకార్యము. దేవాలయాల నిర్వహణకయ్యే ఖర్చులను భరించడానికి, ఇవి నిత్య స్వయం పోషకాలుగా వుండటానికీ మడి, మాన్యాదులను యేర్పరచేవారు. జమా ఖర్చులు ఇతర నిర్వహణలకై ధర్మకర్తల సంఘం ఉండేది. ఇప్పటికీ ఈ వ్యవస్థ కొనసాగుతూంది.

దేవాలయ నిర్మాణంలో పెద్ద పెద్ద బండరాళ్ళు, గార, ఇసుక, చిన్న చిన్న కంకర కలిపిన పదార్థాన్ని ఉపయోగించి దృఢంగా కట్టేవారు.

రాయలసీమ శాసనాల్లో దేవాలయ నిర్మాణం, దాతలు వారిని గూర్చిన అనేక వివరాలున్నాయి. ఇవి ఆనాటివారి భక్తి ప్రపత్తులకు చిహ్నాలుగా నేటికినీ నిలిచి ఉన్నాయి.

ఆనాటి పాలకుల ప్రోత్సాహం, కృషి, త్యాగం, దైవభక్తి, శిల్పుల శాస్త్రజ్ఞానం, ప్రతిభా నైపుణ్యాలు, కవి పండితుల కావ్యత్వశోభలు, ప్రజల నాగరికత, సంస్కృతి-ఇవన్నీ ఒక్కుమ్మడిగా దేవాలయ నిర్మాణంలోని సమగ్ర స్ఫూర్తికి, మూర్తికి దోహదం చేశాయి.

కడపజిల్లా తక్కోలు గ్రామంలోని క్రీ.శ. 1873 వ సంవత్సరానికి చెందిన ఒక శాసనంలో[257] లింగాల వెంకటరామిరెడ్డి ధర్మార్థసిద్ధికై గుడి కట్టించినట్లు పేర్కొనబడింది.

ఇదే జిల్లా మలెమార్పురం గ్రామంలోని క్రీ.శ. 1719 వ సంవత్సరానికి చెందిన ఒక శాసనంలో[258] కోదండరామాలయాన్ని, ఆళువార్లను, ఆంజనేయులను రంగారెడ్డి, వెంకటరెడ్డి అనువారు తాము కట్టించిన దేవాలయంలో ప్రతిష్ఠించినట్లు పేర్కొనబడింది.

ఇదే జిల్లా ముద్దనూరు గ్రామంలోని కాలవివరాలు తెలియని ఒక శాసనంలో[259] రేమయ్యరు అనేవాడు ఆదిత్య గృహంబు (సూర్యదేవాలయం) నిల్పినట్లు పేర్కొనబడింది.

ఇదే జిల్లా క్రొరపాడు గ్రామంలో కాలవివరాలు తెలియని ఒక శాసనంలో[260] మంచికంటి కామరాజు కొమారుడు గంగమరుసయ్య కట్టించిన గుడి అని పేర్కొనబడింది.

ఇదే జిల్లా దానవులపాడు గ్రామంలోని కాలంవివరాలు తెలియని ఒక శాసనంలో[261] మల్లెంకొండం బంగారు సుబయ్యశెట్టి ప్రారంభం శేశ్న దేవాళయము కొడుక్క చెన్నయ్యశెట్టి కట్టించినట్లు తెల్పబడింది.

ఇవికాక - ఆలయ జీర్ణోద్ధరణలు, ప్రాకారాదులు, గోపురాలు, విమాన శిఖరాలు, గర్భగుడి, దివ్వెగంబం మొదలైనవి నిర్మించినట్లు పేర్కొనబడిన శాసనాలు కూడా లభించాయి.

కర్నూలు జిల్లా (ప్రస్తుత ప్రకాశం జిల్లా) త్రిపురాంతకం గ్రామంలోని క్రీ. శ. 1254 వ సంవత్సరానికి చెందిన శాసనంలో[262] విశ్వేశ్వరాచార్యుని కుమారుడు శాంతశంభుడు స్ఫటిక శిలలతో విమానాన్ని నిర్మించినట్లు చెప్పబడింది.

అనంతపురం జిల్లా కదిరి గ్రామంలోని క్రీ. శ. 1352 వ సంవత్సరానికి చెందిన ఒక శాసనంలో[263] కదిరి అవుభళదేవర నగరి మంటపాన్ని పరిపూర్తి చేసినట్లు పేర్కొనబడింది.

కడప జిల్లా మోపూరు గ్రామంలోని క్రీ. శ. 1425 వ సంవత్సరానికి చెందిన ఒక శాసనంలో[264] భైరవదేవర గుడి పశ్చిమ భాగంలో తిప్పినాయుడు అనే ఒకానొక భటుడు ఆలయగోపురాన్ని నిర్మించినట్లు చెప్పబడింది.

అనంతపురం జిల్లా గోరంట్ల గ్రామంలోని క్రీ.శ. 1524 వ సంవత్సరం నకు చెందిన ఒక శాసనంలో[265] సోమేశ్వరుని గుడి శిథిలమైన తావులకు సున్నం వేసేందుకు, మంటప ప్రాకారాలను లెస్సగా పెట్టేందుకున్న తమ్మళ్లవారికి ఏర్పాట్లు చేయించి వారిని విస్తరాకుల వెట్టినుండి విముక్తి చేసినట్లు తెల్పబడింది.

కడప జిల్లా సంబటూరు గ్రామంలోని క్రీ. శ. 1554 వ సంవత్సరానికి చెందిన ఒక శాసనంలో[266] శ్రీనివాసయ్యంగారు కల్యాణమండపాన్ని కట్టించినట్లు పేర్కొనబడింది.

కడప జిల్లా దేవి గుడిలోని క్రీ.శ. 1623 వ సంవత్సరానికి చెందిన ఒక శాసనంలో[267] ఒకడు తలకంటిదేవి గోపురం ముందరి మంటపం ఆచంద్రార్క స్థాయిగా కట్టించినట్లు చెప్పబడింది.

పూర్వకాలంలో దేవాలయ నిర్మాణాన్ని చాలా పవిత్రంగా భావించేవారు. ఒక భక్తుడు ఆలయాన్ని తమ తల్లితండ్రాదుల పుణ్యంగా నిర్మింపచేస్తే, ఇంకొకడు తన రాజుగారి పుణ్యంగాను, మరొకడు గుప్తసేవగా నిర్మించడం కూడా జరుగుతుండేది.

దేవాలయంలో ప్రధాన దేవతా ప్రతిష్ఠ, పరివార దేవతలు, నవగ్రహాలు, బసవణ్ణ, ఆంజనేయస్వామి, నాగప్రతిష్ఠ, అశ్వత్థప్రతిష్ఠలు చేసేవారు. ధ్వజ స్తంభం, కల్యాణమంటపం రంగమంటపం, గర్భగుడి, ముఖమంటపం మొదలైన వాటిని నిర్మించడం జరిగేది. ప్రహరీ గోడ, ప్రదక్షిణ పథం నిర్మించి దేవాలయ శిల్పాలను, ఆలయ పవిత్రతలను చక్కగా కాపాడేవారు. కోనేరు, పుష్కరిణి, పూదోట, వాటికి మెట్ల నిర్మాణం- వీటన్నింటి నిర్వహణకు తగిన సిబ్బందిని దేవాలయ ధర్మకర్తల ద్వారా పాలకులు ఏర్పాటు చేసేవారు.

అసంపూర్తిగా నిలిచిపోయిన ఆలయ నిర్మాణాన్ని కుమారుడో, మరొక ఆత్మీయుడో నిర్మించిన దృష్టాంతాలూ శాసనాల్లో ఉన్నాయి. ఇహలోకంలో కీర్తి, పరలోకంలో ముక్తి, ఆత్మసంయమనం కల్గించే దేవాలయ నిర్మాణం భారతీయ సంస్కృతికి చెరగని అమూల్య చిహ్నాలు.

అనంతపురం జిల్లా గోరంట్ల గ్రామానికి చెందిన క్రీ.శ. 1524 వ సంవత్సరం నాటి శాసనం సోమేశ్వర దేవాలయ జీర్ణోద్ధరణకుగాను తమ్మళ్ళు అనే జాతివారు శిథిల దేవాలయాన్ని పునర్నిర్మించడం, సున్నాలు వేయడం చేసి విస్తరాకుల వెట్టినుండి విముక్తులైనట్లు, ఇకముందు నాదిచేత ఎవరైనా ఆ వెట్టి చేయిస్తే జరిగే శాపాశయాలు కూడా చివర పేర్కొనబడినాయి. దీనికి సంబంధించిన వివరాలు యిదివరకే తెలుపబడినాయి.

దేహమే దేవాలయమని, జీవుడే దేవుడని భావించే మనం, దేవాలయంలోని దేవుని కరుణార్ద్రవీక్షణానికే ఎదురుచూస్తాము. ఇట్లాంటి ఆర్ద్రిత ఆత్మీయతలే దేవాలయ నిర్మాణానికి బాటలు వేశాయి.

**ధ్వజ స్తంభాలు :** దేవాలయ నిర్మాణంలో దేవతా ప్రతిష్ఠలు, ధ్వజ స్తంభాలు ఇతర విధాలైన అనేక స్తంభాలు కూడా ప్రతిష్ఠింపబడటం శాసనాల్లో పేర్కొన్నారు. ఈ కంబాలు శిల, దారువు, లోహం మొదలైన యేవిధమైన వస్తువుతో కానీ నిర్మించవచ్చు. ధ్వజస్తంభం ఆలయ ప్రాంగణంలో ప్రధాన ద్వారం ఎదుటనే నిలిపివుంచే పద్ధతి ఈనాటికీ ఉంది. మనిషికి శిశ్నంవలె దేవాలయానికి ధ్వజస్తంభం ఉంటుంది అన్నది కొందరి పెద్దల మాట. ఆగమాల్లో, వాస్తుశాస్త్రాల్లో ధ్వజమునకు ప్రత్యేక స్థానముంది.[267(a)]

ధ్వజస్తంభాలేకాక దివ్వెకంబము, నాగకంబము శాసనకంబము, వసుధారకంబము మొదలైనవి ప్రతిష్ఠింపబడినట్లు శాసనాలు ఋజువు చేస్తున్నాయి

కడప జిల్లా పెద్దనపాడు అనే గ్రామంలోని క్రీ.శ. 1713 నాటి ఒక శాసనంలో[268] యల్లారెడ్డి పుత్రులు తిమ్మారెడ్డిగారు రజత,కాంచన విగ్రహాలేకాక ధ్వజస్తంభ ప్రతిష్ఠ చేయించినట్లును, ఇదే జిల్లా టంగుటూరు గ్రామంలోని క్రీ.శ. 1734 వ సంవత్సరమునాటి ఒక శాసనంలో[269] వెంకటచినపాపిరెడ్డి అనునతడు గరుడస్తంభము నిర్మించినట్లు- ఇట్లాంటివే ఇదే జిల్లాకు చెందిన మరికొన్ని శాసనాలున్నూ[270] పేర్కొంటున్నాయి.

కడపజిల్లా గొరిగనూరు గ్రామంలోని కాలవివరాలు తెలియని ఒక శాసనం,[271] అట్లాంటిదే మరొక శాసనం,[272] దివ్వెగంబములు వేయించినట్లు తెలుపుతున్నాయి.

కర్నూలు జిల్లా (ప్రస్తుత ప్రకాశం జిల్లా) త్రిపురాంతకంలోని క్రీ.శ. 1106 కు చెందిన ఒక శాసనంలో[273] శ్రీదరభట్టు నిలిపిన నాగగంభము అని పేర్కొనబడింది. కడప జిల్లా పెద్దనపాడు గ్రామంలోని శాసనం[274] ఒకటి క్రీ.శ. 1435 వ సంవత్సరముగా పేర్కొంటూ పెద్దనపాటను అగస్త్యనాథదేవరకు వసుదార కంభము నిలిపినట్లుగా తెల్పబడింది.

**దేవాలయము ఒక విద్యాలయము :** ప్రాచీన భారతదేశంలో దేవాలయం ఒక విద్యానిలయంగా కూడా ఉండినదని తెలుస్తూంది. మౌఖికంగా నేర్పబడే నాటివిద్య ఋష్యాశ్రమాల్లో, దేవాలయాల్లో వర్ధింపబడేదని చెప్పవచ్చు. చతుష్షష్ఠి కళలూ రాణిస్తూండేవి. నాగార్జునకొండ, అమరావతి, ఓరుగల్లు, హంపి (విజయనగరం) వంటి ప్రదేశాల్లో విద్యాపీఠాలు ఉండేవి. వీటిలో లెక్కకు మిక్కిలిగా విద్యార్థులు విద్యాభ్యాసాన్ని సాగించేవారని చరిత్ర చెబుతూంది. అయితే, శాసనాల్లో ఈ విద్యాభ్యాసాన్ని గూర్చిన ప్రత్యేక ప్రసక్తి కన్పించటం లేదు. కావ్యాల్లో మాత్రం అక్కడక్కడ విద్యాభ్యాస విషయాల్ని గూర్చిన కొన్ని విశేషాలు మనం గమనించవచ్చు.

భాగవతంలో ప్రహ్లాదుడు చండామార్కులవద్ద విద్య నేర్వడానికి వదలబడినట్లు, అయితే తన ఆధ్యాత్మిక, నైతిక విద్యల్లో ఆరితేరడమూ, తన తండ్రికే పరమార్థాన్ని చెప్పటమూ అందరికీ తెలిసిన విషయాలే!

హంసవింశతి కావ్యంలో మట్ల నారాయణామాత్యుడు ఆనాటి గురువులు శిష్యులకు బోధించే రీతులు, విధించే దండనలు ఒక సీసపద్యంలో అద్భుతంగా చిత్రించాడు.

‘అయ్యవార లోనామాలు దిద్దుకొమ్మనినచోఁ గడుపు నొప్పనుచు నేడ్చి
దండమ్మనను గుణింతము పెట్టరమ్మన్న నంగుళి వ్రణమాయెననుచు
జూణిగి
శిష్యులచే గాలు సేతులు గట్టించి తెచ్చి పద్యము జెప్పదెమలకుండి
పలకవ్రాయు మటంచు బడికెత్తుకొనిపోవ బలపంబు లేదని పలుకకుండి
..................................................................
.................. .......గొట్టుబెట్టుగ సజ్జనకోల విఱుగ.’[275]

—విద్యార్థులు మొండికెత్తడం, అబద్ధాలు చెప్పడం, నిర్లక్ష్యంగా వుండడం వాటికి తగిన రీతుల్లో గురువులు దండనల్ని విధించడం ఇందులో చక్కగా వివరించాడు.

ఏది యేమైనా దేవాలయాల్లోను, ఋష్యాశ్రమాల్లోను విద్యాభ్యాసాలు సాగించేవారని, ఆనాటి రాజభాషలైన ప్రాకృత, సంస్కృతాలు నేర్పేవారనీ, అది మౌఖికంగా, బహుముఖంగా సాగేదనీ తెలియవస్తూంది.

**దేవాలయం ఒక సామాజిక సంస్థ :** దేవాలయ ప్రస్తావన వేదాల్లోను, రామాయణ మహాభారతాల్లోను ఆగమాల్లోను ఉంది. చిత్తూరు జిల్లా గుడిమల్లం గ్రామంలో క్రీ.పూ. 2 వ శతాబ్ది నాటికి పరశురామేశ్వరాలయం నిర్మించబడినట్లు పరిశోధకులు నిర్ణయించినారు.[275(a)] శాసనాల్లో దేవాలయాలను గూర్చి సుమారు ఏడవ శతాబ్దం నుండి ఉటంకించడం, అందునా రాయలసీమ శాసనాల్లో దేవాలయ నిర్మాణం, నాటి నిర్వహణలు ఈ శతాబ్దికి తర్వాత కాలంలోనే వ్యాప్తిలోకి వచ్చినట్లు తెలుస్తూంది. మనుధర్మశాస్త్రంలో కానీ, ఇతర ధర్మశాస్త్ర గ్రంథాల్లో గాని దేవాలయం ప్రసక్తి కన్పించదు. దేవాలయం కేవలం పూజా కేంద్రంగానే పరిమితం కాక సమస్త ప్రజావళికి సంబంధించిన సామాజిక ధర్మ కేంద్రంగా కూడ పరిఢవిల్లింది.

ఆధ్యాత్మిక భావనా సంపన్నులైన రాజులు, దైవ ప్రేరితులైన ఇతర భక్తులు తమ తమ అంకిత భావాలతో దేవాలయాల సర్వతోముఖాభివృద్ధికి తమ వంతు కర్తవ్యాన్ని నిర్వర్తించారు. నిర్మించిన దేవాలయాన్ని కాపాడడం, దేవాలయ నిర్వహణకై తగిన సహజ వనరులను, సంపదలను యేర్పరచడం, కానుకలను, మడిమాన్యాదులను సమర్పించుకోవడంవంటి విశేష పుణ్య కార్యాలు ఆనాటి రాజులే కాక ఇతర భక్తులు కూడా చేశారు. దేవాలయాలకు ధర్మకర్తల సంఘాలు కూడా యేర్పడినాయి. అవి ఈనాటివరకూ కొనసాగుతున్నాయి.

అర్చకుడు (పూజారి) దేవుడికీ భక్తుడికీ మధ్య ఒక వారధి వంటివాడు. ఇతడు పవిత్రంగా చేసే పూజ భక్తునికి ఇహపర సుఖాలను కల్గిస్తుంది. దేవాలయాలు స్వయంపోషకాలుగా వుండడానికి, పవిత్రతతో ప్రకాశించడానికి పూజారులు, ధర్మకర్తలు (నిర్వాహకులు) తమ సహకారాన్ని అందిస్తే తప్ప సాధ్యం

కాదు. పురాణ కాలక్షేపాలు, ఉత్సవాలు, హరికథలు, వేదపారాయణాలు, పంచాంగ శ్రవణాలు మొదలైనవన్నీ దేవాలయ ప్రాంగణంలోనే జరిగేవి. ఇవి కాక, గ్రామాల్లో జరిగే అనేక తగాదాల తీర్పులు, సభలు, సమావేశాలు, వివాహాది శుభకార్యాలు, ప్రజల్లో చాలామంది ఒకచోట చేరి వేడుకలను నిర్వహించుకోవటానికి కావలసిన హంగామాలు- వీటి అన్నింటికీ దేవాలయమే కేంద్ర స్థానంగా ఉండేది.

దేవాలయాలకు రకరకాలైన దానాలు ఇవ్వబడేవి. వీటిలో గేదెలు, మేకలు, మోదాలు (మొదవులు/ఆవులు) మొదలైనవి వున్నాయి. వీటిని పోషించడం, వృద్ధిచేయడం, వాటిద్వారా ఉత్పత్తి అయ్యే పాలు, నెయ్యి మొదలైన వాటిని దేవాలయ నిత్య నిర్వహణకై వినియోగించటం చేసేవారు. త్రిపురాంతకం, శ్రీశైలం, తిరుపతి వంటి పుణ్యక్షేత్రాల్లోని దేవాలయాల్లో దైవకృపకు పాత్రులయ్యేందుకు రాజులు, ఇతర భక్తులు తమ యథాశక్తిగా ఇట్లాంటి దానాలను చేసిన దృష్టాంతాలు శాసనాల వలన తెలియవస్తున్నాయి. దేవాలయాలకు భూ, గ్రామ దానాలు అసంఖ్యాకంగా ఇచ్చినట్లు నాటి దాన శాసనాల వల్ల స్పష్టంగా తెలుస్తూంది.

దేవాలయాలకు, దేవుళ్ళకు ఆయా రాజులు, భక్తులు విభిన్న దానాలను చేసిన వివరాలు అనేకం శాసనాల్లో చోటు చేసుకున్నాయి. కడప జిల్లా రామేశ్వరం గ్రామంలో క్రీ. శ. 7 వ శతాబ్దానికి చెందిన ఒక శాసనంలో[276] చోళ మహాదేవి వసంతీశ్వర స్వామికి కొంత భూమి, రెండు తోటలను దానంగా ఇచ్చినట్లు చెప్పబడుతూంది.

ఇదే జిల్లా పాయకట్టు కొత్తూరు గ్రామంలోని క్రీ. శ. 13 వ శతాబ్దికి చెందిన ఒక శాసనంలో[277] రామనాథ దేవరకు చెరువు, దీపారాధనకు కొంత మడి ఇచ్చినట్లు పేర్కొనబడింది. ఇలాంటి శాసనాలు[278] కడప జిల్లాలోను, ఇతర రాయలసీమ జిల్లాల్లోను అనేకం ఉన్నాయి.

కర్నూలు జిల్లా పెద్ద అహోబిలం గ్రామంలోని క్రీ. శ. 1410 కి చెందిన ఒక శాసనం[279] శ్రీ అహోబలదేవర నిత్య అవసరాలకు కొమరగిరి రెడ్డిగారి సుకృతమునకుగాను కాటమరెడ్డి వేమారెడ్డిగారు గ్రామాన్ని దానం

చేసినట్లు చెబుతూంది. ఈ విధమైన శాసనాలు రాయలసీమ ఇతర జిల్లాలోను లభిస్తున్నాయి.[280]

అనంతపురం జిల్లా తాడిపత్రి గ్రామంలోని క్రీ.శ. 1531 కి చెందిన ఒక శాసనం[281] తాడిపత్రి రామేశ్వరదేవునికి దధ్యంన్న అవసరానకు కాడారంభం[282] వెలపొలం కోలపాటి చేను అష్టభోగతేజస్వామ్యతలు[283] సహితంగా ఇచ్చినట్లు పేర్కొనబడింది.

కర్నూలు (ప్రస్తుత ప్రకాశం) జిల్లా త్రిపురాంతకం గ్రామంలోని ఒక శాసనంలో[284] త్రిపురాంతక దేవరకు దత్తి....యిచ్చిన యినుప 50 అని అసంపూర్తిగా ఉంది. ఇది క్రీ.శ. 1111 నాటి శాసనం. ఇనుప (ఈనుప) యెడ్లు అంటే ఆవులు/గేదెలు / మేకలు ఏవైనా కావచ్చును. త్రిపురాంతకంలోని మరికొన్ని శాసనాలు,[285] ఇతర శాసనాలు దేవుని అఖండ దీపాలకు మోదాలు / మేకలు ఇచ్చినట్లుగా పేర్కొంటున్నాయి. ఆవులు, మేకలద్వారా వచ్చే పాలు, పెరుగు, నెయ్యి మొదలైనవి దేవుని అభిషేకాలకు, దీపారాధనలకు వినియోగించేవారని తెలుస్తూంది. ఈ శాసనాలు క్రీ.శ. 1208 నుండి క్రీ.శ. 1335 వరకు వేయింపబడినవి.

దేవాలయాల్లోని అనేక సేవలతోపాటు అంగరంగభోగాలు అనేవికూడా ఉన్నాయి. వీటి ప్రసక్తి శాసనాల్లో అక్కడక్కడ పేర్కొనబడినాయి. అంగానికీ, రంగానికీ చేసే సేవలు, భోగాలు అంగరంగభోగాలు. దేవుని ప్రతి అంగానికీ పూజచేసిన తర్వాత వాటి అలంకరణలు పరిపూర్తి చేసి, దేవాలయంలోని గర్భగుడి, రంగమంటపం మొదలైన భాగాలకు పూజచేసి మొత్తం దేవాలయాన్ని సర్వాంగసుందరంగా తీర్చిదిద్దడం, ఆయా వేడుకల్లో, ఉత్సవాల్లో, పర్వదినాల్లో విశేష పూజలు చేయించడం జరిగేది. వీటన్నింటికీ దాతలు ధనరూపేణా, వస్తురూపేణా, భూ, గ్రామ రూపేణా దానాలను ఇచ్చేవారు. శాసనాల్లో చాలాచోట్ల వీటి ప్రసక్తి వచ్చింది.

కర్నూలు (ప్రస్తుత ప్రకాశం) జిల్లా త్రిపురాంతకం గ్రామంలోని క్రీ.శ. 12, 13 శతాబ్దులకు చెందిన శాసనాలు[286] అనేకం అంగరంగభోగాలను వివరిస్తున్నాయి.

**దేవాలయాలకు కానుకలు :** వివిధ దేవాలయాల దేవుళ్ళకు అనేక కానుకలు చెల్లించి తమ భక్తి ప్రపత్తులను ప్రకటించుకొనడమేకాక, దేవాలయ పోషణకు ఈ కానుకలవల్ల విశేష ప్రయోజనాలు కల్గించేవారు. గ్రామాలు, పొలాలు మొదలైనవి మాత్రమేకాక ధనం, ధాన్యం, బంగారం, తోటలు, కిరీటాదులు, గొడుగులు మొదలైన వస్తువులను సమర్పించిన శాసనాలు ఉన్నాయి. ఇవి వారి వారి హోదా, ఆర్థిక స్థితిగతులనుబట్టి కూడా సమర్పింపబడినాయి. కర్నూలు (ప్రస్తుత ప్రకాశం) జిల్లా త్రిపురాంతకం గ్రామంలోని క్రీ.శ. 13 వ శతాబ్దికి చెందిన కొన్ని శాసనాలలో[287] రాజులు కొందరు బంగారు నగలను కొన్నింటిని కానుకలుగా ఇచ్చినట్లు పేర్కొనబడింది.

చిత్తూరు జిల్లా తిరుమల-తిరుపతికి చెందిన క్రీ.శ. 1512 నుండి పేర్కొనబడి ఉండే అనేక శాసనాల్లో[288] నవరత్న ఖచిత కిరీటం, బంగారు నగలు, కెంపులు, పచ్చలు, ముత్యాలు మొదలైన నవ రత్నాలు కొన్నివందలు వేల సంఖ్యలో యిచ్చినట్లు వివరింపబడినాయి.

**దేవాలయాల్లో సేవలు :** దేవాలయాల్లో దేవునికి భక్తులు ఆయా సేవలు చేయించేవారు. రాజులు చేసే సేవలకన్నా, కొన్ని వృత్తులవారు అంటే విప్రవినోదులు, దొమ్మరులు తమ తమ కులవృత్తుల్లో వచ్చే ఆదాయంలో కొంత భాగాన్ని దైవసేవకై అంకితం చేయడం పేర్కొనదగింది. అమృతపడి, నైవేద్యాదులకు ధాన్యం క్షేత్రాదులను యిచ్చిన దానాలు ఉన్నాయి.

చిత్తూరు జిల్లా శివపురం గ్రామంలోని క్రీ.శ. 1401 వ సం॥నకు చెందిన ఒక శాసనంలో[289] తాము చేసే వృత్తులను దేవర అంగరంగ భోగాలకు సమర్పించి, ఆయా వృత్తుల ద్వారా వచ్చే ఆదాయాన్ని దేవాలయానికి అంకితం చేసినట్లుగా తెలుపబడి వుంది.

కర్నూలు జిల్లా శ్రీశైలం గ్రామంలోని క్రీ.శ. 14 వ శతాబ్దికి చెందిన ఒక శాసనంలో[290] శ్రీ మల్లికార్జున దేవర మధ్యాహ్న అవసరాలకు కర్పూరము, గుగ్గిలం మొదలగువాటిని యిచ్చిన దాఖలాలు చెప్పబడి వున్నాయి.

కర్నూలు జిల్లా చిన్న అహోబలం గ్రామంలోని శాసనం, మరికొన్ని యిలాంటి శాసనాలే[291] దేవరలకు పొలివూటు క్రమంగా యిచ్చినట్లు పేర్కొన బడినాయి. పొలివూటు అంటే మఠమునకు కానీ, గుడికికానీ యేర్పరచిన స్థితి. పొలి-అంటే బలి, పూజోపహారము. కొంతమంది విప్రవినోదులు (ఆయా గ్రామాల్లో గారడీ విద్యను ప్రదర్శించే వృత్తిగలవారుగా బ్రాహ్మణులకు వినోదము కల్గిస్తూ వారినుండి వార్షికం వసూలు చేసుకొనే బ్రాహ్మణుల శాఖ-విజయనగర రాజుల కాలంలో ఉండేది. వీరికి రాజుకానీ, ఇతరులు కానీ యిచ్చే వార్షికభృతిని విప్రవినోదివర్తన అంటారు.)[292] తమకు లభించే ఈ భృతిని, ఆదాయాలను వారిలో కొంతమంది దేవుళ్ళకు, కైంకర్యాలకు, దేవాలయ నిర్వహణకు ఇచ్చినట్లు అనేక శాసనాలు ఉన్నాయి.

కర్నూలు జిల్లా బోయల ఉప్పలూరు గ్రామంలోని క్రీ.శ. 1547 సం॥కి చెందిన ఒక శాసనంలో,[293] ఇంకా అనేక శాసనాల్లో[294] విప్రవినోదులకు వచ్చే వర్తనలు అందరికీ పుణ్యంగాను దేవాలయ నిర్మాణాలకు, అమృతపళ్ళకు యిచ్చిన వివరాలు ఉన్నాయి

దైవ కైంకర్యాలకు, ఇతర సేవలకు ఆయా కులాలవారు ఇచ్చే స్తావరం,[295] త్యాగవర్తనలు[296] అనే పేర్లతో వ్యవహరించే కొన్ని విధానాలు శాసనాల్లో ఉన్నాయి. కర్నూలు జిల్లా చెరువుబెళగల్లు గ్రామంలోని క్రీ.శ. 16వ శతాబ్దికి చెందిన ఒక శాసనంలో[297] బెళుగంటి పేంట బలిజవారు యిచ్చే స్తావరం మధ్యాహ్నపు అవసరం అమృతపళ్ళకు యిచ్చినట్లు పేర్కొనబడింది.

కడప జిల్లా కోకటం గ్రామంలోని క్రీ శ. 16వ శతాబ్దిగా చెప్పబడు తున్న ఒక శాసనంలో[298] దొమ్మరి సాళువ పక్షిన్నీ, మీసరగండడును తమ కులం దొమ్మరివారికెల్లా పుణ్యంగాను దొమ్మరి త్యాగం అఖండ తిరువళికెలకు ధారవోసి యిచ్చినట్లుగా చెప్పబడుతుంది. దొమ్మరి వాళ్ళు తమకు ఆదాయంగా వచ్చే పన్నును దేవతా కార్యాలకు వినియోగించేటట్లు యేర్పాటు చేయించే ఈ రకపు శాసనాలు అక్కడక్కడ కన్పిస్తున్నాయి. ఈ విధంగా అనేక కులాల వారు తమతమ వృత్తులను, ఆ వృత్తులద్వారా లభించే ఆదాయాలను కూడా దైవ కైంకర్యాలకు ధారవోసి తమ భక్తిశ్రద్ధల్ని కనబరచేవారు.

**స్థానపతి (స్థానాపతి) :** "పూర్వం దేవాలయానికి ఒక ముఖ్య అధికారి ఉండేవాడని తెలుస్తూంది. స్థానికపతి స్థానాపతి- ఇతడే దేవాలయానికి ముఖ్య అధికారి. దేవాలయాన్ని కట్టించిన, దేవతా విగ్రహాన్ని నిల్పి దేవాలయపోషణకు ప్రధాన దాతలను, ఆ దేవాలయానికి కావలసిన పరిచారకులను నియమించడంతో పాటు స్థానాపతినికూడా అప్పటి పాలకులు నియమించేవారు. వీరు ఆలయ నిర్వహణకు సంబంధించిన సౌకర్యాలను, అవసరాలను చూస్తూ దేవాలయాన్ని సమగ్రంగా దిద్దితీర్చేవారు. దైవ పూజలకు ఆటంకాలు లేకుండా కొనసాగడానికి తగినట్లుగా పర్యవేక్షిస్తూ ఉండేవారు. స్థానాపతి జీవన వ్యయానికయ్యే ధనాన్ని భరించేందుకు దేవాలయ మాన్యాల్లోని కొంత భూమిని అందుకు ప్రత్యేకంగా కేటాయించేవారు."299

డా॥ నేలటూరి వెంకటరమణయ్యగారి ప్రకారం "దేవస్థానాలకు సంబంధించిన భూముల్ని పర్యవేక్షించడం, దేవస్థానానికి వచ్చే ధనరూప, గ్రామ, భూసంబంధమైన సమస్తదానాల్ని స్వీకరించటం, తద్వారా దేవాలయ ఆస్తుల్ని పెంచి, దేవాదాయాన్ని వృద్ధిచేయడం, ఉత్సవాలకూ, ఇతర దైవకార్యాలకూ ధనం అవసరమైనప్పుడు భూమిని అమ్మడం, పొలం ఆధారంగా దేవాలయ ధనాన్ని వడ్డీకి అప్పులివ్వడం, అప్పు తీర్చిన తర్వాత తనఖావుంచిన భూములను విడిపించడం, దేవాలయ, భూములను రైతులకు కౌలు, గుత్తలకు యివ్వడం, దేవస్థానం ఐశ్వర్యం పర్యవేక్షించడం. దేవాలయాల్లో యేవైనా అపరాధాలు జరిగితే తగు విచారణ చేసి తీర్పుయివ్వడం-ఇది ఈ కాలానికి చెందిన స్థానికులకూ అన్వయిస్తుంది."300

దేవాలయానికి సంబంధించిన అనేక కార్యక్రమాలు సక్రమంగా సాగడానికి ఈ స్థానాపతులే బాధ్యతలను వహించి నెఱవేర్చడం జరుగుతూ వుండేదని స్పష్టమవుతూంది.

చిత్తూరు జిల్లా తంబళ్ళపల్లె గ్రామంలోని క్రీ.శ. 1405 వ సం॥కి చెందిన మొదటి దేవరాయల కాలంనాటి ఒక శాసనం,301 ఇదే రాజు కాలంనాటి, ఇదే సంవత్సరపు ఈ ఊరికే చెందిన మరొక శాసనం,302 క్రీ.శ. 1406 సం॥ నాటి ఈ గ్రామానికే చెందిన, ఇదే రాజు కాలంనాటి ఇంకొక శాసనం303 స్థానాపతుల వివరాలను, వారికిగల అనేక హక్కులను వివరిస్తున్నాయి.

**దేవాలయం ఒక న్యాయాలయం** : 'దేవుని యెదుట ప్రమాణంచేసి అంతా నిజమే చెబుతాను' అన్నది సామాన్యంగా న్యాయస్థానపు బోనులో ముద్దాయికానీ, సాక్షికానీ చేసే ప్రమాణం. సామాన్యంగా దేవాలయాల్లో కూడా అనుమానం వచ్చిన మనిషిచేత ఇలాంటి ప్రమాణాలు చేయిస్తుంటారు. కర్నాటక లోని ధర్మస్థలంలో న్యాయస్థానాల్లో పరిష్కరించలేని సమస్యలను కూడ అక్కడి ధర్మపీఠం ద్వారా పరిష్కరింపచేస్తుంటారు. చిత్తూరు జిల్లా కాణిపాకం వినాయకస్వామి దేవాలయం తప్పుచేసిన వారికి తగిన న్యాయాన్ని ప్రసాదించే ఆలయంగా ప్రసిద్ధి చెందిందని చెపుతారు. అయితే, శాసనాల్లో ఇలాంటి దేవా లయాల్ని ప్రత్యేకంగా పేర్కొనబడినట్లు యెక్కడా కన్పింపదు.

**దివ్య (దివ్యం)** : "వృత్తమయమైన సృష్టి, స్థావర జంగమాత్మకమై, దివ్యమానుషాత్మకమై సహజంగా విభక్తమై ఉంది. ఇవి రెండూ స్వాభావికాలైనా పరస్పర పూరకాలుగా కూడ ఉన్నాయి. మానవుని సామాన్య విశేషగతులన్నీ మానవాశ్రితాలుగా లౌకిక దృష్టికి బయటికి కన్పించినా, చివరకు ఇవన్నీ ఒక అలౌకిక శక్తిలో లీనమౌతాయి అలాగే జీవాత్మ, పరమాత్మను. జ్ఞానానికి ప్రాపకంగా ఉండే ఇంద్రియాలు ఆత్మ విషయానుభవ ద్వారాలై ఉన్నాయి. అందువల్ల ఈ ఇంద్రియ వ్యాపారాలన్నీ భూతాత్మతో అవిశ్రాంతంగా ఉంటూనే దీని మూలంగా ముందుకు సాగి పరమాత్మలో చేరాలి. అప్పుడే సత్యాసత్యాల సమత్వానుభవం సంప్రాప్తమౌతుంది. ఈ స్థితిలోనే మానుషానికీ, దివ్యకూ పరస్పర బంధం స్వాభావికంగా ఏర్పడుతుంది. దీనివల్ల మన జీవితంలోని వ్యవహారాలన్నీ దివ్య - మానుషాల సమ్మిశ్రితాలైనాయని స్పష్టమవుతుంది."304

"వ్యవహారంలో సాక్ష్యాది ప్రమాణాలను చూపలేనప్పుడు తత్త్వ నిర్ణయము నకై చేయవలసిన తులాది పరీక్షా రూప ప్రమాణమే 'దివ్య' అన్నది." ఇది తులాదివ్య, అగ్నిదివ్య, జలదివ్య, విషదివ్య, కోశదివ్య అని ఐదు విధాలుగా ఉంది 305

ఈ ఐదు దివ్యలు శుద్ధికై- అంటే సందిగ్ధంలో ఉండే అభిప్రాయానికి సందేహ నివృత్తికోసం ధర్మశాస్త్రంలో వివరింపబడ్డాయి. మహాభియోగాల్లో అభియోక్తలు జయపరాజయాల్లో పాలు పంచుకోవలసి వచ్చినప్పుడు ప్రయో గించాలి. లేదా ఇచ్ఛానుసారంగా అభియుక్త, అభియోక్తలలోని ఎవరికోసమైనా ఉపయోగించడం జరుగుతుంది.

**1. తులా దివ్య :** తులాధారణ అంటే తూకం చేసేది. అత్యంత నిపుణుడైన స్వర్ణకారుడు మొదలైనవారి ద్వారా త్రాసుకు ఉండే ఒక పళ్లెంలో తూకం చేయాల్సిన మనిషిని కూర్చొనచేసి, ఇంకొక పళ్ళెంలో రాళ్ళు, మట్టి వేయాలి. మనిషిని కూర్చొండబెట్టిన పళ్లెంలో గుర్తుకుగాను తులాదండాన్ని పైకెత్తాలి. తర్వాత దివ్య పరీక్షకు నిలబడిన వ్యక్తి త్రాసును ఈవిధంగా ప్రార్థించాలి: 'ఓ తులాదండమా! నీవు సత్యస్థానమవు పూర్వము నిన్ను దేవతలు సృష్టించారు. ఓ కల్యాణీ! నీవు సత్యాన్ని ప్రకటించు, నన్ను సంశయం నుండి విడుదల చేయి. ఓ అమ్మా! నేను పాపిని అయ్యుంటే నన్ను క్రిందికి తీసుకొని వెళ్ళు. సరైనవాడినైతే పైకి లాక్కొని వెళ్ళు." ఈవిధంగా ప్రార్థించి ఆరోపింపబడిన పురుషుని (మనిషిని) తూకం వేయాలి, అప్పుడతడు పైకి లాగబడితే నిర్దోషి, కిందికి లాగబడితే దోషి అని నిరూపింపబడినట్లుగా గణించాలి

**2. అగ్నిదివ్య :** అగ్నిదివ్యకు నిలబడే వ్యక్తి రెండు చేతుల్లోను వడ్లను బాగా రుద్ది, అరచేతిలో యేర్పడ్డ గాయాల్ని రసంచేత గుర్తు చేయాలి. దానిమీద అశ్వత్థ (రావి) వృక్షపు ఆకులను ఏడింటిని ఉంచి, ఏడు తెల్లని దారాలతో చుట్టుచుట్టి, శమీపత్రాన్ని, పెరుగులోని అక్షింతలను, పూలను వేయాలి. అటు తర్వాత అగ్నిని అభిమంత్రించాలి. 'ఓ అగ్నీ! నీవు ప్రాణులన్నింటి శరీరాల్లో ఉంటావు. అన్నింటినీ పవిత్రం చేస్తావు. క్రాంతిదర్శిని. పుణ్యపాపాలసాక్షిగా సత్యాన్ని ప్రకటించు.' ఈ అభిమంత్రణం తర్వాత, రెండు అరచేతుల్లోకి యాభై పలాలతూకముండే బాగాకాచినలోహగోళాన్ని అదివరకే నిర్మింపబడిన పదహారు అంగుళ ప్రమాణాల్లో ఉండే ఏడు మండలాల్లో (గడుల్లో) అడుగుపెడుతూ, ఎనిమిదవ మండలంలో నిలబడి, తొమ్మిదో మండలంలో ఆ నిప్పును వదలాలి. పరీక్షకు నిలబడేవాడి చేతులు కాలకపోతే నిర్దోషి. భయంతో ఆ వ్యక్తి మధ్యలోనే వదిలిపెడితే, దాన్ని మళ్ళీ గ్రహించి క్రమవిధానంలో రావాలి. అరచేతిలో మార్పు రాకపోతే శుద్ధుడనీ, మార్పు వస్తే అశుద్ధుడనీ తెలియాలి.

ఈ దివ్య పంచభూతాలను మనోస్థితికి తెచ్చుకొని అక్కడే ప్రతిష్ఠించడం శ్రద్ధ, మనోదృఢత్వం కలవానికే సాధ్యమౌతుంది.

**3. జలదివ్య :** జలదివ్యలో పాల్గొనేవాడు మొదట వరుణపూజను చేయాలి.

'ఓ వరుణదేవా! నీవు సత్యంతో నన్ను రక్షించు.' ఈ విధంగా జలంతో ఆవాహనంచేస్తూ ప్రార్థించి, బొడ్డువరకు నీటిలో నిలబడిన శోధ్యపురుషుని పట్టుకొని నీటిలో ప్రవేశింపచేసి ముంచాలి. దివ్యపరీక్షకు నిల్చే మనిషి మునిగే సమయంలోనే, అత్యంత గమనవేగం కల్గిన ఒక మనుష్యుడు - మొదట ప్రయోగించిన బాణాన్ని తిరిగి తెచ్చేవరకు మునగగల్గివుంటే వాడు శుద్ధుడే! దీన్ని చేసేవాడు తన జీవితకాలంలో ప్రాణ, అపానాలను సమస్థితిలో పెట్టుకొని వుండి వుండాలి. లేకపోతే జలంలో మునగడం అసాధ్యం, అభ్యాసబలంతో వుండినా వ్యర్థమే! లోపల ప్రాణశక్తుల సహజగతి లేకున్న దానివల్ల శుద్ధుడు కాలేడు. అందువల్ల పంచప్రాణుల శక్తుల గతులను సమస్థితిలో పెట్టుకోవాలి. అగ్ని తత్వంతో ఉత్పన్నమైన ఆప్తత్వంలో లయం కావడమే దీని పరమ లక్ష్యం. అప్పుడే శుద్ధి దోష రహితావస్థ ప్రాప్తిస్తుంది.

**4. విషదివ్య :** విషదివ్యానికి నిల్చేవాడు మొదట ఈ విధంగా ప్రార్థించాలి. 'ఓ విషమా! నీవు బ్రహ్మ పుత్రుడవు. సత్యధర్మాల్లో ప్రతిష్ఠితుడైన వాడివి. నన్ను ఈ దోషంనుండి సత్యం ద్వారా రక్షించు. నా పాలిటి అమృతమవుకమ్మ.'

ఈ ప్రకారం విషాన్ని అభిమంత్రించి హిమాలయాల్లోని శృంగజన్మ విషాన్ని స్వీకరించాలి. తర్వాత శోధకుడు వికారాలకు లోనుకాకుంటే శుద్ధుడవుతాడు. విషం వానిలోనే అరిగిపోయినప్పుడు యే వైషమ్యమూ యేర్పడదు. ఈ దివ్యానికి నిలిచేవాడు పంచభూతాల్ని తనలోనే అరిగించుకొనేవాడు కావాలి. లేకుంటే విషప్రభావం శాంతం కాదు. ప్రకృతిని లీనం చేసుకొనేవాడికి యేదీ అసాధ్యం కాదు. ఔన్నత్య ఉదాత్త గుణాదులే అన్నింటికి సహకరిస్తాయి.

**5. కోశదివ్య :** కోశదివ్యలో పాల్గొనేవాడు ఉపవాసంచేసి దుర్గ మొదలైన ఉగ్రదేవతల్ని విధ్యుక్తంగా పూజించి తర్వాత అభిషేకం చేసి ఆ తీర్థాన్ని మూడు శేర్ల ప్రమాణంలో తాగాలి. తర్వాత పదునాల్గు దినాల్లో రాజకృతమైన లేక దైవకృతమైన ఘోరదుఃఖానికి అతడు చిక్కిపోకుంటే పరిశుద్ధుడే!

ఈ దివ్యను పాటించేవాడు దేవతా సాన్నిధ్యం కల్గినవాడు కావాలి. కేవల ప్రాకృతునికి ఈ కార్యం అసాధ్యం. సత్వరజస్తమోగుణాల్ని తన అధీనంలో ఉంచుకోగల్గినవాడు మాత్రమే దీనికి తట్టుకోగలడు. దీనిపై ఉగ్రశక్తి ప్రభావం ఉంటుంది కాబట్టి, సామాన్యుడు బలి కాక తప్పదు. దీనికి అన్నకోశ సమస్థితి తప్పనిసరి.306

"ఇంకా తండుల దివ్య, తప్తమస్క దివ్య, ఫలదివ్య, ధర్మాధర్మదివ్య అన్నవి కూడా ఉన్నాయి."307

**తండులదివ్య :** మంత్రించిన బియ్యం నమిలి రావి ఆకుమీద ఉమ్మెయ్యాలి. ఈ బియ్యానికి తడిలేకపోయినా, రక్తం కనిపించినా అతడు దోషి.

**తప్తమస్కదివ్య :** మరుగుతున్న నూనెలోంచి నాణెం తియ్యాలి. చెయ్యి కాలకపోతే నిర్దోషి.

**ఫలదివ్య :** కాలుతున్న బల్లెపు అరును చేతబట్టుకొని కొన్ని అడుగులు వెయ్యాలి. తర్వాత ఆ చేతిలో ధాన్యం నలపాలి. చేతులు కందకుంటే నిర్దోషి.

**ధర్మాధర్మ దివ్య :** వెండితో చేసిన ధర్మమూర్తినీ, సీసంతో చేసిన అధర్మమూర్తినీ జాడీలో వేస్తారు. అతడు తీసే విగ్రహాన్నిబట్టి దోషాదులను నిర్ణయం చేస్తారు.

"దూరదర్శన శక్తికోసం కళ్ళు పొడిచేసుకోవటం, దూరశ్రవణ శక్తి కోసం చెవులలో ఊచపెట్టి పొడుచుకోవడం, విద్యాసంపదకోసం నాలిక కోసుకోవడం, శత్రువధ కాంక్షిస్తే తల కత్తిరించుకోవడం వంటి అఘాయిత్యాలు చేసేవారున్నారు."308

పూర్వకాలంలో సాక్ష్యాలు రెండు రకాలుండేవి. మనుష్యులు స్వయంగా యిచ్చేవీ, దివ్య సాక్ష్యాలూ. మనుష్యుల్ని నమ్మనప్పుడు 'దివ్య' పరీక్షల ద్వారా న్యాయనిర్ణయం చేసేవారు.

పంప భారతం ( -1-70) లో శంతన మహారాజు యోజనగంధి చేతిని 'నల్మెగె దిబ్యం బిడివంతె' అని పట్టుకొన్నాడని వర్ణించాడు.

శాంతి పురాణంలో (4-30) నూ 'దివ్య' పేర్కొనబడింది.

బసవణ్ణన వచనాల్లో (సంఖ్య 236, 334, 647) కొన్నిచోట్ల దివ్య ప్రస్తావనలు ఉన్నాయి 390

'దివ్య' అనే ఈ సంప్రదాయానికి కేంద్రస్థానం దేవాలయమే! దీన్ని న్యాయాలయంగా భావించి, అక్కడ సమావేశమయ్యే కొందరు పెద్దమనుషులే దైవప్రతినిధులుగా వ్యవహరించి తీర్పు చెప్పేవారు. ఇదివరకు చెప్పిన కొన్ని దివ్యలలో కఠినమైనట్టివీ, అనాగరికమైనవీ వున్నాయి. వీటిద్వారానే దోషుల్ని పట్టుకొనేవారు. వారికి విధింపబడే శిక్షలు మాత్రం వర్ణనాతీతమనే చెప్పవచ్చు. నిర్దోషులైతే వారికి పునర్జన్మ కల్గినట్లే! ఇప్పుడివి యెక్కడోకానీ లేవు. దైవం పేరుతో మధ్యలో వుండే కొందరు స్వార్థపరులు మాత్రం వీటివల్ల రాక్షసానందాన్ని పొందారనడంలో అతిశయోక్తి లేదు. ఇప్పటికీ చిత్తూరు జిల్లా కాణిపాక వినాయకస్వామి పేరు చెప్పిన కోర్టు కచ్చేరీల్లో యెవరూ అబద్ధం చెప్పరని, స్వామి యెదుటనే ప్రమాణం చేయిస్తే అసలు అబద్ధమే చెప్పలేరని, దీనికిగాను కొంత రుసుం వసూలు చేసి, అపరాధం చేసినాడని అనుమానపడే వ్యక్తిద్వారా అసలు విషయాలను రాబట్టవచ్చుననే యథార్థం ఇప్పటికీ అక్కడ చెప్పబడుతూంది. శాసనాల్లో ఈ విషయాలను పరిశీలిస్తే కొన్ని కొన్ని చోట్ల దీని ప్రసక్తి పరోక్షంగా ప్రస్తావింపబడినట్లు తోస్తూంది.

కడప జిల్లా పగిలిపాయకట్టు కొండూరులోని క్రీ.శ. 1773 వ సం॥ నాటి ఒక శాసనంలో 310 జయకమ్మ రాయించడం, అఖండదీపం ముట్టించి, తీర్థప్రసాదాలు తీసుకొని పువ్వులదండ మెడలో వేసుకొని పొలిమేర తొక్కి, 21 దినములు జయించి వేసిన హద్దుల వివరం అని పేర్కొనబడింది.

ఇదే జిల్లా (ప్రస్తుత అనంతపురం జిల్లా) చిల్లేవారిపల్లె గ్రామంలోని తేదీ వివరాలు లేని ఒక శాసనంలో 311 జయరేఖా నిరూపక్రమము 'దివ్య'ను స్ఫురింప చేస్తున్నది.

కడప జిల్లా చెన్నమాంబాపురం గ్రామంలోని తేదీల వివరాలు తెలియని ఒక శాసనంలో312 కోనేటిలో స్నానం జేసి ఆర్ద్ర వస్త్రాలతో పూలమాల వేసుకుని తీరప్రసాదాలతో అయగాళ్ళు పలికిన వివరములు చెప్పబడివున్నాయి.

ఇదే జిల్లా కల్లపనాయనిపురం-ప్రతినామం అధిక ప్రతాపదేవరాయపురం లోని ఒక శాసనంలో[313] రెండు అగ్రహారాలవారి సమ్మతితో సుదర్శనాచార్యులు అనే వ్యక్తి రాసిన ఉత్తర ధర్మనిర్ణయ జయలేఖ వర్ణింపబడింది.

ఈ 'దివ్య' అన్నది మానవ శ్రేయస్సుకూ, లోకశ్రేయస్సుకూ వినియోగింపబడితే దివ్యంగా వుంటుంది. దుర్వినియోగపరిస్తే సగటు మనిషి మనుగడకు, అమాయకుల నిత్య జీవితాలకు దినదిన గండంగా వుంటుంది. ఏ విధానమైనా నిర్మాణాత్మకంగా ఉంటే తప్పనిసరిగా ఆమోదించవలసిందే! స్వార్థ ప్రయోజనాలకు కొంతమంది స్వార్థపరుల ఆటగా ఉంటేమాత్రం అట్లాంటివారి ఆటలు కట్టించడానికి వీటిని సమూలంగా నిర్మూలించవలసిందే!

## దేవాలయాలు - సంప్రదాయాలు - ఊరేగింపులు:

తిథి, వార, నక్షత్ర, యోగ, కరణాల ద్వారా ముహూర్తాదులను నిర్ణయించి పర్వదినాలను నిర్దేశించారు రాజునుండి సామాన్యుడివరకు ఇవి పాటింపబడేవి. ఇప్పటికీ వీటిని చాలామంది పాటిస్తున్నారు కూడ. ప్రాచీనులు పాడ్యమి, దశమి, ఏకాదశి, ద్వాదశి, పౌర్ణమివంటి పవిత్ర తిథుల్లో దానాలు చేసినట్లు అనేక శాసనాలు పేర్కొంటున్నాయి. ప్రాచీన కావ్యాలో కూడ ఇవి ఉటంకించబడి ఉన్నాయి. ఇవికాక సూర్య, చంద్ర గ్రహణ సమయాల్లో, మకర సంక్రమణాది రోజుల్లో అనేక ధన, ధాన్య, భూదానాలు ఆచరించేవారు. సాంప్రదాయాల్ని పాటించే చాలామంది ఈనాటికీ వీటిని అనుసరిస్తున్నారు.

కడపజిల్లా వూటుకూరు గ్రామంలోని క్రీ.శ. 1370 వ సం॥కి చెందిన ఒక శాసనంలో వీరేశ్వరునికి ప్రతి సంవత్సరమున్ను వైశాఖ శుద్ధ పంచమి కల్యాణ మహోత్సవం సాగేటట్టుగా నిర్ణయించబడినట్లు పేర్కొనబడింది.[314]

ఇదే జిల్లా అత్తిరాల గ్రామంలోని క్రీ.శ. 1477 వ సం॥కి చెందిన మరొక శాసనంలో గోకులాష్టమి పుణ్య దినంనాడు అణ్ణమరుసు అనువాడు దేవాలయానికి వచ్చి విశేష పూజలను జరిపించినట్లు తెలుపబడింది.[315]

అనంతపురం జిల్లా గోరంట్ల గ్రామంలోని క్రీ.శ. 1533 వ సం॥ నాటి ఒక శాసనంలో[316] గోరంట్ల పెరుమాళకు ఉభయదశముల మహోత్సవాలే గాక

పౌర్ణమి పుణ్యకాలమందు పెరుమాళ్ళకు సంబంధించిన స్థానికులు నగరివారికి వండిపెట్టేందుకు తగిన కట్టడులు చేసినట్లు వివరింపబడింది.

కడప జిల్లా జిల్లెళ్ళ గ్రామానికి చెందిన క్రీ.శ. 1549 వ సం॥ నాటి ఒక శాసనంలో[317] శ్రీ వీరభద్రదేవునికి చేసే పారువేట మహోత్సవాలకు అహోబళ స్థళంలో అశేష జనాల సమ్మతిని పొందినట్లు పేర్కొనబడింది. పారువెంట: పారువేట అంటే ఉత్సవ విగ్రహాలను వేటకు తీసుకొనిపోవుట, దేవోత్సవము అని బ్రౌణ్య నిఘంటువులో తెల్పబడింది.

విజయనగర రాజులు నవరాత్రి ఉత్సవాలను మహా వైభవంతో, వేడుకలతో చేసేవారని ఆనాటి కావ్యాలు. చరిత్రలు తెల్పుతున్నాయి. దేవాలయాలకు కానుకలను, దానాలును సమర్పించేటప్పుడు పర్వదినాల్ని, సూర్య చంద్ర గ్రహణాల్ని, సంక్రమణ కాలాలను దృష్టిలో వుంచుకొని ఆచరించేవారు. ఈ వివరణలన్నీ ఇదే సిద్ధాంత వ్యాసంలో ప్రత్యేకించిన ఒక అధ్యాయంలో వివరింపబడ్డాయి.

హంసవింశతి కావ్యంలో—

"దేవకార్యములకుఁ, దిరునాళ్ళకును మహోత్సవములకును గంగ
జాతరలకు
సంప్రోక్షణములకు జన్మములకుఁ బెండ్లి వడుగు నోములకును
వ్రతములకును
సత్రంబులకు సహస్రంబులకును సమారాధన పితృకార్య యూధములకు
బండుగులకు నాలపంబులకును బొంగలికిని దేవరకు గొల్చికిని నడరు

జంగమార్చనలకు బాలదాస భోజ
నములకును దండువెట్టికి నగరివారి
కొండబక్కలకును భిక్షుకులకునైన
గొలుతవడకుండఁ గుండలా కుమ్మరిచ్చు."[318]

అని ఆనాటి ఉత్సవాలు, తిరునాళ్ళు చక్కగా వివరింపబడినాయి. ఇంకా తి.తి. దేవస్థానములకు సంబంధించిన అనేక శాసనాల్లో విజయనగర రాజుల కానుకలు, సంప్రదాయాలు, వారు చేయించిన ఉత్సవాదులు, నైవేద్యాలు, పూజా విశేషాలను ప్రత్యేకంగా పేర్కొనడం జరిగింది.

## దేవునికి సమర్పించిన నైవేద్యాలు :

దైవసంప్రీతికై ఆయాకాలాల్లో పూజాసమయాల్లో నివేదింపబడే పదార్థమే నైవేద్యం. క్షీరం, కదళీఫలాదులు, శుభ్రంగా వండిన పదార్థాలు, నానవేసిన బేడలు వంటివి సామాన్యంగా నైవేద్యాలకు పదార్థాలుగా వాడతారు. కొబ్బరి కాయలు కొట్టి నైవేద్యం చేయడం సామాన్యంగా జరిగే ఒక సత్సంప్రదాయం. ప్రాతఃకాలము, మధ్యాహ్నకాలము, సాయంకాలాల్లో ఆయా దేవతాప్రీతికై ప్రత్యేకించిన నైవేద్యాలను ఆరగింపచేస్తారు. కాబట్టి త్రిసంధ్యల్లోనూ ఆయా దేవతా మూర్తులకు సమర్పించే ఫలాలు, పాలు, చక్కెర వంటి పదార్థాలను సామాన్య నైవేద్యంగా, పిండివంటలతోపాటు షడ్రసోపేతమైన వంటకాలను దైవనివేదనం చేయడాన్ని మహానైవేద్యంగా చెబుతారు.

దేవుడి ఉత్సవ విగ్రహాన్ని మేళతాళాలతో వంటశాలకు ఊరేగింపుగా తీసుకొనివెళ్ళి, స్వామికి అక్కడనే అన్ని పదార్థాలను నివేదించడం ఒకరకమైన విధానం కాగా, స్వామి మూలవిగ్రహం చెంతకు అన్ని పదార్థాల్ని చేర్చి అక్కడ నివేదించిన తర్వాత ఆ పదార్థాల్ని వంటశాల భాండాల్లో మిశ్రితం చేయడం ఒక విధమైన పద్ధతి. ఈ విధానాలు తిరుపతి, శ్రీశైలం, కాళహస్తి వంటి గొప్ప క్షేత్రాల్లోనే కాక, ఇతర దేవాలయాల్లోనూ చాలా వాటిలో జరుగుతున్నాయి.

ప్రాచీన రాజులు దేవుడి నైవేద్యాల కోసమే ప్రత్యేకించిన ఏర్పాట్లు, గ్రామ భూదానాది వివరాలు అనేకం శాసనాల్లో చోటు చేసుకొన్నాయి.

కర్నూలు (ప్రస్తుత ప్రకాశం) జిల్లా త్రిపురాంతకం గ్రామంలోని దేవాలయంలో క్రీ. శ. 1212 సం॥కు చెందిన ఒక శాసనంలో[319] త్రిపు రాంతక దేవర నిత్యనైవేద్యాలకు కొన్ని ఊళ్ళు దానాలుగా ఇచ్చినట్లు పేర్కొన బడినది. ఇట్లాంటి శాసనాలు అనేకం[320] ఈ విషయాలను వివరిస్తున్నాయి. వీటిలో క్రీ.శ. 15, 16 శతాబ్దులకు సంబంధించినవి యెక్కువగా ఉన్నాయి.

చిత్తూరు జిల్లా తిరుమల, తిరుపతి దేవస్థానములకు సంబంధించిన ఒక శాసనంలో శ్రీవీరకృష్ణరాయ మహారాయ దేవులు తిరుమలమ్మ దేవులు తిరువేంగళ

నాథదేవునికి అనవాల నైవేద్యం అవసరానకు పైడిగిన్నె తమ ఉభయమునకు గాను సమర్పించినట్లు ఉన్నది. ఇది క్రీ.శ. 1512 వ సం॥న వేయించిన శాసనము. అనవాల నైవేద్యం అంటే ఇగురగాచిన పాల నైవేద్యం.

అనంతపురం జిల్లా రామాపురం గ్రామంలోని క్రీ.శ. 1497 కు చెందిన ఒక శాసనంలో[321] రామాదేవరకు త్రికాలం షోడశోపచార పూజా నైవేద్యాలు[322] సమర్పించినట్లు తెలుపబడింది. ఈ షోడశోపచారాల్లోని క్రమాన్నిబట్టి నైవేద్యం అనేది 13 వ స్థానాన్ని ఆక్రమిస్తున్నది.

కడప జిల్లా దేవగుడిలో క్రీ.శ. 1407 వ సంవత్సరానికి చెందిన ఒక శాసనంలో[323] సోమగ్రహణ పుణ్యకాలమప్పుడు శ్రీ వీరప్రతాప మహారాయరు పట్టాభిషేక సమయాన తలకంటిదేవికి దానవులపాటి పొలంలోపల సగం పొలం అమృతపడికిగాను ధారాపూర్వకంగా ధారవోసినట్లుగా పేర్కొనబడింది. అమృతపడి అనేది ఆహారము లేదా అన్నము అని చెప్పబడుతూంది. అమృతపడి నైవేద్యంగా సమర్పింపబడిన శాసనాలు అనేకం[324] ఉన్నాయి. ఇవి అన్నీ క్రీ.శ.16 వ శతాబ్దికి చెందిన శాసనాలు.

అనంతపురం జిల్లా పట్నం గ్రామంలోని క్రీ.శ. 1367 వ సంవత్సరానికి చెందిన శాసనంలో[326] శ్రీ కదిరి అహోబళదేవర తిరుబోనాలకు[327] పాతర్లపల్లి చెఱువు వెనకను పుట్టెడు మడి ఇచ్చినట్లుగా పేర్కొనబడింది.

కర్నూలు జిల్లా శ్రీశైలంలోని క్రీ.శ. 1312 వ సం॥ నాటి ఒక శాసనంలో[328] శ్రీపర్వతము శ్రీమల్లికార్జునదేవర మధ్యాహ్న అవసరాలకు[329] కలుమఠము వారికి కొన్ని పదార్థాలను యిచ్చినట్లు తెలుపబడినాయి.

కర్నూలు జిల్లా చిన్న అహోబిలం గ్రామం దేవస్థానానికి చెందిన క్రీ. శ. 1548 సం॥కు చెందిన ఒక శాసనంలో[330] దోశలపడికిగాను[331] కొన్ని పదార్థాలను యిచ్చినట్లుగా పేర్కొనబడినది.

కడప జిల్లా రాయచోటి గ్రామంలోని క్రీ. శ. 1558 వ సం॥కు చెందిన ఒక శాసనంలో[332] వీరేశ్వరదేవునికి అకాల పాయసం[333] అవసరానకు కొన్ని పదార్థాలను సమర్పించినట్లు చెప్పబడింది.

ఈ విధంగా దేవాలయాల్లో దేవుళ్ళకు, దేవతలకు అనేక రకాల నైవేద్యాలను నివేదించడం శాసనాలవల్ల తెలుస్తూంది. ఈనాటికీ ఇవి చాలా దేవాలయాల్లో పాటింపబడుతూ ఉన్నాయి.

సర్వప్రాణులు దైవ స్వరూపాలే అనే భావంతో పూర్వపు ఋష్యాశ్రమాల్లో భూత తృప్తికై, అంటే- ఇతర ప్రాణుల సంతృప్తికై వండిన పదార్థాలను, కాయకసరులను నివేదనములుగా ఉంచేవారు. పక్షులు, ఇతర జంతు సమూహం వచ్చి వాటిని సంతృప్తిగా ఐకమత్యంగా ఆరగించేవి. దీనికి ఆధారంగా—

—"భూసురప్రవరులు భూతబలుల్ దెచ్చి
పెట్టునీవారాన్న పిండతతులు''334
—అని నన్నయగారిచే వర్ణింపబడింది.

నైవేద్యం దైవుడికే కాకుండా, ప్రతి ప్రాణికీ, ప్రతి మనిషికీ నివేదించే తత్వం అనాదినుండి భారతీయ సంస్కృతిలో నిబిడీకృతమై ఉంది. ఇది అద్వైత సాంప్రదాయానికి ప్రతీకగా మనం చెప్పుకోవచ్చు.

**ప్రసిద్ధ క్షేత్రాలు :** శాసనాలకూ పుణ్యక్షేత్రాలకూ అవినాభావ సంబంధముంది. జనుల ధార్మిక భావాలకు సంకేతాలు దేవాలయాలైతే, ఆ దేవాలయాలకు ఈ క్షేత్రాలే నిలయాలు. తిరుపతి, కాళహస్తి, శ్రీశైలం, అహోబలం మొదలైనవి రాయలసీమలోని ప్రసిద్ధ క్షేత్రాలు. పాపపరిహారార్థం, సత్సంతానం కోసం, తమ మొక్కుబడుల్ని చెల్లించుకోవటంకోసం భక్తి శ్రద్ధల్ని కనబరచి పవిత్ర క్షేత్రదర్శనం చేస్తుంటారు. రాయలసీమలోని పవిత్ర క్షేత్రాలు శాసనాల్లో చోటు చేసుకొన్న విధం, ఆయా క్షేత్రాల్లోని కొన్ని శాసనాలు మొదలైన వాటిని తెలుసుకోవలసిన అవసరం ఎంతైనా ఉంది.

**తిరుపతి :** నేటి చిత్తూరుజిల్లా చంద్రగిరి తాలూకాలో తిరుపతి పట్టణమున్నది. దీనికి అతి సమీపముననే 'తిరుమల' గిరులపై శ్రీ వేంకటేశ్వరస్వామి వారి దేవాలయం వుంది. ప్రతిరోజూ వేలాదిమంది యాత్రికులతో ఈ తిరుమల-తిరుపతి దేవస్థానాలు కిటకిటలాడుతుంటాయి.

"మహేంద్ర పర్వములయందలి నల్లమల్ల కొండల వరుసలో నీ తిరుపతి చిత్తూరు మండలములో చంద్రగిరి తాలూకాయందున్న సుప్రసిద్ధ పుణ్యక్షేత్రము. ఈ తిరుపతి కొండలు యేడుకొండలుగా విభజింపబడినవి. అవి ఏవనగా 1. వరాహాచలము, 2. అంజనాచలము, 3. నారాయణాచలము, 4. వృషభాచలము, 5. సింహాచలము, 6. గరుడాచలము, 7. శేషశైలము. తిరుపతికి తిరువెంగడమని పేరు. వేంకటేశ్వరస్వామికి తమిళాంధ్ర శాసనములలో తిరువేంగడనాథుడని నామము. ఈ ప్రాంతమునకే తిరువేంగడ కొట్టమని ప్రాచీన తమిళ శాసనములలో కలదు."[335]

ఈ దేవస్థానాలకు చెందిన క్రీ.శ. 1512, క్రీ.శ. 1513, క్రీ.శ. 1514 సంవత్సరాలకు చెందిన కొన్ని శాసనాలలో[336] శ్రీకృష్ణదేవరాయలు, ఆయన దేవేరులు శ్రీవేంకటేశ్వరస్వామివారి నైవేద్య అవసరాలకు, అలంకారాదులకు సమర్పించిన పైడిగిన్నెలు, కిరీటాదులు ఇతర కానుకలు వివరింపబడినాయి.

**త్రిపురాంతకం :** "ఇది కర్నూల్ (ప్రస్తుత ప్రకాశం) జిల్లా మార్కాపురం తాలూకాలో ఉంది. శ్రీశైల క్షేత్రానికి ఇది తూర్పు ద్వారం. ఇక్కడ కుమారాద్రి మీద త్రిపురాంతకేశ్వరుడు నెలకొని వున్నాడు. త్రిపురాంతక క్షేత్రంలోనే కరస్థలి సోమనాథయ్య, రెంటాల మల్లినాథుడు, దోచమాంబ, ప్రసాదావధాని, గోడగి త్రిపురారి ఇంకా సకల భక్తానీకమూ వుంటారు. రెంటాల మల్లినాథుడు 'కుమారాద్రికి తూర్పువైపున సోపానముల్ దీర్చినవాడు.''[337]

"ఇక్కడి అధిష్ఠానదైవం త్రిపురాంతకదేవుడు; అమ్మవారి పేరు త్రిపుర సుందరీదేవి. త్రిపురాంతకానికే కుమారగిరి అనీ, తరుణగిరి అని నామాంతరాలున్నాయి. భారతవర్షంలోని ప్రధాన శైవక్షేత్రాలలో పేరెన్నికగన్న శ్రీశైలానికి తూర్పువాకిలి ఇది. త్రిపురాంతకదేవుని ఆలయ కుడ్యాలమీద, ఆలయ ప్రాంగణంలో విడిగా ఉన్న శిలలమీద వందకుపైగా శాసనాలు చెక్కబడి ఉన్నాయి. ఇవి తెలుగు, కన్నడ, తమిళ భాషలలో ఉన్నాయి. వీటిలో 97 శాసనాల పాఠాలు ఇంతవరకు ముద్రింపబడినాయి. ఈ ముద్రితాముద్రిత శాసనాలన్నిటిలోను అతి ప్రాచీనమైనది క్రీ.శ. 1106 నాటిది. మిక్కిలి ఇటీవలిది క్రీ.శ. 1839 నాటిది. ఈ ఏడు శతాబ్దుల సుదీర్ఘకాలంలో స్వామికి జరుగుతూ ఉండిన వివిధ సేవలను

గురించి, ఉత్సవాలను గురించి, భక్తులు చేసిన గ్రామాది దానాలను గురించి, ఆభరణ విశేషాలను గురించి, ఆలయనిర్మాణాన్ని గురించి ఎన్నో విశేషాలను ఈ శాసనాలు మనకు అందిస్తున్నాయి.

"త్రిపురాంతకేశ్వరుని సేవించుకొని కానుక లర్పించుకొన్నవారిలో మహారాజు మొదలుకొని మామూలు మానవునిదాకా ఎందరో ఉన్నారు. స్వామిని కొలిచిన మహాప్రభువులలో వెలనాటి వంశీయులు, నాతవాడి ప్రభువులు, కొండపడుమటి సామంతులు, కాయస్థరాజులు, ఏరువపాలకులు, పరిచ్ఛేది వంశీయులు, రెడ్డిరాజులు ఉన్నారు. ఇక స్వామికి కైమోడ్చిన రాజకీయాధికారుల్లో మహాప్రధానులు, సకల సేనాధిపతులు, దండనాయకులు, సర్వాధికారులు, రాయసాహిణులు, పంచకరణాధిపతులు ఉన్నారు. వీరేకాక దేవాలయాధికార వర్గంలోని వారైన స్థానపతులవంటివారు కూడ యధాశక్తి త్రిపురాంతక దేవునికి కానుక లర్పించుకొన్నారు. వాణిజ్యసంస్థలు తమ వర్తక సామాగ్రిపై తమకు లభించే సుంకాన్ని స్వామికి ధారవోసిన సందర్భాలూ వున్నాయి. వీరేకాక ఎందరో సాధారణ వ్యక్తులు సైతం తమ శక్తికొలది త్రిపురాంతక దేవుని సేవించుకొన్నారు.

"త్రిపురాంతకేశ్వరుని దేవాలయానికి దానంచేయబడిన గ్రామాల సంఖ్యను పరిశీలిస్తే ఆలయం ఎంతటి వైభవాన్ని అనుభవిస్తూ ఉండినదీ స్పష్టమౌతుంది. ఇంతవరకు లభించిన శాసనాలనుబట్టి త్రిపురాంతకునకు మొట్టమొదటగా గ్రామాన్ని దానం చేసినది వెలనాటి వంశపు ప్రభువైన మొదటి గొంకరాజని తెలుస్తున్నది. ఈతడు శక సంవత్సరం 1028 (క్రి.శ. 1106)లో కార్తీక పర్వ నిమిత్తంగా త్రిపురాంతకదేవుని అంగరంగ భోగాలకు కమ్మనాటిలోని గుండేటి దరినున్న బేటలపాడు గ్రామాన్ని ధారాపూర్వకంగా ఇచ్చాడు. ఆ తర్వాతి సంవత్సరంలో (క్రి.శ. 1107) మహామండలేశ్వర కరికాలచోడ మహారాజు మార్జవాడలోని వల్యూరు, భోజుని చెరువు అనే గ్రామాలను స్వామి నిత్యనైవేద్యానికి, నందా దీపానికి, ఆలయంలో ఏ భాగమైనా కాలక్రమాన జీర్ణమైతే పునర్నిర్మించడానికిగాను సమర్పించుకొన్నాడు."[338]

దేవాలయ పరిపాలనకు సంబంధించిన అధికారులను, ఇతర ఉద్యోగులను గూర్చి త్రిపురాంతక శాసనాలవల్ల తెలుస్తూంది. స్థానాధిపతికి దేవాలయ అధికా

రాల్లో ప్రముఖమైన పాత్ర ఉన్నదని వీటన్నింటివల్ల వ్యక్తమౌతుంది. శక సంవత్సరం 1099 (క్రీ.శ. 1177) నాటి శాసనంవల్ల[339] అప్పటి త్రిపురాంతకేశ్వరుని స్థానాధిపతి (స్థానపతి) వ్యాసరాసీ పండితులని తెలుస్తూంది.

త్రిపురాంతకేశ్వరుని దర్శనార్థం వచ్చే యాత్రికులకూ త్రిపురాంతకంలో దేవుని సన్నిధిలోనే ఉండే భక్తాదులకుగాను, సత్రాన్నాక దానిని దేవాలయమే నిర్వహించేది. త్రిపురాంతక స్వామి ఆలయానికి వెళ్ళేదారిలో మెట్లప్రక్కగా ఉన్న నంది స్తంభంమీద శాసనమొకటి అతిథి అభ్యాగతులకొరకు ఒక మఠం, సత్రాలలోని వంటవారు, కావడివారు. రాత్రిపగలు కాచుకొనియుండెడివారు, నీరు పోసెడి బ్రాహ్మణుడు మొదలైన పరిచారకులకు జీవన వృత్తులు ఉండేవని తెలియజేస్తున్నది. ఈ శాసనకాలం బహుశః 13 వ శతాబ్ది కావచ్చు.[340]

త్రిపురాంతకేశ్వరునికీ, త్రిపురాంబకూ భక్తులు తమ ప్రాణాలనే కానుకలుగా అర్పించిన సందర్భాలు చాలా ఉన్నాయి. స్వామి ఆలయం ఆవరణలో వరుసగా ఉన్న వీరగల్లులే ఇందుకు నిదర్శనాలు. కొందరు వ్యక్తులు తమ మెడలలోను, పొట్టలలోను కత్తులను పొడుచుకొంటున్నట్లు, కొందరు కత్తితో తమ ఎడమ తొడను, మరొక కత్తితో తమ గుండెలనూ ఒకేసారి పొడుచుకొంటున్నట్లు ఈ వీరగల్లులపై విగ్రహాలు గండరించబడి ఉన్నాయి. కొన్ని వీరగల్లులపై భక్తుల రూపాలేకాక శాసనాలు కూడ ఉన్నాయి. ఇవి సుమారు 13 వ శతాబ్దికి చెందినవి. వీటిలో ఒక శాసనం అల్లడ్డ అనే వీరుని మేలును కోరి సోమశివగురుదేవరు త్రిపురాదేవికి తన తలను ఇచ్చినట్లు తెలుపుతున్నది. భగవత్ప్రీతికరంగా భక్తులు యిట్లా ప్రాణాలను త్యజించటం వీరశైవమత ప్రభావం వలన ప్రచారంలోకి వచ్చింది. శ్రీశైలంలో వలెనే త్రిపురాంతకంలో కూడా వీరశైవ కార్యకలాపాలకు ఆదరణ లభించింది. త్రిపురాంతకం ఆలయాలలోని శాసనాలను పరిశీలిస్తే ఆనాటి ఆలయ వైభవం, ఐశ్వర్యం, వైశిష్ట్యం మనకు స్పష్టంగా తెలుస్తాయి.

"చీకటి మిద్దె : త్రిపురాంతక మహాదేవుని ఆలయము దక్షిణదిశలో 'చీకటిమిద్దె' యనబడు గది యున్నది. గది ద్వారము తూర్పువైపున నున్నది. చీకటిమిద్దె నేడు గబ్బిలాల కావాసమైయున్నది. చీకటిమిద్దె తూర్పు కుడ్యముపై

శాసనములు చెక్కబడియున్నవి. దక్షిణ కుడ్యముపై నొక శాసనమున్నది. చీకటిమిద్దె పశ్చిమ, ఉత్తర కుడ్యములపై వివిధ వంశీయులకు చెందిన శాసనములున్నవి."341

"త్రిపురాంతకము దేవాలయము పునాది, ప్లాను నక్షత్రాకారములో నున్నది. గర్భగుడి, ముఖమండపము, అంతరాళ మండపముల నిర్మాణము చాళుక్య రాజ్యారంభ కాలమునాటివిగా భావింపబడుచున్నది. పాశుపతశైవులకీ క్షేత్రము పవిత్రమైనది. వారి యావాస మీ క్షేత్రప్రాంతము."342

"త్రిపురాంతకమున వెలసిన శాసనము లధికముగా ఉత్తరాయణ సంక్రాంతి, విష్ణు సంక్రాంతి, మహాశివరాత్రి, మహాకార్తిక పర్వదినములందు, సూర్య, చంద్ర గ్రహణ పుణ్యకాలమందు వేయింపబడినవి.''343

కర్నూలు జిల్లా త్రిపురాంతకం దేవాలయానికి చెందిన క్రీ.శ. 1106 వ సంవత్సరమునకు చెందిన ప్రథమ శాసనం,344 వాటి వివరాలు ఇదివరకే వివరింపబడినాయి. ఇది చింతనపెగ్గడ రాసినదిగా కూడా చెప్పబడి, చివర శాపాశయాలు కూడా పేర్కొనబడినాయి.

శక సంవత్సరం 1176 (క్రీ.శ. 1254)లో విశ్వేశాచార్యులవారి పుత్రుడు శాంతశంభు త్రిపురాంతకేశ్వరాలయ శ్రీ విమానాన్ని శుద్ధవర్ణములైన అశ్మములతో (తెల్లటి పాలరాళ్ళతో) నిర్మించినట్లు స్వామి ఆలయం దక్షిణ కుడ్యం మీద ఉన్న శాసనం తెలుపుతుంది ఈ శాసనం సంస్కృత పారిభాషిక పదవర్ణములతో ఒప్పారుతూంది.345

**అహోబిలం** : అహోబలం కర్నూలు జిల్లాలో ఉంది. ఇక్కడి అహోబలేశ్వరుడైన నరసింహస్వామి ఆలయప్రాంతంలో అనేక శాసనాలు ఆయనపైగల భక్తిశ్రద్ధల్ని పేర్కొంటున్నాయి. ఈ ఆలయానికి సంబంధించిన క్రీ. శ. 1410 వ సంవత్సరపు శాసనం346 రెడ్డి వంశపు రాజులు కొన్ని గ్రామాలను దానం చేయటం, క్రీ. శ. 1515 వ సంవత్సరపు శాసనం347 శ్రీకృష్ణదేవరాయలు నృసింహస్వామికి అనేక కానుకలు, దానాలు సమర్పించడం, క్రీ. శ. 1563 వ సంవత్సరపు శాసనం348 సదాశివ రాయలు నాలుగు స్తంభాల మంటపాన్ని నిర్మించి, కొంత భూమిని దానంగా ఇవ్వటం, క్రీ. శ.

1609 వ సంవత్సరపు ఒక శాసనం[349] వేంకటపతి రాయలు స్వామివారికి అనేక కానుకలను, దానాలను సమర్పించుకోవడం మొదలైన విశేష వివరాలను పేర్కొంటున్నాయి. శ్రీ బి. ఎన్. శాస్త్రిగారి గ్రంథం ప్రకారం ఇందులో 105 శాసనాలు ముద్రించబడ్డాయి.[350] చివరి శాసనం సంపూర్తిగా లేదు.

ఆయా క్షేత్రాల్లో నెలకొనివుండే దేవాలయాలకు, వాటిలోని దేవతా మూర్తులకు రాజులు, ఇతర భక్తులు వారివారి శ్రద్ధాసక్తులతో విశేషమైన ఆత్మీయతల్ని కనబరచినట్లు శాసనాలు ధృవపరుస్తున్నాయి. త్యాగనిరతి, సంస్కృతి, విశాల హృదయం, సామాజిక దృక్పథం, ఆర్థిక వ్యవస్థ, దేవాలయ నిర్వహణ ఆనాటి వారి బహుముఖ ప్రజ్ఞకు, ధార్మిక మనస్తత్వానికి చక్కని గీటురాళ్లు.

## ఆర్థిక వ్యవస్థ - వర్తక - వ్యాపారాలు :

వర్తకం - వ్యాపారం అనేవి దాదాపు సమానార్థకాలే! వాణిజ్యమనే పదం కూడా వాడబడుతూంది. వర్తకం అంటే స్వేచ్ఛావృత్తికి ఆధారమైనది. వ్యాపారము - పని, క్రియ అనే అర్థాల్లో చెప్పవచ్చు. ఇది ఒక వృత్తి మాత్రమే! చిల్లర వస్తువుల దగ్గర్నుండీ బంగారు, వెండి, నగలవరకూ అన్నీ వ్యాపారాలే! అయితే, ఈ వ్యాపారాల్లోని క్రయ విక్రయ విధానాలు, కొలతలు, తూకాల్లో చాలా భేదాలున్నాయి. ధాన్యం, వాణిజ్య పదార్థాలు, కలప, లోహాలు, పారిశ్రామిక వస్తువులు, వస్త్రాలు ఒకటేమిటి- యెన్నో వస్తువులు ఈ వర్తక, వ్యాపార విధానాల్లో చోటు చేసుకున్నాయి.

సమాజంలోని ఆర్థిక వ్యవస్థ ప్రధానంగా ఈ వర్తక వ్యాపార లావాదేవీలతో నిండి ఉంది. గ్రామస్థాయినుంచీ, దేశ విదేశాలవరకూ ఈ వ్యాపార సరళి అంచెలంచెలుగా వ్యాపించింది. తగినన్ని రవాణా సౌకర్యాలు లేని ప్రాచీన కాలంలో కూడా గుఱ్ఱాలు, ఎద్దులు, గాడిదలు, ఇతర పశువులు, పడవలు మొదలగువాటి ద్వారా సరకు రవాణాలు జరిగేవని శాసనాలు ఋజువు చేస్తున్నాయి.

మొదట వర్తక వ్యాపారాల్ని చేపట్టింది వైశ్యులే! ఈ వృత్తిని బట్టియే వారా సంప్రదాయాన్ని స్వీకరించి అభివృద్ధి చెందారని చెప్పవచ్చు. రానురాను

ఈ వ్యాపారధోరణి అన్ని జాతుల్లోను నెలకొని, శాఖోపశాఖలుగా విస్తరిల్లుతూ వచ్చింది. నేటి సమాజంలో ఈ వ్యాపార స్థితి ఆర్థిక పరిపుష్టికి ప్రధానమైన అలంబనమైంది.

"వర్తకులు రాజాదరణతో బాగా సంపదలు గడించి సంఘంలో అత్యధిక మైన పలుకుబడి కలిగి ఉండేవారు. ఆర్థిక బలంతో రాజకీయ బలమూ సమకూ రింది. వారు శ్రేణులుగా ఏర్పడేవారు. వారికి దర్బారులో మంచి పలుకుబడి ఉండేది. వర్తక శ్రేణులు సామర్థ్యంతో సామంతుల శక్తికి దీటయ్యేది. చేతిపనుల వారు కూడా శ్రేణులుగా ఏర్పడేవారు."351

వర్తక శ్రేణులకు వృత్తిశ్రేణుల మీద ఓ విధమైన పెత్తనం ఉందనిపించే శాసనాలు కొన్ని ఉన్నాయి ఇంత కాలంలో ఈ రకం సరుకు లివ్వాలనే నిబంధ నతో వర్తకులు బజానాలివ్వడం ఉండి ఉండొచ్చు, 'చప్పన్న దేశాల వర్తకులు' పెన్నబాడి, ముల్కినాడు, రేనాడు, సకలిసీమ, ఔకు, కోయిలకుంట్ల, పెద్ద నంద్యాల, పులివెందులలోని మగ్గాలనుంచి రావలసిన బాకీలను శ్రీశైల మఠ అధికారి అయిన స్వామికి ఇచ్చినట్లు వామనూరు (కడప) శాసనం తెలుపు తూంది.352

ప్రాచీనకాలంలో వర్తకశ్రేణులు (సంఘాలు) ఉండేవని, వీటికి రాజులతో సన్నిహిత సంబంధం ఉండేదనీ, ప్రజాహిత కార్యక్రమాల్లో వీటికి తగిన భాగస్వామ్యముండేదని వ్యక్తమవుతూంది.

ప్రాచీన దక్షిణ భారత వర్తక శ్రేణులకు 'అయ్యావళి ఐనూర్వరు' అనే పేరు కల్గిన, ప్రస్తుత కర్నాటక రాష్ట్రంలో ఉన్న బిజాపూర్ జిల్లాలోని 'ఐహోల్' కేంద్ర స్థానంగా ఉండేది. రాయలవారి విజయనగర పరిపాలనా కాలంలో దీనికి సంబంధించిన వర్తక శ్రేణులు దక్షిణ భారతంలోని నగరాల్లో పట్టణాల్లో శాఖోపశాఖలుగా విస్తరిల్లాయి. అయితే, వీటన్నింటికి 'అయ్యావళి' కేంద్రంగా ఉండేది. 'అయ్యావళి వర్తక సంఘం' పేరుతోనే ఈ శాఖలన్నీ తమ తమ వర్తక వ్యాపారాన్నీ కార్యక్రమాల్నీ నిర్వర్తించుకొనేవి.

కర్నూలు (ప్రస్తుత ప్రకాశం) జిల్లా త్రిపురాంతకంలోని క్రీ.శ. 1270 సంవత్సరపు ఒక శాసనంలో,[353] శ్రీ త్రిపురాంతక శ్రీ మన్మహాదేవర అంగ రంగభోగాలకుగాను నానాదేశాల్లోని నగర సంఘపు వర్తకులు పౌత్తపినాడు అంతటా త్రిపురాంతకం పేట (పట్టణం)లో అమ్మిన సరకుకు మాడకు రెండేసి వంతున కనరిపీసాల[354] లెక్క ప్రకారం పేంటసుంకము మొ॥ ఇచ్చినట్లు పేర్కొన బడింది.

ఇదే గ్రామంలోని క్రీ.శ. 1292 సంవత్సరపు మరొక శాసనంలో[355] అయ్యావళికి చెందిన ఐవత్తు ఐనూర్వరు అంటే ఐహోలు లేదా అయ్యావళిపురా నికి చెందిన అయిదువందలమంది వర్తకులు త్రిపురాంతక మహాదేవునికి అనేక బహుమతులు, ధాన్యాలు ఇచ్చినట్లుగా, వీరుగాక నానాదేశి పెక్కంద్రు అనబడే అనేక దేశాల పెక్కంద్రు వర్తకులు ఆయా సంఘాలకు చెందినవారు అనేక కానుకలను సమర్పించినట్లు పేర్కొనబడింది.

అనంతపురం జిల్లా కదిరి గ్రామంలోని క్రీ.శ. 1418 సంవత్సరపు ఒక శాసనంలో[356] యాభై ఆరు దేశాలకు సంబంధించిన సమస్త వర్తకులకు, కదిరి ప్రాంతంలోని మాలమాదిగలకు రైతులకు పన్నులులేని ఒక ఒడంబడిక కుదిరిన విషయం పేర్కొనబడింది.

కడప జిల్లా పులివెందల గ్రామంలోని క్రీ.శ. 1535 సంవత్సరపు ఒక శాసనంలో[357] వర్తకులకు, రెడ్లు కరణాలకు, మిగతవారికి పన్నును పునరుద్ధరించి నట్లు - ముఖ్యంగా వర్తకులకు కూడా ఇవ్వబడిన ఒక నమ్మిక శాసనంగా తెలుప బడి ఉంది.

ఇదే జిల్లా చిట్టివేలు తాలూకాలోని కొన్ని గ్రామాల అగ్రహారికులు శ్రోత్రియందార్ల వద్ద ఉండే తామ్ర శాసనాలు, దానపత్రాలు వగయిరా నకళ్ళ లోను, ఇదే జిల్లా నగర్లపాటి గ్రామస్థులవద్ద ఉండే తామ్రశాసనంలోను[358] అయ్యావళీ పురవరాధీశ్వరులున్ను....స్వదేశీ పరదేశీ అయ్యావళి ముఖ్యమయిన చాలుమూల సమస్తమైన యాభై ఆరుదేశాలవారు కూడి నారసింహరాజు అను అతనికి "బసవశంకర'' బిరుదును యిచ్చి సత్కరించడమే కాకుండా దూది, వక్కలు, మిరియాలు వంటి పదార్థాలకు ధరల నిర్ణయంకూడా చేసినట్లు చెప్పబడి ఉంది. ఇది క్రీ.శ. 1564 సంవత్సరపు శాసనము.

రాయలసీమ సముద్రతీర ప్రాంతానికి దూరంలో ఉన్నది కాబట్టి రహదారి మార్గాల్లోనే అధికంగా రవాణా జరిగేది.

"అదర మొప్ప నొక్క దివసాంతమునందు దుకాణమున్ బహి
ర్వేదిని భద్రకారుడ మరించుక ధూర్తుని జూచి మిద్దెలో"359

—దుకాణం (అంగడి) అనే వ్యావహారిక పదం ఆనాటి కావ్యాల్లో పేర్కొనబడి ఉంది.

ఇంకా—

''అప్పులొ్వారిధిచేతఁబుచ్చికొని, కార్యంబై న మున్గొన్నయ
య్యప్పులొ చనియున్నవృద్ధికముగా నవ్వార్ధికే తీర్పగా
నప్పుణ్యాతి విశుద్ధ జీవులు నిజాచ్ఛాంగంబులందోచు న
ట్లొప్పారెన్మళిబింబ గర్భితములై ద్యోబారి శుభ్రాభ్రముల్''360

—అప్పుగొని వడ్డితో తీర్చి శుద్ధాత్ముడై శుద్ధదేహుడైన సజ్జనుని సామ్యము మేఘము లందు చెప్పబడింది. ఆత్మశుద్ధి యాకారమందగపడును. సుకృతముచే ఆత్మ శుద్ధియు కలుగును.

అప్పుచేసినవాడు, తీర్చిన తర్వాత ఎంత నిర్మలంగా, శుద్ధంగా, స్వేచ్ఛగా బరువు దించుకొని తేలిగ్గా ఉంటాడో అది ఆనాటి కావ్యాల్లో యెంతో హృదయ రంజకంగా, సహజంగా వర్ణింపబడింది.

అప్పులేనివాడు అధికబలుడు అన్న సామెత యేనాడో పుట్టింది. ద్రవ్యానికి ద్రవ్యమూ, ప్రతిఫలంగా వడ్డీ ఇవ్వడమనేది, ఇతరుల ఇంట్లో ఉంటున్నందుకు చెల్లించే బాడుగ లాంటిది.

కాకతీయుల కాలంలో కొన్ని వర్తక సంఘాలు యేర్పడి, తమ హక్కులను, అధికారాలను అనుభవించి వ్యాపింప చేసినట్లు శాసనాలవల్ల తెలుస్తూంది. అయ్యావళి ఐనూర్వరు, ఉభయ నానాదేశి పెక్కండ్రు, బాలుమూల సమస్త పెక్కండ్రు అనే పేర్లతో అవి శాసనాల్లో పేర్కొనబడి ఉన్నాయి.

అయ్యావళి ఐనూర్వరు అనే ఈ వర్తక సంఘం కేంద్రస్థానం ఐహోళె లేక అయ్యావళి. అందుచే దీనికి అయ్యావళి వర్తక సంఘమని పేరు.

—నానాదేశి పెక్కండ్రు సాధారణంగా అన్ని ప్రాంతాలలో, దేశాల్లో తిరిగి వ్యాపారం చేస్తూ అయా సరకులకు ధరలు నిర్ణయించుకుంటూ, రహదారులలో దోపిడీదొంగలబారినుండి తమను తాము కాపాడుకుంటూ, సుంకాలను ఒప్పందాల ద్వారా నిర్ణయించుకుంటూ, తమ ఉనికిని రాజుల, అధికారుల ద్వారా కాపాడుకొనేవి అని తెలుస్తూంది.

చాలుమూల ఉభయ నానాదేశాల పెక్కండ్రు సందారక ప్రధానదేశి పరదేశి వివిధ దేశములకు చెందిన వర్తక సంఘంగా శాసనాల్లో పేర్కొనబడింది. వీటిని గూర్చి పూర్వప్రకరణాల్లో వివరించబడింది.

సమాజంలో వ్యవసాయం, ఇతర వాణిజ్య ఉత్పత్తులు వెన్నెముకవంటివి కాగా, వర్తక వ్యాపారాలు జీవనాడులుగా మానవ జీవితాన్ని అభివృద్ధివైపు పయనింపచేయడమే కాకుండా సర్వసమగ్రతను అర్థిక పుష్టిని చేకూర్చగలవని విశ్వసింపవచ్చు.

## ఆర్థిక వ్యవస్థ (నాణాలు) :

ప్రాచీనకాలంలో భూములు, పశువులు ప్రధాన ధనంగా ఉండేవి. సమాజంలో క్రమక్రమంగా ధనానికి కొత్తకొత్త అర్థాలు యేర్పడే స్థితి వచ్చింది. వస్తు మార్పిడి పద్ధతిద్వారా (Barter System) లావాదేవీలు జరిపే ప్రజలు, వ్యాపార సంస్థలు అయాకాలాల్లోని నాణాలద్వారా వస్తువుల్ని కొనడం, తాము ఉత్పత్తిచేసిన వస్తువులకు, పదార్థాలకు ధనరూపంలో ఉండే నాణాలను గ్రహించడం, వాటికి విలువ కట్టడం జరిగేది. సమాజంలోని ప్రజల జీవన స్థితిగతులు, పాలకుల అధికార విధానం వస్తువుల గిరాకీలనుబట్టి ధనము విలువను, నాణాల విలువలను నిర్ణయించడం జరిగింది. బంగారు, వెండి, రాగి వంటి లోహాలతో మొట్టమొదటగా రూపురేఖలు దిద్దుకొన్న ఈ ద్రవ్యం కాలగర్భంలో వింతవింత ఆకృతుల్ని సంతరించుకుంది.

'నాడు గద్యాణాలు, మాడలు, అనే బంగారు నాణాలు, పాదిక, వీసం అనే నాణాలతోపాటు రూక అనే వెండి నాణెం ఉండేది. రూకలను 'రు' అని సంక్షిప్తంగా రాసేవారు. కొన్నిచోట్ల ప్రతి విద్యార్థికి నెలకు రెండు రూకల

చొప్పున సంవత్సరానికి 24 రూకలు (నేటి ఉపకారవేతనంవలె) ఇచ్చేవారు. గురువులకు కూడ నెలకు రెండు రూకలు (అదనంగా కాబోలు) ఇస్తున్నట్లు గట్టి తిమ్మన శాసనం తెల్పుతుంది.'[361]

'ఆనాడు చెలామణీలో ఉన్నట్లు తెలిసే వెండి, బంగారు, రాగి నాణేల పేర్లు చూస్తే ద్రవ్య చలామణీ చాలా విస్తృత వ్యాప్తంలోనే వున్నదనుకోవచ్చు. ఇవి కేంద్రీయ ప్రభుత్వం వేసినవి కాదు. ఎక్కడికక్కడ స్థానిక ప్రభువులూ, సామంత నాయకులూ తమ నాణేలు ముద్రించుకోవచ్చు. 88 గ్రైన్‌లు తూగే బంగారు నాణేన్ని 'గద్య' లేక గద్యాణ అనేవారు. రాజనారాయణగద్య, సురభి గద్య, త్యాగగద్య, బిరుదుగద్య మొదలగునవి. మాడ అనేది 73 గ్రైన్‌లు తూగే వెండిదీ, బంగారుదీ కూడ వుంది. కాసు రాగినాణెం. నూరు కాసులు ఒక పణం. ఇది బంగారు నాణెం. 60 గ్రైన్‌ల 'కలంజు' నాణెం వెండిదీ, బంగారుదీ కూడ ఉంది. తూర్పు చాళుక్య రాజులు వేసిన బంగారు, వెండి, రాగి నాణేలు ఆంధ్రలో పరుచోట్లనేకాక బర్మా, సయామ్, కోస్తాలలో కూడ దొరికేయి. వీని మార్పిడి ప్రమాణాలేమిటో శాసనాల్నిబట్టి తెలియదు. పావులూరి మల్లన తన 'సారసంగ్రహ గణిత'లో ఆనాడు చెలామణిలోవున్న వేర్వేరు నాణేల పరస్పర సంబంధాల్ని వివరించేడు. దాని ప్రకారం—[362]

| | | |
|---|---|---|
| 4 గోకర కాసులు | — | 1 సౌరకాని |
| 4 సౌర కాసులు | — | 1 పీర |
| 4 పీరలు | — | 1 కాని |
| 4 కానులు | — | 1 పీసము |
| 4 పీసములు | — | 1 పటిక |
| 4 పటికలు | — | 1 చిన్నము |
| 4 చిన్నములు | — | 1 మాడ |

ఈ విధంగా ఆనాటి నాణేలకు విలువలు వుండేవి.

మానవ సంస్కృతికి సంబంధించిన అధ్యయనంలో ఈ నాణేలకు ప్రధాన పాత్ర ఉంది. విజయనగరరాజుల కాలంలోని ఆర్థిక స్థితిగతులు, వ్యవహారాలు, కళాత్మకతలో ఈ నాణేలకు ఉండే స్థానం నిరుపమానం. వీటిలో బంగారు, వెండి, తామ్ర నాణేలు ఉన్నాయి.

నాణాల్లో ప్రసిద్ధమైంది గద్యాణం లేదా హౌన్ అనే పేరుగలది. దీని తూకం సుమారు 90 గ్రాములు అని డా॥ అల్టేకర్‌గారు, సుమారు 63 గ్రా. అని డా॥ అప్పదొరైగారు అభిప్రాయపడుతున్నారు. గద్యాణానికి, మిగత నాణాలకి ఉండే సంబంధం ఈ విధంగా ఉంది—

| | | | |
|---|---|---|---|
| 1 గద్యాణం | - | 10 పణములు | లేక హణ |
| 1 పణము | - | రెండు అద్దలు | (అర్ధపాలు-అద్ధ) |
| 1 పణము | - | నాలుగు హాగలు | (ముప్పాగ-3/4 పణము) |
| 1 పణము | - | 16 వీసాలు | (లేక 20 వీసాలు) |
| 1 హాగ | - | 2 బేళె | |

గద్యాణము, పణ, అద్ధ, హాగ, బేళె, వీస - ఇవన్నీ ప్రత్యేక నాణాలని స్పష్టంగా తెలిసివస్తూంది. నాణాల్లో వీసమే అత్యంత కనిష్టమైనది. పైన తెల్పిన నిదర్శనాలవల్ల శాసనాలూ, సాహిత్య గ్రంథాలూ చెప్పే నాణాల పేర్లు ఒకటే అనేది తెలుస్తూంది. అయితే, వీటి విలువల్లో కొన్నిచోట్ల వ్యత్యాసం ఉండవచ్చునని తెలుస్తూంది.[363]

''విజయనగర రాజుల్లోని ప్రథమ పాలకులు తమ పరిపాలనలో ఈ నాణేలను ముద్రించడం, వాటిని చలామణీ చేయించడంలో విశేషమైన కృషి చేశారు. వారు టంకసాలలు, వాటి విధులు, విధానాలపై తగిన అజమాయిషీ, అదుపు చేశారు. మొదటి హరిహరరాయలు రాజ్యానికి చెల్లించవలసిన పన్నులు, సుంకాలను వస్తు రూపేణా కాకుండా నగదు రూపంలోనే, అంటే- నాణేల రూపంలో చెల్లించాలని నిర్దేశించాడు. రాజ్యావసరాలకుగాను, కొత్త టంకసాలలు, వాటిలో సరికొత్త నాణేల విలువలను (నాణెపు రకాలు) ప్రవేశ పెట్టాడు. దీనికిగాను ప్రత్యేక పరిపాలనా శాఖలను స్థాపిస్తూ ఈ నాణెముల ముద్రణలో వాటి ప్రయోగాలను, వాటిపై అదుపును చేశాడు. ఈ విషయంలో బార్బోసా కొన్ని ఆసక్తికరమైన విశేషాలను వెల్లడించాడు. స్వర్ణకారుడు బంగారు నాణ్యతను గుర్తించేందుకు తనతో యెప్పుడూ ఒక గీటురాయి (a touch stone) ని వెంట తీసుకొని వెళ్ళేవాడని తెలుస్తూంది.''[364]

"నాణాలను ముద్రించే స్థలాలను 'కమ్మటి'ములని 'అచ్చుటంకసాల'లనీ పిలుస్తూ ఉండేవారు. 'విశ్వకర్మల'ని పిలువబడే కంసాలివారిని రాజు ఈ 'కమ్మ

టాల్లో' నియమించుకొనేవాడు. ఈ అగసాలివాళ్ళు లేదా 'కమ్మటదోజులు' తామే ప్రత్యేకంగా శ్రేణులను (సంఘాలను) స్థాపించుకొనేవారు."[365]

కడప జిల్లా దేవగుడి గ్రామంలోని క్రీ.శ. 1298 వ సం॥కు చెందిన రెండు శాసనాల్లోను[366] వరహా, మాడ, రూక అనే వైవిధ్యంకల మూడున్నర రూపాయల విలువగల బంగారు నాణెముగాను, మాడ - ఒక విధమైన నాణెము గాను లేక అర్ధదీనారము లేక పది రూకలు విలువగలదిగా వివరించబడింది. రూక అంటే అతి తక్కువ విలువైన రాగినాణెంగా చెప్పబడుతుండేది. మాడలలో ఉత్తమగండమాడ, కులోత్తుంగమాడ, గండమాడ, చామరమాడ, గంధహస్తి మాడ, గంధవారణమాడ, జయమాడ, బిరుదుమాడ, భుజబలమాడ, మధు రాంతక మాడ, రాజరాజు మాడ అనే అనేక రకాల మాడలున్నట్లు కొన్ని శాసనాలు, గ్రంథాలు తెలుపుతున్నాయి.[367] ఇదే జిల్లా శ్రీరంగపురంలోని క్రీ.శ. 1334 సం॥లోని ఒక శాసనంలో తమ హస్తఖర్చులకు వెయ్యి వరహాలు ఇవ్వగలవారము అని పేర్కొనబడి ఉంది.[368]

ఇదే జిల్లా దేవిగుడి గ్రామంలోనిదే క్రీ.శ. 1394 సం॥పు మరొక శాస నంలో[369] 'టంకం' అన్న ప్రసక్తి ఉంది. టంకం అంటే నిష్కము-పదియారు దబ్బుల బంగారు నాణెముగాను, ట - అంటే టంకానికి సాంకేతిక నామంగా, ఇదే వరహాగా నిఘంటువుల్లో తెల్పబడింది [370]

ఆనాటి క్రయవిక్రయాలు, ఒప్పందాలు, పన్నులు, సుంకాలు, సమస్త ద్రవ్య వినియోగాలు నాణాలరూపంలో ఉండే రూకలు, మాడలు, వరహాలు, టంకాలు అనే విలువలతో చెలామణీ చేస్తూ ఉండేవారు అనేందుకు శాసనాల దాఖలాలు అనేకం ఉన్నాయి.

కావ్యాల్లో కూడా వీటికి సంబంధించిన వివరాలున్నాయి. మహాకవి శ్రీనాథుడు — "దీనార టంకాల దీర్థమాడించిరి దక్షిణాధీశు ముత్యాలశాల' అనీ, 'చీరలు నూరు టంకములు చేసెడివైనను పెట్టెనుండగా' అని భాస్కర శతక కర్త మారద వెంకయ్య కవీ పేర్కొన్నారు.

**సుమారు 4 దశాబ్దాల కిందటివరకూ రూపాయలతోపాటు అర్ధరూపాయి,** పావలా, బేడ (రెండణాలనాణెం), అణా, అర్ధణా, బొట్టు, దమ్మిడీ ఉండేవి. వీటి

స్థానంలో ప్రస్తుతం అంటే 1958 వ సం॥ తర్వాత నాణేలు దశాంశ పద్ధతిలో చలామణిలో ఉన్నాయి. ఒక రూపాయి నుండి ఐదువందల విలువగల వరకు కరెన్సీ నోట్లు జారీలో ఉన్నాయి. ఆయా దేశకాల పరిస్థితుల ననుసరించి నాణాల విలువల్లో అనేక మార్పులు వచ్చాయి. సమాజంలో జీవన ఆదాయ వ్యయాల్లో మార్పు వచ్చినప్పుడంతా ఈ నాణాల విలువల్లో హెచ్చుతగ్గులు కల్గడం సహజం. వస్తువుల ధరలు పెరిగినప్పుడల్లా ద్రవ్యానికి మారకపు రేటు తగ్గడం మామూలే. ఆర్థిక వ్యవస్థలో పదార్థానికి ఉండే విలువ ద్రవ్యానికి ఉండదు. 'లక్షాధికారి కానీ లవణము, అన్నమేకానీ మెరుగు బంగారాన్ని మింగబోడు' అన్న శేషప్ప కవి విరచిత నరసింహ శతకంలోని సూక్తి, ఆర్థిక సూత్రంలోని పదార్థానికీ, ద్రవ్యానికీ ఉండే అంతరాన్ని వ్యక్తం చేస్తూంది.

## కొలతలు - తూకాలు :

పొట్ట పోసుకోవడానికి రకరకాల వృత్తుల్ని చేపట్టిన మానవులు ఒకే విధమైన ఆహారాన్ని తినలేక రకరకాల ఆహార ధాన్యాల్ని పండించడానికి ప్రయత్నాలు చేశారు. దీనికి సారవంతమైన భూములు కావాలి. గుబురుగుబురుగా ఉండే చెట్టుచేమలను నరికి వేశారు. భూమిని వ్యవసాయ యోగ్యంగా చేసుకొన్నారు. తమతమ భూముల హద్దులను నిర్ణయించుకోవడానికి రాళ్ళు, రప్పలు, చెట్లు, కట్టెలు, కంపలు, గుంతలు మొదలగువాటిని గుర్తులుగా నిర్ణయించుకున్నారు. పొడవు వెడల్పులను జానెలు, మూరలు, హస్తాలు, బారలు, కాలి అడుగులు కొలతలుగా, కర్రల కొలతలుగా తాళ్ళ ప్రమాణాలుగా కొన్నాళ్ళు యేర్పాటు చేసుకున్నారు. ఊరికి ఊరికిగల మధ్య దూరాన్ని పరువు, క్రోసు, ఆమడ అనే పదాలతో, తరువాత మైళ్ళు, ఫర్లాంగులుగా లెక్కపెడుతూ వచ్చారు. కాలిబాటలు దారులుగా, రహదారులుగా రూపొందాయి.

పంటను గుప్పెడు, చేరెడు, చేటెడు, గంపెడుగా లెక్కలు కట్టిన ఆనాటి వారు సోల, శేరు, ఇరస, తూము, పందుము, ముప్పందుము, పుట్టి, బస్తాలుగా లెక్కించారు.

పాలు, పెరుగు, నెయ్యి, నూనె యిట్లాంటివి కూడా శేరులు, పావు శేరులుగా లెక్కించారు.

శాసనయుగంలో, అంటే - నన్నయకు పూర్వయుగంలోను, తర్వాతి కాలంలోను దూర, కొలమానాల్లో కొన్ని ప్రత్యేక పేర్లు ఉన్నట్లు స్పష్టంగా తెలుస్తూంది.

"సంస్కృత, ప్రాకృత శాసనాల్లో భూమి కొలతలకు నివర్తన, పట్టిక అనే మాటలు వాడేరు. ఇవి రెండు పర్యాయ పదాలనీ అర్థమవుతోంది. శాసనాలలో ఈభూమి పరిమితి ఎంతో చెప్పకపోయినా 200 మూరల చతురం భూమిని నివర్తనము అంటారు. ఒక నిర్ణీత కాలంలో ఒక మనిషి తాను బయలుదేరిన చోటుని చేరుకొనేటట్లు చుట్టి వచ్చిన భూమిని నివర్తనం అంటారు."371

"చల్లే విత్తనాలనుబట్టి భూమి విస్తీర్ణాన్ని చెప్పడం వుండేది. అతి ప్రాచీమైనట్టి భూమి కొలత నివర్తన. ఇదిగాక మరుత్తు, ఖండిక, పుట్టి, తూము, కుంచము మొదలైన కొలమానాలు కూడా వున్నాయి. ఇవే క్రమంగా ధాన్యపు కొలమానాలయ్యేయి. విజయనగర రాజుల కాలంనాటి కొన్ని కొలమానాలను పరిశీలిస్తే ఈ పద్ధతికి, అటు తర్వాత వచ్చిన పద్ధతులకు చాలా భేదాలు అగుపిస్తాయి."372

| | | |
|---|---|---|
| 1 మూర | - | 19.68 అంగుళాలు |
| 32 మూరలు | - | 1 దండము (1 కఱ్ఱ) |
| 1 దండం (చదరం) | - | $2756\frac{1}{4}$ చ॥ అ. |
| 1 జుంటా | - | 0.663 ఎకరము |
| 4 చిట్టెలు | - | 1 సోల, 70 తులాల రాశిధాన్యం (బియ్యం) |
| 4 సోలలు | - | 1 ముంత, 280 తులాలు / $3\frac{1}{2}$ పక్కా-శేర్లు |
| 4 ముంతలు | - | 1 కుంచం, 1120 తులాలు - లేక 14 పక్కా-శేర్లు |
| 1 కుంచం | - | 1 తూము, 100 తూకాలు (సుమారు) |
| 20 తూములు | - | 1 కాడి లేక పుట్టి లేక సుమారు 1 టన్ను. |

తులం, పలం, చిన్నం అనే తూనికలతోపాటు మానిక, తూము వంటి కొలతలు కూడ వుండేవి. ఇరవై తూములు ఒక ఖండుగ. దీనినే పుట్టి అనేవారు.

నిచ్చెముల పుట్టి, గారలపాటి పుట్టి, పెదబీరవెల్లి పుట్టి అనేవి ఆయా గ్రామాల్లో ప్రసిద్ధమైన కొలతలు. భూమిని మర్తులుగా కొలిచేవారు. ఖండువు అనే పదాన్ని 'ఖ' అని సంక్షేపంగా రాసేవారు. పాతిక లేక నాల్గవ భాగాన్ని నిలువు గీతలతో '॥' అని, అర్థ లేక అర్ధభాగాల్ని ఒక అడ్డుగీతతో '—' రెండు వీసాలు లేక ఎనిమిదవ భాగాన్ని రెండు అడ్డగీతలతో '=' గుర్తించేవారు. తూము పుట్టిలో ఇరవయ్యవ భాగం. మానిక తూములో పన్నెండవ భాగమని గట్టు తిమ్మన శాసనం వివరిస్తున్నది.[373]

'మత్తర్, మర్తురు అనేది 'మాత్రా' = ప్రమాణము (గాత్రము) యొక్క తద్భవమే అని ప్రొ॥ తీ.నం. శ్రీగారు సూచించారు.[374]

వేరు వేరు కొలత, తూకాల పట్టిక రాజాదిత్యుని వ్యవహార గణితాన్ని ఆశ్రయించి దిగువ ఇవ్వబడింది.[375]

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 ఖండుగ | - | 4 పంచకాలు | 1 భారము | - | 20 తూల |
| 4 పంచకాలు | - | 5 కొళగ | 1 తూల | - | 5 బీసగె |
| 1 కొళగ | - | 4 బళ్ళ | 1 బీసగె | - | 20 పల |
| 1 బళ్ళ | - | 4 మాన | 1 పల | - | 4 కర్ష |
| 1 మాన | - | 4 సోల | 1 కర్ష | - | 4 సువర్ణ |

- కొలతలు సాధనాలుగా ఇప్పటి మెట్రిక్ పద్ధతి వచ్చేందుకు ముందు ధాన్యాలను పావు, అర్ధశేరు, పంచేరు (దడియము, మణువులు)గా, వల్లా (మూట), ఇరస, తూము, పందుములుగా లెక్కకట్టి కొలిచేవారు. ఇదే విధమైన కొలమానాలను లెక్కకట్టి త్రాసులో తూచేవారుకూడా!

ప్రాచీన, మధ్యకాలిక యుగాల్లోని శాసనాల్లో ఈ తూనికలు, కొలతలు ఆనాటి పరిభాషలో చెప్పబడినాయి.

కడప జిల్లా నాగూరు గ్రామంలోని క్రీ.శ. 8వ శతాబ్దిలోని రేనాటి చోళుల కాలంనాటి ఒక శాసనంలో[376] రాజ్యమానంబు నావంబది మఱున్తల పన్నాశ ఇచ్చినట్లుగా చెప్పబడింది. ఇదే జిల్లా కొత్రపాడు గ్రామంలోని ఇదే శతాబ్దికి చెందిన చాళుక్య కీర్తివర్మనాటి శాసనంలోనూ[377] 'రాజమానంబు నాలుపు మఱుతుల నేల' అని పేర్కొనబడింది.

ఇదే జిల్లా రామేశ్వరం గ్రామంలోని క్రీ.శ. 1498 సం॥ నాటి ఒక శాసనంలో[378] "యిచ్చిన మడి దొమ్మరిగడ ప్రమాణం, గోచర్మం ఖ 4 అక్షరాల నాలుగు పుట్లు పందుం వరి మడిని' అని చెప్పబడింది.

10 హస్తాలు - ఒక దండ; 30 దండలు - ఒక నివర్తన, 10 నివర్తనలు - 1 గోచర్మముగా నిఘంటువులో[379] వివరించబడింది.

పుట్టి అంటే 960 శేర్లుగా, పందుము అంటే పది తూములుగా, తూము అంటే 48 శేర్లుగా లెక్క పెట్టేవారని వ్యవహారంలో ఉంది.

చిత్తూరు జిల్లా దేవుల చెరువు గ్రామంలోని క్రీ.శ. 1658 సం॥నాటి ఒక శాసనంలోను,[380] ఇదే జిల్లా బురకాయలకోట గ్రామంలోని క్రీ.శ. 1796 సం॥ నాటి మరొక శాసనంలోను[381] 'గడ'ల లెక్క ప్రకారం భూమి (మడి)ని కొలిచిన దాఖలాలు ఉన్నాయి.

కడప జిల్లా గొల్లపల్లె గ్రామంలోని క్రీ.శ. 1545 సం॥ ఒక తామ్ర శాసనంలో పొలం 'ఖ' అనే సంకేతాక్షరంగా పేర్కొనబడింది.'ఖ'ను ఖండుగా లెక్కించాలి.

ప్రాచీన శాసనాలను పరిశీలిస్తే చల్లే విత్తనాలను, దూరాన్ని బట్టి కొలతగా భూమి విస్తీర్ణాన్ని నిర్ణయించడం జరిగేదని తెలుస్తుంది. వేంగి, తూర్పు చాళుక్యుల కాలపు ప్రాచీన తామ్ర శాసనాల్లో, గ్రంథ భాగాల్లో ద్వాదశ - ఖండికి, కొద్రవ-బీజవపక్షేత్రం, వింశతి ఖండికి - వ్రీహి - బీజ - పరిమాణ - క్షేత్రం అని పేర్కొన్నారు. కాకతీయ వంశానికి చెందిన గంగపతి దేవుని పాకాల్ శాసనం ప్రకారం 'నివర్తన' అనే పదానికి తెలుగు పదం 'మర్తు' అని తెలుస్తూంది. ఈ శాసనంలో, చక్రవర్తి ఇచ్చిన భూమి 5 నివర్తనలుగా సంస్కృత భాగంలోను, 5 మర్తులుగా తెలుగు భాగంలోను వివరించబడింది.[382]

ప్రాచీన కొలమానాలు, తూనికలు ఆనాటి రాజరిక - సామాజిక వ్యవస్థకు అద్దంపడుతున్నాయి. ప్రస్తుత అంతర్జాతీయ విపణిలో దశాంశ పద్ధతికి సంబంధించిన నాణేలకు సరిపోయే మెట్రిక్ కొలతలు, తూకాలు సమన్వయింప

బడి ఉండటం స్పష్టంగా గమనించదగిన విశేషం. ప్రజల జీవన ప్రమాణాలకు, అధికార యంత్రాంగంలోని పరిపాలనాదక్షతకు, వర్తక వాణిజ్యాల ఆర్థిక స్థితి గతులకూ ప్రతిబింబాలు ఈ కొలతలూ-తూకాలూ.

**వృత్తులు :** మనిషి సాంఘిక మనుగడ సాగిస్తున్నప్పటినుండి యేదో ఒక వ్యాపకం పెట్టుకొనే ఉన్నాడు. కూడు, గూడు, గుడ్డలను పొందటానికి అనేక విధాల శ్రమించిన మానవుడు శ్రమజీవి అయ్యాడు. తన ప్రవృత్తికి అనుగుణంగా వృత్తిని చేపట్టాడు. దీన్నే పని అనీ, ఉద్యోగం అనీ ఈనాడు అంటున్నాము. తనకు, తనను నమ్ముకొన్నవారికీ నిత్యజీవిత అవసరాలను, భవిష్యత్తునూ కల్గించడానికి కల్గించుకొన్న వ్యాపకమే వృత్తి. ఇది సామాన్యంగా ప్రతిఫలాపేక్షతో కూడినట్టి ఇహలోక ప్రవృత్తి.

'వర్తతే అనయా వృత్తిః'[383] కృషి మొదలైన జీవనోపాయాల్ని వృత్తులుగా చెప్పినారు. 'చాతుర్వర్ణ్యం మయాసృష్టం గుణ కర్మ విభాగశః'[384] అన్నది గీతాసూక్తి. నాలుగు వర్ణాలను, వాటికి సంబంధించిన వృత్తులను (గుణకర్మలను) తానే యేర్పరిచినట్లు భగవంతుడు తెల్పాడు.

కులం-వృత్తి-ప్రవృత్తి-మానవ జాతి మనుగడలో అంతర్లీనమైన, వ్యవస్థీకృతమైన అంశం.

పూర్వం లోకంలో వ్యవసాయం ప్రధానవృత్తిగా సాగినా,దీనికి ఆలంబనాలుగా కుమ్మర, కమ్మర, వడ్రంగం వంటి అనేక వృత్తులు యేర్పడ్డాయి. మానవ సమాజం సజావుగా సాగడానికి పడుగుపేకల్లా ఈ వృత్తులు ప్రాచీన కాలంనుండి యెంతగానో తోడ్పడుతున్నాయి. వృత్తులకు, కులవ్యవస్థకు కొన్ని స్వార్థశక్తులు విపరీతార్థాలు తీసి, సమాజాన్ని కలుషితం చేయడానికి విఫల ప్రయత్నం చేశాయి. ఆత్మీయతల్ని మంటగలిపి మానవత్వాన్నే మట్టుపెట్టాయి. ఈ కులాలు అంతఃకలహాలకు దారితీయడంతో, వృత్తులు తమ ఉనికినే కోల్పోవడానికి దారితీసింది.

ఆయా వృత్తుల్ని యేర్పరుచుకొన్న కొందరు, కాకతీయ రాజుల కాలంలో శ్రేణులుగా (సంఘాలుగా) యేర్పడారు. వీరు తమ శ్రేయస్సుకే కాకుండా సంఘ

శ్రేయస్సుకు, దేవాలయాల, రాజాస్థానాల అధికారాల ప్రాబల్యాలకూ తహతహ లాడాడు. వీరి ప్రసక్తి అక్కడక్కడ శాసనాల్లో చోటు చేసుకొని ఉంది.

విజయనగర పరిపాలకుల కాలంలో ముస్లింల దాడులను యెదుర్కొనేందుకు హిందూ రాజులు, హిందూ జాతులమధ్య అంతర్గత సమైక్యత అవసరమైంది. అప్పుడు వృత్తులు, జాతులు అనే భేదం లేకుండా పరజాతీయులను, పరదేశీయులను తరిమికొట్టటానికి ఈ సమైక్యతాభావం తోడ్పడింది. అల్లాంటి సమయాల్లో పాలకులు ప్రజల్లోని అనేక రకాల వృత్తులవారు కట్టే వృత్తి పన్నులను తగ్గించివేయటమో, పూర్తిగా మినహాయించటమో చేసేవారు. ఇట్లాంటి చర్యలు పాలక - పాలితుల మధ్య ఉండే సమన్వయానికి, అవగాహనకూ సంకేతాలుగా నిలిచాయి.

అతివృష్టి, అనావృష్టుల కారణంగా కొంతా; పాళెగాళ్లు, సామంతుల అవినీతి విధానాల కారణంగా మరికొంతా బాధను అనుభవిస్తూ ఆనాటి ప్రజలు కొట్టుమిట్టాడుతుండేవారు. చక్రవర్తులను కలుసుకొని, వారికి యేర్పడిన కష్ట నిష్ఠూరాలను చెప్పుకోవటంవల్ల ఈ వృత్తులు పునరుద్ధరింపబడటం, వృత్తి పన్నులను మినహాయించటం, పూర్తిగా రద్దు చేయటం, మన్నించటం జరిగేది.

ఈ సందర్భంలో గ్రామాల్లోని ఆయగాండ్రను గూర్చిన వివరాలు తెలుసుకోవడంకూడా అవసరమే. శాసనాల్లో వీరిని గూర్చిన వివరాలు కూడా అక్కడక్కడ ఉన్నాయి. "ఆయగాండ్రు: గ్రామాన్ని ఆశ్రయించుకొని తమ జీవనాన్ని గడిపే కొందరు ఉద్యోగులు ఉండేవారు. వీరు గ్రామ భటులు; వీరిని ఆయగాండ్రు అనేవారు. రెడ్డి, కరణం, తలారి, చాకలి, మంగలి, కంచరి, కమ్మరి, అగసాలి, కుమ్మరి, నీరుకావలి, చర్మకారుడు మొదలైన వీరు సామాన్యంగా పన్రెండుమంది ఉండేవారు. కాకతీయుల కాలంలోకూడా వీరు ఉండినారు. కానీ, వారికి గ్రామవ్యవస్థలో ప్రాధాన్యం తక్కువ ఉండేది. ఈకాలంలో వీరికి మిరాసి భూములనబడే ప్రత్యేక వృత్తులొసగబడేవి. వీటిని భటవృత్తి మాన్యాలనేవారు. ఇవిగాక ప్రతి రైతు పంటకాలంలో వీరికి 'మేర'లనే మామూళ్లు ఇచ్చే ఆచారముండేది. వీరిలో రెడ్డి, కరణం, తలారి, నీరుకావలి కొంత ప్రభుత్వాధికారం కూడా కలిగి ఉండేవారు. ప్రజలకు వీరు లొంగిలేరు. ప్రజలే వీరికి లొంగి

ఉండేవారు. రెడ్డి, కరణాల ద్వారానే రాజోద్యోగులు గ్రామ వ్యవహారాలను చేస్తూ ఉండేవారు. గ్రామోపజీవులైనా వీరికి ఒక ఉద్యోగ హోదా ఉండేది."[385]

"ఆయగాండ్రు - ఊరి ఉద్యోగస్థులుగా, తాము రైతుకు చేసిన సేవకు ప్రతిఫలంగా కళ్ళంలో ధాన్యం కొలుచుకునే చాకలి, మంగలి, వెట్టి మొదలగు గ్రామోద్యోగులుగా పేర్కొనబడ్డారు."[386]

ప్రాచీన కాలంనుండి లోకంలోని అనేక వృత్తులవారు, ఆయా వృత్తుల ద్వారాను, గ్రామాల్లో కొన్ని ఉద్యోగాలు చేస్తూనూ, గ్రామ పరిపాలనలో భాగ స్వాములుగా ఉండేవారు. అనేక గ్రంథాల్లో[387] చెప్పిన రీతిగా వారిని గూర్చిన స్థూల పట్టికను ఈ విధంగా పేర్కొనవచ్చును:

| (1) | | (2) |
|---|---|---|
| పురోహితం (శ్రోత్రియం) | | బెస్త |
| పూజాకైంకర్యాలు (దేవరికం) | | తలారికం |
| వైద్యం | | మగ్గరి (నేసేవారు, సాలెవారు) |
| ఉపాధ్యాయ | | గానుక (గాండ్ల) |
| రాజరికం | | మంగలి (క్షురక) |
| వ్యవసాయం | | చాకలి (రజక) |
| పశుపాలనం (పాడి) | | చర్మకార |
| గొల్లవృత్తి (కిలారి) | | బొమ్మలాట |
| వర్తకం (వాణిజ్యం) | | మేదర |
| వ్యాపారం | | డొమ్మర |
| కమ్మర | | వేశ్య |
| కంచరి | | దేవదాసి |
| కుమ్మర | పంచాళంవారు- | అద్దకం (రంగులు, మొ॥) |
| వడ్రంగం | పంచబ్రాహ్మణంవారు | పూలు (మాలాకరణం) |
| కంసల | | ఇంద్రజాలిక |
| శాసె - రాతిపనివారు, గ్రావకారుడు (వడ్డె) | | వేట |
| కరణీకం | | బొమ్మల తయారీ |

| | |
|---|---|
| అగ్రహారీకం | వెట్టి |
| వహి (గణకుడు) | ఈడిగ (కల్లుగీత) |
| వంటపని | స్వర్ణకారుడు |
| త్రవ్వకం (బావులు-చెరువులు-ఇళ్ళుకట్టడం) | విప్రవినోది |
| | మణియగాడు - పారువత్తి లేక గ్రామాధికారి (గుడియధికారి) |
| శిల్పం | |
| చిత్రలేఖనం | |

రాయలసీమ శాసనాల్లో వృత్తుల, అయగాండ్ల వివరాలు అనేకం ఉన్నాయి.

చిత్తూరు జిల్లా శివపురం గ్రామంలోని క్రీ.శ. 1401 వ సం॥కు చెందిన ఒకానొక శాసనంలో[388] మల్లుభట్ట అనేవాడు, మల్లినాథదేవుడికి అతని తల్లి దండ్రుల జ్ఞాపకార్థం దేవరఅంగరంగభోగం నడిచేందుకు కొన్ని గ్రామ్యవత్తుల్ని దానం చేసిన వృత్తాంతం పేర్కొనబడింది.

కడప జిల్లా పుష్పగిరి ప్రాంతంలోని క్రీ.శ. 1182 వ సం॥ నాటి ఒక శాసనంలో[389] కన్నడభాషలో, ధారాపూర్వకంగా సాలె మర్లయ్య అనువాడు సమర్పించిన వృత్తి అని చెప్పబడి ఉంది.

కడప జిల్లా గండికోటదుర్గం కైఫీయతులోని అయగాండ్ల వివరాలు ఇలా ఉన్నాయి:[390] ''పురోహితుడు ఎల్లుచలంభట్టు, కరణం లక్కిరాజు,రెడ్లు బూతూరి రామనాయుడు, కరమల కొండయ్యా, వడ్లఎల్లయ, కుమ్మర గోపాలుడు, మంగలి రాముడు, చాకల ఎల్లుడు, తలారి చెన్నుగాడు, మాదిగె గుర్వడు, అనకల రంగడు, తమ్మల కొండడు, పొలిమేర కాపుదరవేసి ఓబన్న - వీరందరూ వెంబడిరాగా పొలిమేర నిర్ణయం చేసి చుట్టు తిరిగి వచ్చేవరకు నాలుగు అమడ అవుతున్నది అని మనవి చేసిరి. శాలివాహన శకవరుషంబులు 1044 సం॥న క్రీ.శ. 1123 సం॥న గ్రామాన కోట కట్టిరి కనుక గండికోట అయినది'' అని వివరించబడింది.

'కాటమరాజు కథ' అనే కావ్యంలో 'వెట్టి బెఖల్ మాన్పి వెనుకవేసికొని' అన్నమాట ఉటంకింపబడి ఉంది.[391]

''కరణమును నూరి రెడ్డిని
గరిమందగు పారుపత్తెగాని దలారిన్
దళియైన వేళ నీనలు
గురితో........సుఖించున్''392—అనే అంశం పేర్కొనబడింది.

కరణాలు తమ కరణీక వృత్తిలో చూపించే మెలకువలు, ప్రతిభా సామర్థ్యాలు కావ్యాల్లోనే కాకుండా సుమతి శతకంవంటి శతకాల్లోకూడా చమత్కారజనకంగా చోటుచేసుకున్నాయి.

''మాన్యముల తీఋగు విడుపు మడుపు మణినా
కాడుకోల్కాడు బంట్రౌతు కరణములను
నారివెట్టి బసివి గణాదారులచటి
వారి లెక్కలు రాబట్టు వాడొకండు''393

—లెక్కలు రాబట్టేవారి పట్టిక ఇక్కడ యివ్వబడింది. వీరిలో అధికారాల ననుసరించి మణియకాడు - పారుపత్తెగాడు, గ్రామాధికారి, దేవాలయ అధికారి; కోల్కాడు-కోలుకాడు, కావలివాడు, పన్నులు వసూలు చేయువాని బంటు (నియమించెడి అధికారి); బంట్రౌతు-సేవకుడు; కరణము-భూమి, ఇల్లు సంబంధమైన లెక్కలు రాసేవాడు; వెట్టి-గ్రామాధికార్లకు బంటు, రక్షకుడు, గ్రామనౌకరు; బసివి-జారిణి, శివదాసియై వ్యభిచరించు స్త్రీ; గణాచారి - శివమెక్కి గంతులు వేయువాడు.

వీరందరూ గ్రామాల్లో ఆనాడు ప్రజలమధ్య ఉంటూనే తమ తమ వంశపారంపర్య వృత్తులద్వారా జనజీవన స్రవంతిలో కలిసిపోవడం గమనించవలసిన అంశం. వీరి తరతరాల వృత్తులు, ప్రవృత్తుల్ని కూడా తమ అధికార పరిదుల్ని దాటి బయటికి వెళ్ళనీయలేదు అని అనడంలో కూడా అతిశయోక్తి యేమాత్రం లేదు.

పంచాళంవారు అనబడే ఐదు రకాల వృత్తులవారు ఒకటిగా యేర్పడినట్టున్ను, అనంతపురం జిల్లా కనగానపల్లి గ్రామంలోని విజయనగర రాజు అచ్యుతరాయల కాలంనాటి క్రీ.శ. 1533వ సం॥నాటి ఒక శాసనంలో కరవు కాటకాలవల్ల వారు తమ తమ వృత్తిపన్నుల్ని చెల్లించలేక గ్రామాలను వదలి

వెళ్ళినట్లున్ను, ఇది తెలిసిన ఆ ప్రాంతానికి చెందిన ముప్పయిరెండు గ్రామాల రెడ్డి, కరణాలు వారు వదలి వెళ్ళిపోయిన గ్రామాల్లోనే వారికి పునరావాసం కల్పించేందుకు అన్ని పన్నులను మినహాయించినట్లు వివరింపబడి ఉంది.

ఆర్థిక మూలసూత్రంతో బంధింపబడిన ఈ వృత్తులు అనేక విధాలైన అధికారాల కిందపడి నలిగిపోయాయి. విదేశీయుల పాలన, యంత్ర భూతముల కోరల మధ్య స్వదేశీ వృత్తులు, చేతిపనులు మొదలైనవి నశించిపోయాయి. ఇప్పుడిప్పుడే మనం వృత్తి విద్యల అవసరం గమనిస్తున్నాము.

## సూచికలు


1. సర్కార్, డి.సి., ఎపి.ఇం. - 1959.
1(ఎ) గడియారం రామకృష్ణశర్మ సూచన,
2 తె.వి. సర్వస్వము (3 సం॥) - పు. 92-93.
3. తెలుగు అకాడమీ, హైద్రాబాదు, తె.చ.సం. - పు. 17-19.
4. రామారావు, యం., (సం) శాతవాహన సంచిక.
5. అన్యు. రిపోర్ట్ ఆఫ్ ఆర్కి. & మ్యూజి., అం. ప్ర. 1976 - 77.
5(ఎ) రామకృష్ణశర్మ అలంపూరుగారి సూచన.
6. ఎ.పి.ఇం. XX - 19.
7. వెంకటరమణయ్య, నేలటూరి, క.శి.శా. వగయురా, - పు. 8.
8. ఇన్స్. ఆం. V - పు. 50.
9. ఇన్స్. క. I - 129.
10. సౌ. ఇం. ఇన్స్. X - 362.
11. ఇన్స్.క. I - 37.
12. ,, I - 38.
13. తెలుగు అకాడమీ, హైదరాబాదు, తె.చ.సం., పు. 68-69.
14. ఇన్స్.క. I - 2.
15. ,, - 3.

16. ఇన్స్. క. I - 4.
17. ,, - 7.
18. ,, - 10.
19. ,, - 37.
20. ,, - 38.
,, - 43.
20(ఎ) రామకృష్ణశర్మ, ఆలంపూరుగారి సూచన.
21. శారద, కె., మధ్య. తె.ప.పరి., - పు. 20-21.
22. వెంకట రమణయ్య, నేలటూరి, క.శి.శా. వగయిరా, ఉపో. పు. 83 - 85.
23. ఇన్స్. క. I - 45.
24. ,, - 46.
25. ,, - 47.
26. ,, - 50.
27. వెంకటావధాని, దివాకర్ల, ప్రాఙ్న. యు., - పు. 68.
28. ఇన్స్. క. I - 60.
29. ,, - 61.
30. ,, - 63.
31. ,, - 74.
32. సర్కార్, డి.సి., చిత్తూర్ త్రూ ఏజెస్ - పు. 48.
33. సౌ. ఇం. ఇన్స్. 4X - 28.
34. ఇన్స్. క. I - 85.
35. శారద, కె., మధ్య. తె. ప. పరి , - పు 22 - 23.
36. ,, - అదే - - పు. 23.
37. ఇన్స్. క. I - 98.
38. ,, - 99.
39. ,, - 100.
40. ,, - 105
41. సౌ. ఇం. ఇన్స్. X - 62

42. సౌ. ఇం. ఇన్స్. X - 63.
43. ,, - 67.
44. ,, - 186.
45. శాస్త్రి, బి. యన్.. త్రిపు. దే. శాస., - పు. 27.
46. ఇన్స్. క. I - 137.
47. ,, - 135.
48. ,, - 140.
49. సౌ. ఇం. ఇన్స్. X - 241.
50. - 254.
51. ,, - 304.
52. ,, - 328.
53. ,, - 496 & 506.
54. ,, - 551.
55. ,, - 555.
56. ,, - 559.
57. ,, - 574.
58. ,, - 577.
58(a) గ. రా. శర్మ, అలంపూరుగారి సూచన
59. సౌ.ఇం. ఇన్స్. XVI - 1, 2 & 3.
60. ఇన్స్. క. I - 6.
61. సౌ. ఇం. ఇన్స్. X - 4 & 5.
62. - అదే - XVI - 17.
63. ,, - 26.
64. ,, - 28, 29, 31, 33.
65. ,, - 36.
66. ,, - 37.
67. ,, - 38.
68. ,, - 39.
69. ,, - 45.

70. సౌ. ఇం. ఇన్స్. XVI - 46.
71. ,, - 48.
72. ,, - 61.
73. తి.తి.దే. III - 32, 41, & 51 & సౌ. ఇం. ఇన్స్. XVI - 53.
74. సౌ. ఇం. ఇన్స్. XVI - 91.
75. ,, - 92.
76. ,, - 94.
77. ,, - 98.
78. ,, - 127.
79. ,, - 129.
80. ,, - 136.
81. ,, - 152.
82. ,, - 278, 279.
83. ,, - 283, 291.
84. ,, - 299.
85. ,, - 300, 302, 315.
86. వెంకటరమణయ్య, నేలటూరి, క.శి.శా. వగయిరా, - పు. 165 - 66, - ఇన్స్. క. III - 244.
87. సౌ. ఇం. ఇన్స్. XVI - 316 & 319.
88. - అదే - - 330, 332 & 333.
89. శారద, కె. , మధ్య తె. ప. పరి., - పు. 24-26.
90. ,, - అదే - - పు. 26-27.
91. ,, - అదే - - పు. 29.
92. ,, - అదే - - పు. 40-41.
93. ,, - అదే - - పు. 40-41.
94. ,, - అదే - - పు. 41-42.
95. సౌ. ఇం. ఇన్స్. XVI - 104.
96. - అదే - - 126.

97. సౌ. ఇం. ఇన్స్. XVI - 304.
98. మనువు (కుల్లూకభట్ట విరచితం - మనుధర్మశాస్త్రము - అధ్యా. 8. పు. 441 శ్లో॥ 245 - వావిళ్ళ 1928.)
99. ఈశ్వరదత్తు, కుందూరి - శా.శ.కో - పు. XXVI
100. శేషశాస్త్రి, అర్., శాసన పరిచయ, - పు. 43 - 44.
101. ఇన్స్. క. III - 214.
102. సౌ. ఇం. ఇన్స్ XVI - 40
103. ,, - 41.
104. ,, - 78.
105. వెంకటరమణయ్య, నేలటూరి, క.శి.శా. వగయిరా, - పు. 368.
106. ,, ,, పు. 189.
107. ,, ,, పు. 379.
108. ,, ,, పు. 200 - 201.
109. ఈశ్వరదత్తు, కుందూరి, శా.శ.కో., ఉపో, - పు. XIIV - (44)
110. కృష్ణమూర్తి, ముసునూరి, శబ్దార్థ దీపిక, - పు. 240.
111. ఈశ్వరదత్తు, కందూరి, శా.శ.కో., - పు. 165.
112. ,, ,, ఉపో. పు. XIIV - XIVI (44 - 46)
113. సౌ.ఇం.ఇన్. X - 232, 346, 400, 464, 469, 502.
114. నారాయణామాత్యుడు, అయ్యలరాజు - హం.విం. V - పు. 263.
115. కాశీవిశ్వనాథ అయ్యవారి స్థానాపతి - రాయ.వా. - పు. 29.
116. శారద, కె., మధ్య. తె.ప.పరి., - పు. 45 - 46.
117. సౌ.ఇం.ఇన్స్ XVI - 31.
118. గ్రామమందు భాగప్రకారము కలిగిన భూస్వాతంత్ర్యము.
119. దేవుని కిచ్చిన దానాలు, బహుమతులు.
120. వెట్టికి బదులుగా విధింపబడు పన్ను.
121. ఒక విధమైన పన్ను.
122. భూమిపన్ను నుండి మినహాయింపు.
123. సౌ.ఇం.ఇన్స్. XVI - 104.
124. - అదే - - 122.

125. దుర్గరక్షణకై ప్రజలనుంచి వసూలు చేయు పన్ను.
126. భాగధేయము, భూమిపై ప్రతిఫలము (బాడుగ)
127. లెక్కల తనిఖీ.
128. సౌ.ఇం.ఇన్స్. XVI - 136.
129. - అదే - - 150.
130. ఇన్స్.క. II - 224.
131. శారద కె., మధ్య.తె.ప.పరి., - పు. 343.
132. ఇన్స్.క. II - 271.
133. - అదే - - 236.
134. శారద కె., మధ్య.తె.ప.పరి., - పు. 342.
135. వెంకటరమణయ్య, నేలటూరి-క.శి.శా. వగయిరా, - పు. 66 & ఇన్స్. క. III - 52.
136. ఇన్స్.క. III - 215.
137. పంటపై పదవ వంతు పన్ను విధించిన మాన్యం. ఈ నిబంధం మీద ఇచ్చిన ఇనాములకు దశబంధ ఇనాములని పేరు.
138. సౌ.ఇం.ఇన్స్. X - 304.
139 ఇన్స్.క. II - 77.
140. - అదే - - 109.
141. సౌ.ఇం.ఇన్స్. XVI - 79, 103 మొ॥
142. - అదే - - 47.
143. - అదే - - 48.
144. - అదే - - 126.
145. - అదే - - 269.
146. ఇన్స్.క. II - 137.
147. - అదే - - 110.
148. సత్యనారాయణ, కంభంపాటి- ఆం.సం.చ. II—పు. 211
149. వెంకటశాస్త్రి, ముసునూరి- శ.దీపిక, —పు. 1049
150. సీతారామాచార్యులు, బహుజనపల్లి- శబ్ద. రత్నా,
151. ఈశ్వరదత్తు, కుందూరి- శా.శ.కో., - పు. 234.

152. సౌ.ఇం.ఇన్స్. X - 497.
153. - అదే - - 496, 530, 210 మొ॥
154. ఇన్స్.క. III - 97.
155. - అదే - - 265.
156. సౌ.ఇం.ఇన్స్. XVI - 320.
157. - అదే - - 14.
158. . అదే - - 55 & ఇన్స్. క. III - 215, 208, 61 మొ॥
159. ఈశ్వరదత్తు, కుందూరి, శా.శ.కో., - పు. 234, & .
- శారద కె., మధ్య. యు.తె.వ.పరి., -పు. 312.
160. ఈశ్వరదత్తు, కుందూరి, శా.శ.కో., - పు. 6.
161. ,, - అదే - - - పు. 237.
162. ,, - అదే - - (ఉపో) - పు. 60.
163 ,, - అదే - - 306.
164. చిదానందమూర్తి, ఎం., క.శా.సాం.ఆ., పు. 209.
165. ,, - అదే - - పు. 210.
166. ,, - అదే - - పు. 213.
167. ఇన్స్.క. ii - 27.
168. సౌ.ఇం.ఇన్స్. xvi - 42.
169. - అదే - - 132.
170. - అదే - - 85.
171. - అదే - - 138.
172. - అదే - - 283.
173. ఇన్.క. III - 191.
174. ఈశ్వరదత్తు, కుందూరి, శా.శ.కో., - పీఠిక - పు. 59.
175. ,, - అదే - పు. 53 - 54.
176. ,, - అదే - పు. 62.
177. సత్యనారాయణ, కంభంపాటి, అం.సం.చ. II - పు. 63.
178. మహాలింగం, టి.వి., అడ్మినిస్ట్రేషన్ & సోషియల్ లైఫ్ అండర్
విజయనగర్ - పు. 19.

179. ఇన్స్.క. I - 3.
180. - అదే - - 38.
181. సౌ. ఇం. ఇన్స్. XVI - 126.
182. - అదే - - 156, 176, 182, 186, 190, 202 &
- వెంకటరమణయ్య, నేలటూరి, క.శి.శా. వగయిరా, - పు. 52, 53,
- 54 & 56 మొ॥
183. వెంకటరమణయ్య, నేలటూరి, క.శి.శా. వగయిరా, - పు. 52.
184. ,, - అదే - - పు. 54.
185. ఇన్స్. క. II - 63.
186. - అదే - - 228.
187. - అదే - - 241.
188. సౌ.ఇం.ఇన్స్. X - 212.
189. - అదే - XVI - 218.
190. ఇన్.క. II - 251.
191. సౌ.ఇం.ఇన్స్. XVI - 326.
192. - అదే - - 243.
193. సౌ.ఇం.ఇన్స్. - 123.
194. వెంకటరాయశాస్త్రి, వేదం; నన్నెచోడ కుమారసంభవ పీఠిక, - పు. 39.
- (శా.ప. మంజరి I - 46)
195 ఇన్.క. I - 27.
196. సౌ. ఇం. ఇన్స్. X - 633.
197. - అదే - - 312.
198 సౌ. ఇం. ఇన్స్, XVI - 475.
199. ఇన్స్. క. II - 14.
200. వెంకటరమణయ్య, నేలటూరి, క.శి.శా. వగయిరా, - పు. 22, 23, 24
201. ఇన్స్.క. II 54.
202. వెంకటరావు, నిడదవోలు, తెలుగు ఇన్స్క్రిప్షన్స్, - పు. 163 - 65 & -
- సోర్సెస్ ఆఫ్ విజయనగర్ ఎంపైర్ - 81.
203. ఈశ్వరదత్తు, కుందూరి, శా.శ.కో., - పు. 105.

204. వెంకటశాస్త్రి, ముసునూరి, శ. దీ., - పు. 437.
205. లింగాభట్టీయ కృతం, గురుబాల ప్రబోధిక - పు. 217 & 221
206. ఇన్స్. క. II 174.
207. - అదే - - 221.
208. వెంకటరమణయ్య, నేలటూరి, క. శి. శా. వగయిరా, - పు. 261 - 62.
209. నారాయణామాత్యుడు, అయ్యలరాజు, హం. విం. ఆ. II వ. 158.
210 పెద్దన, అల్లసాని, మను. చ. ఆ. I వ. 66.
211. వెంకటశాస్త్రి, ముసునూరి, శ. దీ., - పు. 1323.
212. బ్రౌన్, సి. పి., తె. ఇం. నిఘం., - పు. 1299
213. సౌ. ఇం. ఇన్స్. X - 388.
214. - అదే - XVI - 201.
215. ఇన్స్. క. II - 93.
216. ఈశ్వరదత్తు, కుందూరి, శా. శ. కో., - పు. 17.
217. వెంకటశాస్త్రి, ముసునూరి, శ. దీ., - పు. 77 & 811.
218. చిదానందమూర్తి, ఎం., క. శా. సాం. అ., - పు. 407
219. విజయరాఘవాచార్య, వి , తి. తి. దే శాస. VI. సెక్షన్ III. -పు. 226 - 308.
220. వెంకటశాస్త్రి, ముసునూరి, శ. దీ., - పు. 660.
221. ,, వి. కల్పతరువు, - పు. 182 - 83.
222. చిదానందమూర్తి, ఎం., క.శా.సాం.అ., - పు. 182-83
223. ఈశ్వరదత్తు, కుందూరి, శా.శ కో., - పు. 146 (సౌ.ఇం.ఇన్స్. IV, 702).
224. చిదానందమూర్తి, ఎం., క.శా.సాం.అ., - పు. 183.
225. సౌ.ఇం.ఇన్స్. X - 91
226. - అదే - - 422.
227. విజయరాఘవాచార్య, వి., తి.తి.దే.శా.సం॥ VI 39, పు. 232.
228. ,, - అదే - -పు. 238.
229. ,, - అదే - -పు. 240.

230. విజయరాఘవాచార్య, వి., తి.తి.దే.శా. సం॥ VI 39,-పు. 253-308 మొ॥
231. తె.వి. సర్వస్వము (3 సం॥) - పు. 583.
231(a). రామకృష్ణ శర్మ, గడియారం.
232. నారాయణరావు, చిలుకూరి, మల్లి.పం.చరిత్ర, - పు. 171-73.
- (సోమన, పాల్కురికి)
233. ఇన్స్.క. I - 82. ఎ.
234. - అదే - - 138.
235. - అదే - - పు. 141, సౌ.ఇం.ఇన్స్. X - 26, 210 మొ॥
236. సౌ.ఇం.ఇన్స్. XVI - 46.
237. ఇన్స్.క. I - 1.
238. - అదే - - 121.
239. - అదే - II - 48.
240. తె.వి. సర్వస్వము (3 సం॥) - పు. 560.
241. - అదే - - పు. 563.
242. - అదే - - పు. 563.
242(a). రామకృష్ణ శర్మ, గడియారం
243. ఇన్స్.క. I - 123.
244. సౌ.ఆం.ఆన్స్. XVI - 53, 96, 109, 155; 159 to 310 మొ॥
245. - అదే - - 165, 188, 235, 248, 261.
246. సౌ. ఇం. ఇన్స్. X - 254.
247. ఇన్స్. క. II - 6.
248. ,, - 28, సౌ. ఇం. ఇన్స్. xvi, - 47, &
- క.శి.శా. వగయిరా, - (నే.వెం.ర.) - పు. 712-1
249. తె.వి. సర్వస్వము, (3 సం॥) - పు. 544.
250. ,, - పు. 547.
251. ఇన్స్.క. i - 168.
251(a) గడియారం రామకృష్ణ శర్మగారి సూచన
252. తె.వి. సర్వస్వము పు. 535.
253. ,, పు. 535-536.

254 సౌ ఇం. ఇన్స్. xvi - 16.
255. వెంకటరమణయ్య, నేలటూరి, క.శి.శా. వగయిరా, - పు. 140-41.
256. వెంకటరాయశాస్త్రి, వేదం, నన్నెచోడ కవిత్వము, ఉపో. - పు. 39.
(శాసన. ప. మం., 1-46).
257. ఇన్స్.క. III - 220
258. ,, - 202.
259. సౌ. ఇం. ఇన్స్. x - 593.
260. ఇన్స్. క. III - 87.
261. ,, - 49.
262. సౌ.ఇం.ఇన్స్. x - 345.
263. ,, xvi - 4.
264. ,, - 28.
265. ,, - 89.
266. ఇన్స్.క. II - 112.
267. ,, - 282.
267(a) గడియారం రామకృష్ణ శర్మగారి సూచన.
268. ఇన్స్. క. III - 119, 85.
269. ,, - 137.
270 ,, - 26, 219.
271. ఇన్స్. క. iii - 51.
272. - అదే - - 121.
273. సౌ. ఇం. ఇన్స్. x - 235.
274. ఇన్స్. క. ii - 40.
275 నారాయణామాత్యుడు, అయ్యలరాజు, హం. విం. ఆశ్వా. iii ప. 141.
275(a) రామకృష్ణశర్మ, గడియారం
276. ఇన్స్. క. i - 14.
276. వెంకటరమణయ్య, నేలటూరి, క.శి.శా. వగయిరా, - పు. 241 - 42.
278. సౌ. ఇం. ఇన్స్. x - 371, - అదే - xvi - 1, - అదే - 46.
278. సౌ. ఇం. ఇన్స్. x - 371, - అదే - xvi - 1, - అదే - 46.
279. - అదే - x - 577.

280. వెంకటరమణయ్య, నేలటూరి క. శి. శా. వగయిరా, - పు. 24. - సౌ. ఇం. ఇన్స్. xvi, - 38, 45 మొ॥
281. సౌ. ఇం. ఇన్స్. iv - 801.
282. కాడారంభం - మెట్ట పంటకై చేయు దుక్కి (సేద్యం).
283. అష్టభోగతేజస్వామ్యతలు - విక్రయ, దాన, వినిమయ, జల, తరు, పాషాణ, నిధి, నిక్షేపములు.
284. సౌ. ఇం. ఇన్స్. x - 68.
285. - అదే - 246, 283, 305, 507, 311, 318, 341, 350, 394, మొ॥
286. ,, 63, 241, 258, 370, 451 మొ॥ & ఇన్స్. క. i - 131.
287. ,, 431, 471, 473, & 474.
288. ,, తి.తి.దే.శా. iii, - 32, 41, 51, & సౌ. ఇం. ఇన్స్. xvi. 53, 94, 175, 310 మొ॥
289. సౌ. ఇం. ఇన్స్. xvi - ii.
290. - అదే - x - 503 & నే.వెం.ర; క.శి.శా. వగయిరా, పు. 258 - 59.
291. ,, vxi - 181 మొ॥
292. సత్యనారాయణ, కంభంపాటి, ఆం.సం.చ. ii, - పు 63 & - శారద కె; మధ్య.తె.వ.భా.పరి; - పు. 342.
293. సౌ.ఇం.ఇన్స్. XVI - 156.
294 ఇన్స్.క. ii 238 & 24, సౌ.ఇం.ఇన్స్. xvi, - 190, - అదే - x - 230.
295. స్థిరమైన అస్తులమీద చెల్లించే పన్ను - శారద కె., మధ్య.తె.ప.పరి. - పు. 379.
296. జీవనభృతికి ఇచ్చే ధనం - ,, - అదే -
297. సౌ.ఇం.ఇన్స్. xvi - 245.
298. - అదే - - 300.
299. ఈశ్వరదత్తు, కుందూరి, శా.శ.కో., ఉపో., - పు. 88.
300. చిదానందమూర్తి, ఎం., క.శా.సాం.అ., - పు. 191.
301. సౌ.ఇం.ఇన్స్. xvi - 17.

303. - అదే - - 20.
304. వివిధ రచయితలు (అంచె మత్తు తెరపిన సంస్థె) - మైసూరు - యాజ్ఞ వల్క్యస్మృతి - దివ్యప్రకరణ, - పు. 65-68.
305. ఈశ్వరదత్తు, కుందూరి, శా.శ.కో., - పు. xxiv (పు. 24)
306. అం.మ. తెరపిన సంస్థె, యాజ్ఞవల్క్యస్మృతి, - దివ్య. ప్రక., - పు. 65-68.
307. సత్యనారాయణ, కంభంపాటి, ఆం.స.చ. i - పు. 126-27.
308. ,, - అదే - - పు. 237.
309. చిదానందమూర్తి, ఎం., క.శా.సాం.అ., - పు. 199.
310. వెంకటరమణయ్య, నేలటూరి, క.శి శా. వగయిరా - పు. 201.
311. ,, - అదే - - పు. 365.
312. ,, - అదే - - పు. 575.
313. ,, - అదే - - పు. 573-74.
314. ఇన్స్.క. ii - 13.
315. - అదే - - 51.
316. సౌ.ఇం.ఇన్స్. xvi - 107.
317. - అదే - - 173.
318. నారాయణామాత్యుడు, అయ్యలరాజు, హం. వి. ఆ. V, ప - 14.
319. సౌ. ఇం. ఇన్స్. x - 258.
320. - అదే - - 577; నే. వేం. ర., క. శి. శా. వగయిరా, - పు. 24; - ఇన్స్. క. ii, - 65 మొ॥
321. ........... తి తి. దే. శాస. iii, - 51.
322. సౌ. ఇం. ఇన్స్. xvi - 38.
323. షోడశోపచారములు :- 1) ఆవాహనము, 2) ఆసనము, 3) పాద్యము, 4) అర్ఘ్యము, 5) ఆచమనీయము, 6) స్నానము, 7) వస్త్రము, 8) యజ్ఞోపవీతము, 9) గంధము, 10) పుష్పము, 11) ధూపము 12) దీపము, 13) నైవేద్యము, 14) తాంబూలము, 15) నమస్కారము, 16) ప్రదక్షిణము.

ఇక్కడ నైవేద్యము 13 వ ఉపచారంగా చెప్పబడింది.

324. వెంకటరమణయ్య, నేలటూరి, క. శి. శా. వగయిరా, - పు. 23.
325. సౌ. ఇం. ఇన్స్. vii - 569, - అదే - iv - 800, - అదే - xvi - 50, - ఇన్స్, క. ii - 70 మొ॥
326. సౌ. ఇం. ఇన్స్. x - 5.
327. తిరుబోనం - దేవునికి నైవేద్యము చేయు అన్నము - - ఈశ్వరదత్తు, కుందూరి, శా. శ. కో., - పు. 126.
328. సౌ. ఇం. ఇన్స్. x - 503.
329. మధ్యాహ్న అవసరాలు - మధ్యాహ్న సంధ్యాకాలమున దేవునికి చేయు కైంకర్యములు.
330. సౌ. ఇం. ఇన్స్. xvi - 169.
331. దోశలపడి - బియ్యము, మినపపప్పు కలిపి రుబ్బిన పిండిని పెనముపై కాల్చిన అట్టు.
332 ఇన్స్. క. ii - 255.
333. అకాల పాయసం-భక్ష్య విశేషము- ఈ. దత్తు కుం. శా.శ.కో;- పు. 4.
334. నన్నయభట్టు, శ్రీ ఆం. మ. భారతం. ఆదిపర్వం, అశ్వా. 4, పు. 133, ప. 23.
335. ఈశ్వరదత్తు, కుందూరి, ప్రా. దా. భూ; - పు. 159 -60.
336 తి.తి. దే. శాస. iii; 11, 59, 32, & సౌ. ఇం. ఇన్స్. iv- 382.
337. నరసింహారెడ్డి, వి., ప్రా.కా.తె.నాడు, - పు. 20.
338. రామచంద్రమూర్తి, ఎస్.ఎస్., అం.ప్ర.దే.శా. సమీక్ష, - పు. 58 - 59.
339. సౌ.ఇం.ఇన్. x - 196.
340. ,, - 388.
341. శాస్త్రి, బి.యన్., త్రిపు. దే. శాసనములు, పు. 3 - 4.
342. ,, ,, - పు. 17.
343. ,, ,, - పు. 33.
344. సౌ.ఇం.ఇన్స్. x - 62.
345. ,, - 345.
346. ,, - 577.
347. ,, xvi - 53.

348. సౌ. ఇం. ఇన్స్. XVI - 261.
349. ,, - 310.
350. శాస్త్రి, బి.యన్., త్రిపు.దే.శాసనములు, - పు. 1 - 105.
- ,, ,, - పు. 41 - 177.
351. సత్యనారాయణ, కంభంపాటి, ఆం.సం.చ. ii పు. 222.
352. ,, ,, - పు. 224.
353. సౌ.ఇం.ఇన్స్. x - 429.
354. ఒక నాణె విశేషం - ఈశ్వరదత్తు, కుందూరి, శా.శ.కో., - పు. 59.
355. సౌ.ఇం.ఇన్. x - 473.
356. ,, xvi - 24.
357. ,, - 110.
358. వెంకటరమణయ్య, నేలటూరి, క.శి శా. వగయిరా; - పు. 765 - 79.
359. నారాయణామాత్యుడు అయ్యలరాజు, హం.విం. ii, ప. 205.
360 శ్రీకృష్ణదేవరాయలు, ఆముక్త. - ఆశ్వా. 4, ప. 158.
361. ఆచార్య, ఎన్.ఎల్.ఎన్., కా.శాస., - పు. 49.
362. సత్యనారాయణ, కంభంపాటి, ఆం.సం.చ. i, - పు 191.
363. శ్రీకంఠయ్య, కె., విజయనగర కాలద కన్నడ సాహిత్యదల్లి జనజీవన చరిత్రె, - పు. 330.
364. మూర్తి, ఎ.వి.ఎన్., ఎర్లీ విజయనగర - మొ॥ - పు. 163.
365. చిదానందమూర్తి, ఎం., క.శా.సాం.అ. - పు. 387.
366. వెంకటరమణయ్య, నేలటూరి, క.శి.శా. వగయిరా, - పు 675 - 76.
367. ఈశ్వరదత్తు, కుందూరి, శా.శ.కో., - పు. 264 & 233 - & - ఎపి. ఇం. vii, - 130.
368. వెంకటరమణయ్య, నేలటూరి, క.శి.శా. వగయిరా, - పు. 797.
369. ,, - అదే - - పు. 678.
370. ఈశ్వరదత్తు, కుందూరి, శా.శ.కో., - పు. 117.
371. సత్యనారాయణ, కంభంపాటి, ఆం సం.చ. i, - పు. 130.
371. మహాలింగం, టి.వి. అడ్మినిస్ట్రేషన్ & సోషియల్ లైఫ్ ఆఫ్ విజయనగర్ ఎంపైర్ - పు. 168 - 69.

373. ఆచార్య, ఎన్.ఎల్.ఎన్., కా.శాస., - పు. 46.
374. చిదానందమూర్తి, ఎం., క.శా.సాంఅ., - పు. 393.
375. ,, - అదే - - పు. 393.
376. ఇన్స్.క. i - 12.
377. - అదే - - 43.
378. ఇన్స్. క. ii - 55.
379. ఈశ్వరదత్తు, కుందూరి, శా.శ.కో., ఉపో. -పు. (xxxv) - (75)
380. సౌ.ఇం.ఇన్స్. x - 758.
381. - అదే - - 772.
382. ఈశ్వరదత్తు, కుందూరి, శా.శ.కో., ఉపో. -పు. lxxxv - (75)
383. లింగాశట్టీయ - గురు.ప్ర. - పు. 759.
384. వేదవ్యాస మహర్షి - భగవద్గీత, జ్ఞాన. అధ్యా. iv శ్లో. 13.
385. విశ్వనాథరెడ్డి, కేతు (సం.) - తెలుగు చరిత్ర - సంస్కృతి - పు. 133.
386. శారద కె., మధ్య.తె.ప.వరి., - పు. 135.
387. ,, -అదే- & శ్రీకంఠయ్య, కె., విజ.కా.సా.జ.జీ. చరిత్ర, పు. 326.
388. సౌ.ఇం.ఇన్స్. xvi - 11.
389. వెంకటరమణయ్య, నేలటూరి, క.శి.శా. వగయిరా, - పు. 483.
390. - ,, - అదే - - పు. 2-4.
391. సీతాకళ్యాణి, వి., తె.చారి.కావ్యాలు, - పు. 389.
392. నారాయణామాత్యుడు, అయ్యలరాజు, హం.విం. ఆ. iv, ప. 79.
393. ,, - అదే - ఆ. iv, ప. 84.
394. సౌ.ఇం.ఇన్స్. xvi - 106.

# రాయలసీమ శాసనాలలోని భాష – ఇతర లలిత కళలు

శాసనాలు చాలవరకు ప్రాచీన కాలపు దాఖలాలు (రికార్డులు) మాత్రమే! నాటి శాసనాలను బట్టే, ఆనాటివారి భాషాస్థాయిని నిర్ణయించడం యేమంత సమంజసం కాదు. భాషా దృష్టితో ఆనాడు శాసనాలు వేయించలేదు. ప్రజలందరూ సమకాలీన విషయాన్ని అర్థం చేసుకోవాలనే దృష్టితోనే శాసనాలు వేయించినారు. క్రీస్తు శక ప్రారంభకాలాల్లో కేవలం ప్రాకృత, సంస్కృత భాషల్లో శాసనాలు దొరికాయి. కర్నూలు జిల్లాలోని జొన్నగిరి (ఎఱ్ఱగుడి) ప్రాంతంలోని అశోకుని శాసనాలు - ఆంధ్రదేశంలో బ్రాహ్మీలిపిలో రాయబడిన ప్రాకృత భాషా శాసనాలు - మొదటి శాసనాలుగా చెప్పబడినాయి.

"శాసనములలో గానవచ్చిన మొట్టమొదటి తెలుగుపదము 'నాగబు'. ఇది అమరావతి స్తూప శాసనములలో కానవచ్చినది. అందువలన ఏ మూడవ, నాలుగవ శతాబ్దినాటిదో కావచ్చును. శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు దీనిని భారతిలో ప్రకటించినారు. మహానాగ ప్రతిమ క్రింద ఈ శాసనమును జెక్కియుందురని వారన్నారు. కావచ్చును. ఇప్పుడా నాగ ప్రతిమ శిథిలమగుటచేతనో త్రవ్వినపుడు పగిలిపోవుటచేతనో ఈ 'నాగబు' శాసన మొక్కటియే మనకు దక్కినది. 'నాగబు' అనగా నాగంబు - నాగము అన్నమాట. ఈ శాసనము ననుసరించి క్రీస్తుశకము మూడవ శతాబ్దినాటికే తెలుగునకు ఒక రూపమేర్పడెనని యూహింపవచ్చును."1

నన్నయకు పూర్వపు శాసనాలను స్థూలంగా రెండు విభాగాలుగా చేయవచ్చు. మొదటి భాగం క్రీస్తు శకారంభం నుండి నాలుగవ శతాబ్దం వరకు, రెండవ భాగం ఐదవ దశాబ్ది నుండి పదకొండవ శతాబ్దం వరకు. ఈ కాలమంతా చాలా భాగం ప్రాకృత, సంస్కృత భాషల్లోనే శాసనాలు వెలువడినాయి. ఆంధ్రదేశంలో తమిళం, కన్నడంవంటి భాషల్లో అక్కడక్కడ కొన్ని శాసనాలు

కన్పించినా, వీటిపై కూడా సంస్కృతభాషా ప్రభావం కొట్టొచ్చినట్టు కన్పిస్తూంది. 11 వ శతాబ్ది తర్వాత మిశ్రిత భాషాశాసనాలు కన్పింపసాగినాయి. వీటిలోనూ మతపరమైన శాసనాలే అధికం. నన్నయకు కొంచెం ముందు భాషాస్థితిని తెల్పే పద్యమయ శాసనాలు కన్పించినా వాటిలోని సారస్వతపుష్టి అంత ఉత్తేజకరంగా కన్పించదు ఎందుకంటే, అవి కేవలం విషయ దృష్టితో మాత్రం రాయబడినవే!

"ఏడవ శతాబ్దము నుండియు తెలుగు రాజపోషణ కలిగి సంస్కృత శబ్దములను జేర్చుకొని క్రమవికాసమును పొంది 11 వ శతాబ్దము నాటికి ఈ రాజవంశంలో (చాళుక్య) 27 వ పురుషుడయిన రాజనరేంద్రుని యాస్థానమున, మొట్టమొదటి గ్రంథముగా ఆంధ్ర మహాభారత రూపమున వెలసినది. కావున తెనుగునాట తెలుగును వెలయించినవారు చాళుక్యనృపతులు."[2]

ప్రాఙ్నన్నయ్య కాలంలో ప్రాకృత, సంస్కృత భాషల్లో అధికంగా శాసనాలు వెలువడ్డాయి. ఇవి అధికార భాషలుగా ఆనాడు ఉండటంవల్లనేమో, తెలుగు కేవలం అట్టడుగు భాషగా, ఉపభాషగా ఉన్నట్లు తెలుస్తూంది. అందువల్లనే తెలుగు భాషా శాసనాలు అతితక్కువగాను, తక్కువస్థాయిలోను ఉంటూ వచ్చినాయి. రాజాదరణ సంస్కృతానికి ఇచ్చినంతనా తెలుగు భాషకు ఇవ్వక పోయినందువల్లనేమో పండిత కవుల్లో చాలామంది సంస్కృత భాషనే వరించారు. సంస్కృతం దేవభాష అనీ, లిపి నాగరి లిపి అనీ, వేదాలు, శాస్త్రాలు సంస్కృత భాషలో ఉండటంవల్ల ఈ భాషకు ఇచ్చినంత గౌరవం ఇతర భాషలకు ఇవ్వలేదు. ఈ పరిస్థితిలో తెలుగు భాష ఆనాడు ఆశించినంత అభివృద్ధి సాధించలేదు అని దృఢంగా చెప్పవచ్చు.

కన్నడంలో పంప మహాకవికి పూర్వం కొందరు మహాకవులు ఉత్తమమైన చంపూ కావ్యాలు రచించినారని కవిరాజమార్గం ద్వారా తెలుస్తూంది. వాటి ననుసరించి తెలుగు శాసన కావ్యకర్తలు తమ శాసనాల్లో గద్యపద్య మిశ్రమమైన రచన చేసి ఉండవచ్చు. కన్నడ భాషలో వెలువడిన ఈ చంపూ కావ్యాలను అనుసరించి శాసనాల్లోనూ, ఆటు తర్వాత ఆదికవి నన్నయ తన ఆంధ్రమహాభారతంలో ప్రవేశపుట్టి ఉండవచ్చు. నన్నయ తన భారతం ద్వారా తెలుగు భాషకు వేసిన పునాది భవిష్యత్ భాషా భవన నిర్మాణానికి తగిన దోహదం చేసింది

అందువల్లనే తర్వాతి పాలకులైన కాకతీయుల తెలుగు శాసనాలు చాలా భాగం పద్యగద్యాల్లో కన్పిస్తాయి. ప్రజల భాషగా తెలుగు ప్రాచుర్యం పొందినప్పటికీ పాలకుల్లో, పాలితుల్లో పండితులు, అధికారులు సంస్కృతాన్నే ఆదరించారు. శాసన విషయమంతా తెలుగులో ఉండడం, ఒకటి రెండు వాక్యాలు కన్నడం లోను, ప్రార్థనాది విషయాలు సంస్కృతంలోను, ఫలశ్రుతులు (శాపాశయాలు) కూడా సంస్కృతంలోనే ఉండటం గమనించదగిన విశేషం. ఇవిగాక బిరుదులు, ప్రశస్తులు సుదీర్ఘ సంస్కృత సమాసాలుగా ఉపమాన ఉపమేయాదులతో శ్లేష లతో రూపకాలతో అలంకారికంగా వర్ణింపబడటం కూడా పరిశీలనకు గ్రహించ వలసిన ప్రధానాంశం.

## సాహిత్యం - ఇతర లలితకళలు :

రాయలసీమ ప్రాంతాన్ని పాలించిన రాజుల ఆస్థానాల్లో అనేకులతోపాటు కవి, గమకి, వాది, వాగ్మి, నట, విట, గాయకాది కళాకారులుండేవారని శాసనాల ద్వారా తెలుస్తూంది.

కొందరు పాలకులు స్వయంగా కవులు, పండితులుగా రాణించారు. ఇతర కళల్లో కూడా ఆరితేరి, ప్రజలకు కూడ ఇటువంటి సంస్కారాన్నే కల్గించారు. రాయలసీమ ప్రాంతాన్ని పాలించిన రాజవంశాల్లో ప్రధానంగా కాకతీయులు, రెడ్లు, విజయనగర రాజుల కాలంలో సాహిత్యం, కళలపట్ల జనాదరణ పెరి గింది. హితముతో కూడుకున్నది సాహిత్యమనీ, ఆనందాన్నీ, ఐహిక, ఆముష్మిక ఫలాన్ని కల్గించేవి కళలనీ ఆనాటివారు త్రికరణశుద్ధిగా నమ్మినారు. స్వర్ణ యుగాలను చవి చూచినారు.

ఈ సందర్భంలో ఇక్కడ కొన్ని మాటలను చెప్పడం అవసరం.

"ప్రభువులు స్వయముగా విద్వత్కవులై గ్రంథ రచనము చేసినారు. విద్వత్పుంగవుల కర్థ గౌరవము నిచ్చి వాఙ్మయ సృష్టికి వసతులు కల్పించి నారు. కవికిని ప్రభువునకును గల సంబంధమును గూర్చి కల్హణ కవి యీ క్రింది విధముగా ప్రస్తావించియున్నాడు:

'భుజవన తరుచ్ఛాయాం యేషాం నిషేవ్య మహౌజసాం
జలధిరశనా మేదిన్యా సీదసావ కుతోభయా
స్మృతి మపి నతేయాంతి క్ష్మాయాః వినాయ దనుగ్రహం
ప్రకృతి మహతే కుర్మ స్తస్మైనమః కవికర్మణే' - (రాజతరంగిణి)

''దేని యనుగ్రము లేక సకలభూతలమేలిన చక్రవర్తులు గూడ స్మరణకు రాజాలరో యట్టి కవిత్వమునకు నమస్కరించుచున్నాను. నీ దయలేని కారణ మున సర్వైశ్వర్యంబు లనుభవించిన పెక్కండ్రు రాజులు లోకమునకు తెలియ కుండ బోయినారు ''3

రాజులను, రాజవంశాలను, ఘటనాఘటనలను కేవలం చరిత్రవల్ల తెలుసు కోవచ్చు. కానీ రాజుల ప్రశస్తి, గుణగణాదులు, వ్యక్తిత్వ విశేషాలు, ఆత్మీ యతలు కేవలం కవులవల్ల, తర్వాతి పండిత విమర్శకులవల్ల మాత్రమే తెలియగలము. కానీ అప్పటి ప్రజల జీవనవిధానం, సామాజిక స్థితిగతులు కేవలం శాసనాల వల్లనే సాధ్యమవుతుంది.

పూర్వకాలంలో శాసనాలను రచించడంలోకానీ, శాసనాలకు భాషాస్వరూ పాన్ని యేర్పరచడంలో కానీ, సంస్కృతీబద్ధాలైన సాంప్రదాయాలను, విశేషా లను కూర్చడంలో మంగళప్రదమైన మాటలను, చిహ్నాలను చేర్చడంలో ఆద్యంతం కవి ప్రతిభా సామర్థ్యాలు శాసనాల్లో వ్యక్తీకరింపబడినాయి. ఇట్లని, శాసనాలు రచించడం అన్నది కవిత్వ ప్రతిభలను ప్రదర్శించడం యెంత మాత్రమూ కాదు. ఇందులోని విషయాన్ని రాజుకే కాకుండా, పదిమంది ప్రజలకు తెలియజేయడమే దీని ప్రధాన ఉద్దేశ్యం. అయితే, ప్రాఙ్నన్నయ కాలంనుండి కవితా ప్రతిభలు కొట్టవచ్చినట్లుండే శాసనాలు కొన్నికొన్ని కన్పిస్తున్నాయి. ఇందుకు కారణం ప్రధానంగా ఆనాటి ప్రాకృత, సంస్కృత భాషా కావ్యాల ప్రభావమే అని చెప్పక తప్పదు. అందుకనే చాలా శాసనాల్లో మొదట చివర సంస్కృత-సంస్కృతీబద్ధమైన వాక్యసరళి గోచరిస్తుంది. సంస్కృత ఛందస్సుల ప్రభావం తెలుగు, కన్నడ భాషలపై అమితంగా చూపినాయి. వీటి కారణంగా ఆయా కవులు రాణించారు. మొదట సంస్కృతం అభ్యసించడం ద్వారా ఇతర దేశీయ భాషలను నేర్చుకోవడం. వీటి ఆధారంతో వీరు బహుభాషావేత్తలు

కావడానికి, బహు సంస్కృతుల సజీవ కేతనాలుగా రూపుదిద్దుకోవడానికి ఆస్కారం కల్గింది. ఈ విధానం ప్రాఙ్నన్నయ యుగంలోనే ప్రారంభమైందని చెప్పవచ్చు. రాజులు, రాజాశ్రితులైన అధికారులు- వీరివల్ల ప్రజలు; ఆయా కాలాల్లో మతాచార్యులవల్ల యేర్పడిన సిద్ధాంతాల ప్రభావంతో, కవులు ఆయా రచనలను చేయుడానికి దోహదం కల్గింది. ఒక్కొక్కసారి ఈ సిద్ధాంతాలు ఉద్యమాలకు కూడా ఊపిర్లు పోసినాయి అని చెప్పడం కూడా యెంత మాత్రం సాహసం కాదు.

ప్రాచీన శాసనాల్లో ఉటంకింపబడిన శాసన కవులను గూర్చి పరిశీలిస్తే, కడప జిల్లా చదిపిరాళ్ళ గ్రామంలోని క్రీ శ. 9-10 శతాబ్దుల నడిమికాలంలోని ఒక శాసనంలో[4] ఉత్పలమాల ఛందస్సులో 'అర్థమశాశ్వతమ్ము, ఒడలన్నది తక్షణ భంగురమ్ము'....అనే పద్యంతోపాటు ఇంకొక అసంపూర్తి పద్యం ఉంది. కవి పేరు తెలీదు. ఈ శాసనంలో అగస్త్యమునిచే నిర్మింపబడిన దేవాలయం శిథిలమై ఉండగా, దాన్ని అమ్మనపెగ్గడ అనే వ్యక్తి, 'చెడినదాని నెత్తిని సొచదీర్చి యుక్తిమబయ్యొబ్బ' (చెడినదాన్ని సరిచేసి, పైకప్పువేసి యుక్తమైన రీతి ఒప్పునట్లుగ) పునరుద్ధరించినట్లు పేర్కొనబడింది. అదే దేవాలయానికి బాసె భూపయ అనే వ్యక్తి పది మత్తరుల మడిని దానంగా యిచ్చి, ఒక నూతిని నిర్మించిన విషయం గద్యంలో శాసన శిలకు ఒకవైపున చెక్కబడి ఉండగా, మరొకవైపున దేవాలయ జీర్ణోద్ధారం చేసిన అమ్మన పెగ్గడను గురించిన ఒక ప్రశస్తి పద్యం కూడ ఉంది. అది—

'అర్థమ శాశ్వతమ్ము యొడలన్నది తక్షణ భంగురమ్ము త
త్వార్థము గాదు జీవనము క్రితాన్తక మారకమిట్టి దీనిని
రత్తి గుఱించి నమ్మక పరార్థము నెన్నణ్డు జేటులేని ధ
ర్మార్థమ చేయుణ్డి మనుజులమ్మెన పెగ్గడయట్లు వేర్మిలోన్ '

—ధనము అశాశ్వతమైనది. శరీరము నశ్వరమైనది. జీవము తత్వార్థము కాదు. యమునిచేత దండనార్హమైనట్టి దీనిని రక్తినిగూర్చి నమ్మక పరార్థానికై, శాశ్వతమైన ధర్మార్థాన్ని మనుషులంతా అమ్మన పెగ్గడ మాదిరి గొప్పగా చేయండి. ఇదీ దీని భావార్థం.

ఇంకొక పద్యం కూడా ఉంది కానీ, అందులో చాలా భాగం శిథిలమై పోయింది అస్పష్టంగా ఉంది. జీవిత ధర్మాన్ని స్పష్టంగా చెప్పే ఇలాంటి శాసనాలు చాలా అరుదు. సాహిత్యరీత్యా కూడా ఈ శాసనం చాలా గమనార్హ మైంది.

తూర్పు చాళుక్యుల శాసనాల్లో మహాకాయస్థులు, సంధి విగ్రహి లేక భట్ట బ్రాహ్మణులు శాసన రచనలు చేసినట్లు ఆధారాలున్నాయి. రాజుల కొలువుల్లో ఉండే ప్రసిద్ధ కవులు కూడా ఈ శాసన రచనలో తోడ్పడిన సందర్భాలు ఉన్నాయి.

"పూర్వచాళుక్యుల యాస్థాన కవులెందరో బ్రాహ్మణులు. రాజులొసగిన శాసనము లెన్నియో వారు లిఖించినవే. భట్టదేవుడు (భట్టగుండుడు), మాధవ భట్టు, పోతనభట్టులు తామ్రశాసనములు వ్రాయుటలో నిపుణులు. రెండవ అమ్మ యను రాజేంద్రుడు (క్రీ.శ. 945-970) ఇచ్చిన దానశాసనము నయ్యన్నభట్టు రచించెను."[5]

శాసనాన్ని శిలమీద, తామ్రఫలకం మీద చెక్కేవాడు ప్రత్యేకంగా ఉండే వాడని తెలుస్తూంది. వీరిని మామూలుగా కమ్మరి, కంచరి, ఆచారి, అక్కసాలి, విశ్వకర్మ, వర్ధకి అని పిలిచేవారు. వీరు వృత్తిరీత్యా చేస్తూ ఉండిన పనులకు ప్రతిఫలంగా మాన్యమో, రాజపోషణో లభించేది.

శాసనాన్ని రచించేవాడు ఒకడైతే, శిల్పించేవాడు ఇంకొకడు. రచన, శిల్పం రెండూ కల్గి వుండేవారు బహు తక్కువ. వీరిని దుర్చిన వివరాలు శాసన శిల్పి/కవి అన్న ప్రకరణంలో ప్రస్తావించబడ్డాయి.

మహాభారత కావ్యరచయిత, ఆదికవి నన్నయ రాజరాజుకు సంబంధించిన నందంపూడి, మంద శాసనాలను రచించినట్లు కొందరు చెవుతున్నారు. రెడ్డివంశ రాజుల పాలనలో మహాకవి శ్రీనాథుడు అనేక శాసనాలను రచించినట్లుగా తెలుస్తూంది. కాకతీయ వంశరాజులకు చెందిన కర్నూలు (ప్రస్తుతం ప్రకాశం) జిల్లా త్రిపురాంతకానికి చెందిన క్రీ.శ. 1212 వ సం॥ ఒక శాసనంలో కవి.... గ....వాది, వాగ్ని బుధ బధిర అంధక భట నట శిష్ట నిఖిల యాచకజన చింతా

మణి, పరాక్రమ చూడామణి అని ఉంది. గమకి అంటే మంచి లయ్యతో గమక ములో (రాగయుక్తంగా, పదభావాన్ని తెలిసి) పఠించేవాడు అని అర్థం. స్పష్ట వర్ణోచ్చారణ, శ్రావ్యత, ఔచిత్యం మొ॥ గుణాలు గమకికి తప్పనిసరిగా ఉండాలి. దీన్ని గూర్చి యింకా వివరంగా ఇదే ప్రకరణం తరువాతి భాగంలో వివరించ బడుతుంది.

కడప జిల్లా తాళ్ళ పొద్దుటూరు గ్రామంలో క్రీ.శ. 1323 వ సం॥కు చెందిన ఒక శాసనంలో చోళ ప్రశస్తితోపాటు కొన్ని పద్యాలు ఉన్నాయి. ఇవి ఉత్పలమాల, చంపకమాల, సీస పద్యాలుగా ఉన్నాయి. కవి పేరు లేదుకానీ, జగతాపి గంగని పరాక్రమం దీనిలో హృదయంగమంగా వర్ణించబడింది.[7]

పద్యకవులే కాకుండా, ప్రాచీన సంస్కృత శ్లోకాలను ఉటంకిస్తూ శాస నాలను రచించిన గద్యకవులూ ఉన్నారు. వీరిని గూర్చిన వివరణ శాసన కవుల విభాగంలో చేర్చబడింది.

రాయలసీమలోని అనేకమంది కవులు సామాన్యంగా రాజాస్థానాల్లో సత్కరింపబడేవారు 'నిరాశ్రయా న శోభంతే పండితా, వనితా, లతా' అన్న సూక్తి అనాదే పుట్టింది. రాజులను ఆశ్రయించి కవులు భుక్తినీ, భద్రతను; కవులను ఆలంబనంగా చేసుకొని రాజులు కీర్తినీ పొందటంలో యేమాత్రం మొగ మాటం చూపించలేదు. అయితే, పోతన వంటి కొందరు స్వతంత్ర కవులు మాత్రం భక్తి సామ్రాజ్యాన్నే వరించారు; రాజాశ్రయాన్ని తిరస్కరించారు.

కడప జిల్లా కోకటం గ్రామంలోని క్రీ.శ. 1518 సం॥పు ఒక శాసనంలో[8] శ్రీకృష్ణదేవరాయలు కోకటం అనే గ్రామాన్ని, ఇంకా అనేక అగ్రహారాలను పెద్దనకు ఇచ్చినట్లు పేర్కొనబడింది. 'ఎదురైనచో తన మదకరీంద్రముడిగ్గి.... కోకట గ్రామాద్యనేకకాగ్రహారము లడిగిన సీమల యందు నిచ్చె' అని కృష్ణ రాయలవారి వదాన్యతను గూర్చి పెద్దన కవే చెప్పినాడు.[9]

కడప జిల్లా తిప్పలూరు గ్రామంలోని క్రీ. శ. 1527 సం॥పు ఒక శాస నంలో[10] శ్రీ వీరప్రతాప శ్రీకృష్ణదేవరాయలవారు అష్టదిగ్గజ కవీశ్వరులకు ధార వోసి యిచ్చిన తిప్పలూరు అగ్రహారానకు అని చెప్పబడి ఉంది. పెద్దనగారు

కాక, ముక్కుతిమ్మన, అయ్యలరాజు రామభద్రుడు, ధూర్జటి, భట్టుమూర్తి, పింగళి సూరన, తెనాలి రామకృష్ణుడు, మాదయ్యగారి మల్లన అనే ఈ ఎనిమిది మంది అష్టదిగ్గజ కవీశ్వరులు. పారంపరిక గాథల్లో వీరున్నట్లు చెప్పబడినా చారిత్రకంగా వీరి కాలాలను గూర్చి భిన్నమైన అభిప్రాయాలున్నాయి.

'కాశీనాథ విశ్వనాథనాయనయ్యవారి స్థానాపతి రచించిన వచన కావ్యం రాయవాచకం. శ్రీకృష్ణరాయల పట్టాభిషేకాన్ని, దైనందిన జీవితాన్ని, విజయాలను వివరంగా వర్ణించే చారిత్రక గ్రంథం ఇది. ఈ గ్రంథం రాయలవారి జీవిత కాలంలో గాకుండా క్రి.శ. 1590-1602 సం॥ల మధ్య రచించబడిందని సి. వి. రామచంద్రరావుగారు తేల్చి చెప్పినారు.'[11]

'మట్ల అనంతరాజు 'కకుత్స్థ విజయం' అనే కావ్యాన్ని రచించినాడు. ఈ రాజకవి 1586-1614 ల మధ్య వెంకటపతిరాయల సేనానిగా ఉండి మహత్తర విజయాలను సాధించినాడు. 1606 నాటికి వెంకటపతిరాయలను సకల హిందూ సార్వభౌముణ్ణిచేసి తాను మహామండలేశ్వరుడై సిద్ధవటం సీమను పాలించాడు.'[12]

ఇదే ప్రకరణంలోని 6 వ సూచికలో ఉటంకించినట్లు కవి, గమకి అన్న పదాల వివరణ, అనంతపురం జిల్లా తాడిపత్రి తాలూకా బొందలదిన్నె గ్రామం పొలిమేరలో పుట్టుబండకు రాసియుండే రెండు పద్యాలు తెలుగు సాహిత్య దృష్టిలో చాలా ముఖ్యమైనవిగా యెన్నదగినవి. పద్యాల చివరల్లో తన్ను బెణక కవిగా చెప్పుకున్నాడు. ఈ కవి కాలం క్రి.శ. 1678 అని, ప్రకటింపబడిన శాసనం ద్వారా తెలుస్తోంది. పూర్వ ప్రకటితాలైన శాసన చరిత్రల్లో ఇతన్ని గూర్చిన ప్రసక్తి యెక్కడా కన్పించదు. ఇతని పూర్తిపేరు భీమరాజుగారి బెణకయ్యగా ఈ శాసనంలో చెప్పబడింది. ఈ రెండు పద్యాలూ ఇవి-

'శ్రీ నరసింహదేవుని విశేష కృపన్ రచియించ నేర్తునో
మానవనాథులార నను మక్కువ జేయుచు ఆదరించుడీ
మానిత వెన్ని నామ కుల మాన్యుడ భీమయ మంత్రి పుత్రుడన్
మానిత శంకరాంబ సుకుమారుడనే బెణకాఖ్య సత్కవిన్.

రాగగరిమలెరిగి రహిమీర పదములు
పాడనేర్తు ద్విపద పద్యపణతి
తెలిసి చదువనేర్తు ధీమంతు లౌనన
పేర్మి భీమయార్య బెణక కవిని'

పై మొదటి పద్యంవల్ల యీ బెణకయ్య తండ్రిపేరు భీమయ మంత్రి అనీ, తల్లి శంకరాంబ అనీ, 'వెన్ని' అనే వంశంలో యితడు పుట్టినాడనీ, నరసింహస్వామిని గురించిన కృతిని ఇతడు రచించి ఉండవచ్చుననీ తెలుస్తూంది.

రెండవ పద్యం ఇపుడు తెలుగు సాహిత్య క్షేత్రంలో అపురూపమైన గమక కళను అనగా కావ్య పఠన కళను గూర్చి తెలుపుతూంది. కేవల కావ్య రచనవల్ల సార్థకం చేకూరదనీ, సహృదయ హృదయంగమంగా పఠింపబడితే తప్ప అది పరిపూర్తికాదని కవి చెప్పినాడు. తాను ధీమంతులు మెచ్చుకొనునట్లు రాగ తాళములను తెలిసి మధురంగా పాడనేర్తుననీ, ద్విపద ఛందస్సులో కావ్య పద్ధతి తెలిసి చదువగలనని చెప్పుకొన్నాడు. ఈ అంశాన్నిబట్టి ఆంధ్రదేశంలో గమక కళ అనేది ప్రాచుర్యంలో ఉండిన ఒకానొక గొప్ప విద్య అని తెలుస్తూంది. ఈ గమక కళను గూర్చి ఇదివరలో కొందరు బాగా పరిశీలించి చెప్పినట్లు తెలుస్తూంది.

"శ్రీ కాళూరి హనుమంతరావుగారు 1989వ సం॥ జూన్‌నెల భారతి పత్రికలో 'కొన్ని శబ్దార్థాలు' అనే శీర్షికతో రాసిన వ్యాసంలో (పు - 12) గమకి (న్) గూర్చి రాస్తూ - 'గమకి అనగా మంచి శయ్యలో గమకముగా పద్యము చదువువాడు.' 'కవి గమకి వాగ్మి గాయక నట చింతామణి' (కుమార సంభవం నన్నెచోడ - 3, 112). కన్నడంలో కూడ ఈ పదం ప్రయుక్తమై ఉంది. తెలుగు కన్నడములు రెండింటిలోనూ 'కవి, గమకి, వాగ్మి' అన్న సమాహారము నందే కానవస్తున్నది. (నే.వేం. రమణయ్య వ్యాఖ్య). (ఇంకా హర. విలా. 1, 78). గమకము కలవాడు అన్న వ్యుత్పత్తినిబట్టి ఈ శబ్దం నకారాంతం కావచ్చును. సంస్కృత గ్రంథాలలో ప్రయోగం మృగ్యం" అన్నారు.

కానీ, వీరు గమకి అంటే ఎవరు, గమక కళ అంటే ఏమిటి అని మాత్రం రాయలేదు.

సుప్రసిద్ధ కన్నడ ఆచార్యులైన డా॥ చిదానందమూర్తిగారు ఈ గమక కళను గూర్చిన వివరాలకై శ్రీమాన్ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ గారిని ఒకసారి సంప్రదించారని, తామే రాసిన 'ప్రాచీన కర్నాటకదల్లి గమక-గమకికళు'

పరిశోధనా వ్యాసంలో తెలిపినారు. ఆ వివరాలను మన తెలుగులో ఈ విధంగా అనువదించుకోవచ్చు.

"తెలుగులో గమకము ప్రత్యేక కళగా వృద్ధి పొందలేదని, గమకి, వాగ్మి అనే ఉక్తి తెలుగున ఉన్నప్పటికి నన్నెచోడకవి తన కావ్యంలో కన్నడ కావ్యాల నుండి స్వీకరించినట్లు తెలుస్తూంది. కన్నడం లోని ఈ పారిభాషిక పదానికి ఉండే అర్థం సంస్కృతంలోకానీ, తమిళంలో కానీ లేదని తెలియవస్తూంది."14

పై శాసన నేపథ్యంలో శ్రీ రాళ్ళపల్లివారి అభిప్రాయం యెంతవరకు సమంజసం అన్నది విమర్శకులు ఆలోచించవలసిన అంశం. కావ్యాలను చదివించుకొని వినడం అన్నది రాజుల ఆస్థానంలోనేకాక, నిరక్షరాస్యులైన పల్లె ప్రజలలోకూడ ఉంది.

బెణకయ్య పేర్కొన్నట్లు, కవి కేవలం తన కావ్యరచన మాత్రమేకాక, కావ్యపఠన కళానైపుణ్యాన్ని గూర్చి చెప్పుకొనడం చాలా అరుదు.

బహుశః వాచిక కళ ఏమంత కొత్త విషయం కాదని యెవరైనా అనుకోవచ్చు. మహబూబ్‌నగర్ జిల్లా వర్ధమానపురం గ్రామంలోని క్రీ.శ. 13 వ శతాబ్దానికి చెందిన కాకతి గణపతి చక్రవర్తి సామంతుడు మల్యాల గుండయ్య వేయించిన సంస్కృత తెలుగు శాసనాల్లో తెలుగు గద్యంలో గుండయ్య సభను వర్ణిస్తూ ఆ సభలో కవి, గమకి, వాది, వాగ్మి మొదలైనవారు ఉండిరని పేర్కొన్నారు.

నన్నయగారి అవతారికా పద్యాల్లోని 'విమలమతిం బురాణములు వింటి.... భక్తితోన్-'15 భారత శ్రవణాసక్తి, వినంగనది యిష్టము, పురాణములు వింటి అనే ప్రయోగాల వల్ల - కావ్యాలు ఒకనిచేత చదువబడితే అనేకులు విని ఆనందించేవారనీ తెలుస్తూంది.

ప్రాఙ్నన్నయ కాలంనాటి శాసనాలు కేవలం విషయ ప్రాధాన్యతగలవే అధికంగా ఉన్నాయి. ప్రసిద్ధ సంస్కృతకవుల కావ్యాల్లోని శ్లోకాలను ప్రార్థనా శ్లోకాలుగాను. ఇతర శ్లోకాలుగాను ఉటంకించారు. శాపాశయాలను కూడా

సంస్కృత భాషాపరంగానే ప్రయోగించారు. దీనివల్ల ఆనాటి అధికార భాషా ప్రాచుర్యం యేవిధంగా శాసనస్థమైందీ తెలుస్తూంది.

నన్నయ తర్వాతికాలంలోని శాసనాల్లో తత్సమపదాలూ, అచ్చ తెలుగు పదాలు, ఆనాటి వ్యావహారిక భాషావిధానమూ ఆద్యంతం స్పష్టంగా కనిపిస్తున్నాయి గతప్రకరణాలలో చెప్పినట్లు కవిత్వ ప్రతిభను, భాషాప్రాగల్భ్యాన్ని ప్రదర్శించడానికి మాత్రం శాసనాలు రచించబడలేదు. శాసనాలు కేవలం ప్రామాణిక ధృవపత్రాలు, రికార్డులుగా, పారమార్థిక దృష్టితో మాత్రమే లిఖించబడినవి కానీ, ఇతర స్వార్థపూరిత ఉద్దేశ్యం లేదని చెప్పవచ్చు.

## సంగీతము :

లలితకళల్లో సంగీతానికి విశిష్టమైన స్థానం ఉంది. రాజాస్థానాలు, దేవాలయాలు, భోగపుసానుల గృహాలు సంగీత నిలయాలుగా ఖ్యాతికెక్కాయి. నర్తకీమణులద్వారా ఆస్థానాల్లోను, దేవదాసీలద్వారా ఆలయరంగమండపాల్లోను, వేశ్యాగృహాల్లోను అనేక సందర్భాల్లో సంగీత ఝురులు ప్రవహించేవి.

కళలన్నింటికి కేంద్రస్థానం దేవాలయమే! హరికథలు, నాటకాలు, పురాణకాలక్షేపాలు, తోలుబొమ్మలాటలు, కోలాటాలు, సంగీత కచ్చేరీలు సర్వప్రజలకు కనువిందు, వీనులవిందు కలిగించేవి.

క్రీడాభిరామం, ఉత్తర హరివంశం, పల్నాటి వీరచరిత్ర మొదలైన కావ్యాల్లో కోడిపందాలు, పాచికలాట, పొట్టేళ్ళ పందాలు, పాములాట, జూదం, తోలుబొమ్మలాటలు, వీధినాటకాలు, జక్కులవాళ్ళ ఆటలు మొదలైన వినోదాలను గూర్చిన వివరణలు, వర్ణనలు ఉన్నాయి.

''విజయనగరరాజుల ఆదరణలో రచించిన సంగీతశాస్త్ర గ్రంథాలలో విద్యారణ్యుని సంగీతసారం, కల్లినాథుని కళానిధి, బండారు లక్ష్మీనారాయణ సంగీత సూర్యోదయం, రామయామాత్యుని 'స్వరమేళ కళానిధి' చెప్పదగినవి.''16

గాత్రసంగీతాన్ని ఆశ్రయించి అనేక వాద్యాలు ఆనాడు వినియోగింపబడినట్లు శాసనాల్లో కావ్యాల్లో కూడా పేర్కొనబడినాయి.

కర్నూలు (వస్తుత ప్రకాశం) జిల్లా త్రిపురాంతకంలోని క్రీ.శ. 1212 నాటి ఒక శాసనంలో రామచంద్ర నరేంద్రరాజు సమధిగత పంచమహాశబ్ద, చౌషష్టి విద్యావిచక్షణ మొదలైన ప్రశస్తులతో కీర్తింపబడినాడు. పంచమహాశబ్ద పదంతో వర్ణింపబడిన శాసనాలు మనకు అనేకం లభిస్తున్నాయి.[17] (1) శృంగము (2) మృదంగము (3) శంఖము (4) భేరి (5) ఘనము- ఈ అయిదింటిని పంచ మహా వాద్యాలుగా చెపుతున్నారు. శ్రీకృష్ణదేవరాయల విరచిత ఆముక్తమాల్యద కావ్యంలోను ఇంకా ఇతర కావ్యాల్లోను అనేక వాద్యాల ప్రసక్తి ఉన్నది. పెళ్ళి, రాజుల ఊరేగింపు, దేవుని ఊరేగింపు, ప్రసిద్ధులైనవారి ఊరేగింపులో నాగ వాసములు (కళాకారిణులైన వేశ్యలు) వెంటవచ్చేవారట. బ్రాహ్మణులు మోసే భగవంతుని వాహనాన్ని బ్రహ్మరథమని అనేవారు. మద్దెలలు, ఉపాంగము (సుతిపోసెడి తిత్తి), ఆవజము (రుంజ), దండె (తంబుర), తాళము, ఉరుమ (చర్మవాద్య విశేషము), కిన్నెర (తంత్రీవాద్య విశేషము), సన్నగాళె (తిరుచ్చిన్నము - కాహళి), వీణ, ముఖవీణె (మొగవీణ), వాస్రెగోలు పిల్లనగ్రోవి, డోలు, మౌరి (నాగస్వరము), భేరి (దుందుభి), గౌరు - పెద్దకాహళి, గుమ్మెట - గుమ్మెత (తుడుము), డప్పు, డుక్క - ఢక్క, చయ్యంకి - తాళము, త్రితీయ పరంపరలు - లెక్కకు మీరిన వాద్యత్రయముల వరుసలు, మొరయన్ - మ్రోగగా.... ఆముక్తమాల్యదలో ఇవి వర్ణింపబడినాయి.[18]

అనంతపురం జిల్లా గుంతకల్లు గ్రామంలోని క్రీ.శ. 1558 సదాశివరాయల కాలంనాటి ఒక శాసనంలో[19]....మేళవారు, నాగసరాలవారు అని పేర్కొనబడింది. వేశ్యాది నాట్యబృందాన్ని మేళవారు అనీ, నాదస్వరమనే వాద్యాన్ని ఊదేవారిని నాగసరాలవారు అని చెప్పబడినారు.

## జానపద కళలు :

తోలుబొమ్మలాట, వీధినాటకం, హరికథలు, పాచికల ఆటలు, కోడి పందాలు, ఇతర జూదాలాటలు, పొట్టేళ్ళ ఆటలు, విప్రవినోదుల గారడీ ఆట, వేట, పారువేట, సిడి, దొమ్మరి ఆటలు మొదలైనవన్నీ జానపద కళల్లో చేరేవే!

దేవాలయాలు, ధనవంతుల లోగిళ్లు, రాజాస్థానాలు ఈ ఆటలకు రంగస్థలాలు. ఉగాది, దసరా, దీపావళి, సంక్రాంతివంటి ప్రసిద్ధ పర్వదినాల్లోని ప్రధాన వేడుకలు ఈ ఆటలే!

విప్రవినోదులు అనబడే వినోదపు గారడి ఆటను ప్రదర్శించి బ్రాహ్మణుల నుంచి వార్షికం (ప్రతిఫలం) వసూలు చేసుకునే బ్రాహ్మణుల శాఖ విజయనగర రాజుల కాలంలో ఉండేదని అనేక శాసనాలు పేర్కొంటున్నాయి. వీరిని గూర్చిన వివరణలు ప్రత్యేక ప్రకరణంలో ఇదివరకే ఇవ్వబడినాయి.

"విజయనగర రాజుల కాలంలోనూ అటు తర్వాతి కాలంలోను సాంఘిక స్థితిగతుల్లో, కులవ్యవస్థలో అనేక మార్పులు వచ్చాయి. ప్రతి కులంలోను కొన్ని ప్రత్యేక హక్కులు, కులమర్యాదలు మిగత కులాలకంటె విభిన్నంగా వుండినాయి. ఈ నేపథ్యంలో ఒకానొక కులంలో ఈ విధమైన ప్రయత్నం జరిగింది. అదే విప్ర వినోదుల శాఖగా పరిణామం చెందింది. బ్రౌన్ వీరిని గారడి విద్యగాండ్రుగా ఉండే బ్రాహ్మణులుగా చెప్పాడు. అయితే, హెచ్. కృష్ణశాస్త్రిగారు వీరిని గంజాం, విశాఖపట్నం జిల్లాల్లోని బ్రాహ్మణేతరులుగా, వారి వృత్తిపరంగా కొంత దిగజారినవారుగా వుండినట్లు తోస్తూందని చెప్పారు. వీరు విజయనగర, బేదకోట, కటకం, ద్రవిడ దేశం ప్రాంతాల్లో ఉండినట్లు తెలుస్తూందని చెప్పారు. క్రీ.శ. 1554 ప్రాంతాల్లో కొంతమంది విప్రవినోదులు కార్తీక పూజలో భాగంగా హనుమంతుని (దేవుని) పూజించేవారని రంగనహళ్ గ్రామ శాసనం తెల్పుతూంది.''[20]

కర్నూలు జిల్లా బోయల ఉప్పలపాడు గ్రామంలోని క్రీ. శ. 1547 శాసనంలోను,[21] కడప జిల్లా కలమళ్ళ గ్రామంలోని క్రీ. శ. 1550 శాసనంలోను,[23] ఇదే జిల్లా ఎర్రగుడి గ్రామంలోని క్రీ.శ. 1552 నాటి శాసనంలోను[23] ఇంకా అనేక శాసనాల్లోను[24] ఈ విప్రవినోదులు, వీరికి సంబంధించిన వర్తనలు-విశేషాలు పేర్కొనబడినాయి. విజయనగరరాజుల కాలంనాటి చాల శాసనాల్లో వీరి ప్రసక్తి అధికంగా ఉంది.

## వాస్తు, శిల్ప, చిత్రలేఖనాలు :

కాకతీయ శిల్పానికి నిదర్శనంగా నేటికీ హనుమకొండలో వేయి స్తంభాల గుడి ఉంది. వీరి సామంతులు కూడ అనేక జైన, శైవ, వైష్ణవాలయాలు నిర్మించినారు. గణపతిదేవ మహారాజు కాలంలో నిర్మించిన రామప్ప దేవాలయం చాలా ప్రసిద్ధమైనది. ఓరుగల్లు కోట ఏకశిల చుట్టూ నిర్మించినారు.

విజయనగర వాస్తుకు, శిల్పానికి, చిత్రలేఖనానికి చిహ్నాలుగా తాడిపత్రి దేవాలయాలు, వాటి కుడ్యశిల్పాలు, లేపాక్షి దేవాలయంలోని నాట్యమండప శిల్పాలు, కుడ్యాలు, పైకప్పులకు వేయబడిన వర్ణ కథాత్మక చిత్రాలు ప్రధానంగా చెప్పుకోదగినవి. ఆంధ్ర - కన్నడ ప్రాంతాల సరిహద్దులోని హంపి - విజయ నగరంలోని విఠల, హజార రామాలయాలు, ఏకశిలా నిర్మిత రథం, పెనుకొండ లోని గగనమహలు మొదలైనవి నేటికీ నిలిచి వుండే శిల్పాకృతులు. 'లేపాక్షి బసవయ్య లేచి రావయ్యా'అన్న కవి వాక్యానుసారంగా జీవకళలు ఉట్టిపడే నంది (బసవయ్య) శిల్పం నిజంగా లేచివచ్చేట్లుగానే ఉంది.

## దేవదాసీలు :

దేవదాసీ వ్యవస్థను గూర్చి పూర్వ ప్రకరణాల్లో వివరింపబడింది. లలిత కళల్లో నృత్యం కూడా ఒకటి. శాసన సాహిత్యంలో దేవదాసీలను గూర్చిన ప్రసక్తి అక్కడక్కడ చోటుచేసుకుంది కాబట్టి, ఈ అంశాన్ని పునః ఇక్కడ చెప్పడం అన్నది అసంగతం కాదు.

దేవాలయాల్లో గీత, నృత్యాల ద్వారా దేవునికి యథాశక్తి సేవచేసి జీవితం గడిపే ఒక పరిచారిక దేవదాసి. రంగభోగం అనే ఉపచారంలో నృత్య, వాద్య, గీతాదులతో ప్రత్యేక రంగమంటపంలో పూజా విధానంలో ఒక అంశంగా జరుప బడే కార్యక్రమమిది. ఈ నర్తకీమణులు దేవాలయ సేవలకే వినియోగింపబడే వారు. ఈ కళను ఈ వ్యక్తులతోపాటు దైవదత్తం చేసేవారు.

తిరుమల తిరుపతి దేవస్థానాల్లో దైవసేవకై వినియోగింపబడే దేవదాసీలు కొందరు ఉన్నట్లు శాసనాలద్వారా స్పష్టమవుతూంది. క్రీ.శ. 1468, 1535, 1538, 1540, 1545, 1568 మొదలైన సంవత్సరాల్లో వలంది, బెజ్జి, గోవింద సాని, హనుమసాని, లింగసాని, తిరువెంకట మాణిక్యం, నాగసాని, శెవ్వసాని, తిరుమలమ్మ మొదలైనవారు ఆనాడు తిరుమల తిరుపతి దేవస్థానాల్లో దేవదాసీ లుగా, నర్తకీమణులుగా ప్రఖ్యాతి చెంది ఉండినారని తిరుమల తిరుపతి దేవ స్థానాల శాసనాల సంపుటాల ద్వారా తెలుస్తూంది.

నాట్యం లలితకళల్లో ఒక్కటైనా సాహిత్యం, సంగీతం, చిత్రలేఖనం, శిల్పం - వీటన్నింటి సమాహారంగా దేవాలయ వ్యవస్థలో పొందుపరచబడి ఉన్న సజీవకళ ఇది. ఈ కళకు సజీవశక్తిని కల్గించే వ్యక్తులే దేవదాసీలు.

## వీరగల్లులు (వీరశిలలు) :

వీరశిలలు (వీరగల్లులు) నాటి సామాజిక స్థితికి దర్పణాలు. దేశానికో, స్త్రీమాన సంరక్షణకో, దేవాలయం వంటి సంస్థల రక్షణకో, మరో ప్రజాహిత కార్యానికో ఒక వ్యక్తి కానీ, కొంతమంది వ్యక్తులు కానీ ప్రాణత్యాగం, ఆత్మ బలిదానం చేయడానికి చిహ్నాలుగా, జ్ఞాపకార్థాలుగా ఈ వీరశిలలను ప్రతిష్ఠించడం ఒక సాంప్రదాయంగా ఉండినది. రాయలసీమ ప్రాంతంలో ఈ వీరపూజ ఉండినట్లు అనేక శాసనాలు తెల్పడం మాత్రమే కాకుండా, కేవలం శిల్పాకృతుల్లో ఉండటం కూడా గమనించదగిన అంశం.

"కాకతీయుల కాలంనుండి మృతవీరుల నారాధించే ఆచారం తెలుగు దేశంలో ఉండింది. రాయలసీమ ప్రాంతంలో వైదుంబులు, బాణరాజులు యుద్ధాలలో మృతిచెందిన వీరుల స్మారకంగా వారి శిలాప్రతిమలను నిలిపి ఆరాధించేవారు. వీనిని వీరగల్లులని పిలిచారు. కాకతీయుల తర్వాత ఈ ఆచారం కొంత అంతరించింది. దీని స్థానంలో వీరశైవం పేరిట దేవుని కొరకు ఆత్మబలి ఇవ్వడం ప్రారంభమయింది. అట్లా తమను తాము చంపుకొంటున్నట్లు తెలిపే శిలా ప్రతిమలు అనేకం తెలుగుదేశంలో రెడ్డిరాజుల కాలంనుండి కనబడతాయి. ఇట్లా వీరశైవులు తమ శిరస్సులను అర్పించడానికిగాను అనవేమారెడ్డి శ్రీశైలంలో వీరశిరోమండపం కట్టించాడు. ఇట్టి ఆలయాలను చంపుడుగుళ్లు అని పిలచారు. కడప జిల్లాలో మోపూరు భైరవస్వామి గుడి, కర్నూలు జిల్లాలో శ్రీశైల మల్లికార్జునుని గుడి, వరంగల్లు జిల్లాలో కొరవి వీరభద్రుడి గుడి ఇట్టి గుళ్ళుగా ఆనాడే పేరుపొందాయి."[26]

కడప జిల్లా చాగలేరు గ్రామంలోని క్రీ. శ. 8-9 శతాబ్దుల నడిమి కాలంలోని ఒక శాసనంలో పశుసంరక్షణకుగాను అణ్ణ అనేవాడు పెద్ది అనేవాడిని ఎదిరించి పొడిచి పడిపోయినట్లు పేర్కొనబడింది[27] ఇదే జిల్లా ఆరిబల్లి అనే గ్రామంలోని క్రీ.శ. 9 వ శతాబ్దానికి చెందిన ఒక శాసనంలో ఒక వీరుడు అనేకులను చంపి పడిపోయినట్లు చెప్పబడింది.[28]

ఇదే జిల్లా వందడి గ్రామంలోని క్రీ.శ. 10 వ శతాబ్దికి చెందిన ఒక శాసనంలో ఒకానొక వీరుడు ఏనుగుతో పోరాడి చనిపోయిన విషయం పేర్కొనబడింది.[29]

వీరశిలలు, ఆనాటి సమాజంలోని మానవత్వపు విలువలు, సమాజస్థితి, స్థలను తెలియజెప్పే దర్పణాలు. కొన్ని వీరశిలలకు అక్షరబద్ధ శాసనాలు నాలు) ఉండవు. బాణము, కత్తి, ఈటె మొదలైన ఆయుధాలను ధరించిన తులుంటాయి. దేవాలయం, స్త్రీ, శిశు చిహ్నాలతో చేర్చబడిన వీరుల ఆకృ ఉంటాయి. ఆయా సందర్భాల్లో ఆయా వీరులు నిస్వార్థంగా పాటుపడిన లు, విధానాలు వీటివల్ల అర్థమవుతాయి.

ఇలాంటివే నిసిధి, మహాసతి శిలలు అని చెప్పవచ్చు.

దివంగత సన్యాసులకు వారి స్మారకంగా, వీరులకు వీరశిలలు నిల్పి గా కొన్ని స్మారకాలను స్థాపిస్తూ ఉండినారు. వీటినే నిసిధి శిలలుఅంటారు.

అలాగే ధార్మిక దేహ త్యాగం చేసినప్పుడు అంటే సహగమనం, లేదా గమనం చేసినప్పుడు 'మహాసతి' పేర వారి స్మారకంగా శిలలు స్థాపిస్తూ వారు. వీటినే మాస్తికల్లు లేదా మహాసతి శిలలు అంటారు.

వీటిని గూర్చిన వివరాలు ఇదివరకే ప్రత్యేక ప్రకరణంలో వివరంగా బడినాయి.

## గు శాసనాల్లో ఛందస్సు - అలంకారాలు :

శాసనాల్లో మొదట మొదట క్లుప్తంగా ఉండిన వాక్యసరళి క్రమక్రమంగా ృత, సంస్కృత ముడుల్ని విప్పుకొని, సంస్కృతీ తంత్రులతో నాగరికమై ్చా వాయువుల్ని పీలుస్తూ, విస్తృతి పొంది, వినూత్నమైన నాదాల్ని ంది. ఈ నాదస్రవంతిలో యెన్నో రాగాలు, లయలు, భావాలు, స్పంద దోబూచులాడాయి.

కవిత్వం ఛందోబద్ధమైనపుడే సంగీతం దానితో చెట్టాపట్టాలేసుకుని నమవుతుంది. ఛందోబద్ధంగా, లయాన్వితంగా ఉండే విషయాన్ని సుల జ్ఞాపకముంచుకోవచ్చు.

శాసన కాలంనాటి భాషను గూర్చి ఇదివరకే చర్చించబడింది. క్రీ.శ. శతాబ్ది వరకు తెలుగులో అసలు శాసనాలే లేవు. అంతవరకు పేర్కొన ప్రాకృత, సంస్కృత శాసనాల్లో గ్రామాల, వ్యక్తుల పేర్లు, బిరుదాలు తం తెలుగులో అలగా కనిపిస్తాయి.

"తెలుగులో మొదటి పద్యమయ శాసనం అద్దంకి శాసనం. ఇది క్రీ.శ. 848 నుండి 892 వరకు పాలించిన తూర్పు చాళుక్యరాజైన గుణగ విజయాదిత్యుని ప్రథమ రాజ్య సంవత్సరం నాటిది 'తరువోజ' అని మనం చెప్పే ఛందో విశేషములు దీనిలో వున్నాయి. ఇది పూర్తిగా దేశీయచ్ఛందము. ఈ శాసనంలో పరమమాహేశ్వరుడైన పండరంగుడను సేనాపతి ప్రస్తుతింపబడ్డాడు. నేటి వర్ణక్రమ ప్రకారం ఈ విధంగా వుంది. ఇది 'తరువోజ' అను పద్యం. మొదటి రెండు పాదాలు శిథిలమయ్యాయి.

.............. .. ................

...................... ...........

పట్టంబుగట్టిన ప్రథమంబు నేడు
బలగర్వమొప్పగ బైలేచి సేన

ఇది తరువోజ యొక్క ఒక పాదము. ఈ పాదమును పూర్వోత్తరార్ధములుగా చూచినచో నాల్గేసి గణములుగల రెండు భాగము లేర్పడును. పూర్వార్ధమందు సరిగా నేయే గణములున్నవో ఆ వరుసలో ఆ గణములే ఉత్తరార్ధమందును ఉన్నవి. పూర్వార్ధమందు వరుసగా మూడింద్ర గణములు, ఒక సూర్యగణము ఉన్నవి. ఉత్తరార్ధమందును అంతే, - వరుసగా మూడింద్ర గణములు, ఒక సూర్యగణము."30

నన్నయకు పూర్వపు శాసనాల్లో వృత్తాలకంటె యెక్కువగా దేశిచ్ఛందాలే కన్పిస్తున్నాయి. దొరికిన ఛందస్సుల్లో తరువోజ, సీసము, ద్విపదలు, రగడలు, కందము కన్పిస్తున్నాయి.

"ప్రాచీనాంధ్ర శాసనాల్లో కంద పద్యం శాసనాలు తక్కువగా కన్పట్టుచున్నవి. ఆటవెలది, తేటగీతి పద్యములు వ్యస్తముగను, సీసమునకు అనుబంధముగను వాడబడుట శాసనములలో కానవగును. ఇంత ప్రాచీన కాలమునందు సైతము వ్యస్తముగా వాడబడుటనుబట్టి వీనిని సీసము కింద అనుబంధముగా వాడబడు పద్ధతితోబాటు ప్రత్యేకమైన అస్తిత్వమును కల్గియున్నదని చెప్పవచ్చును."31

వీరశిలలు, ఆనాటి సమాజంలోని మానవత్వపు విలువలు, సమాజస్థితి, వ్యవస్థలను తెలియజెప్పే దర్పణాలు. కొన్ని వీరశిలలకు అక్షరబద్ధ శాసనాలు (లేఖనాలు) ఉండవు. బాణము, కత్తి, ఈటె మొదలైన ఆయుధాలను ధరించిన ఆకృతులుంటాయి. దేవాలయం, స్త్రీ, శిశు చిహ్నాలతో చేర్చబడిన వీరుల ఆకృతులు ఉంటాయి. ఆయా సందర్భాల్లో ఆయా వీరులు నిస్వార్థంగా పాటుపడిన విధులు, విధానాలు వీటివల్ల అర్థమవుతాయి.

ఇలాంటివే నిసిధి, మహాసతి శిలలు అని చెప్పవచ్చు.

దివంగత సన్యాసులకు వారి స్మారకంగా, వీరులకు వీరశిలలు నిల్పినట్లుగా కొన్ని స్మారకాలను స్థాపిస్తూ ఉండినారు. వీటినే నిసిధి శిలలుఅంటారు.

అలాగే ధార్మిక దేహ త్యాగం చేసినప్పుడు అంటే సహగమనం, లేదా అనుగమనం చేసినప్పుడు 'మహాసతి' పేర వారి స్మారకంగా శిలలు స్థాపిస్తూ ఉండేవారు. వీటినే మాస్తికల్లు లేదా మహాసతి శిలలు అంటారు.

వీటిని గూర్చిన వివరాలు ఇదివరకే ప్రత్యేక ప్రకరణంలో వివరంగా ఇవ్వబడినాయి.

## తెలుగు శాసనాల్లో ఛందస్సు - అలంకారాలు :

శాసనాల్లో మొదట మొదట క్లుప్తంగా ఉండిన వాక్యసరళి క్రమక్రమంగా ప్రాకృత, సంస్కృత ముడుల్ని విప్పుకొని, సంస్కృతీ తంత్రులతో నాగరికమై స్వేచ్ఛా వాయువుల్ని పీలుస్తూ, విస్తృతి పొంది, వినూత్నమైన నాదాల్ని పలికింది. ఈ నాదస్రవంతిలో యెన్నో రాగాలు, లయలు, భావాలు, స్పందనలు దోబూచులాడాయి.

కవిత్వం ఛందోబద్ధమైనపుడే సంగీతం దానితో చెట్టాపట్టాలేసుకుని సంలీనమవుతుంది. ఛందోబద్ధంగా, లయాన్వితంగా ఉండే విషయాన్ని సులభంగా జ్ఞాపకముంచుకోవచ్చు.

శాసన కాలంనాటి భాషను గూర్చి ఇదివరకే చర్చించబడింది. క్రీ.శ. ఆరవ శతాబ్ది వరకు తెలుగులో అసలు శాసనాలే లేవు. అంతవరకు పేర్కొనబడిన ప్రాకృత, సంస్కృత శాసనాల్లో గ్రామాల, వ్యక్తుల పేర్లు, బిరుదాలు మాత్రం తెలుగులో లీలగా కన్పిస్తాయి.

"తెలుగులో మొదటి పద్యమయ శాసనం అద్దంకి శాసనం. ఇది క్రీ.శ. 848 నుండి 892 వరకు పాలించిన తూర్పు చాళుక్యరాజైన గుణగ విజయాదిత్యుని ప్రథమ రాజ్య సంవత్సరం నాటిది 'తరువోజ' అని మనం చెప్పే ఛందో విశేషములు దీనిలో వున్నాయి. ఇది పూర్తిగా దేశీయచ్ఛందము. ఈ శాసనంలో పరమమాహేశ్వరుడైన పండరంగుడను సేనాపతి ప్రస్తుతింపబడ్డాడు. నేటి వర్ణక్రమ ప్రకారం ఈ విధంగా వుంది. ఇది 'తరువోజ' అను పద్యం. మొదటి రెండు పాదాలు శిథిలమయ్యాయి.

.............. .. ................

...................... ...........

పట్టంబుగట్టిన ప్రథమంబు నేడు
బలగర్వమొప్పగ బైలేచి సేన

ఇది తరువోజ యొక్క ఒక పాదము. ఈ పాదమును పూర్వోత్తరార్ధములుగా చూచినచో నాల్గేసి గణములుగల రెండు భాగము లేర్పడును. పూర్వార్ధమందు సరిగా నేయే గణములున్నవో ఆ వరుసలో ఆ గణములే ఉత్తరార్ధమందును ఉన్నవి. పూర్వార్ధమందు వరుసగా మూడింద్ర గణములు, ఒక సూర్యగణము ఉన్నవి. ఉత్తరార్ధమందును అంతే, - వరుసగా మూడింద్ర గణములు, ఒక సూర్యగణము."30

నన్నయకు పూర్వపు శాసనాల్లో వృత్తాలకంటె యెక్కువగా దేశిచ్ఛందాలే కన్పిస్తున్నాయి. దొరికిన ఛందస్సుల్లో తరువోజ, సీసము, ద్విపదలు, రగడలు, కందము కన్పిస్తున్నాయి.

"ప్రాచీనాంధ్ర శాసనాల్లో కంద పద్యం శాసనాలు తక్కువగా కన్పట్టుచున్నవి. ఆటవెలది, తేటగీతి పద్యములు వ్యస్తముగను, సీసమునకు అనుబంధముగను వాడబడుట శాసనములలో కాననగును. ఇంత ప్రాచీన కాలమునందు సైతము వ్యస్తముగా వాడబడుటనుబట్టి వీనిని సీసము కింద అనుబంధముగా వాడబడు పద్ధతితోబాటు ప్రత్యేకమైన అస్తిత్వమును కల్గియున్నదని చెప్పవచ్చును."31

పెద్దముడియం శివాలయ శాసనము (క్రీ.శ. 8 వ శతాబ్దము) :

తేటగీతి: దేవస్వంబు లంచము గొన్నవాడు వార
ణాసి వచ్చిన పాపంబు గొన్నవాడు
- యతిపాటింపబడలేదు.[32]

—శాసనాల తర్వాత ప్రాచీన తెలుగు సాహిత్యంలో ప్రథమాంధ్రకవి నన్నయ ఒక్కడే మధ్యాక్కర ఉపయోగించినాడని చెప్పవచ్చు. మధ్యాక్కరను కూడా ఒక్కసారి మాత్రమే నన్నయ ఉపయోగించినాడు. ద్విపదకూ, మధ్యాక్కరకూ సన్నిహిత సంబంధము ఉండడంవల్ల, ప్రాచీన సాహిత్యంలో ద్విపద ప్రథమ ఛందస్సుగా వుండటంవల్ల వీనికి అంత సాన్నిహిత్యం కల్గిందని చెప్పవచ్చు.

మధ్యాక్కరలో వరుసగా రెండింద్ర గణాలు, ఒక సూర్యగణం, మరలా రెండింద్ర గణాలు, ఒక సూర్యగణం- మొత్తం ఆరుగణాలు వుంటాయి. ద్విపదలో మూడు ఇంద్రగణాలు, ఒక సూర్యగణం, చివరి ఇంద్రగణం ఆద్యక్షరం యతిస్థానం.

రగడ అనే ఛందం తొమ్మిదవ శతాబ్దినాటికే కావ్యంలో ప్రవేశించినట్లు తెలుస్తూంది. అంతకుముందే అంటే క్రీ.శ. 575 వ సం॥ నాటి ధనంజయుని కలమళ్ళ శాసనంలో 'ఎరికల్ ముతురాజు ధనంజయుబూ రేనాణ్డేళన్ చిరుమూరి' అనే పాఠం మధురగతి రగడగా నిరూపింపబడింది.[33]

నన్నయకు పూర్వము కవిత్వము ఈ రీతిగా వుండేదని నిరూపించి చెప్పడం సాధ్యం కాదు. తెలుగులో శాసనాలే తప్ప కావ్యాలు లభింపలేదు కాబట్టి శాసనాల ద్వారా లభించే పద్యాలే ఆధారభూతాలుగా నిలిచాయి.

శాసనాల్లో - ముఖ్యంగా తెలుగు శాసనాల్లో మొట్టమొదట సంస్కృత శ్లోకాలతో ప్రారంభంచేసి, సంస్కృత వృత్తాలైన శార్దూల, మత్తేభాది ఛందస్సులు వాడినా, నన్నయకు పూర్వం సుమారు 3 వ శతాబ్దినుండే దేశీయ ఛందస్సులో శాసనాన్ని రచించారు. పాల్కురికి సోమనాథుడు మౌళికంగా ఉండే ద్విపదకు కావ్యరూపంలో ప్రాచుర్యం తెచ్చాడు. తిక్కన, ఎఱ్ఱాప్రగడ, శ్రీనాథుడు,

పోతన వంటి మహాకవులు ఛందస్సును పరిపుష్టం చేసినారు. ఇటీవలి కాలంలో ఈ ఛందస్సు మాత్రా ఛందస్సుగా ఆవిర్భవించింది. గేయం, గీతం, భావ కవిత్వంగా అలరారింది. ఛందస్సు భాషకు నియమబద్ధంగా, ఆలంబనంగా, అలంకారంగా విలసిల్లింది.

**అలంకారాలు** : శాసనాలు భాషా దృష్టితోకాని, ఛందోదృష్టితోకానీ, అలంకారిక ఆడంబరంతోకానీ రాసిన రాతలు కావు. తాము నమ్మినదాన్ని తోడి వారికి చెప్పడం, వాటిని శిలా, తామ్రశాసనాల్లో మలచడం జరిగింది. ఊహాశక్తి తెలిసిన మనిషి తన కల్పనా చమత్కృతులతో కావ్యత్వశైలిని శాసనానికి కూడా కల్పించడంతో శాసనకవి కావ్యకర్త ప్రక్కన నిలబడటం జరిగింది. అయినా, వేటి శైలి వాటికే. స్థాయి కూడా అంతే! సంస్కృత శ్లోక పూర్వకాలైన పద్య, గద్య మిశ్రిత శాసనాల్లో ఆలంకారిక శైలి సహజంగానే చోటు చేసుకుందని చెప్ప వచ్చు. ప్రార్థనా శ్లోకాలు, ప్రశస్తులు, బిరుదులు, దాన విషయాల్లో అలంకార ప్రక్రియ చోటు చేసుకుంది.

క్రీ.శ. 9-10 శతాబ్దుల కాలంనాటి కడప జిల్లా బండపల్లి శాసనంలో-34 "సన్త్యనేక సమర సంఘట్టణోపలబ్ధ జయలక్ష్మి సమాలింగిత........" అనే ప్రయోగంలో రూపకాలంకారమున్నదని చెప్పవచ్చు.

ఇదే జిల్లా కొసినేపల్లి గ్రామానికి చెందిన క్రీ. శ. 10 వ శతాబ్ది నాటి ఒక శాసనంలో35 రూపకాలంకార వాక్యాలున్నాయి.

కర్నూలు (ప్రస్తుతం ప్రకాశం) జిల్లా త్రిపురాంతకం గ్రామంలోని అనేక శాసనాల్లోని అనేక ప్రశస్తులు, బిరుదులు, ఉత్ప్రేక్షలు, రూపకాలు, ఉపమా లంకారాదులు, అంత్యానుప్రాసలనే శబ్దాలంకారాదులు అధికంగా ఉన్నాయి. అక్కడక్కడ స్వభావోక్తి అలంకారం కూడ లేకపోలేదు.

కేవలం విషయమే ఉంటే పాఠకులకు, శ్రోతలకు వినికిడిగా ఉండదనే భావనతో, సంస్కృత కావ్యాల్లోని ప్రసిద్ధ శ్లోకాలను ఉటంకించడం, స్వయంగా

కొన్ని రచించడం, తాత్విక దృష్టితో, పారమార్థిక దృష్టితో పరిశీలనా దృక్ప థంతో చెప్పడంవల్ల శాసనాలు సమకాలీన సాహిత్య ప్రతిరూపాలుగా సంతరించ బడినాయి. అంతేకాకుండా - రాజుల, అధికారుల వ్యక్తిత్వాలు శాసన ప్రశస్తుల్లో వర్ణించబడిన ఉపమానాలనుబట్టి సవివరంగా తెలుస్తాయి.

కేవలం ఆలంకారిక దృష్టితోనే శాసనాలను పరిశీలిస్తే అసలు శాసన ఉద్దేశ్యం అర్థంకాదు. అసలు ఉద్దేశం అది కాదుకూడ. అయితే, శాసనాలను సమగ్రంగా పరిశీలించవలసి వచ్చినప్పుడు దాత, గ్రహీతల పవిత్ర ఉద్దేశ్యాలతో పాటు శాసన కవి హృదయాన్ని, భాషలోని ఆత్మీయతని, భావంలోని అంత ర్యాన్ని, కవిత్వంలోని చమత్కారాన్నిగూడ తప్పక విని ఆనందించవలసిందే! అట్లాంటప్పుడు అలంకారము, శైలి ఆ శాసనానికి ఆభరణాలుగా కూడా భాసిస్తాయి. సహృదయుడైన శాసన పాఠకునకు ప్రతి శాసనమూ ఒక కళా ఖండంగా, కావ్యమంజరిగా కన్పిస్తుంది అని అనటంలో యేమాత్రమూ అతి శయోక్తి లేదు.

## సూచికలు

1. సోమశేఖరశర్మ, మల్లంపల్లి - సారస్వత వ్యాసములు (ప్రథమ సంపుటము) (సం. డా॥ జి. వి. సుబ్రహ్మణ్యం) - పు. 6.
2. జోగి సోమయాజి, గంటి - తెలుగు వాఙ్మయము - పు. 9. (సం. కూర్మా వేణుగోపాలస్వామి) - (ప్రాచీనాంధ్ర వాఙ్మయం).
3. సీతాకళ్యాణి, వి - తెలుగులో చారిత్రక కావ్యాలు - పు. 83. (కావ్య పీఠికలు - చారిత్రక ప్రాధాన్యం).
4. పరబ్రహ్మశాస్త్రి, పి. వి. - ఇన్స్. క. I నెం. 1221.
5. రామనరసింగరావు, కూరెళ్ళ- పూర్వచాళుక్య యుగము నందలి బ్రాహ్మణ ప్రముఖులు (భారతి మాసపత్రిక - పు. 398).
6. (సం.) రామయ్యాపంతులు, జయంతి - సౌ. ఇం. ఇన్స్. x నెం. 258.
7. పరబ్రహ్మశాస్త్రి, పి. వి. - ఇన్స్. క. I నెం. 159.

8. ఇన్స్. క. - II నెం. 78.

9. పెద్దన, అల్లసాని - మను. చ. పీఠిక - పు. 7. (తేవప్పెరుమాళ్ళయ తంజనగరం).

10. పరబ్రహ్మశాస్త్రి, పి. వి. - ఇన్స్. క. II నెం. 95.

11. నరసింహా రెడ్డి, పి. - ప్రా. కా. తె. నా. - పు. 265

12, ,, - అదే - - పు. 270.

13. వెంకటరమణయ్య, నేలటూరి - క. శి. శా. వగయిరా - పు. 670.

14. కన్నడ సాహిత్య పరిషత్తు - 1974 - ప్రా. క. గమకి - మత్తు గమక కలె - పు. 44.

15. నన్నయభట్టు - ఆంధ్రమహాభారతం (ఆదిపర్వం) 10 వ పద్యం.

16. రామచంద్రరావు, సి. వి; భాస్కర చౌదరి, బి; విశ్వనాథ రెడ్డి, కేతు - తెలుగు చరిత్ర - సంస్కృతి - పు. 152.

17. (సం.) రామయ్య పంతులు, జయంతి - సౌ.ఇం.ఇన్స్. నెం. 258.

18. శ్రీకృష్ణదేవరాయలు - ఆముక్తమాల్యద - 4 - 25.

19. (సం.) రమేష్, కె.వి. - సౌ.ఇం.ఇన్స్. XVI నెం 234.

20. మహాలింగం, టి.వి. - అడ్మినిస్ట్రేషన్ & సోషియల్ లైఫ్ అఫ్ అండర్ విజయనగర - పు. 19.

21. (సం.) రమేష్, కె.వి. - సౌ.ఇం.ఇన్స్. XVI నెం. 156.

22. ,, - అదే - నెం. 176.

23. ,, - అదే - నెం. 182.

24. ,, - అదే - నెం. 186, 190, 202 & - క.శి.శా.వ. పు. 52, 53, 54, 56 మొ॥

25. రాఘవాచార్య, వి.వి. - తి తి.దే.శా. వాల్యూం II, III, IV & VI మొ॥

26. రామచంద్రరావు, సి.వి. మొ॥ - తెలుగు చరిత్ర - సంస్కృతి.

27. పరబ్రహ్మశాస్త్రి, పి.వి. - ఇన్స్.క. I, నెం, 34.

28. ,, - అదే - నెం. 59.

29. ,, - అదే - నెం. 66.

30. సంపత్కుమారాచార్య, కోవెల - తె.చం.వి. - పు. 29 - 31.
31. నరసయ్య, సంగనభట్ల - తె.దే.ఛం. (ప్రా.వికా.) - 169.
32. రామయ్య పంతులు, జయంతి - సౌ.ఇం.ఇన్స్. X నెం. 611 X
- తె.దే.ఛం. (ప్రా.వికా.) - పు. 169.
33. నరసయ్య, సంగనభట్ల - తె.దే ఛం. (ప్రా. వికా.) అధ్యా. II
- పు. 155.
34. పరబ్రహ్మశాస్త్రి. పి.వి. - ఇన్స్.క. I నెం, 61, 63, & 65.
35. ,, - అదే - నెం. 99, 100 మొ॥

# ఉపసంహారం

శాసనాలు, కావ్యాలు ఇతిహాస రచనకు పరిశోధకులకు తోడ్పడే లిఖిత సాహిత్య రూపాలు. ప్రాచీన రాజుల, ప్రజల సంస్కృతికీ, జీవన విధానాలకీ అద్దంపట్టే అమూల్య చిహ్నాలు శాసనాలు. భాషాక్రమపరిణామదశలో మౌలికము లేఖనమై, అనేక విధాలైన పరికరాలపై ఊపిరి పోసుకోవడానికి జరిగిన ప్రయత్నాలే శాసనాల బహువిధ రూపాలు. ఆయా దేశాల సాంస్కృతిక చరిత్రలను తెలుసుకోవడానికి శాసనాలు మూలాధారాలై సహకరిస్తాయి.

భారతదేశంలో అసంఖ్యాక శాసనాలు లభిస్తున్నాయి. ఆంధ్రదేశంలో ఈ శాసనాలు అశోకుని కాలంనాటికే వేయించినట్లు కర్నూలు జిల్లా ఎర్రగుడి (జొన్నగిరి) వద్ద ఉపలబ్ధమయిన శాసనాలను బట్టి తెలుస్తూంది. బ్రాహ్మీ, ఖరోష్ఠి, ప్రాకృతం, సంస్కృతం, కన్నడం, తమిళం, తెలుగు మొదలైన అనేక భాషల్లో (లిపుల్లో) అసంఖ్యాకమైన శాసనాలు దేశంలోని ఇంకా అనేక ప్రాంతాల్లో లభిస్తున్నాయి. సామాన్యంగా ప్రతి గ్రామంలోనూ, వాటి పొలిమేర ప్రాంతాల్లోనూ ఇలాంటి శాసనాలు ఏవో రూపాల్లో కన్పిస్తూనే వున్నాయి. వీటి మహత్వం తెలియనివారు, వీటిని నాశనం చేసినవారూ ఉన్నారు. మరికొన్ని ప్రకృతి వైపరీత్యాల వల్ల కూడా నశించిపోయాయి. ఈ శాసనాలను యే ఉద్దేశాలతో అయితే వేశారో వాటి పరమార్థం మాత్రం అంతరించిపోయింది. నిధి నిక్షేపాలను ఆశించిన స్వార్థపరులైన మరికొందరు శాసన స్థితిగతులనే మార్చివేశారు. భౌతికమైన ధనాన్ని మించిన విలువైన సంస్కృతి, జీవన విధానాలు ఈ శాసనాల్లో ఇమిడి ఉన్నాయని ఈనాడు యెంతమంది భావిస్తున్నారు? వాటిలోని యథార్థాలను మనం అవగాహన చేసుకొన్ననాడే, మన ప్రాచీన సంస్కృతీ సంప్రదాయాలను పరిరక్షించుకొన్నవారం కాగలము.

శాసనాల్లో లేని విషయాలే లేవు. శాసనాల్లో ఉన్న అమూల్యాంశాలు ప్రపంచ మానవాళి నిత్య జీవితంలో ఈనాటికి దోబూచులాడుతున్నాయి. మానవుల ఆచార వ్యవహారములకు శాసనాలు పట్టుగొమ్మలు. ఆంధ్రదేశంలోని శాసనాల్లో

పరిపాలనా సంబంధిత, కావ్యాత్మక విలువలతో కూడినవి అనేకం ఉన్నాయి. ఇట్లని ప్రతి శాసనమూ భాషా దృష్టితోకానీ, కావ్యమయ ప్రాగల్భ్యంతో కానీ రచించడం ప్రాచీనుల అసలు ఉద్దేశ్యం కాదు వ్యక్తియొక్క శౌర్యాన్ని, జయాన్ని, గుణగణాలను, దానగుణాన్ని, మంచితనాన్ని శాసనం ద్వారా ప్రకటించారు. ఇలాంటి వీర, దాన శాసనాలు అనేకం మనకు లభిస్తున్నాయి. వీటిలో తామ్ర, శిలా శాసనాలున్నాయి వీర శిలలు, నిసిధి శిలలు, మహాసతి శిలలు మొదలైనవాటిలో యే రాతలూలేకున్నా వాటి భావాత్మకాలైన శిల్పాల్ని బట్టి వాటి పరమార్థాల్ని ఊహించవచ్చు. వీటిలో కొన్నింటిపై రాతలుకూడ ఉన్నాయి. కొందరు వీరులైన వ్యక్తులు తమ పోషకుల(రాజుల) తరపున యుద్ధంలో పోరాడి మరణించిన వారు (లెంకలు), బలాత్కారంగా పశువులను (సొమ్ములను) సంగ్రహించినపుడు ఎదిరించి నిల్చినవారు, స్త్రీల మాన సంరక్షణకై పోరాడినవారు, దేవాలయాన్ని దేవతా విగ్రహాల్ని రక్షించినవారు, మదపుటేనుగు, సింహం, పులివంటి గొప్ప జంతువులను వేటాడి చంపి, వీరులుగా ప్రశస్తిని పొందినవారే ఈనాడు వీర శిలల (వీరగల్లుల) రూపాల్లో శాసనాలుగా సాక్షాత్కరిస్తున్నారు.

దేవాలయాలకు, సత్రాలకు, కవులకు బ్రాహ్మణులకు కొన్ని వృత్తుల (దొమ్మరి, కంసల, మంగల, చాకల) వారికి భూములు, గ్రామాలు, అగ్రహారాలు మొదలైనవాటిని దానాలుగా యిచ్చిన దాతల్లో రాజులు, అధికారులు, ధనవంతులు అధికభాగం ఉన్నారు. మరికొంతమంది తమతమ తల్లిదండ్రుల,ఇతర పెద్దల పుణ్యానికి దానం చేసినవారు ఉన్నారు. వీరు ఆయా సమయాల్లో దాన శాసనాలను శిలా, తామ్ర ఫలకాలపై చెక్కించేవారు. వ్యక్తికానీ, రాజుకానీ వారి వారి స్తోమతలనుబట్టి, అవసరాన్నిబట్టి దానాన్ని ఇవ్వడం సంప్రదాయంగా ఉండేది. ఇచ్చినవాడికి పుణ్యం, పుచ్చుకున్నవాడికి పురుషార్థం కూడా కల్గేది. గ్రామ, భూదానాలే కాకుండా ధన, కనక వస్తువాహనాదులు, గోవులు, గొఱ్ఱెలు, మేకలు, దీపాలువంటివి కూడా దాన వస్తువులై చోటు చేసుకున్నాయి. కొందరు పాలకులు దేవాలయాల జీర్ణోద్ధరణ, గోపురాదులను పునర్నిర్మించటం, ధ్వజస్తంభాలను ప్రతిష్ఠించటం, కోనేర్లను, సోపానాల్ని కట్టించటం, పూదోటలు వేయించటం, నూతులు, బావులు, తటాకాదులను యేర్పరచటం కూడ శాసనాల్లో పేర్కొన్నారు.

ప్రారంభకాలంలోని శాసనాల్లో కేవలం విషయానికే ప్రాముఖ్యాన్నిచ్చే వారు. క్లుప్తంగా కూడ ఉండేవి. తరువాతి శాసనాల్లోని ప్రారంభాల్లో శ్రీ, స్వస్తిశ్రీ వంటి మంగళవాచకాలు చెప్పబడినాయి. కాలాన్ని, కర్త పేరునూ, విషయమునూ రాసేవారు. ప్రశస్తులతో, బిరుదాలతో దాతను (రాజును), అతని గుణాలను ఉన్నతులైన పురాణ పురుషులతో, మహాత్ములైన పూర్వపువారి విశేష గుణాలతో పోల్చినారు. ఈ పోలికలు శాసన రచయితల ఊహాశక్తికి, ఐతిహాసిక పరిపూర్ణతకూ తార్కాణాలుగా భాసిస్తున్నాయి.

ప్రాఙ్నన్నయ యుగంలోని తెలుగు భాషకుగల స్థితిగతులను తెలుసు కోవాలంటే శాసనాలే శరణ్యము. అయితే, ఈ శాసనాల్లోని భాష, దాని ప్రయో జనం కూడ పరిమితమైనవే!

'భూదానమును కాని మరియొక దానమును కాని తెలుపుటకే శాసన ములు పుట్టినవి. అందువలన ఆ యక్కర భాష కెంత యవసరమో అంత వరకే శాసనములందు దొరుకును. దానానుపాలనాదుల వలన గలుగు మంచి చెడ్డలు కూడ శాసనములందు వివరింపబడుటవలన దానమును దెలుపుట కవ సరమైనవే కాక ఈ సంబంధమైనవి కూడ మరికొన్ని పదములు దొరుకును."[1]

"శాసనములలో గానవచ్చిన మొట్టమొదటి తెలుగు పదము 'నాగబు.' ఇది అమరావతీ స్తూప శాసనములలో కానవచ్చినది. అందువలన ఇది ఏ మూడవ నాలుగవ శతాబ్ది నాటిదో కావచ్చును. శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు దీనిని భారతిలో ప్రకటించినారు. మహానాగ ప్రతిమ క్రింద ఈ శాసనమును జెక్కి యుందురని వారన్నారు. కావచ్చును; ఇప్పుడా నాగ ప్రతిమ శిథిలమగుటచేతనో, త్రవ్వినపుడు పగిలిపోవుటచేతనో ఈ 'నాగబు' శాసన మొక్కడియే మనకు దక్కినది. 'నాగబు' అనగా 'నాగంబు - నాగము' అన్నమాట. ఈ శాసనము ననుసరించి క్రీస్తు శకము మూడవ శతాబ్ది నాటికే తెలుగునకు ఒక రూపమేర్పడె నని యూహింపవచ్చును"[2] అని మల్లంపల్లి సోమశేఖర శర్మగారు పేర్కొ న్నారు.

శాసనాలు మన ప్రాచీన సంస్కృతికి భాష్యాలు. ఈ సంస్కృతిలోని అంతర్భాగమే ఆంధ్రుల సంస్కృతి. 'భిన్నత్వంలోని యేకత్వం' భారతీయత లోని అంతస్సూత్రం కాగా, విభిన్న సంస్కృతుల సమ్మేళనమే సమగ్ర భారతీయత। మానవత్వం అంతర్జాతీయ సమత్వానికి మూల సంకేతం.

నాగరికతకూ సంస్కృతికీ అవినాభావ సంబంధమున్నా సూక్ష్మభేదం కూడ ఉంది. నాగరికత దేహధర్మమనీ, సంస్కృతి మానవుని ఆత్మ ధర్మమనీ కొందరి భావన. మనిషి వేష భాషల్లో బాహ్యంగా కన్పించేది నాగరికత కాగా, మనో వ్యాపారాల్లో అంతర్మథనంగా సమగ్రంగా వికసించి భాసించేది సంస్కృతి. జాతిపరంగా, సంప్రదాయపరంగా, సంస్కారపరంగా వాడుకలో ఉండే పదమే సంస్కృతి. దీన్ని గూర్చి ప్రథమ అధ్యాయంలోనే వివరింపబడినా ఇక్కడ దీన్ని ఇంకొక కోణంలో పునరాలోచించుకోవడం అసంగతమేమీ కాదు.

''సంస్కృతి చరిత్రకు బీజము. చరిత్ర వెన్నెముకయైనచో సంస్కృతి చరిత్ర నిండు దేహము. చరిత్ర చెట్టుబోదెయైనచో సంస్కృతి చరిత్ర దాని శాఖోపశాఖలు, పచ్చని యాకులు, పుష్పములు, ఫలములు నగును.''3

మానవుల అభ్యున్నతికి దారిచూపే మార్గదర్శిని సంస్కృతి. మానవ సంఘాన్ని సంఘటితం చేసి పటిష్ఠం చేయగలిగేదే నిజమైన సంస్కృతి.

ఈ సంస్కృతీ పునాదుల మీదనే మన జాతి యావత్తూ ఇతర దేశాలకు మార్గదర్శకంగా, స్థిరంగా నిల్చివుంది.

భారతదేశ ప్రాచీన ప్రజల్లో ఆంధ్రులు కూడ ఒకరు. 'అంధ్ర' అనేది ప్రాకృత పదం. సంస్కృతీకరణంలో ఇది 'ఆంధ్ర' అయింది. జాతిపరమైన ఈ శబ్దంవల్ల మనం మాట్లాడే భాషకు కూడ ఈ పేరే వచ్చింది. చిత్తూరు, అనంతపురం జిల్లాల ప్రాంతాలను క్రి.శ. 4వ శతాబ్దం ప్రాంతంలో పాలించిన బాణ రాజుల శాసనాల్లో అంధ్ర పథం చెప్పబడింది. బాణరాజుల శాసనాలలోనే అంధ్ర మండలం ద్వాదశ సహస్ర గ్రామ పరిమితమైందని చెప్పబడింది. ఈ ఆంధ్ర మండలమే సమకాలిక తమిళ, కన్నడ శాసనాల్లో వడుగావళి, వడుగావళి పన్నిసాసిరం (పన్నెండు వేలు) అని చెప్పబడింది.

అతి ప్రాచీనకాలంనుండి క్రీ శ పదకొండు పన్నెండు శతాబ్దాలవరకు వాఙ్మయంలో శాసనాలలో అంధ్ర, లేక ఆంధ్ర అనే పదం మొదట జాతిపరంగా అటు తర్వాత దేశపరంగా వాడబడింది. ఆరు, ఎనిమిది శతాబ్దాలనాటికి అనంతపురం, కడప జిల్లాల్లో రేనాటిచోళుల తెలుగు శిలాశాసనాలు లభించాయి. ఈ తెలుగు శాసనాలు క్రీ.శ. 6, 7 శతాబ్దులనుండి లభించినా తెలుగు కావ్యసృష్టి క్రీ.శ. 11 వ శతాబ్ది వరకు జరుగలేదు.

శాతవాహనుల కాలంనుంచే ఆంధ్రదేశం సంస్కృత, కన్నడ, తమిళ సంస్కృతుల ప్రభావాలకు లోనై, నూతన సంస్కృతికి నీరాజనం పట్టింది. ఇక్ష్వాకులు, బృహత్పలాయనులు, ఆనంద గోత్రికులు, శాలంకాయనులు, విష్ణుకుండినులు, పల్లవులు, శాతవాహనులు ఈ ప్రాంతపు సంస్కృతులను, సంప్రదాయాలను గౌరవించి, దాన్ని సార్థకపరిచారని చెప్పవచ్చు.

ప్రాచీన మానవ సమాజంలో కులవ్యవస్థ సంస్కృతీ పునాదులపైనే ఆవిర్భవించింది. ప్రధానమైన నాలుగు వర్ణాలే కాక, వృత్తినిబట్టి అనేక కులాలు యేర్పడినాయని చెప్పవచ్చు. వీటిలో ప్రధానంగా వడ్రంగం, కమ్మరం, కుమ్మరం, కంసల, చర్మకార వంటివి పేర్కొనవచ్చు. ప్రధానమైన నాలుగు వర్ణాలలో విద్యాబోధన, రాజ్యపాలన, వర్తక, వాణిజ్య నిర్వహణ, వ్యవసాయాది వృత్తులను ముఖ్యంగా స్వీకరించినారు. సమాజాన్ని రాజకీయంగా, ఆర్థికంగా, సాంఘికంగా నియమబద్ధంగా కొనసాగడానికి ఆనాడు ఈ వర్ణవ్యవస్థ, వృత్తి విధానాలు తోడ్పడినాయి. ఆంధ్రుల జీవనం కుటుంబ వ్యవస్థకు కేంద్రంగా గ్రామ, పట్టణ, నగర వ్యవస్థల వరకు కొనసాగింది.

ఉత్తర సర్కారులు, తెలంగాణము, రాయలసీమ ఈ మూడు ప్రాంతాల భాషా భౌగోళిక సంస్కృతీ సమన్వయమే ఆంధ్రదేశము. ప్రస్తుతమిది ఆంధ్ర ప్రదేశ్‌గా అవతరించింది. అవిభక్త మద్రాసు రాష్ట్రంలో ఉత్తర సర్కారు జిల్లాలు, రాయలసీమ ప్రాంతపు జిల్లాలు మాత్రం చేరి ఉన్నాయి. తెలంగాణా జిల్లాలు హైదరాబాదు నిజాం అధీనంలో ఉన్నాయి. కీ.శే. పొట్టి శ్రీరాములు గారి దీక్షతో భాషాప్రయుక్త రాష్ట్రాలు యేర్పడటంతో తెలుగు మాట్లాడే ప్రజల ప్రాంతాలను ఒకే రాష్ట్రంగా యేర్పరచేందుకు తగిన సన్నాహాలు చేశారు. అదే

విధంగా మైసూరు రాష్ట్రం కర్ణాటక రాష్ట్రంగా, మద్రాసు రాష్ట్రం తమిళనాడుగా, బొంబాయి రాష్ట్రం మహారాష్ట్రగా అవతరించాయి. ఈ విభాగాల వింగడంలో ఆయా ప్రజల జీవన విధానాల్లో, భవిష్యత్తుల్లో కూడా అనేక మార్పులు వచ్చాయి. ద్రావిడ జీవన విధానంలో ఆర్య సంస్కృతీ ప్రభావం చోటు చేసుకొనేందుకు తగిన పరిస్థితులు యేర్పడ్డాయి. అదివరకే ఉత్తర భారతంలో స్థిరనివాసం యేర్పరచుకున్న ఆర్యులు దక్షిణ భారత ప్రజలపై తమ ఆధిపత్యాన్ని చూపడంతో, అమాయకులైన దాక్షిణాత్యులు బలవంతులైన, మేధాసంపన్నులైన ఆర్యుల ప్రభావానికి లోనయ్యారు. ప్రకృతిని ఆరాధించటం, ప్రకృతి శక్తులకు దాసోహమనటం, వేదాలు, పురాణాలు, ఉపనిషత్తులు, శాస్త్రాలు వీటికి భాష్యం చెప్పటం, చదువుసంధ్యల్లో కొత్తపంథా చూపించటం వంటి ఆర్యుల ఉత్తమ విధానాలు దాక్షిణాత్యులు సుహృద్భావాన్ని చూపడానికి కారణ భూతమయ్యాయి. ఈ విధంగా ఆర్యులు భారతదేశమంతటా తమ సంప్రదాయ సరళిని శాఖోపశాఖలుగా విస్తరింపచేశారు. ఆర్య సంస్కృతి దక్షిణ భారత ప్రజాజీవనంపై చెరగని ముద్ర వేయడానికి అది దోహదం కల్గించింది.

"చారిత్రకముగాను, అధునాతనముగాను బ్రాహ్మణులును, బ్రాహ్మణేతరులును నయిన తమిళు లనేకులు ఆంధ్ర దేశమునకు వచ్చి స్థిరపడిపోయి తెలుగువారే యయిపోయిరి."[4]

ఈ వాక్యాల్లో తమిళులు, వారి జీవన విధాన సంస్కృతులు తెలుస్తున్నాయి. దీని ప్రకారం తమిళులు - వారి సంస్కృతి ప్రస్తుత ఆంధ్రదేశంలో అనేక రూపాలతో విస్తరించి ఉంది. తి.తి. దేవాలయాల కుడ్యాలపై వున్న అనేక తమిళ శాసనాలు తిరుమలగిరిపై శ్రీవారికి ఇవ్వబడిన అనేక కానుకలు, ఇతర ప్రసాద విశేషాలనుగూర్చి తెలియజేస్తున్నాయి. తి. తి. దేవాలయాల్లోను, ఇతర దక్షిణ వైష్ణవ దేవాలయాల్లోను ఊంజల్ సేవవంటి పదాలను ఉపయోగిస్తున్నారు. 'తిరు' అనే పదం 'శ్రీ' అనే సంస్కృత పదానికి తమిళీకరణమే!

ప్రస్తుత రాయలసీమ ప్రాంతానికి చేరువగా అనేక కన్నడ భాషా సంస్కృతులు వెల్లివిరుస్తున్నాయి. అనంతపురం జిల్లా దక్షిణ ప్రాంతంలో హిందూపురం తాలూకాలోని చాలాభాగం, మడకశిరా తాలూకాలో యెక్కువ భాగం, రాయ

దుర్గం ప్రాంతం, కర్నూలు జిల్లా ఆదోని, మంత్రాలయం, యెమ్మిగనూరు ప్రాంతాలు, చిత్తూరు జిల్లా దక్షిణ ప్రాంతం-యివన్నీ కన్నడ సంస్కృతీ సువాసనలను విరజిమ్ముతున్నాయి.

ఆంధ్రదేశంలో కన్నడ సంస్కృతిని తెల్పే అనేక శిలా శాసనాలు లభ్యమవుతున్నాయి. కడప జిల్లా దానవులపాడులోను, అనంతపురం జిల్లా కొనకొండ్ల, కంబదూరు, తొగరకుంట గ్రామాల్లోను, ఇంకా అనేక ప్రదేశాల్లోను, కర్నూలు జిల్లా, చిత్తూరు జిల్లాలోని చాలా చోట్ల కన్నడ శాసనాలు లభిస్తున్నాయి. వీటిద్వారా ప్రాచీనసంస్కృతికి చెందిన అనేక విశేషాలు తెలుస్తున్నాయి. ఇప్పుడు కూడా ఈ ప్రాంతాల్లోని బ్రాహ్మణులు, లింగాయితులు, ఇతర వర్గాల ద్వారా కన్నడభాషా విశేషాల్నే కాకుండా వారి సంప్రదాయాల్ని ఆచార వ్యవహారాల్ని తెలుసుకొనేందుకు వీలు కల్గుతుంది.

రాయలసీమకు ఉత్తరదిశలో నివసించే జిల్లాలవారిని ఉత్తరాంధ్రులుగా చెప్పుతున్నారు. అనగా ఉత్తర సర్కారు జిల్లాలైన గుంటూరు, కృష్ణ జీవనదుల పరీవాహక ప్రాంతాల్లో, డెల్టా ప్రాంతాల్లో నివసించే వీరు, ఇతర ప్రాంతాల ఆంధ్రులకంటె భిన్న సంస్కృతీ, సంప్రదాయాల్ని కలిగి ఉన్నారనడంలో అతిశయోక్తి లేదు ముక్కారు పంటలు పండించుకోవటం, అధిక ధనవంతులై ఉండటం, విద్యలు, కళలు మొదలైన వాటిలో ఆరితేరటం మాత్రమేకాక, కళాపోషణ కూడ జేస్తున్నారు, మొవ్వ, కూచిపూడి, విజయనగరం, రాజమహేంద్రవరం, కాకినాడ, విజయవాడ ప్రాంతాలు సాంస్కృతిక కేంద్రాలుగా ఈనాటికీ విరాజిల్లుతున్నాయి. సాగరతీర వాసులైన వీరి జీవన విధానాలు రాయలసీమ జనజీవనంపై నాటకాలద్వారా, చలనచిత్రాల ద్వారా, కావ్యాలు, నవలల (సాహిత్యం) ద్వారా, కవుల ప్రసంగాల ద్వారా, దేవాలయాల ద్వారా (కనకదుర్గ, అన్నవరం సత్యనారాయణస్వామి) తమ ప్రభావాలను చూపిస్తున్నాయి. ఆలనాటి నన్నయ, శ్రీనాథుడు మొదలగు వారినుండి ఇటీవలి విశ్వనాథవారి వరకును, శాతవాహనులు విష్ణుకుండినుల శాసన కాలంనుండి, మన ప్రజాస్వామిక వ్యవస్థ వరకు యావదాంధ్ర ప్రజాజీవనం పరస్పరం ముడివడి, సంస్కృతీ సంప్రదాయాల వెల్లువలో అలా సాగిపోతూనే ఉన్నది.

భాషా ప్రయుక్త రాష్ట్రాలు యేర్పడక పూర్వం నిజాం అధీనంలో ఉండిన తెలంగాణాప్రాంతం ఆంధ్రరాష్ట్రంలో విలీనమై ఆంధ్రప్రదేశ్‌గా అవతరించేందుకు తోడ్పడింది. హైదరాబాదు - సికిందరాబాదు జంటనగరాలే సమస్త సంస్కృతులకు నిలయాలుగా, దర్పణాలుగా భాసిస్తున్నాయి. ఆదిలాబాదు,

వరంగల్లు, కరీంనగర్, మెదకు, నల్గొండ, నిజామాబాదు, ఖమ్మం, మహబూబ్ నగర్ జిల్లాలు తెలంగాణా సంస్కృతికి ప్రతిబింబాలు. తెలుగు - ఉర్దూల సమ్మేళనంతో కూడిన తెలుగుభాష, ఉచ్చారణలోని యాస తెలంగాణా ప్రజల ఒక ప్రత్యేక బాణీగా వారికి చెరగని ముద్ర వేస్తూంది. రజాకార్ల దారుణాల అట్టుడికిపోయిన అలనాటి తెలంగాణా దాశరథి, మీర్ అక్బర్ అలీఖాన్ వంటి మహాకవుల ప్రబోధాలతో ముందుకు సాగింది. సురవరం ప్రతాపరెడ్డి, డా॥ సి. నారాయణరెడ్డి వంటి కవులతో సాహిత్య సొగసులను సంతరించుకున్నది. హైందవ, ముస్లిము సమన్వయ ప్రత్యేక సంస్కృతీ విలాసాలతో భాగమతీ నగరంగా (భాగ్యనగరంగా) పిలువబడి, హైదరాబాదుగా ప్రసిద్ధికెక్కింది. నాగార్జునకొండ, ఓరుగల్లు, రామప్పకొండ, భద్రాచలం వంటి ప్రాంతాలు ప్రాచీన కాలం నుండి విభిన్న శిల్పకళా సంస్కృతి నిలయాలుగా ఖ్యాతి కెక్కినాయి. ఇక్కడి భాషలు, జీవన విధానం, విద్యావిధానం, పరిపాలన ఇతర ప్రాంతాల వారికి మార్గదర్శకాలుగా నిలిచినాయి. ఆంధ్రప్రదేశ్‌కు నడిబొడ్డు నగరమై రాజధాని నగరంగా విలసిల్లే హైదరాబాదు, ఈనాడు సమస్త కళలకూ కేంద్రస్థానంగా తేజరిల్లుతున్నదీ అంటే ఇందులో యేమాత్రమూ అతిశయోక్తి లేదు.

**రాయలసీమ సంస్కృతి ప్రత్యేకత :** ఆంధ్రభోజుడుగా, మూరురాయర గండడుగా, సంగీత, సాహితీ, సమరాంగణ సార్వభౌముడుగా వాసిగాంచిన శ్రీకృష్ణదేవరాయలు పాలించిన ప్రాంతమే ఈ రాయలసీమ. ఇది రాయలవారి సీమగా 'రాయవాచకం'లో పేర్కొనబడింది. అబ్దుల్ రజాక్, పీస్ వంటి విదేశీ చరిత్రకారులచే పొగడబడింది. ఈ సీమను గూర్చిన విశేషాల్లో చాలా భాగం 'భూమిక' అనే ప్రకరణంలో ముందుగానే తెల్పబడింది. ప్రస్తుతం ఇక్కడి సంస్కృతి ప్రత్యేకతను వివరించే ప్రయత్నం జరుగుతుంది.

అనంతపురం, కర్నూలు, కడప, చిత్తూరు జిల్లాలు కలిపి ఈనాడు 'రాయలసీమ' ప్రాంతంగా పిలవబడుతూంది. ఈ జిల్లాల్లోని మొదటి రెండింటి లోని కొంత ప్రాంతం బళ్ళారి జిల్లాలో ఉండేదని. చిత్తూరు జిల్లా ఉత్తర ఆర్కాటు జిల్లాగా పిలువబడేదని తెలుస్తూంది. ఏదియేమైనా ఈ నాల్గు జిల్లాల సమన్వయమే రాయలసీమగా ఇప్పటికీ వ్యవహరింపబడుతూంది.

అనంతపురం జిల్లాలో చరిత్ర ప్రసిద్ధాలైన గుత్తి, పెనుకొండ, కుందుర్తి, లేపాక్షి, తాడిపత్రి, హేమావతి (హెంజేరు) ప్రాంతాలు పర్వత దుర్గాలతో, నదులతో దేవాలయాలతో విలసిలినటు నాటి శాసనాలు ఋజువు చేసునాయి.

పెన్న, చిత్రావతి, కుశావతి, వేదవతి వర్షాకాలంలో బాగా వర్షంవస్తే ప్రవహించే నదులు, ఎండాకాలంలో పూర్తిగా ఎండిపోతాయి. అయితే, శాసన రచనా కాలాల్లో ఇవి సంపూర్ణంగా ప్రవహించేవేమోనని అనిపిస్తుంది! పెన్నానదిని గూర్చి అనంత పురం జిల్లా తాడిపత్రి వద్ద -

'యత్ర నీలగిరిస్తత్ర పేంన్నా చోత్తర వాహినీ, యత్ర రామేశ్వరో దేవస్తత్ర ముక్తిర్న సంశయః, రక్షాయై జగతాం భూయాద్దయాళుః ద్విరదాననః, పాథక్రీడా విధౌయస్య పల్వాలంతి పయోదయః'5

—అనివున్న శాసన పంక్తులు ఆనాటి వారి మనోనిర్మలత్వానికి, పెన్నపై వారికిగల భక్తి విశ్వాసాలకు, సంస్కారానికి ప్రతీకలు.

'ఎక్కడ నీలగిరి ఉన్నదో అక్కడే పెన్నానది ఉత్తరవాహినిగా ప్రవహిస్తుంది. ఎక్కడ రామేశ్వరుడున్నాడో అక్కడే ముక్తికూడ- సంశయం లేదు. ఎవని జలక్రీడలో సముద్రాలే చిన్నమడుగులవుతాయో అట్లాంటి దయాళువైన గజాననుడు జగద్రక్షకుడు అగుగాక!' ఇది క్రీ.శ. 1503 నాటి తాడిపత్రి శాసనంలో ఒక ప్రార్థనా శ్లోకంగా చెప్పబడింది.

'లేపాక్షి బసవయ్యా లేచి రావయ్యా' అన్న అడవి బాపిరాజుగారి భావోద్వేగం లేపాక్షిలో ఉండే నంది శిల్పంలోని జీవకళను గూర్చి తెలియజేస్తుంది. ఇదికూడ అనంతపురం జిల్లాలోని ఒక శిల్పకళాఖండం.

ప్రజోపయోగానికై నాటి రాజులు అనేక చెరువులు, బావులు తవ్వించి, నిర్మించినారు. దేవాలయాలు కట్టించి ధార్మిక వర్తనులైనారు. అవసరార్థమై కొన్ని పన్నులు, సుంకాలను విధించినా - ప్రజల జీవనాభివృద్ధికై అనేక సౌకర్యాలు చేసినారు.

శాసన కాలంలో సాహిత్యం, సంగీతం, చిత్రలేఖనం, శిల్పం, నృతం మొదలైన కళలు అభివృద్ధి చెందినాయి విజయనగర రాజుల కాలంలో, అనగా- క్రీ.శ. 14 వ శతాబ్దినుండి తెలుగు సంస్కృతిని ప్రతిబింబించే అనేక కళలు వృద్ధిచెందటానికి తగిన సాంఘిక, రాజకీయ, ఆర్థిక పరిస్థితులు ఏర్పడినాయి. ఈ కాలాన్ని స్వర్ణయుగంగాకూడా చెబుతారు. శ్రీకృష్ణదేవరాయల వంటి రాజులు స్వయంగా కవులైనందువల్ల, వారి ఆస్థానంలోను, రాజ్యంలోను కవితా సౌరభం గుబాళించింది. అల్లసాని పెద్దనాది అష్టదిగ్గజ కవీశ్వరులకు అగ్రహారాదులను దానం చేయడం కూడా జరిగింది. ఆనాడు వేతనాలకు బదులు మడిమాన్యాదుల్నే ఇచ్చేవారు. స్థానాపతులు, మంత్రులు కూడా ఆనాడు రచనలు చేసేవారు.

దేవాలయాలు న్యాయాలయాలుగా, నృత్య వేదికలుగా, శిల్ప మండపాలుగా, చిత్ర కళా మందిరాలుగా నెలకొన్నాయి. రాజుల ఆస్థానాలు అధికారికమైన సంస్కృతికి నిలయాలు కాగా, దేవాలయాలు ధార్మిక సంబంధమైన, పార

మార్మికమైన సంస్కృతికి సంకేతాలుగా విరాజిల్లినాయి ఈ జిల్లాలోని కదిరి, కంబదూరు, తాడిపత్రి, లేపాక్షి దేవాలయాల్లోని ప్రాచీన శిల్పకళా ఖండాలు ఇప్పటికీ నాటి సంస్కృతిని చాటుతున్నాయి.

కర్నూలును కందెనవోలు అని కూడా అంటారు. ఇది కొంతకాలం నవాబుల అధీనంలో ఉండినది. శ్రీశైలము, అహోబలము, మంత్రాలయము, మహానంది, త్రిపురాంతకము (ప్రస్తుతం ప్రకాశం జిల్లా) మొదలైన పుణ్యక్షేత్రాలు ప్రాచీన సంస్కృతులకు పుట్టినిండ్లు. ఆయా దేవాలయాల్లో శిల్ప, చిత్రకళా రీతులు సజీవమూర్తులై ప్రకాశిస్తున్నాయి. తుంగభద్ర, కృష్ణానదులు జీవనదులై జిల్లాను సస్యశ్యామలం చేస్తున్నాయి. ఆంధ్ర రాష్ట్రావతరణ సందర్భంలో కర్నూలు కొంతకాలం తాత్కాలిక రాష్ట్ర రాజధానిగా ఉండినది. ఈ జిల్లాలోని పత్తికొండ తాలూకాలో జొన్నగిరివద్ద అశోక శిలా శాసనాలు లభించినాయి. ఇచ్చటి ప్రజలు వరి, జొన్న, వేరుశెనగ, పత్తి ప్రధాన పంటలుగా పండిస్తున్నారు. నల్లమల్ల అడవులద్వారా కలప, లక్క, వెదురు విశేషంగా లభిస్తున్నాయి. త్రిపురాంతకంలో అధికమైన శాసనాలు లభిస్తున్నాయి.

కడప జిల్లా కూడా కొన్నాళ్ళు నవాబుల అధీనంలో ఉంది. ఈ జిల్లాలో లభించినన్ని వైవిధ్యంకల శాసనాలు రాయలసీమలోని మరి ఏ జిల్లాలోనూ లభించడం లేదు. వీటిలో ఆనాటి జనజీవనము, పన్నులు, వృత్తులు, ఒప్పందాలు మొదలైనవి అనేకం ఉన్నాయి. కవులకు నిలయంగా, కళలకు కాణాచిగా, పోతుగడ్డగా పేరు పొందింది ఈ జిల్లా. అల్లసాని పెద్దన్నకు కోకటం, పెద్దన పాడు, నాచన సోమునికి ఒక అగ్రహారం దానాలు చేయబడినవి ఈ జిల్లా పరిధిలోనే. పుష్పగిరి, గండి, ఒంటిమిట్ట, పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వామి మఠం, సిద్ధవటం వంటి గొప్ప క్షేత్రాలు ఉన్నది ఈ గడ్డ మీదనే. తిరుమలకు వెళ్ళే యాత్రికులు ఇక్కడి దేవుని కడపలోని శ్రీ వెంకటేశ్వరస్వామి వారిని దర్శించియే ముందుకు పోయేవారట. ఆ దేవాలయానికి ఇది గడపగా ఉండేదని చెబుతారు.

కడప ప్రాంతంలోని తెలుగు భాష కొంత యాసగా కన్పించినా అసలైన రాయలసీమ తెలుగుదనం, సంస్కృతి, సంప్రదాయాలు ఇక్కడే నెలకొని ఉన్నాయేమోనని అనిపిస్తూంది.

చిత్తూరు పూర్వపు తమిళరాజ్యంలోని ఉత్తర ఆర్కాటు జిల్లా. చంద్రగిరి రాజ్యం విజయనగర రాజుల అధీనంలో ఉండడంవల్ల తెలుగు సంస్కృతి ఇక్కడ వ్యాపించటానికి అవకాశం యేర్పడింది. దీనికి తూర్పు, దక్షిణ ప్రాంతాల్లో ఇప్పటికీ తమిళ సంస్కృతీ సంప్రదాయాలు, భాష కొట్టవచ్చినట్లు కనిపిసుంటాయి. ఊళ్ళ పేరు. మనుషుల పేరు కూడా అవే! సంస్కృత 'శ్రీ'

శబ్దమే 'తిరు'గా - తిరుమలై, తిరుపతిగా వ్యవహరింపబడుతూంది. శ్రీకాళహస్తి తిరుపతి దేవాలయాల కుడ్యాలపై, శిలలపై తమిళ భాష, లిపి ఈనాటికీ చెక్కు చెదరక నిల్చి ఉన్నాయి. తిరుమలపై జరిగే పూజాది కార్యక్రమాల్లో తిరుప్పావై వంటివి పఠనాలు చేయబడి తిరుప్పావడ, ఊంజల్ సేవ వంటివి కూడ జరుపబడు తున్నాయి. తిరుపతి క్షేత్రం అన్ని కళలకు కేంద్రంగా, సంస్కృతికి దర్పణంగా భాసిస్తూంది. శ్రీ వేంకటేశ్వరుని దర్శించే భక్తుల్లో భిన్న మతాలవారున్నారు. ప్రపంచంలోనే ఇది ఒక గొప్ప సాంస్కృతిక కేంద్రంగా పరిఢవిల్లుతూంది.

రాయలసీమ ప్రాంతం, భిన్న సంస్కృతుల సమన్వయం. ఈ ప్రాంతం అనాదినుంచీ ఎన్ని కరువు కాటకాలను యెదుర్కొన్నా, రాజకీయ అలజడులకు లోనైనా, ఆర్థిక దుస్థితులకు బలైనా, ప్రకృతి పక్షపాతం చూపినా ఆంధ్రదేశం లోనే కాకుండా యావద్భారతావనిలోనే తన ఉనికిని చాటుకొన్న ఒక విలక్షణ మైన ప్రాంతం. రేనాటి చోళులు, బాణవంశపు రాజులు, కాకతీయులు, విజయనగరాధీశులు, నవాబులు, ఆంగ్లేయులు అయా కాలాల్లో పరిపాలించిన ఈ ప్రాంతం అనేక సంప్రదాయాలకు, సంస్కృతులకు, భాషా విధానాలకు నిలయమై ఉంది. దేశానికి స్వాతంత్ర్యం సిద్ధించి ప్రజాస్వామ్యం యేర్పడినా, ఒకనాటి రతనాలసీమ రాళ్ళసీమగా మారుతూందే కానీ రాయలసీమగా సార్థక్యాన్ని సంతరించుకోవడం లేదు.

ఢిల్లీ సుల్తాన్ మహ్మద్ బిన్ తుగ్లక్ ప్రతినిధిగ కంపిలి రాజ్యాన్ని పరిపాలి స్తున్న సంగమ వంశానికి చెందిన మొదటి హరిహరరాయలు విజయనగర రాజ్య స్థాపకుడు. విజయనగర స్థాపకులు కర్నాటులు. వీరి రాజ్యపరిపాలనా కాలంలోనే ఈ నాలుగుజిల్లాలు రాయలసీమగా ప్రసిద్ధిగాంచి, మూడు పువ్వు లారుకాయలుగా విలసిల్లినాయి. బ్రిటీష్ పరిపాలన, నైజాం పాలన కాలాల్లో వారివారి స్వార్థాలకు బలై, ప్రకృతికి లోబడి అనావృష్టికి లోనై, కఱువుకాటకాలతో నిర్వీర్యమై, స్వార్థపూరిత మాండలికుల, స్థానిక అధికారుల పీడనలచేత బలహీనమై రాయలసీమ రాళ్ళసీమగా మారిపోయే దుస్థితి యేర్పడింది. రాజులు మారినా, రాజ్యాలు అంతరించినా, రాజవంశాలు నిర్మూలమైనా, ప్రజాస్వామ్య ప్రభుత్వాలు యేర్ప డినా రాయలసీమ అలనాటి రత్నాలసీమగా మాత్రం రూపురేఖలు దిద్దుకోవటం లేదు. రాజకీయ నాయకుల చదరంగంలో రాయలసీమ కూడా ఒక పావుగా చరిత్రలో శాశ్వతంగా నిల్చిపోయింది. దీని భవితవ్యానికి ప్రకృతీ, మానవుడూ పరస్పరం సహకరించుకుంటే తప్ప మోక్షం లేదు.

భాషా విషయానికొస్తే ఇక్కడి భాష అటు తెలంగాణము, ఇటు ఉత్తరాంధ్ర ఉచ్చారణల మధ్యేమార్గంలో మాట్లాడబడుతూంటేమోనని అనిపిస్తుంది. కన్నడపు మెత్తదనం, తమిళుల కరుకుదనం, దేవభాషలోని దివ్యత్వం వెరసి తెనుగుభాష

తియ్యదనం రాయలసీమ తెలుగులో రసవంతంగా చిందులేస్తుంది. స్వచ్ఛమైన తుంగభద్ర, నీలివర్ణపు కృష్ణ, అచ్చమైన పెన్న - ఈ త్రివేణి సంగమ పరిభాషే రాయలసీమ తెలుగు భాష.

ఆంధ్ర వాల్మీకి శ్రీ వావిలికొలను సుబ్బారావు, జనమంచి శేషాద్రిశర్మ గారు, గడియారం వేంకటశేషశాస్త్రిగారు, దుర్భాక రాజశేఖర శతావధానిగారు, పుట్టపర్తి నారాయణాచార్యులుగారు మొదలైనవారు ఈ గడ్డపై పుట్టి పెరిగినారు.

ప్రాచీన మానవ సంస్కృతికి శాసనాలు దర్పణాలవంటివి. కావ్యాలు కరదీపికలే! ఈ రెండునూ సంస్కృతీ నాణానికి బొమ్మా బొరుసులే! ఆధునికత లోని అందచందాలకు ప్రాచీన సంస్కృతి పట్టుగొమ్మ!

రాయలసీమ ఈనాడు భిన్న భాషల, సంస్కృతుల, జాతుల సమ్మేళనం. ఆయా పండుగల్లో, వైవాహిక కార్యాల్లో, మత సంబంధమైన ఆచారాల్లో, సంప్ర దాయాల్లో, నిత్యజీవన చర్యల్లో వారివారి సంస్కృతులు అనాదినుండి వెల్లివిరు స్తూనే ఉన్నాయి. జైనులు, బౌద్ధులు, హిందువులు, ముస్లింలు, కన్నడిగులు, తెలుగువారు, క్రైస్తవులు పరస్పరం ఇచ్చిపుచ్చుకొనే ధోరణిలో తమ జీవిత యాత్రలను ప్రశాంతంగా అలా సాగిస్తూనే ఉన్నారు. సువిశాలమైన, సమగ్ర మైన భారత భారతీ సంస్కృతీ సముద్రంలో యెన్ని భిన్న సంస్కృతులైనా పవిత్ర స్నానం ఆచరించవలసిందే! ఇదే భిన్నత్వంలోని యేకత్వం అన్న సూక్తికి పరమార్థం కూడ!

శాసన సాహిత్యం వాఙ్మయ వికాసానికి దోహదం చేస్తూనే సంస్కృతీ వికాసానికి కూడ అనేక విధాల తోడ్పడుతుందనేది ఈ పరిశోధన ఫలితాంశం. శాసనాల పరిశోధన అన్ని కోణాల్లో సాగినపుడు ఆంధ్ర సంస్కృతితోపాటు భార తీయ సంస్కృతీ ప్రాభవాన్ని అన్ని కోణాల్లో దర్శింపచేస్తుంది. ఇది శాసన భాషా సాహిత్య రూపాల్లో కొనసాగినపుడు అనేక అపూర్వ విషయాలు బయ ల్పడి సంస్కృతీ వికాసానికి స్వర్ణసోపానాల్ని యేర్పరుస్తుంది.

## సూచికలు

1. సుబ్రహ్మణ్యం, జి.వి.(సం)సారస్వత వ్యాసములు (ప్రథమ సం.)-పు. 5.
2. సుబ్రహ్మణ్యం, జి.వి. (సం) —అదే— - పు. 6.
3. లక్ష్మీరంజనం, ఖండవల్లి; బాలేందు శేఖరం, ఖండవల్లి } ఆంధ్రుల చరిత్ర - సంస్కృతి - పు.5.
4. జోగి సోమయాజి, గంటి ఆం. భా. వికా. - పు. 110
5. (సం) డైరెక్టరు (ఇండియన్ ఎపిగ్రఫీ) మైసూరు సౌ. ఇం. ఇన్స్. VI, నెం. 803.

# ఆధారగ్రంథాలు

## శాసన సంపుటాలు :


నరసింహస్వామి, హెచ్. కె. (సం.) - South Indian Inscriptions - vol xvi 1988.

పరబ్రహ్మశాస్త్రి, పి.వి. (సం.) - Annual Report on Epiqraphy- 1967.

,, - Inscriptions of Cuddapah District vol. I 1977.

,, - ,, vol. II 1978.

,, - , vol. III 1981.

పరబ్రహ్మశాస్త్రి, జి. (సం.) - తెలుగు శాసనాలు.

రామయ్య పంతులు, జయంతి - శాసన పద్యమంజరి.

రామయ్య పంతులు, జయంతి (సం.) - South Indian Inscriptions - vol. x 1986.

విజయరాఘవ ఆచార్య, వి. (సం.) - తి. తి. దే. శాసన సంపుటములు 1984.

వెంకటరమణయ్య, నేలటూరి - Annual Report on Epigraphy 1965.

,, - Annual Report of the Dept. of Archeology & Museums A P. 1976 - 77.

,, - Epigraphica Andhrica.

,, - కడప శిలాశాసనములు వగయిరా.

వెంకటరావు, నిడదవోలు - Selected Telugu Inscriptions.

శాస్త్రి, బి. యన్. (సం.) - త్రిపురాంతక దేవాలయ శాసనములు- శాసన సంపుటి (రెండు భాగాలు)

సర్కార్, డి. సి. (సం.) - Erragudi Edicts of Asoka (Epigraphica Indica) 1959

సుబ్రమణ్యం, ఆర్. (సం.) - అశోకుని ఎర్రగుడి శిలా శాసనములు.

## విశ్వకోశములు - పారిభాషిక కోశములు నిఘంటువులు - గెజిటీయర్లు


అమరసింహుడు, (లింగాభట్టీయ వ్యాఖ్య) - గురుబాల ప్రబోధిక - 1953 (అమర కోశము)

- గెజిటీయర్లు (అనంతపురం, చిత్తూరు, కడప, కర్నూలు మరియు బళ్ళారి జిల్లాలు)

ఈశ్వరదత్తు, కుందూరి, - శాసన శబ్దకోశము - 1967.

- తెలుగు విజ్ఞాన సర్వస్వము - 1959.

బ్రౌన్, సి. పి. - నిఘంటువు (తెలుగు-ఇంగ్లీషు) - 1984.

వెంకటశాస్త్రి, ముసునూరి - విద్యార్థి కల్పతరువు - 1980.

వెంకటశాస్త్రి, ముసునూరి - శబ్దార్థ దీపిక - 1956.

శారద, కె - మధ్యయుగపు తెలుగు పరిపాలనా పరిభాష - 1988.

సర్కార్, డి. సి - Indian Epigraphical Glossaay-1966


## గ్రంథాలు :


ఆచార్య, ఎన్. ఎల్. ఎన్. - కాకతీయ శాసనాలు (ఆంధ్ర భాషా పరిశీలన).

ఆరుద్ర - సమగ్రాంధ్ర సాహిత్యం (1-12 సంపుటాలు)

ఈశ్వరదత్తు, కుందూరి - ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము 1979.

కదిరీపతి, పాలవేకరి - శుకసప్తతి.

గంగాధరం, నేదునూరి - జానపద గేయ వాఙ్మయ వ్యాసావళి - 1960.

గోపరాజు, కొఱవి - సింహాసన ద్వాత్రింశిక.

జోగి సోమయాజి, గంటి - ఆంధ్రభాషా వికాసము.

(సం.) విశ్వనాథరెడ్డి కేతు,
భాస్కర చౌదరి - తెలుగు చరిత్ర - సంస్కృతి - 1986.

నన్నయభట్టు - ఆంధ్ర మహా భారతము (ఆదిపర్వము).

నన్నెచోడుడు - కుమార సంభవము - 1968.

నరసయ్య, సంగనభట్ల - తెలుగులో దేశిచ్ఛందస్సు ప్రారంభ వికాసములు - 1991.

నరసింహారెడ్డి, పి. - ప్రాచీనకావ్యాల్లో తెలుగునాడు.

నారాయణామాత్య, అయ్యలరాజు - హంసవింశతి.

పరబ్రహ్మశాస్త్రి, పి. వి. - కాకతీయ శాసన సాహిత్యము-1981.

ప్రతాపరెడ్డి, సురవరం - ఆంధ్రుల సాంఘిక చరిత్ర-1950.

పెద్దన కవి, అల్లసాని - మనుచరిత్రము.

రాధాకృష్ణ, బూదరాజు - ప్రాచీనాంధ్ర శాసనాలు - 1971.

రామచంద్రమూర్తి, ఎస్. ఎస్. - ఆంధ్రప్రదేశ్ దేవాలయ శాసన సమీక్ష- 1984.

రామరాజు, బిరుదురాజు - తెలుగు జానపద గేయ సాహిత్యము - 1958.

రామరాజు బిరుదురాజు &
కృష్ణకుమారి, నాయని - జానపద గేయాలు - సాంఘిక చరిత్ర - 1974.

రామకృష్ణయ్య, కోరాడ - భాషా చారిత్రక వ్యాసములు-1954.

లక్ష్మీరంజనం, ఖండవల్లి &
బాలేందు శేఖరం, ఖండవల్లి - ఆంధ్రుల చరిత్ర - సంస్కృతి.

వల్లభరాయుడు, వినుకొండ - క్రీడాభిరామము-1972.

వ్యాసమహర్షి - భగవద్గీత-1962 (శ్రీరామకృష్ణ మఠము, మద్రాస్).

విశ్వనాథ స్థానాపతి - రాయవాచకము-1982.

వీరభద్రరావు, చిలుకూరి - ఆంధ్రుల చరిత్రము 1, 2 భాగాలు.

వెంకటరావు, నిడదవోలు - సెలెక్టెడ్ తెలుగు ఇన్స్క్రిప్షన్స్ - 1952.

వెంకటావధాని, దివాకర్ల - ఆంధ్ర వాఙ్మయారంభదశ (ప్రాఙ్నన్నయ యుగము).
వెంకటరాయశాస్త్రి, వేదం - నన్నెచోడుని కవిత్వము.
వెంకటరమణయ్య, నేలటూరి - పల్లవులు - చాళుక్యులు.
వేంకటసత్యరామారావు, నండూరి - ఆంధ్ర సాహిత్యము - సాంఘిక జీవన ప్రతిఫలనము - 1979.
వేణుగోపాలస్వామి, కూర్మా - తెలుగు వాఙ్మయము - సంగ్రహ చరిత్ర- 1978.
వైదేహి, అల్లాడి - ఆంధ్రుల సాంఘిక ఆర్థిక చరిత్ర-1978.
శాస్త్రి, బి.యన్. - ఆంధ్రుల సాంఘిక చరిత్ర-1975 (క్రీ.పూ. 400 - క్రీ. శ. 1100).
శ్రీకృష్ణదేవరాయలు - ఆముక్తమాల్యద (సం. వేదం వెంకట రాయ శాస్త్రి)
సత్యనారాయణ, కంభంపాటి - ఆంధ్రుల సంస్కృతి - చరిత్ర
సంపత్కుమారాచార్య, కోవెల - తెలుగు ఛందోవికాసము - 1962.
సీతాకల్యాణి, వి. - తెలుగులో చారిత్రక కావ్యములు.
సుశీల, టి. - ఆంధ్ర ద్విపద సాహిత్య చరిత్ర.
సోమన, పాల్కురికి - మల్లికార్జున పండితారాధ్య చరిత్ర.
సోమశేఖరశర్మ, మల్లంపల్లి (సంకలనం-సుబ్రహ్మణ్యం, జి.వి.) - సారస్వత వ్యాసములు (ప్ర. సంపు.)
హనుమజ్జానకిరామశర్మ, పోలూరి - భారతీయ సంస్కృతీ ప్రకాశనము.

## కన్నడము :

వివిధ రచయితలు - దివ్యప్రకరణ యాజ్ఞ్యవల్క్యస్మృతి - అంచె మత్తు తెరపిన సంస్థె, మైసూరు.
- ప్రాచీన కర్నాటక దల్లి గమక మత్తు గమకిగళు - గమక కలె - 1974.
చిదానందమూర్తి, ఎం. - కన్నడ శాసనగళ సాంస్కృతిక అధ్యయన - 1966.

నరసింహశాస్త్రి, దేవుడు - సంస్కృతి - 1954.
శ్రీకంఠయ్య, కె. - విజయనగర కాలద కన్నడ సాహిత్యదల్లి జనజీవన చరిత్రె - 1988
శేషశాస్త్రి, ఆర్. - కర్నాటకద వీరగల్లుగళు-1983.
శేషశాస్త్రి, ఆర్. - శాసన పరిచయ - 1983.

**ఆంగ్లము :**

Dixit, G N. (Editor) - Early Vijayanagara (Studies & its History - Culture) - 1986.
Halabhavi, V.B. - Vijayanagar Sexcentenary-Commemoration - 1936.
Kosambi, D.D. - The Culture and Civilisation of Ancient India in Historical Outline (Reprint)-1975.
Mahadeva Sastry, Korada - Historical Grammar of Telugu with Spl. ref. to old Telugu 200-B C. - 1000 A.D.
Mahalingam, T.V. - Administration & Social Life under Vijayangar Part-II Social Life - 1969.
Majumdar, R.C. - History & Culture of the Indian People Vol. I to VII
Neelakanta Sastry K.A. - The History of South India.
Rama Rao, M. - The Temple of Srisailam.
Ramaswamy, N.S. - The Temples of Tadipatri.
Rangaswamy, Saraswathi - Sources of Vijayanagar History.
Sampath, M.D. - Chittoor through Ages.
Sircar, D C. - Indian Epigraphy.

## పత్రికలు :

**తెలుగు :**

తెలుగు పరిశోధన

భారతి

**ఆంగ్లము :**

Journal of the Andhra Historical Research Society.



# శబ్దసూచి (ముఖ్యపదానుక్రమణిక)

# అచ్చు తప్పుల పట్టిక

| తప్పు | ఒప్పు | పుట | పంక్తి |
|---|---|---|---|
| సహిర్గతమైంది | బహిర్గతమైంది | 10 | 23 |
| అంకితం భావం | అంకితభావం | 11 | 26 |
| రాయదేవరాయలు | రామదేవరాయలు | 24 | 5 |
| శిరా శాసనము | శిలా శాసనము | 27 | 9 |
| సిరి దుర్గం | గిరి దుర్గం | 34 | 24 |
| ధ్వజ స్తంణం | ధ్వజ స్తంభం | 178 | 15 |
| పాణి పాకం | కాణి పాకం | 186 | 6 |
| వ్యాస రాసి | వ్యాస రాయ | 198 | 3 |
| తర్వ్తతి | తర్వాతి | 236 | 11 |
| దుర్చిన | గూర్చిన | 238 | 18 |
| వాగ్ని | వాగ్మి | 241 | 17 |
| కుందుర్తి | కుందుర్పి | 262 | 28 |
| త్రిజాస్వామ్య | ప్రజాస్వామ్య | 265 | 26 |

